గ్రంథములకు :

ఆకురాతి చలమయ్య,
శాంతినిలయ గ్రంథమాల,
కాకినాడ.

రాజమహేంద్రవరమున
బాక్సు ముద్రణాలయమునందును
మెజస్టిక్ ముద్రణాలయమునందును
ముద్రితము.

మహాత్మాగాంధీజీ

# జీవనవేదము

700 పుటలు వెల రు. 8-0-0 లు

రాష్ట్రపతి

## డాక్టరు శ్రీ పట్టాభి సీతారామయ్యాగారి

అమూల్యాభిప్రాయము

19 క్యానింగ్ లేన్,
న్యూఢిల్లీ,
5-2-1949.

ఆర్యా,

మీరు పంపిన "మహాత్ముని జీవనవేదము" అను పుస్తకము అందినది. మహాత్ముని జీవితము, మహావాక్యములు చిరసంస్మరణీయములు. చిరకాలము ఆంధ్రదేశమునకు వినియోగించు యీప్రచురణ అందజేసినందుకు యెంతయో కృతజ్ఞులము.

చిత్తగించవలెను,
(సం) పట్టాభి సీతారామయ్య.

# నివేదన

—:o:—

స్త్రీలు, పురుషులు, పిన్నలు, పెద్దలు, బాలురు, బాలికలు, విద్యార్థులు, విద్యార్థినులు, అందరును సులభముగా మహాత్మాజీమాహాత్మ్యమును గ్రహించవలెనను ఉద్దేశముతో నేను ఈ గ్రంథమును తయారు చేసితిని. ఆ మహానుభావుని మహత్తర జీవితమును అందరును పారాయణము చేయదగినది. దీనిలో భాషావిషయక భ్రమప్రమాదములు, రచనా నైపుణ్యాలోపములు, శైలివిషయక శైథిల్యము, వ్యాకరణ వ్యతిక్రమములు అనేకము లుండవచ్చును. అవి అన్నియు క్షంతవ్యములు. ఆమహామానవుని మాహాత్మ్యమును సుబోధ్యముగ కీర్తించుటయే యీగ్రంథరచన యొక్క ప్రధానోద్దేశము.

ఈగ్రంథముద్రణలో నాకు అనేకవిధముల సహాయము చేసిన వారందరికిని నాహృదయపూర్వక నమస్కృతుల నర్పించుచున్నాను.

మా 'శాంతినిలయ గ్రంథమాల' లో మహారాజపోషకులుగా, రాజపోషకులుగా, పోషకులుగా, చందాదారులుగా చేరి యిట్టి ఉత్తమగ్రంథముల ముద్రణకు తోడ్పడిన ఉదారగుణసంపన్నులకును, తమస్నేహితుల ననేకవిధముల

ప్రోత్సాహపెట్టి యీ పట్టికయందుగల అనేకమందిని రాజపోషకులనుగా చేర్పించినవారును, ఆయన నామమెరుగక ఆయన గుణగణములకు, సేవాపరాయణత్వమునకు, పరోపకారపరాయణత్వమునకు, కార్యదీక్షాపరత్వమునకు ప్రజలచే 'స్వాములవారు' అని పిలువబడుచున్న మదీయ అగ్రసోదరులగు శ్రీరంగనాయకులుగారికి నాహృదయపూర్వకనమస్సులర్పించుచున్నాను.

ఈగ్రంథమును అల్పకాలములో ముద్రించి యిచ్చిన బాకస్ ముద్రాణాలయాధిపతులకును, మెజస్టిక్ ముద్రణాలయాధిపతులకును నా కృతజ్ఞత తెలుపుచున్నాను.

ప్రకాశకుడు.

# మహాత్ముని స్వప్నము

ఏ భారత దేశములో దరిద్రతమప్రజలుకూడ యీ దేశము తమదేశమనియు, ఈ దేశములో క్రియాశీలమైన, మహత్తరమైన సత్తాగలదనియు, మానవులవలె జీవించుటకు శాశ్వతగౌరవము, అధికారము గలదనియు తలంపగలరో అట్టి భారతదేశమును నిర్మింపగోరుచున్నాను. ఈ భారత దేశములో ఉచ్చ, నీచములైన శ్రేణులుండవు. సకలమత ములవారును అన్నదమ్ములవలె కలసిమెలసి వసింపగలరు. ఈ భారతదేశము అస్పృశ్యతాభిశాపము నుండి విముక్త మగును. మద్యరూపాభిశాపము అచ్చటనుండి అదృశ్యమై పోవును. ఇచ్చట స్త్రీలుకూడ పురుషులవలె సమానాధి కారమును పొందుదురు.

మనము ప్రపంచప్రజలతో శాంతియుతముగా నడచు చుందుము. మనము శత్రువుయెడలకూడ కోపము చూపిం చక, ప్రశాంతమనస్సుతో క్షమించెదము. మనము ఒకరిని పీడింపము. మనము పీడితులము కావలదు. మనసైన్యము సాధ్యమైనంతవరకు తక్కువగా నుండవలయును.

ఏ యే కార్యములు భారతదేశములో కోటానుకోట్ల ప్రజలకు విరుద్ధమైనవి కావో, విదేశస్వదేశము లను భేదము లేకుండా వాటిని సంరక్షించుకొనుచుండవలయును. నేను వ్యక్తిగతముగా స్వదేశవిదేశము లను భేదములను సృష్టించుటకు పరమ ఏహ్యాభావము ననుభవించుచుందును.

ఇట్టి భారతదేశమే నాస్వప్నము.

# అంకితము

—:o:—

విశ్వప్రపంచమున సూర్యచంద్రులను మహత్తరశక్తిద్వయము మహోజ్వలములు. మానవప్రపంచమున మహత్తరశక్తిసంపన్నులగు వ్యక్తు లిరువురు – రవీంద్ర, కరంచంద్రులు. సూర్యచంద్రులశక్తు లెట్టివో, రవీంద్ర కరంచంద్రులశక్తు లట్టివే. సూర్యుని తేజము అంధకారగహ్వరమును భేదించుకొని పోయి జ్యోతిర్మయము గావించును. చంద్రుని ప్రశాంతకాంతులు తన్మయత్వమును కలిగించి తద్గతచిత్తులను గావించుకొనును. రవీంద్రుని తేజోమయభావములచే మానవుల హృదయాంధకారము పటాపంచ లగుచుండును. కరంచంద్రుని తపోమయజీవిత ప్రశాంతకాంతులచే మానవులు తన్మయులై తద్గతజీవులగుచుందురు. మానవప్రపంచమున కీయుభయజ్యోతులు సూర్యచంద్రులవలె అమరములు. నిత్యనూతనములు. అట్టి మహామానవుల పవిత్రస్మృతికి భక్తిపురస్సరముగా

## మహాత్మాజీ జీవనవేదము

సమర్పితము.

—:o:—

# కృతజ్ఞత

—:o:—

ఈదిగువ నుదహరించిన గ్రంథముల ననుసరించి నేను ఈ 'జీవన వేదమును' తయారుచేసితిని. ఆయా గ్రంథకర్తలకు నాహృదయపూర్వక కృతజ్ఞతను నివేదించుకొనుచున్నాను—

| | | |
|---|---|---|
| 1 | **Great Thoughts of Mahatmaji.** | ఇంగ్లీషు |
| 2 | **Mahatmaji and the depressed Humanity.** | ఇంగ్లీషు |
| 3 | **Gandhiji.** | ఇంగ్లీషు |
| 4 | మహామానవ మహాత్మా గాంధి | బెంగాలి |
| 5 | గాంధిజీ నిగ్రహించుట | బెంగాలి |
| 6 | అంతిమమున గాంధీజీ | బెంగాలి |
| 7 | గాంధీజీ శాంతియాత్ర | బెంగాలి |
| 8 | గాంధీజీ అగ్నిపరీక్ష | బెంగాలి |
| 9 | మృత్యుంజయ గాంధీజీ | బెంగాలి |
| 10 | కలియుగ దధీచి | బెంగాలి |
| 11 | ఆత్మచరిత్ర | తెలుగు |

# జా తీ య గీ త ము



1 జనగణ మన అధినాయక జయహే భారతభాగ్యవిధాతా !
పంజాబ సింధు గుజరాటమరాఠా ద్రావిడ ఆంధ్ర వంగ,
వింధ్యహిమాచల యమునా గంగా ఉచ్ఛలజల ధితరంగ;
తవ శుభనామే జాగే తవ శుభ ఆశిస మాగే,
గాహే తవ జయగాదా!

జనగణ మంగళదాయక జయహే భారతభాగ్యవిధాతా!
జయహే, జయహే, జయహే, జయ జయ జయ
జయహే॥

2 అహరహ తవ ఆహ్వానప్రచారిత శునితవ ఉదారవాణీ;
హిందు బౌద్ధ శిఖ జైన పారసిక ముసలమాన క్రీష్టాన్;
పూరవపశ్చిమ ఆషే తవ సింహాసనపాశే, ప్రేమహార
హాయిగాధా!

జనగణ ఐక్యవిధాయక జయహే భారతభాగ్యవిధాతా!
జయహే, జయహే, జయహే, జయజయజయజయహే॥

3 పతనఅభ్యుదయబంధురపంథా యుగయుగ ధావితయాత్రి
హే చిరసారథి తవ రథచక్రే ముఖరితపథదిన రాత్రి
దారుణవిప్లవమాఝే తవ శంఖధ్వనిబాజే సంకట
దుఃఖత్రాతా॥

జనగణ పథపరిచాయక జయహే భారతభాగ్యవిధాతా।
జయహే, జయహే, జయహే, జయజయజయజయహే॥

4 ఘోరతిమిరఘననిబిడనిశీథే పీడితమూర్ఛిత దేశే।
జాగ్రతఛిలో తవ అవిచలమంగళనతనయనే అనిమేషే,
దుఃస్వప్నే ఆతంకే రక్షాకరికేలే అంకే,
స్నేహామయీ తుమి మాతా,
జనగణదుఃఖత్రాయక జయహే భారతభాగ్యవిధాతా,
జయహే, జయహే, జయహే, జయజయజయజయహే॥

5 రాత్రిప్రభాతిలో ఉదిలోరవిచ్ఛవిపూర్వఉదయగిరిభాలె,
గాహే విహంగమపుణ్యసమీరణ నవజీవనరసఢాలె,
తవ కరుణారుణరాగే నిద్రితభారతజాగే,
తవ చరణే నతమాథా,

జయ జయ జయ జయహే జయ రాజేశ్వర భారత
భాగ్య విధాతా,

జయహే, జయహే, జయహే, జయజయజయజయహే,

(అర్థము (1) జనగ...విధాతా, పంజాబ......
గంగా, ఉచ్ఛల=ఉప్పొంగుచున్న, జలధితరంగ=సముద్రత
రంగములు, తవశుభనామె=నీశుభనామమువలన, జాగే=
మేల్కొనుచున్నవి. తవశుభఆశీష=నీశుభఆశీర్వాదములను,

మాగే=కోరుచున్నవి. తవ జయగాథా=నీజయగీతములను, గాహే=పాడుచున్నవి. జనగణమంగళ.....జయహే

(2) అహరహ సర్వదా, తవఆహ్వాన=నీఆహ్వానము, ప్రచారిత=ప్రచారితమగుచున్నది. తవ ఉదారవాణీ=నీఉదారసందేశమును, శుని=వినుచున్నాము. హిందు...పశ్చిమ, తవ సింహాసనపాశే=నీసింహాసన సమీపమునకు, ఆసే=వచ్చుచున్నారు, ప్రేమహార=ప్రేమహారము, గాథాహాయ్=కూర్పబడుచున్నది, జనగణఐక్య...జయహే॥

(3) పతన అభ్యుదయ బంధుర పంథా=పతన అభ్యుదయములతో కూడినబంధురమార్గమున, యుగయుగధావిత యాత్రి=యుగయుగములనుండి మానవయాత్రికుడు పరుగిడుచున్నాడు, హేచిరసారథి=ఓశాశ్వతసారథి, తవ రథచక్రే=నీరథచక్రములవలన, దినరాత్రి=రాత్రింబవళ్లు. పథ=మార్గము, ముఖరిత=ప్రతిధ్వనించుచున్నది, దారుణవిప్లవమాఝే=భయంకర విప్లవములలో, తవ శంఖధ్వని=నీశంఖారావము, బాజే=మ్రోగుచున్నది, సంకటదుఃఖత్రాతా=సంకటములనుండు, దుఃఖములనుండి రక్షించిన రక్షకుడవు, జనగణపథ.....జయహే॥

(4) ఘోరతిమిర = ఘోరాంధకారమై, ఘననిబిడ నిశీథే=ప్రగాఢనిశీథమున, పీడితమూర్ఛిత దేశే=పీడింపబడి

మూర్ఛజెందిన దేశమున, తవ=నీయొక్క, అవిచలమంగళ=అచంచలమంగళము, నతనయనే అనిమేషే = నయనములను నతనము చేసి రెప్పవాల్చక, జాగ్రతఛిలో=జాగరూకమై యుండెను. దుఃస్వప్నే=దుఃస్వప్నములో, ఆంతకే=భయసమయములలో, అంకే = వడియందుంచుకుని, రక్షాకరిలె=రక్షించితివి. స్నేహమయతుమిమాతా=స్నేహపూర్ణమైన మాతవు నీవు. జనగణదుఃఖ...జయహే॥

(5) రాత్రిప్రభాతిలో=రాత్రిప్రభాతమైనది, పూర్వఉదయగిరిభాలే=పూర్వఉదయగిరిఫాలమున, రవిచ్ఛవి=సూర్యబింబము, ఉదిలో=ఉదయించెను; విహంగమ=విహంగములు, గాహే=పాడుచున్నవి. పుణ్యసమీరణ=పవిత్రవాయువులు, నవజీవనరస=నవజీవనరసమును, ఢాలే=కుమ్మరించుచున్నవి. తవకరుణారుణరాగే=నీకరుణఅరుణకాంతులచేత, నిద్రితభారతజాగే=నిద్రితభారతదేశము మేల్కొనుచున్నది. తవచరణే=నీచరణములపై, నతమాథా=శిరమును నతము చేయుచున్నది. జయ జయ......జయహే॥

# అశ్రుతర్పణము



"సత్యాగ్రహవ్రత సాధన దేశంబు
        రక్షించినట్టి ధర్మస్వరూపి
రాష్ట్రరక్షణకుగా ప్రాణమ్ము దేహమ్ము
        ధారవోసిన మహాదానశీలు
డుపవాసములశక్తి నూహించి ప్రకటించి
        పోరాటములు దీర్చు బుద్ధిశాలి
పంజాబుహత్యాల బరికించి విలపించి
        కన్నీరునించిన ఘనదయాళు
డిండియాప్రజనెల్ల నేకబుద్ధిగనుండ
        బోధించి మించిన పుణ్యమూర్తి
హిందూముసల్మాన్ల నేకంబుజేయగా
        తనువు నర్పించిన త్యాగమూర్తి

దేశసంరక్షణార్థ మీదేహమనుచు
చాటి దీక్షగ బనిచేసి జయమునొంది
భారతీయుల స్వాతంత్ర్య భానుబింబ
ముదయమందిన విజయోత్సవమ్ము
కన్నులిందుగనైనను గానకుండ
స్వర్గసీమకు బాపూజి తరలిపోయె.

# విషయ సూచిక


| | | పేజీ |
|---|---|---|
| 1 | వంశము — జననము | 1 |
| 2 | బాల్యకాలము — విద్యార్థిజీవితము | 14 |
| 3 | విద్యాలయములోని దినములు | 25 |
| 4 | వివాహము | 33 |
| 5 | కిశోరులు మోహన్‌దాసు — కస్తూరిబాయి | 38 |
| 6 | భ్రామప్రమాదములు — దుఃఖము | 43 |
| 7 | ధర్మజ్యోతి — కిశోరమోహన్‌దాసు | 55 |
| 8 | పితృహీనుడు | 63 |
| 9 | ఇంగ్లాండు ప్రయాణసన్నాహము | 65 |
| 10 | ఓడలో | 76 |
| 11 | ఇంగ్లాండులో సంకటములపర్వతములు | 78 |
| 12 | పర్వతములను దాటగలిగెను | 87 |
| 13 | లజ్జ — మోహనదాసుకు అస్త్రము | 94 |
| 14 | స్వదేశమార్గమున | 100 |
| 15 | జన్మభూమికి ప్రత్యావర్తనము | 110 |
| 16 | జ్యోతిని వెదకుట | 112 |
| 17 | సంగ్రామసూచన | 114 |
| 18 | వృద్ధిఅగుచున్న అవమానములు | 117 |

| | పుట |
|---|---|
| 19 స్వాతంత్ర్యసంగ్రామ ప్రథమశంఖారావము | 124 |
| 20 నేటాలు — ఇండియన్ కాంగ్రెస్ స్థాపన | 131 |
| 21 దరిద్రనారాయణసేవ | 136 |
| 22 ఘనీభవించుచున్న విరోధము | 140 |
| 23 భారతదేశమునకు తిరిగివచ్చుట | 143 |
| 24 ఆఫ్రికాలో | 146 |
| 25 సేవావ్రతము | 149 |
| 26 నిగ్రహము — త్యాగశీలము | 153 |
| 27 భారతీయకాంగ్రెసు | 156 |
| 28 మరల దక్షిణాఫ్రికాలో | 161 |
| 29 సత్యాగ్రహము — దానిపరిణామము | 166 |
| 30 టాలస్టాయిఆశ్రమమున | 181 |
| 31 సంయమసాధన | 200 |
| 32 కలెన్‌బెక్ — గోఖ్లే | 206 |
| 33 స్వదేశమ్రుత్తిక | 214 |
| 34 గోఖ్లేగారి ఉపదేశము | 219 |
| 35 భారతభ్రమణము | 231 |
| 36 శాంతినికేతనము | 245 |

| | పుట |
|---|---|
| 37 ఆశ్రమప్రతిష్ఠ | 260 |
| 38 ఎగ్రిమెంటు ఆచారనిర్మూలనము | 270 |
| 39 చంపారణ నీలితోటల విషయము | 277 |
| 40 శోషిత పారిశ్రామికులలో చైతన్యము | 300 |
| 41 మహాయుద్ధము — విపన్నులగు ఆంగ్లేయులు | 319 |
| 42 రౌలట్ బిల్లు — కృతఘ్నులైన ఆంగ్లేయులు | 331 |
| 43 అహింసాభారతదేశము — హింసాపరాయణ బ్రిటిషువారు | 336 |
| 44 జాలియన్ వాలాబాగ్ | 347 |
| 45 ప్రథమ అసహాయోద్యమము | 367 |
| 46 చౌరీచౌరా — ఆందోళన విరమణ | 401 |
| 47 కారాగారము — ధ్యాననిమగ్నమహాత్ముడు | 411 |
| 48 చరకా — హరిజనులు — హిందు — మహమ్మదీయుల ఐక్యత | 425 |
| 49 వైకమ్‌విషయము — దేశబంధుస్మృతి | 435 |
| 50 సైమన్ మోసము — నెహ్రూరిపోర్టు | 443 |
| 51 1931 వ సంవత్సరములో శాసనబహిష్కరణ సంగ్రామము | 459 |
| 52 గాంధి — ఇర్విన్ షరతు | 474 |

పుట

53 రౌండుటేబిలు మోసము 480

54 నిర్మాణకార్యక్రమములో నిమగ్నులగుట 499

55 మహాభారతీయుగము 508

56 ఖైదీలవిముక్తి — ఆందోళనము సత్యాగౌరవముల సంరక్షణ 513

57 ద్వితీయమహాయుద్ధము — కాంగ్రెసుకు గాంధీజీ నేతృత్వము 515

58 ఆగస్టువిప్లవము — భారత దేశ విసర్జన ఆందోళనము 520

59 ఆగస్టు ఆందోళన అనంతరము 531

60 శాంతియాత్ర 540

61 జీవితములో అంత్యదృశ్యము 575

62 మహావాక్యములు 584

63 స్వదేశవాసులకు 586

64 స్వతంత్రత 589

65 ఐక్యత 593

66 దేశసేవ 596

67 జాతి — ధర్మము 597

| | | |
|---|---|---|
| | | పుట |
| 68 | అహింసాసాధనము | 600 |
| 69 | మృత్యువు | 602 |
| 70 | జీవనపంచాంగము | 606 |
| 71 | ఉపవాసవ్రతముల పట్టిక | 614 |
| 72 | మహాత్ముని మాహాత్మ్యము | 617 |
| 73 | పూనాయాత్ర | 628 |
| 74 | పిడుగువంటివారు | 640 |
| 75 | పండిత జవహర్‌లాల్ | 651 |
| 76 | సర్దార్ వల్లభభాయి | 653 |
| 77 | నిర్మాణకార్యసూత్రములు | 658 |

అత్యంతాదరాభిమానములతో మా గ్రంథమాలకు
విరాళముల నొసంగిన దాతలు

## మనవి

మహారాజపోషకులు, రాజపోషకులుగా మా గ్రంథమాలకు సహాయముచేసినవారి ఫొటోలు కూడా ప్రకటింపబడునని మనవిచేసి యుంటిని. కాని అందరివద్దనుండి ఫొటోలు రాకపోవుటచే యీ గ్రంథములో ప్రకటించలేదు. రాబోవు గ్రంథములో ఫొటోలన్నియు ప్రకటింపబడునని మనవి చేయుచున్నాను.

ప్రకాశకుడు.

### మహారాజ పోషకులు

1 శ్రీ ఆదిలక్ష్మీ దేవమ్మ మహారాణీవారు
(గద్వాలి సంస్థానము)

2 ,, సురభి రాజా వెంకట జగన్నాథరావు బహద్దరువారు
(జటప్రోలు సంస్థానము)

3 ,, సవైరాజా రాజేశ్వరరావుగారు, బహిరీబలవంత బహద్దర్ మహాభూపాల్ గారు (వనపర్తి సంస్థానము)

4 శ్రీ ఉయ్యూరు కుమారరాజావారు (వుయ్యూరు)

5 ,, కాసల వెంకటస్వామి, అవ్వారు రంగయ్యగార్లు
(పుల్లంపేట)

6 గా. మంత్రి బె. గోపాలరెడ్డిగారు (మద్రాసు)

7 శ్రీ యిమంది కన్నయ్యగారు, సోదరులు మిల్లుఓనర్సు
(విశాఖపట్నం)

8 ,, నాయన వెంకటరంగారావుబహద్దరువారు (మునగాల)

9 ,, రేబాల పట్టాభిరామిరెడ్డి జమీందారుగారు (నెల్లూరు

10 ,, కోకా శివనాధశాస్త్రిగారు (దివాన్ పిఠాపురం)

11 ,, చిట్టూరి వీరన్నగారు భూస్వాములు (అంజూరు)

12 ,, దగ్గుపాటి పాపయ్య చౌదరిగారు (కారంచేడు)

13 ,, కమ్మచౌదరీ సంఘమువారు (కారంచేడు)

14 ,, కరిౕ అచ్చిరెడ్డిగారు ల్యాండులార్డ రైసుమిల్లు
కంట్రాక్టరు (కొత్త్యేటిపాడు)

15 ,, ఆర్. రామిరెడ్డి జమీందారుగారు, బెళగగల్లు
(కర్నూలు జి.)

16 ,, బొల్లారెడ్డి వేంకటేశ్వర్ రెడ్డి జమీందారుగారు
(గణపవరం కృ. జి.)

17 ,, ఆంధ్రభోజ్య గోగినేని వెంకటసుబ్బయ్యనాయుడుగారు
(గోగినేనిపురం)

18 శ్రీ పాటీలు కేశవరెడ్డిగారు (మొలగపల్లి)

19 ,, అన్నదాత నాగేంద్రుడు. చైర్మ్యాన్, చీరాల మునిసిపాలిటి (చీరాల)

20 ,, కవి కులాలంకార, వాఙ్మయోద్ధారక, జవ్వాది లక్ష్మయ్యనాయుడుగారు (పెనుకొండ)

21 ,, విద్యల భోజుడు మద్దాల రామకృష్ణారావు నాయుడు గారు (వీరవాసవరము)

22 ,, జి. నానాగౌడుగారు, ఫారెస్టుకంట్రాక్టరు (అసిఫాబాద్)

23 ,, దొడ్ల వేంకటరామిరెడ్డిగారు (కావలి)



రాజపోషకులు

1 శ్రీ కర్నల్, డాక్టర్ రాజుగారు (నేతాజి బోసుగారి స్వంతడాక్టరు)

2 ,, గాధంశెట్టి సుబ్బరాయగుప్త గారు, హంసాసోప్ వర్క్సు (బనగానపల్లి)

3 ,, కవిరాజహంస పి. హనుమంతరెడ్డిగారు (గుండ్లకొండ)

4 ,, వి. జగ్గరాజుగారు, ప్రెసిడెంటు కోపరేటివుసొసైటి (అమలాపురం)

5 ,, కొండ లక్ష్మణరావుగారు, హైకోర్టువకీలు హైదరాబాద్

6 శ్రీ డాక్టర్ శ్రీమతి శకుంతలా దేవిగారు **M. B. B. SC.**
హైదరాబాద్

7 ,, గుంటక నరసయ్య పంతులుగారు ,,

8 ,, బి. రామచంద్రయ్యగారు ,,

9 ,, పైండా శ్రీరామకృష్ణయ్యజమీందారుగారు (కాకినాడ)

10 ,, వడ్డెపల్లి విఠోబాగారు (షోలాపురం)

11 ,, చిలకా మల్లయ్యగారు ,,

12 ,, బూర్గుల రామకృష్ణయ్యగారు ,,

13 ,, పల్లెర్ల లక్ష్మీపతిగారు కొత్తపల్లి (కరీంనగర్ నైజాం)

14 ,, ద్వారంపూడి వీరెడ్డిగారు (తొస్సిపూడి)

15 ,, రావుసాహెబ్ జి. బాలకృష్ణయ్యగారు (మద్రాసు)

16 ,, కోసూరి రామస్వామి అండ్ సన్సుగార్లు (కాకినాడ)

17 ,, రావుసాహెబ్, సంఘోద్ధారక రావులలోకనాథం
పంతులుగారు, దేవేంద్రనాథ పంతులుగారు (పేరాల)

18 ,, గుద్దంటి శేషయ్యగారు ,,

19 ,, వడ్డె పుల్లయ్యానాయుడుగారు ,,

20 ,, పూటుకూరి రామయ్య శ్రేష్ఠిగారు

21 ,, ఊటుకూరి ఉపేంద్రగుప్త అండుబ్రదర్సువారు చీరాల

22 ,, పూటుకూరి కోటయ్య శ్రేష్ఠిగారు ,,

23 ,, నూనె గోవిందరాజులు శ్రేష్ఠిగారు ,,

24 ,, ద్రాక్షారామం చంద్రపాళి అందుబ్రదర్సువారు,,
25 ,, ఆలపాటి సూర్యనారాయణమూర్తిగారు (గోవాడ)
26 ,, గుత్తుల సూర్యనారాయణగారు (అమలాపురం)
27 ,, తొమ్మండ్రి లక్ష్మీనరసయ్యగారుమర్చెంటు(పత్తికొండ)
28 శ్రీ సిద్ధుల మల్లయ్యఅండు సన్సు (భోనగిరి నైజాం)
29 ,, యం గోపాలరావుగారు ప్రెసిడెంటు (ఆదోని)
30 ,, ద్వారపూడి బసివిరెడ్డిగారు (కాకినాడ)
31 ,, గుంటక నరసారెడ్డిగారు బ్యాంకర్ (గణపవరం కృ.జి.)
32 ,, కర్రి అప్పారెడ్డిగారు. గౌరవకార్యదర్శి
జీవకారుణ్యసంఘము [illegible]
చేనేత సహకార సంఘము పుల్లంపేట (కడప)
చేనేత సహకార సంఘము మాధవపరము ,,

—:o:—

## పోషకులు

1 శ్రీ తుమ్మలపల్లి సత్యనారాయణమూర్తిగారు (పిప్పర)
2 ,, పోతుల వెంకట్రామారెడ్డిగారు (గోపాలపురం)కొవ్వూరు
3 ,, ఎ. గోపాలకృష్ణయ్యగారు (గుంటూరు)
4 ,, విద్యాసాగరగారు (కాకినాడ)
5 ,, వి. ఆర్. చిత్రాగారు (మద్రాసు)

6 ,, పత్తికొండ వీవర్సు కో ఆపరేటివ్ సొసైటీ
(పత్తికొండ)

7 ,, భావనాఋషిస్వామివారి పద్మశాలీయసంఘం
(బెస్తవారపుపేట)

8 (శ్రీ) చేనేతసహకారసంఘమువారు (బెస్తవారపుపేట)

9 ,, పొలతల రామచంద్రారెడ్డిగారు (చిత్తూరు)

10 ,, వి. రాజారెడ్డిగారు వెల్లివేడు (చిత్తూరు)

11 ,, అవుతు రామిరెడ్డిగారు ల్యాండులార్డు,
(కొల్లిపర గుం. జి.)

12 ,, కాసు బ్రహ్మానంద రెడ్డిగారు, M. L. A.
(నరసరావుపేట)

13 ,, గుడిబండ రామచంద్రారెడ్డిగారు (కొల్లిపర, గుంజి.)

14 ,, చేనేత సహకార సంఘము అధ్యక్షులు— రాపర్తి
జగన్నాధరావుగారు, (గోడిచర్ల)

# మహాత్మాగాంధీజీ

# జీవనవేదము



## మహావాక్యములు

### 1

### వంశము — జననము

1869 అక్టోబరు 2 వ తేదిన కతియవార్ రాజ్యాంతర్గతమైన పోర్ బందర్ పట్టణములో గాంధివంశమునకు చెందిన కరంచంద్ గాంధికుటుంబములో మహాత్మాగాంధీజీ సర్వకనిష్ఠ సంతానముగా జన్మించెను.

జన్మలగ్నమందు మంగళతూర్యములు మ్రోగినవి. కుటుంబములోనివారందరును శిశువునుదర్శించి ఆనందమునందోలలాడిరి. సోదరులు సంతోషాంతరంగులై ఒకటి రెండుసారులు బయటినుండి లోపలికి లోపలినుండి బయటికి తొంగిచూచిరి. తండ్రియైన కాబాగాంధి ఆవార్తవిని పరమానంద భరితుడయ్యెను.

దూరదేశమునందున్న ఆత్మీయ స్వజనులందరును ఆ శుభవార్త విని సంతోషించిరి.

కాని వారిఆనందము, ప్రేమ కేవలము వ్యక్తిగతమైనది. స్వకీయమైనది. ఈశిశువు ఒకదినమున పూర్ణవయస్కుడై అహింసాప్రేమలకు సంపూర్ణస్వరూపియై సకలవిశ్వవాసుల హృదయములను ప్రీతితో, సంతోషముతో నింపి వేయగలవాడని గ్రహించియుండినచో, వారుకూడా కేవలము ఆనందమునే గాక ఆనందముతో గర్వమును, తృప్తిని అనుభవించి యుండెడివారు. కాని వారెట్లు గ్రహింపగలరు? మనుజులలో ఏమహామానవుడైనను, మహాత్ముడైనను జన్మించినచో ఆతడు సహజమైన ప్రాకృతికనియమముల ననుసరించియే జన్మించును.

వారు ఆరోజున ఆతనిపరిచయమును పొందలేకపోయినను, యీనవజాతశిశువే నేటి విశ్వవిఖ్యాతశాంతిదూతయైన మహామానవుడు మహాత్మాగాంధి యని మనకు తెలియును.

ఇతర మహాపురుషుల, విశ్వవిఖ్యాతవ్యక్తుల జనన కాలమునగాని, అనంతరమునగాని సంభవించు అలౌకికమైన, ఆశ్చర్యకరమైన సంఘటనలేవియు గాంధిజనన కాలములో జరిగియుండలేదు. ఆయన శైశవమునుండి యౌవనమువరకు సాధారణమానవునివలెనే పెరిగి యుండెను. కాని ఈతని

మందు ప్రకృతినియమములకు విరుద్ధముగా నేమియు జరిగి యుండలేదు. అలౌకికమైన, ఆశ్చర్యకరమైన సంఘటనలు ఆయన బాహ్యజీవితములో సంభవించకపోయినను, ఆయన మానసిక జీవితములో, వికాసోన్ముఖ మానసములో లోకచక్షువుల కంతరాళమున నవనవచింతనములు, ఆలోకము, ఆదర్శములు ఉద్భవించెను. ఈ యుగములో సర్వశ్రేష్ఠుడైన మానవ మహాత్ముడైన గాంధిజీవితము వంటే అవి సాధ్య మయ్యెను.

కాని ఆయన పరిచయమును పొందుటకు ఆయన వంశ వృత్తాంతములను కూడా గ్రహింపవలయును.

శాంతుడును, ధీరుడును, స్థిరచిత్తుడును అయిన వడ్రంగిగృహములో ఏసుక్రీస్తు జన్మించెను. గృహములో ఆయననుగురించి చెప్పదగిన విశేషవిషయములు ఏమియు లేకుండెను, కాని వారి అంతరములు పవిత్రములు, నిర్మలములును, ఆంతరిక విశేషత్వముచేతనే మహాత్ముడును, త్రాణకర్తయునైన క్రీస్తు దీనహీనుడైన వడ్రంగి వంశమునం దావిర్భవించెను.

కారాబద్ధమైన, నిపీడితమైన, అజ్ఞాతమైన వసుదేవుని గృహములో కృష్ణుడు జన్మించెను. ఆయననుగురించి చెప్పదగిన విశేషమైన విషయమున్నను అది అత్యాచారియగు కంసుని అత్యాచారమువలన ధూళిలో కలిసిపోయెను.

కాని బాహ్యైకపరిచయమునకు అంతరాళమున వారు ధైర్యశాలురును, భక్తిపరాయణులునై యుండిరి. హృదయమునందున్న ధైర్యమును, భక్తియందున్న ప్రవాహమును సార్థకపరచుటకే కైదీయొక్క ఆ వేదనాపూర్ణ గృహములో అవిర్భవించెను.

మహామానవుడు మహాత్ముడునైన గాంధిజననము నందును ఈవిచిత్రసమ్మేళనమునకు ఏవిధమైన వ్యతిక్రమము జరుగలేదు.

గాంధిగారి పితామహుడు ఉత్తమచంద్రగాంధీ. ఆయన వాడుక పేరు ఉతాగాంధి.

గాంధిశబ్దమునకు అర్థము దుకాణదారు. గాంధివంశీజులుకూడ వణిజజాతికి చెందినవారు. కాని మహాత్ముని పూర్వపురుషులు స్వకీయవృత్తిని అవలంబించలేదు. ఉతాగాంధినుండి ఆయన పైన రెండుపురుషాంతరములవరకు కత్తియవాడ్ రాజ్యాంతర్గతమైన పోర్‌బందరులో దివానుగానో, లేక ప్రధానమంత్రిగానో యుండిరి. ఈవైశ్యవంశము వైశ్యోచితగుణగణములకంటె క్షాత్రోచితగుణగణములనే అధికముగా పొందియుండెను. వారు శాసనదక్షులును, నిర్భీకధర్మభీరులును, దానశీలురును, వంశపరంపరగా కుటుంబము లోనివారందరు యీవిశేష సుగుణగణములను పరిపూర్ణముగా పొంది వాటిని కాపాడుకొనగలిగిరి.

గాంధిపరివారమువారు అధికవ్యయము చేయువారుగా నుండిరి. ఉత్తాగాంధి పూర్వపురుషులు దివానుఉద్యోగము చేసి అధికధనమును సంపాదించిరి. కాని వారు అమిత వ్యయమువలన వారివంశీయుల పూర్వార్జితధనమేమియు దాచిపెట్టి ఉంచలేకపోయిరి.

కాని ధనము పొందకున్నను, ఉత్తాగాంధి పూర్వ పురుషులవలె తీక్ష్ణమైన బుద్ధిబలమును, కర్మపటుత్వమును, విచారదక్షతను సంపూర్ణముగా బడసియుండెను. ఆగుణ గణములను బడసియుండుటచేతనే సామాన్య రాజకార్య ములను నిర్వహించుచు క్రమముగా ఆవంశమువారికి ప్రాప్య మైన దివానుపదవిని పొందగలిగిరి.

ఉత్తమచంద్రుడుకూడ పూర్వపురుషులవలె ధన మును కూడబెట్టుటలో ఉదాసీనుడై యుండెను. దివాను ఉద్యోగమువలన పొందిన జీతమునుండి అధికభాగమును సాధుసన్యాసులకును, బీదసాదలకును దానము చేయుచుండు వాడు. మిగిలిన ధనముతో కుటుంబవ్యయమును నిర్వ హించువాడు.

కాని దివానుగిరి శాంతితో నిర్వహించునట్టి అదృ ష్టము ఆయనకు లేకుండెను. ధార్మికుడును, సరళమతియునైన ఉత్తమచంద్రునికికూడ శత్రువులు సమకూడిరి. సామాన్య ఉద్యోగమునుండి రాజ్యములో సర్వశ్రేష్ఠమైన దివాను

పదవివరకు వచ్చిరి. అందువలన రాజ్యమందున్న దుష్టాత్ములు కొందరు ఆయనను యీర్ష్యాద్వేషములతో చూచుచుండిరి. ఆయనకు హానిచేయుటకును, ఆయనను అవమానపరచుటకును సమయముకొరకు కాచుకొని యుండిరి. ఒకసారి వారికి యీసువర్ణసుయోగము లభించెను. పోర్‌బందరు రాజుగారు అప్పటికి చనిపోయిరి. వితంతువు రాణిరూపాలిక బాలకుడైన పుత్రునికి ప్రతినిధిగా రాజ్యపరిపాలనాభారమును వహించెను. రాణిగారు అధికక్రోధస్వభావము గలదై యుండెను. ఒకసారి రాజభాండాగారములోని ఉద్యోగస్థుడు రాణిగారి క్రోధమునకు కారకుడాయెను. ఈ ఆపత్కాలములో ఉత్తమచంద్రుడు తప్ప తనను మరెవరు రక్షింపజాలరని ఆతడు గ్రహించెను. ఆతడు వ్యాకులహృదయముతో సమస్తమును ఉత్తమచంద్రునకు నివేదించి ఆయనను శరణు జొచ్చెను. ఉత్తమచంద్రుడు ఉభయసంకటములలో పడెను. ఒకవైపున ఆర్తుడు, అసహాయుడు, ఆశ్రయార్థి, మరియొకవంక క్రోధావేశముతోనున్న ప్రభుశక్తి.

కాని ఆయనయందున్న ధార్మికమైన, నిర్భయమైన వివేకము కర్తవ్యమును చూపించెను. ఉత్తమచంద్రుడు ఆకర్మచారికి ఆశ్రయ మిచ్చెను, అభయ మిచ్చెను.

రాణి యీవార్తను వినెను. అతిశయక్రోధోన్మత్తురాలయ్యెను. ఆఉద్యోగస్థుని తత్క్షణము పోలీసులకు అప్పగించమని ఉత్తమచంద్రునికి ఆదేశించెను. కాని నిర్భయుడైన ఉత్తమచంద్రుడు అత్యంతవినయముతోను. దృఢస్వరముతోను 'శరణాగతునిత్యజింపజాలనని' తెలియజేసెను.

రాణి క్రోధముచే అంధురాలాయెను. ఉత్తమచంద్రునిశత్రువులు అవకాశము కనిపెట్టి అతనికి విరుద్ధముగా రాణిగారివద్ద అనేకవిషయములను వెలిబుచ్చిరి. రాణి హితాహితజ్ఞానముకూడ పోగొట్టుకొనెను.

అవిధేయుడైన దివానుని జీవితావస్థయందుగాని, మృతావస్థయందుగాని పట్టి తెమ్మని సైనికుల కాదేశింపబడెను.

తీక్ష్ణబుద్ధిగల ఉత్తమచంద్రుడు సకాలములోనే యీవార్తను గ్రహించెను. పోర్‌బందరులో నుండుట యిక నిరాపద కాదని యోచించి రహస్యముగా రాజ్యత్యాగమును గావించెను. ఆయన బరోడాపర్వతములలో పడి జునాగడ్ రాజ్యములో ప్రవేశించెను.

పోర్‌బందరులోని సైన్యము వచ్చి ఉత్తమచంద్రుని గృహమును ధ్వంసము గావించెను, కాని నిరాశ్రయునికి ఆశ్రయదాతయైన అయనను పట్టుకొనలేకపోయెను.

ఉత్తమచంద్రుడు పరివారసంరక్షణకొరకు జునాగడ్ నవాబు దర్బార్‌లో ప్రవేశించెను.

నవాబుసమక్షమునకు పోవునపుడు నవాబుగారికి నమస్కరించెను, కాని నమస్కారము ఎడమచేతితో చేసియుండెను.

నవాబుగారు, ఆయన పరిషద్వర్గము విస్మయము చెందిరి. ఆయన ఆచరణకు కౌతూహలమును వెలిబుచ్చిరి, యీవిచిత్రనమస్కారమునకు కారణమేమని ఉత్తమచంద్రుని ప్రశ్నించిరి.

ఉత్తమచంద్రుడు వినయపూర్వకముగా యిట్లు నుడివెను—"నవాబ్ గారూ! నాకుడిచేతిని పోర్‌బందరు సేవకు దానము చేసితిని. ఇది నాది కాదు. యిది పోర్‌బందరుకు చెందిన ఆస్తి. అందువలన ఎడమచేతితో నమస్కరించవలసివచ్చిన అపరాధమును మన్నింపుడు."

ఎంత అసాధారణమైన [illegible]! ఎంత నిర్భయమైన, స్పష్టమైన జవాబు!

గుణగ్రాహియగు నవాబు వాక్చతురుడగు ఉత్తమచంద్రుని మాటలకు ఆగ్రహింపక ఆనందించెను. ఆయనకు యోగ్యమగు ఉన్నతపదవి నిచ్చుటకు అంగీకరించెను.

కాని ధార్మికుడు, తేజోవంతుడు, నిష్పాపి మరల తన లుప్తశక్తిని తప్పక పొందును.

గుణగ్రాహియగు జునాగఢ్ నవాబుగారి ప్రయత్న ఫలితముగా ఉత్తమచందు పోరుబందరు రాజగృహములో సర్వోషిగా నియామితు డయ్యెను, మరల పోర్ బందరుకు పిలువ బడెను, దివానుపదవిని మరల బడసెను.

ఉత్తమచందు రెండుసార్లు వివాహము గావించు కొనెను. ప్రథమభార్యా గర్భమున నలుగురు పుత్రులును, ద్వితీయ భార్యాగర్భమున ఇద్దరు పుత్రులును జన్మించిరి. పంచమపుత్రుని నామము కరంచంద్ గాంధి. ఆయనకు మరి యొక పేరు కాబాగాంధి. కనిష్ఠపుత్రుని నామము తులసీదాస్ గాంధి.

పితృదేవుని మరణానంతరము కాబాగాంధి, తులసీ దాసుగాంధి క్రమముగా దివాను పదవిని పొందియుండిరి.

ఈ కాబాగాంధి కీర్తిసుసితము, ధార్మికుడును, సరళ స్వభావియునైన వడ్రింగిని, ధైర్యవంతుడును, భక్తి పరాయణుడును అయిన వసుదేవుని మనచే స్మరింపజేయు చున్నాడు.

కాబాగాంధి గ్రంథస్థవిద్య నంతగా అభ్యసించలేదు. కాని గుణవంతుడైన తండ్రివలెనే సహజమైన, వ్యావ హారిక జ్ఞానమును, తీక్ష్ణబుద్ధిని పొందియుండెను. దానితో పాటు ఆంతరిక ధర్మపరాయణతను, నిష్పాక్షపాతమును కూడ సంపాదించెను.

2

సత్యముకొరకు, ధర్మముకొరకు యింపరళ్ళపుతియును, భక్తిపరాయణుడును అయిన వ్యక్తి ఆత్మసమర్పణము గావించుకొనెను.

ఈ కాబా గాంధికి పుత్రరూపమున మహాత్మాగాంధి జన్మించెనని మహోన్నతియగు క్రీస్తు, కృష్ణుని దృష్టాంతము లతో నుడువవలసివచ్చినది. సామాన్యదృష్టికి ఆత డొక రాజ్యమునకు దివాను మాత్రమేనని తోచును. ప్రపంచములోని అసంఖ్యాక మానవులలో అనామధేయుడు, సామాన్యుడు, కాని హృదయమునందాతడు మహాత్తరుడు. అద్వితీయుడు, సరళత్వముచేత, పవిత్రతచేత, భక్తిరసామృతముచేత ఆప్లుతుడు.

ఆయన ఆత్మలోని యీ విశేషత్వమును స్మరించుకొనియే ప్రపంచమున సర్వయుగములకు చెందిన మహాత్మాగాంధి ఆయన పుత్రరూపమున ఆవిర్భవించెను.

గాంధీజీ ప్రసంగసందర్భమున కాబాగాంధివిషయము మరికొంత ఆలోచించుట ఆవశ్యకము.

కాబాగాంధి అంతగా విద్యావంతులు కారని యిదివరకే తెలియజేసితిని. బుద్ధిబలముచేతనే ఆయన తనగొప్పత్యమును అభివృద్ధి చేసుకొనగలిగినారు. ఆయన సరళహృదయుడును, ధర్మపరాయణుడును అని యిదివరకే తెలిపియుంటిని. ఏధర్మపుస్తకమునుండియు ఆయన జ్ఞానమును సంపా

దించియుండలేదు. ఆతని జీవనమునందున్న సహజమైన అనుభవ జ్ఞానమువల్లనే ధర్మజ్ఞానమును సంపాదింప గలిగిరి. ఆయన గుజరాతి వైష్ణవమందిరములకు నా వేళలోకి నియమపూర్వకముగా వెళ్ళుచుండువారు. హరికథలను వినుచుండువారు. ఆర్జించిన ధనములో అధికభాగమును దానధర్మములకు వ్యయము చేయువారు. అంత్యజీవితమునందు ఆయన గీతా పారాయణము చేయుచుండిరి. ప్రతిదినము ప్రాతఃసమయములో కొన్నిశ్లోకములను ఉచ్చస్వరముతో పఠించువారు. సహజ ధర్మానురక్తి, మానసికసరళస్వభావము, ఔదార్యము యివియన్నియు ఏకముగా ఆయనస్వభావమును మధురముగను, ఉజ్జ్వలముగను గావించినవి.

కాని శిశువువంటి సరళస్వభావముగల యీ కాబా గాంధి వైనయిక కార్యములలో నిమగ్నుడైయున్నప్పుడు సూక్ష్మాతిసూక్ష్మమైన పరిశ్రమలను జయించుటకును, వేలకొలది ప్రజలచేత పనులు చేయించుటకును ఆయనకు ఎట్టి యిబ్బందియు ఉండెడిది కాదు.

ధార్మికసరళత్వముచేత కఠినసమస్యలకు సమాధానము చెప్పుటలోను, కోటానుకోట్ల మానవులచేత కార్యములు నెరవేర్పించుటలోను ధర్మపరాయణుడైన గాంధిగారియందుగల తీక్ష్ణబుద్ధి, దక్షత, చాతుర్యములలో గల పరిస్థితిగతమైన ఆశ్చర్యమైన సాదృశ్యమును స్మరింపజేయుచున్నవి.

గాంధిజీ తనమాతృదేవియొక్క ఆచరణములద్వారా బాల్యకాలమునుండి ధర్మముపై పునకు ఆకర్షింపబడిరి.

ఆయన మాతృదేవి సాధ్వీమణియు, ధర్మపరాయణయు. ఆయనతండ్రిగారు క్రమముగా 4 వివాహములు గావించుకొనెను. గాంధిగారి మాతృదేవి పుతలీబాయి కాబా గాంధికి ఆఖరుభార్య.

పుతలీబాయి జీవితకాలమంతయు ధర్మానుష్ఠానములలోను, సత్కార్యములలోను గడపియుండెను. ఆమె తరుచు చాతుర్మాస్యవ్రతములను పాలించువారు. వ్రతములను పాలించునపుడు ఒక్కసారి మాత్రమే భుజించువారు. ఏదియో యొక పూజాపునస్కారమును ఆధారము జేసికొని తరుచు ఉపవాసము ఉండువారు. ఒక్కొకప్పుడు దినము విడిచి దినము ఉపవాసము ఉండువారు. రెండుమూడు రోజులవరకు నిరాహారిణిగానుండియు సహజముగా కార్యకలాపాదులను నిర్వహించుకొనునంతగా ఆమెకు ఉపవాసములు అలవాటైపోయెను. ఒకసారి ఆమె చాతుర్మాస్యవ్రతములతోపాటు సూర్యనారాయణ వ్రతమును అవలంబించెను. ఈవ్రతములో సూర్యుని చూడకుండా అన్నము ముట్టుకొనుటకు వీలులేదు. ఈవ్రతమునుగురించి గాంధిగారు ఇటుల వర్ణించి యుండిరి— "సూర్యుడు

ఎప్పుడు దర్శనమిచ్చునా యనియు, అమ్మ అన్నము ఎప్పుడు తినునా యనియు మేము ఆకాశమువైపు చూచుచుండు వారము. ఈనాలుగుమాసములలో సూర్యదర్శనము లభించుట దుర్లభమని మేము తలంచితిమి. నేను ఒకరోజున సూర్యుని చూచి 'అమ్మా! అమ్మా! సూర్యుడు దర్శనమిచ్చినాడు' అని చెప్పితిని. మాఅమ్మ తొందరగా బయటికి వచ్చేలోపలనే సూర్యుడు మేఘములలోకి పోయెను. 'ఏమీ, లేదే, ఇవాళ ఆహారము లేదు' అనుచు లోపలికిపోయి పనులు చేసుకొనుచుండెను.

ఇదిగాక ప్రతిరోజు హవేలిలోకి పోవుచుండువారు, నిత్యము పూజార్చనలు చేయుచుండెడివారు. అనంతరము స్నానభోజనములు చేయుచుండెడివారు.

మాతృదేవియందున్న యీధర్మానురక్తియే గాంధిజీ భావిజీవితములో విశేషప్రభావమును వ్యాపింప జేసెను. ఆయన సకల ధర్మగ్రంథముల సారమును గ్రహించి, ధర్మముయొక్క నిగూఢతత్వమును కనుగొని, ప్రచారము చేసిన విషయము తథ్యము. కాని శైశవము, బాల్యకాలముల స్మృతిపటమునుండి పొందిన దృష్టాంతములే ఆయన జీవితములో విశేషక్షేత్రములయందు భక్తిపరాయణుడుగను, నిష్ఠావంతుడుగను అగుటకు శక్తి నొసంగినవి.

మాతృదేవియొక్క ఉపవాసములప్రభావము పుత్రునిలో సంపూర్ణముగా మూర్తీభవించిన దనుట కెట్టి

సందియము లేదు. భావికాలమున ఏగాంధీజీ ఆత్మశుద్ధి కొరకో లేక తనఉద్దేశసాఫల్యతకొరకో తరచుగా ప్రాయోపవేశములతో దినములు గడిపియుండెనో, ఏమహాత్మాజీ ఉపవాస దినములలోకూడ ఆనందచిత్తముతో, సహజ భావముతో తనదైనికకార్యములు నెరవేర్చెనో నో, ఆగాంధిజీ ప్రథమజీవితములో మోహన్ దాన్ గాంధీ రూపమున నే ఉపవాసములలో నిమగ్నమై తన మాతృదేవి నుండియే యీవిషయములో ప్రథమ ప్రేరేపణమును పొంద గలిగెను. అందుచేత గాంధిజీవితములో తన మాతృదేవి ప్రభావమే పడుగుంబేకల ఆవిరించియుండెను.

---

## 2

## బాల్యకాలము–విద్యార్థిజీవితము

మోహన్‌దాస్ గాంధికి 7 వ సంవత్సరము వచ్చి నప్పుడు కాబాగాంధి పోర్‌బందరు దివానుపదవిని విడనాడి రాజస్థానకోర్టులో సభ్యుడై రాజకోటదర్బారులో ఉద్యోగ మును స్వీకరించెను.

ఆయన తన కార్యదీక్షవలన రాజకోట అధిపతి ఠాకూరుగారికి అత్యంతప్రియపాత్రు డయ్యెను. ఆయనకూడ ప్రభువుయెడల సంపూర్ణభక్తిపరాయణుడై యుండెను. ఒకసారి ఇంగ్లీషు రెసిడెంటు ఠాకూరుగారినిగురించి వ్యంగ్య

సూచకవిషయమును వ్యక్తీకరించెను. కాబాగాంధి అచ్చటనే యుండెను. ప్రభువును గురించిన నిందను విని ఆయన నిర్భయముగా ఆ రెసిడెంటు నుడివినవిషయమును ప్రతిఘటించి ఎదుర్కొనెను. క్రోధాంధుడైన రెసిడెంటు ఆయనను ఖైదీ చేసెదనని భయపెట్టెను. కాని తుదకు కాబాగాంధిగారి సాహసము, ధైర్యమును గాంచి ఆయన ఆసంకల్పమునుండి విరమించెను. ఆరోజులలో ముఖస్తుతి చేయక స్పష్టముగా ఆంగ్లేయ ఉద్యోగుల విషయముగాని, పనిపాటల విషయముగాని విమర్శించుట ఎంతసాహసకృత్యమో ఆయనకు తెలియును. ఐనను ఆయన మహత్తరహృదయము ప్రభునిందను సహింపలేక పోయెను.

రాజకోటయందే బాలకగాంధీయొక్క విద్యార్థిజీవితము నియమితముగా ఆరంభమాయెను. పోర్ బందరులో ఉన్నసమయములో ఆయన చదువు సరిగా సాగలేదు. కష్టపడి కొంతవరకు నేర్చుకొనెను.

రాజకోటలో ఆయన ప్రాథమిక విద్యాలయములో చేర్పబడిరి. అచ్చట ప్రాథమికవిద్యాలయములో విద్యపూర్తి చేసి ఆంగ్లేయవిద్యాలయములో విద్యాభ్యాసము నారంభించెను. అచ్చట విద్య పూర్తిచేసి ఉన్నతవిద్యాలయములో ప్రవేశించెను. విద్యాలయములో ఆయన ఎప్పుడును మంచివిద్యార్థిగా కాలేకపోయెను. ఉన్నతశ్రేణిలో చదువునప్పుడు చదువులో మంచిమార్కులు వచ్చుటచే ఒకటి

రెండుసారులు. విద్యార్థి వేతనము పొందగలిగెను. ద్వితీయ శ్రేణిలో బహుమతులను పొందిరి. చతుర్థ, పంచమ శ్రేణులలో రు 4, 5 లు విద్యార్థి వేతనములను పొందిరి. వాటిని పొందుటలో తెలివితేటలకంటె అదృష్టమువల్లనే పొందెనని ఆయన అంగీకరించెను. ఈ వేతనములు విద్యార్థుల కొరకు కాదు. క్షత్రియవార్ 'సోరట్' ప్రాంతములనుండి చదువుకొనుటకు వచ్చిన వారికి మాత్రమే నిర్ణయింప బడినవి. 40, 50 మంది విద్యార్థులుగల శ్రేణిలో సోరట్ విద్యార్థులు ఎందరు ఉందురు?

బాల్యకాలములోను విద్యార్థిజీవితములోను గాంధీజీ స్వభావము, ఆచరణసాధారణబాలురవంటిది కాదు.

ఆయన క్లాసులోను, ఉపాధ్యాయులసమక్షములోను అత్యంతలజ్జాశీలురై యుండువారు. విద్యాలయమునుండి బయటికి వచ్చిన పిమ్మట విద్యార్థులతో కలసిమెలసి యుండెడివారు కారు. నేరుగా గృహమునకు పోవువారు. క్లాసులో ఉన్నంతసేపు ఏదో విధముగా ఒకమూల ముడుచు కుని కూర్చొని యుండువారు.

ఈనాడు సమస్తవిశ్వవాసుల సమక్షమున ప్రశాంత మందహాస ప్రపూర్ణమైన వదనము నెత్తి తనమధుర సంభాషణములచేత కోటానుకోట్లప్రజలను తనవారినిగా గావించుకొనగలిన వ్యక్తికి బాల్యకాలమునందున్న యీ లజ్జాప్రకృతి అతివిచిత్రమైనది. గాంధీజీ కార్యక్రమము

అల్పస్వల్పమైన, మధురమైన వైచిత్ర్యములచేత పూర్ణమై యుండును. గాంధీగారి సాత్త్వికప్రకృతి ఆయన బాల్యకాలము నుండియు పవిత్రమైన, మహోజ్జ్వలమైన మహిమచే ఆయనను అలంకరించి వేసెను. ఆప్రకృతి వికాసము పొందిన క్రమము అతిమనోహరమైనది.

ఒక వనములో అనేకములైన చిన్నచిన్న మొక్కలు ఉండెను. ఆ మొక్కలలో ఒక మఱ్ఱిమొక్కకూడ ఉండెను.

చిన్నదైననేమి, చిన్నదైన, లేతదైన తన దేహము చిన్నచిన్న ఆకులను ధరించుచు ఆ మొక్కలలో తనగాంభీర్యమును, విశేషత్వమును ప్రకటితము చేయుచుండెను.

దానిని చూచినపుడు ప్రతివానికి తోచునదేమనగా—ఈ మొక్క మఱ్ఱిమొక్క. ఇది ఒకనాటికి చాలా పెద్దది యగును. ఆకాశమంతటను తన శిరస్సును వ్యాపింపజేయును. వనమంతయు తన శాఖలచేతను, పత్రములచేతను నింపివేయును. వనమంతటికిని రాజగును. దాని ఛాయాతలమున క్లాంతశ్రాంతపథికులకు ఆశ్రయమిచ్చి శాంతింపజేయును.

విద్యాలయమునందు అనేక విద్యార్థులు గలరు. బాలకులలో చిన్నవాడు మోహన్‌దాసు. చిన్నవాడయిననేమి, ఆయన క్షుద్రకాయమునుండి అప్పుడప్పుడు సుగుణముల వైచిత్ర్యములు అంతటను ప్రకాశించుచుండెడివి. ఈబాలుడు తన సుగుణములను సమస్తప్రపంచమునందు

వ్యాపింపచేయునని తోచుచున్నది. సమస్త ప్రపంచములో సుగుణరాజులకు రాజని కావచ్చును.

మోహన్‌దాస్ హైస్కూలులో ప్రథమసంవత్సరము నందుండగా ఆరోజు స్కూలుపర్యవేక్షకుడు జైల్సుదొర గారు స్కూలుకు వచ్చినారు. ఆయన 5, 6 శబ్దములకు వర్ణక్రమము వ్రాయుమని చెప్పెను. ఆశబ్దములలో ఒక శబ్దము Kettle అని యుండెను. దాని వర్ణక్రమమును మోహనదాసు తప్పు వ్రాసెను. క్లాసుఉపాధ్యాయుడు దానిని గ్రహించెను. ఆయన కాలుజోడు శబ్దముతో మోహనదాసును హెచ్చరించెను. ఉపాధ్యాయుడు ఆప్రక్క పిల్లవాని పలకనుండి చూచి ఆవర్ణక్రమమును సరిచేసుకొమ్మని హెచ్చరించుచున్నాడని మోహనదాసు గ్రహింపజాలకపోయెను ఆతడు ఎట్లు గ్రహింపగలడు? ఎప్పుడును నకలుచేయని బాలుడు నకలుచేయుమని సూచించిన సూచనను ఎట్లు గ్రహింపగలడు? ప్రక్కబాలుని పలక చూచి వ్రాసెదనేమోనని నన్ను జాగ్రతపరచుచున్నాడని బాలక మోహన్‌దాస్ గ్రహించెను. ఇతర బాలురు వ్రాసినదంతయు సరిగా యుండెను. మోహన్‌దాస్ వ్రాసినది తప్పు ఆయెను. పర్యవేక్షకుడు వెడలిపోయిన పిమ్మట, మోహన్‌దాస్ నీవు నాసూచనను గ్రహింపలేక పోయితివిగదా యని ఉపాధ్యాయుడు నుడివెను.

మోహన్‌దాసు యీసారి యుక్తియు గ్రహించెను. గ్రహించుటయే ఆతడు సంతోషించెను— ఇతరులు వ్రాసినది చూచి వ్రాసి తప్పుపొందలేదు. అంతే చాలును.

ఆదినమే కాదు, నాగెన్నడును క్లాసులో యితరపిల్లల వ్రాత చూచి నకలు చేయుట నేర్చుకొనలేదు.

ఆయన విద్యార్థిజీవితములో నొకరియొక విశేష సుగుణము ఆయనకు గలగురుభక్తి. గాంధీజీ ఎన్నడును తన ఉపాధ్యాయుల పనులను గురించిగాని, బోధనాపద్ధతినిగురించి గాని విమర్శించలేదు. ఉపాధ్యాయుని లోటుపాటులు గ్రహించియు ఆయనయెడల భక్తిశ్రద్ధలను చూపించెడివారు, గురువులను సర్వదా గౌరవింపవలెననియు, ఏకారణమువల్లనైన వారి కార్యములను విమర్శించరాదనియు ఆయన బాల్యకాలమునుండియు ఆయన హృదయములో దృఢముగా నాటుకొని యుండెను.

పరిణతవయస్సులో తనభ్రమలను, అసత్యమును పరిశోధించి న్యాయమును, సత్యమును ప్రపంచసమక్షమున ప్రదర్శించియున్న మహాపురుషు నాతడే బాల్యకాలమున యీవిచిత్రమైన గురుభక్తి కలిగియుండుట సాధ్యమైనది!

ఆయనకు బాల్యావస్థలో నున్న యొక సుగుణముండెను. ఆయన ఎవ్వనిని మోసము చేయువాడుకాదు. తన ఉపా

యులయెడలను, తోడివిద్యార్థులయెడలను ఏవిధమైన అన్య థా ఆచరణ యుండెడిది గాదు.

ఆయన పాఠములను తయారుచేసుకొనుట ద్వారా యీసత్యపరాయణతను అలవరచుకొనెను.

విద్యార్థిజీవితము లో పుస్తకములు చదువుటయం దాయ నకు అంతగా రుచించెడిది కాదు. పాఠ్యపుస్తకము లకూడా రుచించెడివి కావు. కాని పాఠములు తయారు చేసుకొనక పోయినయెడల ఉపాధ్యాయులు కోపపడుదురు. ఆభయము చేత దైనికపాఠములను చదువుచుండువారు. భయమునుండి తప్పించుకొనుటకు పాఠములను తయారుచేయలేదని ఉపా ధ్యాయులకు ఎన్నడును అబద్ధము చెప్పలేదు.

ఈ వయస్సునుండి తన విచారణశక్తిని న్యూన పరచుకొని, సహజముగా మిథ్యాకారణములను చూపించు పనులను ఆయన అసహ్యించుకొనువారు. కాని ఆయన కల్పనాశక్తి ఆబద్ధమైయున్న తనహృదయమనోద్వారమును తెరచికొని ప్రపంచములో వ్యాపించ కోరినపుడు, తన విద్యావిముఖ అంతరము అనంతోత్సాహముతో నవనవ దేశముల, దృశ్యముల, చరిత్రలను గురించి వినుటకును, తెలుసుకొనుటకును, చూచుటకును వ్యాకులపడుచుండును. ఈవిషయముకూడ గాంధిజీవితములో ఒకవిచిత్రమైన సంఘటన!

ఒకరోజున తనతండ్రిగారి గదిలో తనతండ్రిగారు కొనితెచ్చిన ఒకపుస్తకముపై ఆయనదృష్టి పడెను. అది

'శ్రవణపితృభక్తి' అను ఒక నాటకము. నాటకము చదువదగినదని ఆయనకు యిచ్చి బనించెను. ఆయన దానిని ఆతురతతో చదివెను. బాలకుడైన శ్రవణుడు ఎంతభక్తితోను శ్రద్ధతోను తనతలిదండ్రులకు సేవచేయువాడో, తలిదండ్రులను సుఖపెట్టుటకు ఎంత పరిశ్రమ, కష్టముల నోర్చుకొనువాడో ఆపుస్తకము చదువుచు ఆయన గ్రహించెను. ఒకరోజున బొమ్మలదుకాణములో శ్రవణునిగురించి కొన్నిబొమ్మలను చూచెను. ఆనాటకశ్రవణునికి యీశ్రవణునికి సరిపోల్చి చూచినపుడు ఆయనకల్పనాశక్తి మరింత దృఢతర మయ్యెను. ప్రసారిత మాయెను. తనగృహమునకు లాంతరు బయస్కోపు చూచుటకు ఒకరు వచ్చిరి. ఆబొమ్మలు చూచునపుడు ఆకథలోని రెండుసంఘటనలను చూచెను. శ్రవణుడు తన భుజముపైనున్న సంచిలో తన వృద్ధతలిదండ్రులను పెట్టుకొని తీర్థయాత్రకు వెళ్ళుచున్నటుల గాంచెను. మరియొకదానిలో మృతుడైన శ్రవణునిప్రక్కన కూర్చొని తనతలిదండ్రులు వ్యాకులహృదయముతో ఏడ్చుచుండుట దర్శించెను.

బాలుడు మోహనదాసుని హృదయము కరుణారసముతో కరగిపోయెను. శ్రవణునివలె శ్రద్ధాభక్తులతో తలిదండ్రులసేవ చేయుటకు సంకల్పించుకొనెను.

మరియొక సంఘటనను అవలంబించి ఆయనయందు నూతనముగా జనించిన భావప్రవాహము పొంగి పొరలుచున్న శీతలధారలచేత ఆయన హృదయమును సిక్తము చేసి రసవంతముగా గావించెను.

ఒకసారి రాజకోటకు ఒకనాటకకంపెనీవారు వచ్చిరి. బాలకుడైన గాంధీ నాటకము చూచుటకై తండ్రిగారి అనుమతి కోరిరి. అనుమతిపొంది నాటకము చూచుటకు పోయెను. హరిశ్చంద్రుని సత్యపాలనమే నాటకవిషయము. హరిశ్చంద్రుడు సత్యమునురక్షించుటకు ఒక్కొక్కటిగా రాజ్యమును, ఐశ్వర్యమును, భార్యను, పుత్రుని సమస్తమును దానము చేసినట్లును, ఆయన స్వయముగా దాసత్వమునకు అంగీకరించినట్లును, పుత్రుని మరణమును సహా చూచినట్లును, సత్యమును పాలించుటచేత తిరిగి సమస్తమును పొందినట్లును నాటకములో గాంధి తిలకించెను. హరిశ్చంద్రునిచరిత్ర గాంధిహృదయములో హత్తుకు పోయెను. హరిశ్చంద్రుడు గాంధిగారిభావములకు ప్రియమైన సహచరు డాయెను. హరిశ్చంద్రునిత్యాగము ఆయనకు సర్వసమయములలో ఆలోచనావిషయ మాయెను.

భావరసలోలుడైన గాంధి ఆనాటకమును పలుమార్లు చూచుటకు కోరుచుండెను. కాని అనుమతి బడయకపోవుటచే చూడలేకపోయెను. చూడలేకపోయినను తనహృదయములో హరిశ్చంద్రుని దృఢముగా ప్రతిష్ఠితము చేసికొనెను.

హరిశ్చంద్రునివలె సత్యవాదిని ఎందుకు కాజాలను అని ప్రతిజ్ఞ చేసుకొనెను. హరిశ్చంద్రునివలె ఆపదలలో దగు ల్కొనినంఆయనవలె సత్యమును పాలింతును.

ఇదియే నా జీవనలక్ష్యము, ఏకమాత్రసత్యము.

శీతకాలప్రభాతమున పూర్వాకాశమున తరుణ భానుని రక్తరంజితకిరణజాలములు నలువైపుల అలము కొనెను.

నీలాకాశమంతయు సూర్యకిరణములచే పరివ్యాప్త మాయెను.

గాంధీజీ బాల్యకాలము పరాధీనభారతదేశమున శీతకాలరాత్రిల జడత్వముతో కూడినయుగము.

కాని రాత్రి అంతము కాకున్నను ప్రభాతాగమనము సూచింపబడుచున్నది.

అప్పుడు భారతజాతీయమహాసభ జన్మించినది.

జాతీయజాగరణ గుంజరణధ్వనులమధ్య రాజకోటలో నొకగృహమున భారతస్వాతంత్ర్యసూర్యుని దివ్యమూర్తి, ఆయనలోని సత్యదర్శనముయొక్క తరుణకిరణములచేత భారత భాగ్యాకాశమును మహోజ్వలముగా గావించుటకు మందగమనమున మేల్కొనుండెను.

ఆనాటి చరిత్రయొక్క క్షీణరశ్మి నాధారముగా జేసికొని ఆయన భారతదేశమునందేగాక సమస్తవిశ్వము నందును సత్యమహిమను, సత్యాలోకమును ప్రకాశింపజేసిరి.

ఈవిషయమును ఆనాటిభారతీయు లెవ్వరైన తెలుసుకొన
గలిగిరా, గ్రహింపగలిగిరా? ఎవరు గ్రహింపగపోయినను
భారతభాగ్యవిధాత గ్రహింప గలిగెను. అందువలన ఆయన
రహస్యముగా నుండి ఆలేతహృదయములో సత్యముయొక్క
బీజములను నాటియుండెను. ఆబీజమే కాలక్రమమున మహో-
రుహముగా పరిణమించి భారదేశమంతటను వ్యాపించెను.

గాంధిగారిభావములవిచిత్ర వికాసము ఆయనహృదయ
ములో సత్యము సంపూర్ణముగా వికసించుటచేత నేసంఘటిల్లి
నది. ఆయన బాల్యకాలమునాటి విచిత్రసంఘటనలవివరము
లన్నియు వర్ణింపవలసిననో ఆయనయం దపూర్వముగా
నున్న మాతాపితలసంఘటనలకూడ వర్ణింపవలయును.

తలిదండ్రుల సేవచేయుటకు ఆయన స్కూలులో
చేయు వ్యాయామమునుకూడ విసర్జించెను. అహోరాత్ర
ములు రుగ్ణావస్థయందున్న తండ్రిగారి శయ్యాపార్శ్వమున
గూర్చొని ఆయనసేవజేసి తృప్తినిబొందిరి. తండ్రిగారిమరణ
కాలమున ఆయన సేవచేయుభాగ్యము పొందలేక అశ్రువు
లను రాల్చిరి. ఇంగ్లాండునుండి బ్యారిష్టరుపరీక్ష ప్యాసయి
తిరిగి స్వదేశమునకు వచ్చి మాతృదేవిమరణవార్త విని
శిశువువలె ఏకధారగా అశ్రువిసర్జన గావించిరి.ఆయనజీవిత
చరిత్రను అలోచించుటలో ఆయన తలిదండ్రులయెడల
చూపిన శ్రద్ధాభక్తుల విషయము క్రమముగా మరికొంత
ముచ్చటించబడును.

# విద్యాలయములోని దినములు

విద్యాలయములో మోహనదాసు విశేషజ్ఞానవంతుడుగా నుండక పోయినను ప్రశ్నలకొక్కి పోయినకొలది విద్యావిషయములలో విశేషమైన ఔన్నత్యమును పొందుచుండెను. ఈవిషయము ఇదివరకే చెప్పబడియున్నది. దీనితో పాటు నైతికచరిత్ర వికాసము పొందిన విషయమును గూర్చి తెలుసుకొనవలెను. మోహనదాసు తన చదువువిషయములో చూపిన శ్రద్ధాగౌరవములకంటె తనఆచరణలోని లోపముల విషయమై అత్యంతజాగరూకుడై యుండువాడు. ఆయన ఆచరణవలన ఉపాధ్యాయుడు విధించినశిక్షకంటెను, నిందలకంటెను, తనవల్లజరిగిన భ్రాంత ఆచరణకొరకు అధికముగా విచారించువాడు, బాధపడువాడు. శిక్షకొరకుగాని, తిట్లకొరకుగాని అంతగా బాధపడువాడు కాడు. ఏదో కారణముచేత ఒకప్పుడు ఉపాధ్యాయుడు ఆయనను బెత్తముతో కొట్టెను. ఆ బెత్తపుదెబ్బయొక్క బాధకంటె అపరాధము యొక్క బాధయే ఆయనను ఎక్కువ కష్టమును కలుగ జేసెను.

ఆయన కాలములో 'దోరాబజీ ఎదుల్ జీ గిమీ' అను ఆయన విద్యాలయమునకు ప్రధాన అధ్యాపకుడుగా నుండెను. విద్యార్థులచేత బలాత్కారముగానైనను వ్యాయామము చేయించవలెనని ఆయన నియమము పెట్టెను. మోహన

దాసు చాలా సిగ్గుగా నుండువాడు. ఇతర పిల్లలతో స్వేచ్ఛగా తిరుగుటకే ఆయన సిగ్గుపడుచుండెను. వ్యాయామమును చేయుటకు కూడ ఆయనకు యిష్టము లేకుండెను. బాల్యకాలమునుండి ఆయన షికారు వెళ్ళుటకే యిష్టపడుచుండెడివాడు. మంచిగాలిలో తిరుగుటవలన కలిగెడి ఉపకారమును గురించి బాల్యకాలమునందు ఒక పుస్తకములో చదివియుండెను. అప్పటినుండి నియమపూర్వకముగా భ్రమణము చేయుటచేత ఆయన ఆరోగ్యము అక్షుణ్ణముగానుండి దృఢముగాను, బలిష్ఠముగాను ఉండెను. కేవలము సిగ్గుచేత అనాసక్తతచేతనే వ్యాయామమునుండి విరమించలేదు ఆసమయములో ఆయనతండ్రి జబ్బుగా నుండెను. అందువలన స్కూలుకు శెలవు యిచ్చినవెంటనే వ్యాయామమును చేయక ఆయన తండ్రిగారికి సేవచేయుటకై గృహమునకు పరుగెత్తి పోవువాడు. మోహనదాసు వ్యాయామస్థలములో లేకపోవుటచూచి గిమీ ఆయనను శిక్షింప సంకల్పించుకొనెను. కాని ఆయన వర్షాకాలములో ఒకరోజున సరియైన కాలమును గ్రహింపలేక పోవుటచేత, వ్యాయామస్థలమునకు ఆలస్యముగా వచ్చెను. అప్పటికి వ్యాయామసమయము గడచి పోయెను. ఇతర బాలురు అందరును వ్యాయామము పూర్తి చేసుకుని తిరిగి వచ్చుచుండిరి. మరునాడు స్కూలుకు వెళ్ళిన పిమ్మట వ్యాయామమునకు రాని కారణము గిమీ గాంధి గారిని అడిగెను. వర్షముగా నుండుటచేత సరియైన వేళ తెలుసు

కొనలేక పోయితినని [illegible] చెప్పెను. కాని గిమీయాసను [illegible] వానిని నమ్మలేదు. ఆయనను మిథ్యావాదిగా తలంచి కొన్ని అణాలు జరిమానా విధించెను. ఆరోజున బాలక మోహనదాసునకు చాలా కష్టము కలిగెను. తుదకు ఉపాధ్యాయుడు నన్ను మిథ్యావాదిగా తలంచెనా యని విచారించెను. మోహనదాసు జరిమానా [illegible] ఆలోచించక తన సత్యముయొక్క మర్యాదకు హాని కలిగెనని ఎంతయో విలపించెను. సత్యముయొక్క గౌరవమును రక్షించుటకు [illegible] ఆహార తెక్కలనుండి మాంసాహారములను, ఇతర ఆ[illegible]ములను తీసివేసి శాకాహారిగా [illegible] వ్యక్తి, [illegible] జీవితములో ఆపదలకు [illegible] జేసుకొని కూడ [illegible] సత్యము, [illegible] న్యాయములకు విరుద్ధముగా సత్యాగ్రహములో నిమగ్నమైయున్న మానవుడు, భారతస్వాతంత్ర్య సంగ్రామములో సత్యాగ్రహముయొక్క [illegible]నవాస్త్రమును [illegible] బ్రిటిషు శాసకులను సహించ[illegible] అపన్న[illegible]గను [illegible]ంచిన పురుషోత్తముడు, ఉపాధ్యాయుని విచారణలో సత్యము అవమానింపబడినపుడు [illegible] ఆ వేదన పడెననువిషయములో ఆశ్చర్యమేమున్నది!

ఆనాటి యీ వేదన [illegible] ఆయన భావిజీవితమును, ఆదర్శములను విశేషముగా [illegible]సింప చేయుట కెంతో తోడ్పడెను.

ఆనాటినుండి ఆయన జీవనాంతమువరకు సత్యము అవమానింప బడినటుల చూచినచో బాధపడుచుండురు. విచారగ్రస్తు లగు చుందురు. అసత్యమును ధ్వంసము చేసి సత్యమును ప్రతిష్ఠితము గావించుటకు నిర్భయహృదయముతో కార్యక్షేత్రమునకు ఉరుకుచుండువారు.

ధర్మము బాహ్యాకాచారములవలన వేరు వేరుగా ఉండవచ్చును, కాని ప్రతిధర్మమునకు అంతర్నిహితసత్యము ఒక్కటే. దీనిని ప్రమాణముచేసి భారతదేశములోని వివిధ సాంప్రదాయముల సమ్మేళనమునకును, సద్భావములకును ఆయన ఎంత పరిశ్రమగావించినారు!

మోహనదాసు తండ్రిగారు వ్రాసిన ఉత్తరము ప్రధానోపాధ్యాయునకు ఇచ్చిరి. తండ్రి తనసేవకొరకు స్కూలుకు శలవుయిచ్చిన వెంటనే మోహనదాసును వదలి పెట్టమని ఆఉత్తరముద్వారా వేడుకొనెను. మోహన్‌దాస్ వ్యాయామమునుండి ముక్తిపొందెను, కాని ఆరోగ్యమునకు వ్యాయామము ప్రధానమైనదని, అవుసరమైనదని మోహన్‌దాసు అనంతరము గ్రహించెను. ఆయన జీవితకాలమంతయు నియమితభ్రమణము చేయుటచేత ఆయనకు వ్యాయామమువలనకలుగవలసిన మహోపకారము కలిగెను. ఈభ్రమణరూపమైన వ్యాయామమునకు ఆయన అంతమువరకు అలవాటుపడియుండిరి. ఏకనిష్ఠుడగువ్యాయామవీరుడు

కూడ ఆయనవలె యింత నియమపూర్వకముగా, నియమిత సమయములో వ్యాయామచర్య చేయుదునో లేదో సందేహము.

మహాత్మాగాంధి నిష్పాపియు, దోషరహితుడు నైన మహామానవుడు, కాని బాలకమోహనదాసు బాలకుడు మాత్రమే. అందువలన విద్యార్థిజీవితములోను, బాల్య కాలములోను ఆయన అనేకదోషములను, అనేకపొరపాటు లనుకూడ గావించియుండెను.

విద్యార్జనతో పాటు చేతివ్రాత చక్కగా ఉండ వలెను అనుదాని కెట్టిసంబంధము లేదని ఆయన తలంచెను. ఆయన ఇంగ్లాండు పోవువరకు యీమూఢవిశ్వాసము ఆయన యందు ఉండెను. కాని అనంతరము ఆఫ్రికాలో వకీళ్ళ యొక్కయు, ఇతరవిద్యావంతులగు యువకులయొక్కయు ముత్యములవంటి వ్రాత అక్షరములను చూచి ఆయనలో నున్న ఆమూఢవిశ్వాసము తొలగిపోయెను. వారివ్రాత అక్షరములతో తనఅక్షరములను సరిపోల్చిచూచి అస్పష్ట మైన, అందవిహీనమైన చేతివ్రాత అసంపూర్ణవిద్యకు నిదర్శనమని గ్రహించెను, ఆయన తనదోషమును దిద్దుకొని అక్షరములను చక్కగా వ్రాయుటను అలవరచుకొనెను. ఈవిషయములో అనుభవము సంపాదించి ఆయన యిట్లు హితోపదేశము గావించిరి—మంచిచేతివ్రాత విద్యకు ప్రధా నాంగమని ప్రతియువకుడును, యువతియు గ్రహింపవల

యును. తప్పుచేసి తప్పును ఒప్పుకొనుటలోను, సత్యమును సత్యముగా స్వీకరించుటలోను ఎంత సరళత్వము, ఎంత నిష్కాపట్యము! ఇట్టిఆచరణ గాంధీగారికే తగియున్నది!

ఇట్టిస్వీకారము, సత్యానుసంధానమే ఆయన కార్యములను, స్వభావమును ప్రజలనేత్రములకు శ్రేష్ఠమైనవిగను, సుందరమైనవిగను జేసివైచినవి. ఈవిధముగా నిజదోషమును అంగీకరించుట, అంగీకారముద్వారా ప్రవర్తనను సంస్కరించు ప్రయత్నము చేయుట గాంధిగారి చారిత్రమునందు దొరక విశేషవైశిష్ట్యము.

ఈవైశిష్ట్యమును గురించి ఆయనజీవితములో అనేక సార్లు గాంచితిమి.

విద్యార్థి మోహనదాస్ విద్యార్థదశలో కొన్ని క్లిష్టసమస్యలలో పడిపోయెను. కాని తనస్వప్రయత్నము వల్లనే ఆసమస్యలను చక్కబరచుకొనెను.

ఆయనకు 13 సంవత్సరములవయస్సులో వివాహము జరిగెను. ఈవివాహవివరములు తరువాత చెప్పబడును. కాని వివాహము జరుగుటచే ఆయన చదువు ఒకసంవత్సరము నిలిపి వేయవలసివచ్చెను. కాని ఆసంవత్సరచదువును పూర్తిచేయుటకు ఉపాధ్యాయులు ఒకవిశేషవ్యవస్థను గావించిరి. ఆరునెలలవరకు అనగా ఎండకాలపు శెలవులవరకు ఆయనను మూడవక్లాసులో చదివించిరి గ్రీష్మకాలము గడచినపిమ్మట ఆయనను నాలుగవక్లాసులో ప్రవేశ పెట్టిరి.

నాలుగవక్లాసులో ప్రవేశించినపిమ్మట పాఠములు తయారు చేయుట ఆయనకు కష్టసాధ్యముగా యుండెను. కారణ మేమనగా, ఆ శ్రేణికి చెందిన పాఠము లన్నియు అప్పటి నియమముల ననుసరించి ఆంగ్లభాషలో బోధింపబడెడివి. ఇతరవిషయములు ఏదో విధముగా గ్రహించినను జ్యామెట్రివిషయములో ఆయన చాలాచిక్కులోపడిపోవలసి వచ్చెను. జ్యామెట్రివిషయములన్నియు ఆంగ్లభాషలో నుండుటచే ఆయన వాటిని ఎంతమాత్రము గ్రహించలేక పోయెను. తుదకు ఆయన నిరాశ చెందెను. మూడవక్లాసు చదువకుండా నాలుగవక్లాసులో ప్రవేశించినందుకు ఆయన విచారించుచుండెను. కాని గ్రహించు ప్రయత్నమునుండి విరమించలేదు. ఆయన చేసిన యేకాగ్రప్రయత్నఫలిత ముగా జ్యామిట్రియందుగల కఠినవిషయములన్నియుఆయనకు సులభముగా బోధపడెను. రామచిలుకవలె కంఠస్థముచేయక తాను స్వయముగా గ్రహించి చదువుటచే జామిట్రి యందున్న కఠినవిషయముల నన్నిటిని ఆయన అతి అనా యాసముగా గ్రహింపగలిగెను. పాఠములు గ్రహింపక కంఠస్థము చేయుటకంటె గ్రహించి చదువుటలో ఎంత మహత్తరమైన ఫలితము గలదో ఆయన విశేషముగా గ్రహింప గలిగెను.

ఆయన ఆరవ శ్రేణిలో ప్రవేశించినపుడు సంస్కృత పాఠములవలన కొంత చిక్కులో పడిపోయెను. సంస్కృత

పండితుడు కఠోరపరిశ్రమగలవాడై యుండెను. ఆయన విద్యార్థులకు పాఠములను బోధించుటలో విశేషప్రజ్ఞావంతుడు. సంస్కృత పాఠములు అధికమగుటచేత అవి మోహనదాసుకు సుఖకరములుగా ఉండక కష్టదాయకములుగా ఉండెను. పాఠములను సరిగా అభ్యసింపలేకపోయిరి. ఈ సమయములో యితరవిద్యార్థులు పారసీభాషను కోరియుండుచుండిరి. అందువలన ఆయన సంస్కృతముపై నిరాశ చెంది పారసీభాషను నేర్చుకొన సంకల్పించుకొనెను. సంస్కృత పండితుడు యీవిషయము విని మిక్కిలి విచారించిరి. నిరాశ చెందవలదని మోహనదాసుకు నచ్చజెప్పి కఠినవిషయముల నన్నిటిని ఎక్కువశ్రద్ధతో నేర్పెదనని పండితులు ప్రతిన జేసిరి. సదయహృదయులైన గురువుగారి సహాయముతో సంస్కృతమును మరల అభ్యసించి గ్రహింపగలిగిరి.

సంస్కృతభాషను తిరస్కరింపక ఏకాగ్రతతో, ధైర్యముతో నేర్చుకొనుటచేత ఆయన తనభావిజీవితములో పొందిన సత్ఫలములనుగూర్చి ఆయన యిట్లు నుడివియుండిరి. "అప్పుడు ఆమాత్రము సంస్కృతమైన నేర్చియుండనియెడల నేడు సంస్కృతగ్రంథములనుండి పొందుచున్న రసాస్వాదమును పొందువాడను కాను. సంస్కృతభాషను చక్కగా అభ్యసించలేదను అనుతాపమును నేను అనుభవించుచున్నాను. హిందూబాలకులు ఎవరైనను సంస్కృతము నేర్వనిది జరుగదని నేను గ్రహించితిని."

సంస్కృతభాష నేర్చుకొనుట ప్రతిహిందువునకు అవశ్యకర్తవ్యమని ఆయన బోధించెను.

ఆయన బోధించిన విషయములలో మరియొక ముఖ్యమైన విషయము మాతృభాషలో విశేషజ్ఞానమును ఆర్జించుట. పఠనీయవిషయములు — జ్యామెట్రి, ఇతిహాసము, భూగోళము మొదలైనవిషయములు మాతృభాషలో చదివినచో సహజముగను, అల్పకాలములోను నేర్చుకొన వచ్చును. విదేశభాషలో సులభముగా గ్రాహ్యములు కావు.

---

## 4

## వివాహము

గాంధిగారి బాల్యవివాహమునుగురించి ఆలోచించినపుడు మనకు ఆశ్చర్యము కలుగకమానదు. బాల్యవివాహమునకు ప్రతికూలముగా భారతీయులందరికిని ఎన్నియో ఉపదేశముల నిచ్చినవారు, బాల్యవివాహముయొక్క దుష్ఫలితమునుగురించి విశేషముగా ప్రచారము గావించినవారు, పదమూడుసంవత్సరములవయస్సులోనే వివాహబంధనముచే ఏల బంధింపబడిరి?

గాంధిజీ వివాహవిషయమే యీప్రశ్నకు జవాబు నొసంగగలదు.

హిందూస్థానమునందు ఆకాలములో బాల్యవివాహములు విరివిగా జరుగుచుండెను. దక్షిణభారతదేశములో యీఆచారము అత్యంతికరోగముగ ఉండెను. గాంధీపరివారమువారు వంశానుక్రమముగా వారిసంతానమునకు వివాహములు జరిపెడివారు. వివాహమునకు ముందుగానే ఆ దేశాచారము ననుసరించి వాగ్దానము చేసుకొనెడివారు. మోహనదాసు వివాహమునకు ముందు యిద్దరు కన్యలతో ఆయనకు వాగ్దానము జరిగియుండెను. కాని యీవాగ్దానము భగ్నముకూడ అగుచుండెను. గాంధిగారికి జరిగిన యీ రెండువాగ్దానములు రద్దు చేయబడి మూడవకన్యతో వివాహము జరుపబడెను.

మోహనదాసు వివాహముతో పాటు ఆయన ద్వితీయ సోదరునకు, మరియొకసోదరునకు వివాహములు జరుపుటకు యేర్పాటులు గావింపబడెను.

దీనికి ఒక కారణముండెను. కాబాగాంధి, ఆయన తమ్ముడు వృద్ధులైరి. ఈవివాహములు వారిజీవితములో అంత్య అనుష్ఠానములు. అందువలన వారు యీవివాహములను అత్యంతవైభవోపేతముగా జరుప తలంచిరి.

ముగ్గురుకుమారుల వివాహములు ఏకకాలమున జరిగిన యెడల వివాహసమయమున పరిశ్రమ కొంతమేర తగ్గుననియు, ముగ్గురువివాహములకు వేరువేరు ఖర్చులు చేయక ఒకేకాలమున చేసినయెడల మహావైభవముగా జరుపవచ్చు

వనియు తెలిపిరి. అందువలన మోహనదాస్, అతనిసోద రులు వివాహమన నేమియో గ్రహించుటకు పూర్వమే వివాహమునకు శుభదినము నిర్ణయింపబడెను.

వివాహములోని దాంపత్యజీవితము, భోగవిషయ ములు వారు గ్రహించ[illegible] [illegible]ంచిబట్టలను ధరించిరి. మంచి ఆ[illegible] భుజి[illegible] వారియెడల బంధుబాంధవులు అత్యంత ఆదరాభిమానములను చూపించిరి. అందువలన గాంధిసోదరులు విస్మయ మొందుటయేగాక పరి తృప్తినికూడ పొందిరి. వివాహదినము సమీపించెను.

పోర్ బందరులో వారి పురాతనగృహములో వివాహ ము జరుగుటకు ఏర్పాట్లు గావింపబడెను. గాంధిజీ పెత్తండ్రి అప్పుడు పోర్ బందరులో దివానుగానుండిరి. కాని తండ్రియైన కాబా గాంధి రాజకోటలో ఠాకూరుసాహెబ్ దర్బారులో ఉద్యోగము చేయుచుండువాడు. ఆయనఠాకూర్ సాహెబ్ గారికి అత్యంత ప్రియమైన ఉద్యోగస్తుడుగా నుం డెను. ఠాకూర్ సాహెబ్ గాంధికి ముందుగా ఎక్కువ రోజులు శలవు ఇచ్చుటకు అంగీకరించలేదు. వివాహము నకు కొద్దిరోజులు ముందుగానే శలవు మంజూరాయెను. గాంధిగారిపరివారము పోర్ బందరుకు త్వరగా చేరుటకు తగిన బండిసదుపాయములు చేసెను. రాజకోటనుండి పోర్ బంద రుకు వచ్చుటకు ఆకాలములో 5 రోజులు పట్టెడిది. ప్రత్యేక యేర్పాట్లు చేయబడుటచేత గాంధిపరివారము మూడురోజు

లలో పోర్‌బందరుకు వచ్చిరి. కాని మార్గములో ఒకఆపద సంభవించెను. కాబాగాంధిగారిబండి హఠాత్తుగా విరగబడి పోవుటచే ఆయనకు దెబ్బలు తగిలెను.

తండ్రికి దెబ్బలు తగులుటచే వివాహ ఆనందము మ్లానరూపము దాల్చెను. కాని వివాహములు ఆగిపోలేదు. ఆడంబర అనుష్ఠానము లేవియు ఆగిపోలేదు. ఆహాతస్థాన ములో కట్లు కట్టుకుని కాబాగాంధి వివాహ ఉత్సవమునకు కావలసిన యేర్పాటు లన్నియు గావించెను.

ఈవివాహమునుగురించి గాంధిగారు యిట్టుల వ్రాసి యుండిరి— "వివాహ వేదికపై కూర్చుంటిమి, సప్తపదులు పూర్తి అయినవి. మృష్టాన్నమును భార్యాభర్తలము ఏక ముగా స్వీకరించితిమి. వధూవరులము ఒకటిగా గడపుచుం టిమి. అది ప్రథమరాత్రి. ఇద్దరు నిర్దోషులగు బాలబాలికలు సంసారసముద్రమున దుమికిరి. ప్రథమరాత్రి ఎట్లుప్రవర్తింప వలయునో వదినెగారు నేర్పిరి. ధర్మపత్నియైన కస్తురిబాయ్‌కి ఎవరు నేర్పిరో ప్రశ్నింపలేదు. ప్రశ్నించుటకు కోరికగాని, జ్ఞానముగాని లేకుండెను. మేము ఒకరినిచూచి ఒకరము భయపడుచుంటిమి."

బాల్యవివాహమువలన సహజజ్ఞానము లేకపోవుట చేత వధూవరులు వివాహఉద్దేశ్యమును గ్రహింపలేరు. ప్రేమ లేమిచేతను, అవసరమైన జ్ఞానము లేకపోవుటచేతను, వివా హముయొక్క ఆనందమునుగాని, మాధుర్యమునుగాని అను

భవించజాలరని పైన నదవరించిన వాక్యములద్వారా గాంధిగారు మనకు బోధించినారు. కేవలము అక్షులవలెను, అలంకరింపబడిన బొమ్మలవలెను అనుష్ఠానములను, నియమములను ఒకటివెనుక ఒకటి అనుసరించి నడచుచుందురు. జీవితముయొక్క శక్తిసామర్థ్యములను గ్రహించుటకు ముందే మహత్తరమైన బాధ్యత మెడపై వేసుకొందురు. అదిగాక బాల్యవివాహము విద్యార్థిదశలో బాలురకు ఎంతహానికరమైనదో గాంధిజీ తన అనుభవమువలన మనకు తెలియజేసినారు. వివాహమైన పిమ్మట ప్రేమఅనగా ఎట్టిదో గ్రహింపకపోయినను కస్తూరిబాయియెడల ఒకవిధమగు ఆకర్షణ కలిగియుండిరి. నిర్జనగృహములో కూర్చొని యిద్దరును అర్థములేని చిలుకపలుకులతో గడపుటచే ఒకవిధమైన మోహము ఉదయించెను. అందువలన స్కూలులో చదువుకొనునప్పుడు ఆయాకర్షణ, ఆమోహము ఆయనను వ్యాకులపరచుచుండెను. చదువుసంధ్యలలో శ్రద్ధ సన్నగిలి ఆబాలికనుగురించియే స్మరించుకొనుచుండువారు. గృహమునకు తిరిగివచ్చుటకు ఆతురతపడుచుండువారు. స్కూలునకు ఎప్పుడు శెలవిత్తురాయని నిరీక్షించి యుండువారు.

తన పరిస్థితులవల్లను, అనుభవమువల్లను ఆయన విద్యార్థిదశలో వివాహముయొక్క అనర్థకమును గ్రహించగలిగెను. విద్యార్థిదశలో వివాహము జరిగినయెడల అధ్యయనమునకు, జ్ఞానార్జనమునకు ఎంత అనర్థదాయకమో స్పష్ట

మగుచున్నది. బాల్యవివాహములవలన ఎందరో విద్యార్థులు అల్పవయస్సులోనే విద్యను విడనాడి తమభవిష్యత్తును, జీవితమును నష్టపరచుకొందురు.

బాల్యవివాహము మన దేశజీవితములో ఒకప్రమాదకరమైనవ్యాధి. సత్యద్రష్టయగు మోహనదాసు తనవివాహ సంఘటనవలన యీ వ్యాధియొక్క భయంకర చిత్రమును ప్రకటించినారు.

---

## 5

# కిశోరులు మోహన్‌దాసు, కస్తూరిబాయి.

మహానదులస్రోతస్సును దర్శింపవలెనన్న దానిప్రవాహమునకుగల ఆటంకములనుకూడ చూడవలయును. దాని చంచలజలప్రవాహమునకు ఒక పర్వతప్రాంతమున ఆటంకము కలుగుచుండును; ఒకలోయలో ఆవర్తిత మగుచుండును. కాని తుదకు సకల ఆటంకములను, ఆవర్తనములను అతిక్రమించి సమతలభూమిపై తనక్రమవర్ధమాన దేహమును మహత్తరముగను, విశాలముగను విస్తృతము జేసికొనుచుండును. అత్యంత వేగముతో సముద్రముపై పునకు పరుగిడుచుండును. దానినికూడ మనము విశేషముగా అవలోకించుట అత్యంతావశ్యకమైనది.

గాంధిజీజీవితము మహానదీస్రోతస్సును పోలియున్నది. దీనిధారను చూచినపుడు దీనియందుగల ఆటంకములుకూడ కనుపించును. కాని సకలమిథ్యల, భ్రాంతుల బాధాబంధనములను అతిక్రమించి యీజీవనధార ఎంత మహత్తరముగా, విశాలముగా సత్యజ్ఞానముల సమతల భూమిపై విస్తృతమాయెనో, తుదకు ఏమార్గమునబడి సాఫల్యమయొక్క శాంతిమయసముద్రమునకు పరుగిడి ప్రవేశించెనో సుస్పష్టముగా గానుపించును.

ఆయన విద్యార్థిదశలోని క్షుద్రఘటనలు, ఆయన దాంపత్యజీవితములోని కలహములు, ప్రథమయౌవనములోని కపటస్నేహితుల సాంగత్యములు, ఆయన బాధాబంధనముల, జయవిజయముల మహోజ్వలస్వరూపమును వికసితము చేయును. గాంధిజీ బాల్యదాంపత్యజీవితము ఆయనకు పరీక్షాక్షేత్రముగా పరిణమించెను. సహజజ్ఞానము ఉదయించు ప్రథమమోహమువలన ఆయన విద్యార్జనకెంత హాని కలిగెనో మన మెరుగుదుము. మోహమును జయించి విద్యార్జనలో ఎట్లు ఉద్యమశీలుడాయెనో దానినికూడ గ్రహించితిమి. కాని వికాసోన్ముఖమైన ఆయనదాంపత్యజీవితము మాత్సర్యము, దంభము, పతనములలోనికి ఆయన నెట్లు పడద్రోయుచుండెనో, ఎట్టిమహత్తరశక్తివలన ఆపతనముయొక్క ఆవేగమును నిరోధించి మరల ఆయన సహజ

మార్గమునకు మరలి వచ్చెనో దానిని మనము గ్రహించు టకు ప్రయత్నించెదము.

ఆయన బాల్యకాలపు అసంపూర్ణజ్ఞానమువలన అనేక సారులు సహధర్మిణియగు కస్తూరీబాయికి శ్రమ కలుగ జేసెను. ఒకరోజున ఉపదేశమూలకమైన పుస్తకములో దాంపత్యజీవితమునుగురించి కొన్ని ఉపదేశములను చదివెను. అందులో దంపతులప్రేమ, మితవ్యయము, బాల్యవివాహ ములు మొదలగు విషయములను గురించి వ్రాయబడియుం డెను. ఆపుస్తకములో ఏకపత్నీవ్రతమును నిష్ఠతో పాలించు నియమములు వ్రాయబడియుండెను. ఆనియమములు ఆయన మనస్సుపై ప్రభావమును విస్తరింపజేసెను. పూర్వపురుషుల వలె బహువివాహములు చేసుకొననని యు, కస్తూరీబాయికి మనోకష్టము కలుగజేసి ద్వితీయవివాహ మాడననియు ఆయన సంకల్పించుకొనెను.

కాని యీసంకల్పమువలన మరికొన్ని భ్రమప్రమాద ములు సృష్టింపబడెను. తత్ఫలితముగా ఆయనజీవితములోను, కస్తూరిబాయిజీవితములోను అనేకములైన కష్టములు, మనో వేదనములు అనుభవించిరి.

ఆయన ఏకపత్నీవ్రతమును పాలింతునని సంకల్పించు కొనినట్లే, కస్తూరిబాయిద్వారా ఏకపతివ్రతమును పాలింప జేసెనని భావించిరి. ఆ కాలపుసంఘములో పతిత్యాగము, పునర్వివాహము స్త్రీలకు కల్పనాతీతవిషయమైనను, ఆయన

కస్తూరిబాయికి యీ విషయములలో ఉపదేశముల నిచ్చు చుండిరి. ఈయుపదేశములను పాలించవలెనని బలాత్కరించు చుండిరి. అనుమతి లేకుండా బయటికి వెళ్ళవలదనియు, పర పురుషులతో మాట్లాడవలదనియు ఆయన తనభార్యకు హితోపదేశము గావించిరి.

కాని సరళమతియగు బాలిక ఆమాటలకు లక్ష్యము చేయు లేదు. ఆ మెపవిత్రస్వాదయములో పట్టుదల ప్రవర్ధిత మాయెను. కస్తూరిబాయి భర్తఆజ్ఞను ఉల్లంఘించు నుద్దేశ ముతోనే ఆత్మీయులతో బయటికి వెడలి పోవుచుండెను. అత్తగారితో దేవదర్శనమునకు వెళ్ళుచుండెను. తత్ఫలిత ముగా మనోమాలిన్యము, మానాభిమానములు సృష్టింప బడెను.

కాని పట్టుదల, మిథ్యావాదముల మోహము క్రమ ముగా తగ్గిపోయినవి. పిమ్మట మోహనదాసుకూడ తనభ్రమ లను గ్రహించి భార్యను ప్రేమపెట్టు మనోభావమును పరిత్య జించెను. ఈభ్రమను సంస్కరించుటకు ఉభయులలోనున్న పవిత్రప్రేమయే కారణభూత మాయెను. వయస్సు వృద్ధి జెందినకొలది ప్రేమకూడ గాఢతర మగుచుండెను. పరస్ప రులయందున్న భ్రమప్రమాదములు మరీచికలవలె అదృశ్య ములై పోవుచుండెను.

కస్తూరిబాయికి విద్య నేర్పించవలెనని ఆయనకు యిచ్ఛ జనించెను. ఆ కాలపుస్త్రీలవలె కస్తూరిబాయికూడ

మూఢాచారాలును నిరక్షరకుక్షిణియునై యుండెను. శైశవమునందే జ్ఞానపుష్పము వికసించుటకు ముందుగా ఆమె వధూరూపమును దాల్చి భర్తృగృహమునకు రావలసి వచ్చెను. అట్టి ఆమెకు విద్య నేర్చుకొనుటకు అవకాశము ఎట్లు లభించును? కాని కస్తూరీభాయికి భర్తగారు ఎంత ప్రయత్నించినను విద్యయందు అభిలాషగాని, శ్రద్ధగాని కలుగలేదు. అందువలన మరల మనోమాలిన్యము ఏర్పడెను. అనంతరము ఆమె పనిజరుపుకొనునట్లు విద్య నేర్చుకొనెను. కాని భర్తగారిపట్టుదలవలన ఆమెకూడ పట్టుదలవహించి విద్యయందు మనోనివేశము చేయలేకపోయెను. కొంతకాలమునకు యీమిథ్యామనోమాలిన్యము తొలగిపోయి వారికి సహజదాంపత్యజీవితము లభించెను.

కాని కిశోరమోహనదాసు అప్పటివరకును నిష్కల్మషప్రేమను గ్రహింపలేకపోయెను. ఆవయస్సులో ఆయన గ్రహించుటకుకూడ సాధ్యము కాకపోయెను. అందువలన ప్రేమకు బదులుగా కామము, ఆయునను ఆక్రమించెను. విద్యాలయములోకి పోయి ఆయన కస్తూరిబాయివిషయమే ఆలోచించుచుండెను. ఆయన మనస్సు భ్రాంతిమార్గమున నడచుచుండెను. ఆకారణముచే ఆయన ఆరోగ్యమునకు హాని కలుగుచుండెను.

కాని యథార్థజ్ఞానపుంజ భ్రమలకులోనగుచుండును. భ్రమలను సంస్కరించుకొనుచుండును. శతసహస్రభ్రమ

ప్రమాదములనుండి మోహనదాసు కర్తవ్యపరాయణత్వము సమానముగానే జాగరూకమై యుండెను ఆయన ఉదయ కాలమున నిత్యకర్మలు నెరవేర్చువారు, విద్యాలయమునకు పోవువారు, రుగ్ణావస్థయందున్న తండ్రిగారికి సేవాశుశ్రూషలను చేయువారు, యీసకలకార్యములు ఆయనను కామగహ్వరమునుండి ఉద్ధరించి బయటికి దెచ్చెను. మరల సత్యమైన విశుద్ధమైన మార్గమును చూపించెను.

మోహమిథ్యాజాలములను త్రెంచుకొని సత్యముయొక్క మహోజ్జ్వల జ్యోతిని దర్శించుటయే మోహనదాసు గాంధిజీవితములోని అపూర్వసన్నివేశములకు సమాధానము!

## 6

## ధూమపానము-దుఃఖము

లజ్జాశీలుడగు మోహనదాసుకు స్నేహితులు అంతగా లేరని చెప్పవచ్చును. కాని బాలుడు ఉన్న స్నేహితులను విడనాడి ఉండలేడు మోహన్ దాసుకు ఒకరిద్దరు స్నేహితులుండిరి. పెద్దవారు సిగరెట్లు త్రాగుటచూచి బీడిలు త్రాగవలెనని వారికికూడ కోర్కె కలిగెను. కాని బీడీత్రాగుట వలన లాభమున్నదని గాని, లేక దానివాసన బాగుండునని గాని, వారిలో ఎవరికిని తోచలేదు. కాని తమాషాకొరకు,

నూతనత్వము ననుభవించు ప్రేరణవలన వారు బీడీ త్రాగ నిచ్ఛగించిరి. పెద్దవారు బీడీలను త్రాగి ధూమపానము వదలి నట్లే మేముకూడ చేసెదమని నిర్ణయించుకొనిరి.

వారు తమకోరికను నెరవేర్చుకొనుటకు ప్రథమమున పెద్దలు త్రాగి పారవేసిన బీడీసిగరెట్టుముక్కలను ఏరి తెచ్చి త్రాగుటకు ఆరంభించిరి. కాని కాలిన సిగరెట్లనుండి అధిక ధూమము రాకపోవుటచే నిరాశ చెందిరి. అందువలన తమ ఉద్దేశమును నెరవేర్చుకొనుటకు గృహమందున్న సేవకుల జేబులనుండి డబ్బు దొంగిలించి సిగరెట్లుకొని పీల్చ నారంభించిరి. ఒకవిధమైన చెట్లఆకులను బీడీలవలె చుట్టి కాల్చి పీల్చినచో అధికముగా ధూమము వచ్చునని యింతలో తెలుసుకొనిరి. వారు ఆయాకులను సంపాదించుకొని వాటిని ఉపయోగించుకొనుచుండిరి. రహస్యముగా దొంగతనముగా భయముగా త్రాగిన యీ ధూమపానములో వారు ఎట్టి ఆనందమును పొందలేక పోయిరి. పెద్దలను చూచి నేర్చుకొనిన యీపరాధీనపరిస్థితికి మోహనదాసు, తన స్నేహితులును విచారమనస్కులై మానసికకష్టమును అనుభవించిరి. తుదకు వారు యీఅసహనీయ పరాధీనతను భరించలేక ప్రాణత్యాగము చేసుకొనుటకు సంకల్పించుకొనిరి. ఆత్మహత్యకొరకు విషబీజములను సంపాదించుకొనిరి. అచ్చట కేదారమందిరములోకి పోయి దేవతాసమక్షమున కష్టబహుళమైన పరాధీనజీవితమును సమర్పించుకొనుటకు

సంసిద్ధులైరి. మందిరములోనికి పోవునప్పుడు గాంధిగారికి భావాంతరము కలిగి “మరణించిన ఏమి లాభము? ఈ సామాన్య కారణమునకు ఆత్మహత్య చేసుకొనవలెనా? ఇంత కంటె పరాధీనులమై యుండుటే మేలు” అని నుడివెను.

మోహనదాసు అభిప్రాయముతో ఆయన స్నేహితులు కూడ సమ్మతించిరి. ఆత్మహత్య చేసుకొను అభిప్రాయమును విసర్జించి గృహమునకు తిరిగి వచ్చిరి.

అసత్యవిరుద్ధాచారమునకు స్వాతంత్ర్యమను నామము పెట్టి ఆయన చేసిన ఘోరపాపమునకు వగచుచు, ఆయపరాధమును ఆనాడు దేవమందిరములోని దేవతాసముఖముననే విసర్జించి కల్పితదుఃఖమునుండి రక్షణ పొందిరి. బాలక మోహనదాసునొక్క ఆత్మశుద్ధినిగురించిన ఈకథనుపఠించిన పిమ్మట ఆయన అనేకసార్లు అవలంబించిన ప్రాయోపవేశ విషయమే మనకు స్మరణకువచ్చుచున్నది. అత్యంత సులభ పరిస్థితులలోసహా స్వాభావిక బుద్ధిబలముచే సత్యమును దర్శించిన ఆపవిత్రమనస్కుడే పరిణతవయస్సులోకూడ న్యాయసత్యముల గౌరవరక్షణకొరకు ఎన్నియో సారులు ఆనందవదనముతో, ప్రశాంతమనస్సుతో జీవితమును విసర్జింప సంసిద్ధుడాయెను.

మరియొకసారి ఏదో యొక కారణమువలన ఆయన వేరొక అన్యాయమును గావించియుండిరి. కాని ఆ అన్యా

యమును ఆయనయే గ్రహించి అభినవోపాయములవలన దానిని తత్క్షణమే సంస్కరించుకొనిరి.

ఆయన ద్వితీయసోదరుడు ఒకనాడు 25 రూపాయలు అప్పు జేసెను. కాని యీఅప్పును ఆయనతీర్చలేకపోయెను. అప్పుడు గాంధిగారిసలహా ననుసరించి ఆయన చేతికిపెట్టబడిన బంగారుకడియమునుండి కొంతబంగారము తీసి దానిని రహస్యముగా విక్రయించి ఆ అప్పును తీర్చికొనెను.

ఈకార్యము మోహనదాసునకు అత్యంత మానసిక కష్టమునుకల్గించెను. ఎవరికిని తెలియక పోయినను యిది కూడ ఒకవిధముగా దొంగతనమేకదా? కనుక ఇదికూడ అన్యాయము, పాపము. ఇకను యిట్టికార్యములను రహస్యముగా ఎప్పుడును చేయనని బాలకుడు ప్రతిజ్ఞచేసుకొనెను. కేవలము ప్రతిజ్ఞ చేసుకొనుటయే గాదు. తండ్రివద్ద నిష్కపటహృదయముతో తన అపరాధమును ఒప్పుకొని ఆయుప రాధమునుండి విముక్తి పొందుటకుకూడ ప్రతిన బూనెను. తండ్రిగారి సమక్షమున యీవిషయములు చెప్పుట అత్యంత కఠినముగాను, లజ్జాకరముగాను ఆయనకు తోచెను. అందు వలన ఒక ఉత్తరములో ఆయనదోషముల నన్నిటిని వివరముగా వ్రాసియుండెను. తండ్రిగారివద్ద అనుతప్తహృదయముతో క్షమాపణ కోరుకొనెను. తరువాత తండ్రిగారిచేతికి ఆఉత్తరమును అందించిరి.

ఈసమయములో తండ్రిగారికి జబ్బు ఎక్కువగా నుండెను. ఆయన పరుండి యుండిరి. ఆయన ఆశ్చర్యముతో పుత్రునిహస్తమునుండి ఉత్తరమును తీసుకొని చదివిరి. చదువుచున్నప్పుడు రోగాక్రాంతుడైన పితృదేవుని నయనములనుండి ఎడతెగని ధారలుగా కన్నీరు కారజొచ్చెను.

పుత్రుని యీమహత్తరసాహసమును, ఆత్మదోషస్వీకారమును గాంచి స్నేహప్రవణుడును, రుగ్ణశరీరియునైన పితృదేవుడు కన్నీరు కార్చుచుండెను. పితృభక్తుడగు పుత్రుడుకూడ పరితాపమువల్లను, పితృస్నేహముచేతను విగళితహృదయుడై కన్నీరు మున్నీరుగా కార్చుచుండెను.

గుణగ్రాహియగు పితృదేవుని ధార్మికుడగు పుత్రునిలో యిది యొక అపూర్వమైన దృశ్యము!

పితృదేవునిచే శిక్షింపబడుటకు బదులు స్నేహపూర్వకమైన అశ్రుధారలచేత అనుతప్తహృదయుడగుపుత్రుని సకల పాపములు, పరితాపములు కడిగి వేయబడెను. గాంధి అసత్యమును జయించి సత్యమును స్వీకరించు శక్తిసామర్థ్యములను పొందెను.

కాని భ్రాంతులను, మిథ్యలను జయించి సత్యము యొక్క అభ్రభేదియగు శుభ్రశిఖరమునకు అధిరోహించుటయే ఆయన జీవనవ్రతమై యుండెను. సంసారమందున్న భ్రాంతిమిధ్యల పిశాచములు ఆయనను అంత సహజముగా వదలిపెట్టుటకు అంగీకరించలేదు.

ఆకారణముచేత అవి అన్నియు ఆయన మహా త్మరజీవితమునుఅత్యంత ముహూర్తమువరకుపలుమార్లు నానావిధములుగా నానావేషములతో ఆక్రమించెను, కాని ప్రతిసారియు ఆయనయందున్న న్యాయసత్యముల అస్త్రములచేత ఆహతమై జర్జరితమై పారిపోయెను.

బాల్యకాలములో భ్రాంతిని, అసత్యమును జయించిన మరియొకగాథ నిచ్చట పేర్కొందును. హైస్కూలులో చదువుకొనునప్పుడుఆయనకు కొందరు స్నేహితులు లభించిరి. ఆసమయములో రాజకోటలో సంస్కరణములప్రవాహము ప్రవహించుచుండెను. నూతనభావములతో, నూతనఆశయములతో దేశములోని యువకులమనస్సులు ఉప్పొంగి పోవుచుండెను. ఆంగ్లేయశాసకుల శక్తిసామర్థ్యములు యువకులలో నూతనచైతన్యమును, ఉత్సాహమును సంచరింపజేసెను. ఆచైతన్యఫలితముగా స్వదేశవిముక్తి, దేశగౌరవములను గురించి ఆలోచించమొదలిడిరి. గాంధిగారిస్నేహితులొకరు ఆయనకు ప్రతిరోజు బోధించుచుండిరి—మాంసము. మనము మాంసము తినక పోవుటచేతనే యింత దుర్బలులమైతిమి. ఆంగ్లేయులు మాంసము తినుటచేతనే మనపై ప్రభుత్వము, రాజత్వము చేయుచున్నారు. దానికొకప్రత్యక్షప్రమాణమును చూడుము. నాశరీర మెంతశక్తివంతముగా నున్నదో నేను ఎంతదూరము పరుగెత్తగలనో చూడుము. నీకును తెలుసును. నేను మాంసాహారము చేయుటచేతనే యిలా

మాంసాహారము చేయుట మంచిది. దానివలన నేను బలవంతుడను, సాహసవంతుడను అగుదును. సకలదేశవాసులు మాంసాహారమును చేసినయెడల ఆంగ్లేయులను ఓడించగలరు.

ఆంగ్లేయులను తరిమివేయుటకు, తమయస్పష్ట ఆదర్శములను సార్థకపరచుటకు మోహనదాసు స్నేహితులమాయాజాలములో పడిపోయెను. తుదకు మాంసాహారమును తినుటకు సమ్మతించెను.

కాని సమ్మతించినంతమాత్రమున నేమి? ఆహారము చేయుట అంత సహజమైనది కాదు.

వారు వైష్ణవమతస్థులు. గుజరాతు వైష్ణవులు మాంసాహారము చేయుట అత్యంతనిందనీయమైన విషయము. అదిగాక ఆయనధర్మపరాయణియగు మాతయు, ధార్మికుడైన పితయు అత్యంత ఆచారసంపన్నులు. వైష్ణవమతములోని ప్రతినియమమును అత్యంతనిష్ఠతో ఆచరించి పాలించువారు. అందువలన తలిదండ్రులకు, ఆత్మీయులకు తెలియకుండారహస్యముగా మాంసము తినుటకు స్నేహితులతో మాట్లాడి యేర్పాటు చేసుకొనిరి.

ప్రథమమున మాంసభోజనమునకు ఒకనిర్జననదీతీరమును ఏర్పాటుచేసుకొనిరి. స్నేహితులందరును మహానందముతో మాంసమునుతినిరి. మోహనదాసు ఒకటి రెండు ముక్కలనుమాత్రము నములగలిగిరి, మింగలేక పోయిరి.

ఉపకారమునుగురించి భారతదేశములో ప్రచారము చేయు దునని సంకల్పించుకొనెను.

ఈవిషయమును స్నేహితులకు తెలియజేసి మోహనదాసు మాంసాహారమును త్యజించెను. ఆత్యాగము శాశ్వతమైనది. పెద్దవాడయినపిమ్మట భావిజీవితములో ఆయన ఎప్పుడును మాంసాహారమువలనకలుగు ఉపకారమును గురించి ప్రచారము చేయలేదు. మాంసాహారమునకు బదులుగా ఏమంత్రబలముచేత సర్వభారతీయులను బలవంతులనుగా చేయగలిగెనో అది అభినవమైనది, నిరుపమానమైనది.

మాంసాహారిమైన స్నేహితుని చెడ్డసలహావలనఒకసారి మోహనదాస్ వ్యభిచారమునకుకూడ వశీభూతుడు కానున్న సమయములో ఆయన లజ్జాశీలమైన స్వభావము ఆయనను రక్షించెను.

స్నేహితుడు ఒకసారిసానులగృహచిత్రములనువర్ణించి మోహనదాసుమనస్సును భ్రాంతమార్గమునడపుటకు ఉద్యమించెను. ఇద్దరును ఒకసారి సానిగృహమునకుపోయిరి. స్నేహితుడు ముందుగానే యేర్పాటు లన్నియు గావించియుండెను. మోహనదాసును ఒకమంచముమీద కూర్చొనబెట్టెను.

చిన్నదైన లేతమొగ్గ, నిష్పాపమైనది, నిష్కలుషమైనది. మొగ్గ వికసింపనున్నది—దానిశుభ్ర, స్వచ్ఛరేఖా దళము విస్తృతము చేయుచున్నది.

ప్రక్కనుండి చెడువాసనగు పురుగు పూవుజొచ్చెను. దాని సౌరభమును హరింప గోరెను.

కాని ఆముకుళమును ఈశ్వరుడు, మంగళమయుడగు ఈశ్వరుడు రక్షించెను.

ఆవాయువును చూచి ముకుళము ఆకస్మికముగా సిగ్గుచేత వృక్షపత్రిగుచ్ఛములలోకి పరుగిడిపోయెను. హఠాత్తుగా ముడుచుకొని పోయెను.

ముకుళమునందున్న లజ్జయే దానిని రక్షించెను.

ముకుళము మరల దాని రేఖలను వికసితము చేసుకొనుటకు సుయోగమును పొందెను.

కిశోరగమోహనదాసు — నిష్పాపి — నిష్కలుషహృదయుడు. జీవనోద్యానములో వికసింప గోరుచున్నాడు — రేఖలను విస్తృతము చేసుకొనగోరుచున్నాడు. సత్యసరళన్యాయములను శుభ్ర రేఖలను వికసితము గావించుకొన గోరుచున్నాడు. ఆయనప్రక్కనే — కామాంధురాలగు వారవనిత వచ్చి కూరుచుండెను.

ఆయనలోని సత్యసరళన్యాయములశుభ్రశుచిత్వముల హరింపగోరుచున్నది — ఆయనను మనుష్యత్వముయొక్క ఔన్నత్యమునుండి నరకగహ్వరమున త్రోయగోరుచున్నది, పాపపంకమున పడవేయ అభిలషించుచున్నది.

సరళమతియగు బాలుని ఈశ్వరుడు — మంగళమయుడగు ఈశ్వరుడు రక్షించెను.

వారవనితను గాంచినవెంటనే మోహనదాసుని హృదయాంతరాళమునందొక తీవ్రతరమగు లజ్జాశీలప్రేరణ ప్రబోధిత మయ్యెను.

ఆప్రేరణమును, అప్రబోధమును మోహనదాసు సహింపలేకపోయెను. ఒక్కమాటయైనను మాట్లాడ లేదు.

కేవలము ఆరక్తవదనముతో, ఆరక్తనేత్రములతో, కంపితదేహముతో ఆపడకనుండి దిగిపోయెను. దుతవేగముతో గృహమువైపునకు పరుగిడి పోయెను.

ఆనాటి అలజ్జయే కిశోరమోహనదాసును భయంకర పతనమునుండి రక్షించెను.

ఆనాటిపాపమును నిరోధించుటకు లజ్జను ఆశ్రయించెను. కాని ఉత్తరకాలమున సంయమము, సాహసము, అహింసలను ఆశ్రయించెను. ఆయనసాహసము, అసత్యమును అణచివేయునట్టి సంగ్రామము ప్రపంచచరిత్రలో సువర్ణాక్షరములతో లిఖంపబడనలెను.

స్నేహితుడైన యీదుష్టగ్రహము అనేకవిధముల వ్యర్థమైకూడ మోహనదాసుని సాంగత్యము వదలలేదు. ఆయనకు నూతనసలహాల నిచ్చుచుండెను.

మోహనదాసు వివాహితుడని ఆతనికి తెలిసును. ఆతడు సమయము కనిపెట్టి మరల మోహనదాసుకు చెడు సలహాలనిచ్చుచుండెను. భర్తయొక్క అధికారము అనధికారముల కుటిలనీతివలన కిశోరుని సరళమనస్సును చెడు

మార్గముల నడుపజూచెను. సందిగ్ధావస్థయందు పడవైచెను. తత్ఫలముగా గాంధిగారి దాంపత్యజీవితము దుఃఖమయ మాయెను. అశాంతిచే పరిపూర్ణమాయెను. మోహనదాసు స్నేహితునిసలహా ననుసరించి కస్తూరిబాయిపై ప్రభుత్వ మును చలాయింప నమకట్టెను. అత్యాచారములు, బలాత్కారములచే ఆమెను హింసించుచుండెను. కాని ఆభ్రాంతి భగ్నమాయెను. మోహనదాసు ఈశ్వరకృపచే స్నేహి తుని చెడుసలహాలను, తనమార్గభ్రష్టుదలను గురించి గ్రహింపగలిగెను. భ్రాంతివాంఛలను, కల్పనలను పరిత్యజించెను. ఆకపటస్నేహితునికూడ విసర్జించెను. భ్రాంతి ఆవర్తముల అతిక్రమించి సత్య, జ్ఞానమార్గములలో అగ్రసరు డగుచుండెను.

---

## 7

## ధర్మజ్యోతి---కిశోరమోహనదాస్.

భ్రాంతి, పాపముల అంధకారము జ్యోతిర్మయజీవితమును మరుగుపరచుచుండెను. కాని దివ్యజ్యోతియొక్క క్రమవర్ధమాన శిఖనుండి వెడలుచున్న తేజముచేత పరాజితమై పాపము, అసత్యము, భ్రాంతి మొదలగుదుష్టగ్రహములన్నియు అజ్ఞానాంధకారములోనికి పరుగిడిపోయెను.

ఈసారి మోహనదాసుయొక్క ప్రథమజీవితములోని ధర్మజ్ఞానమును గురించియు, ధర్మప్రాప్తిని గురించియు కొంత ఆలోచించెదము.

మోహనదాసు విద్యాలయములో ఎట్టి ధర్మవిద్యను నేర్చుకొనలేదు, కేవలము నలువైపుల ఆవేష్టనముల నుండియు, స్వాభావిక సంస్కారముల చేతను నానావిధములుగా ధర్మమును గురించి కొంతజ్ఞానమును ఆర్జింపగలిగెను.

లౌకిక హిందూధర్మమునకు నలంపితములగు దేవాలయములనుండి మోహనదాసు ఎట్టిధర్మభావమును గాని, భక్తినిగాని సంపాదింపలేకపోయెను. బాల్యకాలము నుండియు మందిరముల అధికారులయొక్కయు, పూజారులయొక్కయు దుర్నీతినిగురించియు, స్వార్థపరత్వమును గురించియు కథలను విని మందిరములలోని దేవతలవిషయములోను, ధర్మాచరణవిషయములోను ఆయన మనస్సునందత్యంతవీతరాగము కలిగెను.

కాని ఏరత్నమును ఆయన విద్యాలయములోను, దేవమందిరములలోను పొందలేకపోయెనో, దానినిఆయన విద్యాగంధము లేని ధాత్రిమాతయగు రంభాబాయివద్ద అప్రత్యాశితముగా పొందగలిగెను. ధాత్రి రంభాబాయి మోహనదాసుకు తనసంతానమువలెనే ఆదరించుచుండెను. మోహనదాసు బాల్యకాలములో భూతప్రేతములకు భయపడువాడు, దైత్యదానవులకథలను విని కంపించువాడు,

మోహనదాసు తన ధర్మజీవితమునకు బీజమంత్రముగా రామనామమును స్వీకరించిరి. ఆ మంత్రమును స్వభావశీలమగు ధాత్రి ఆయనకు దానము చేసియుండెను.

విద్యాగంధము లేని ధాత్రి రంభాబాయిగారు ఆయన ధర్మజీవితమునకు ప్రథమ పరిశ్రమగురువు. ఆయన రంభాబాయినుండి రామనామమును పొందినట్టులు, పోరుబందరులోని విశ్వేశ్వరమందిరమహాంతులు లాఘామహారాజునుండి రామలీలలను, మాహాత్మ్యములను వినియుండెను. మోహనదాసు తన తండ్రిగారి అనారోగ్యసమయములో రాజకోటనుండి పోరుబందరుకు వెళ్ళినప్పుడు కొంతకాలము అచ్చట ఉండెను. ఈసమయములో ఆయన అప్పటికి ప్రసిద్ధమైయున్న విఖ్యాతమగు విశ్వేశ్వరమందిరమునకు చెందిన సుందరమందిరములోని పండితులు, మహాంతులవద్ద రామాయణమును వినుచుండువారు.

లాఘామహారాజు పండితుడు, గాయకుడు, కథావ్యాసకుడు. రామాయణములోని కరుణ భక్తి రసాత్మకమైన చరిత్రను ఆయన మధురముగా పాడువారు, సుందరభాషలో వ్యాఖ్యానము చేయువారు.

పాడుచున్నపుడు భక్తుడైన లాఘామహారాజు భావావేశముచేత తన్మయుడై పోవువాడు. గాంధిగారి చేతమునకు ఆయన మధుర కంఠము, అసులలితవ్యాఖ్యానము, ఆస్వాదించు భావము ఒక అద్భుతపరిధానమును విస్తరింప జేసెడిది. ఆయన పాటలు వినుచున్నపుడు ఆనందములో ఓలలాడుచుండువాడు.

లాధామహరాజు యొక్క రామాయణ పఠనము మోహనదాసునందు శాశ్వతమైన, అచంచలమైన రామాయణప్రీతిని కలుగజేసెను. రాముని పితృభక్తి, రాముని సత్యరక్షణ, రాముని ప్రజావాత్సల్యము, మహత్తర త్యాగము బాలునిమనమునందొక అపూర్వభక్తిని, ఆదర్శమూర్తిని ప్రతిష్ఠితము జేసెను.

కాని ఆయనయందు కలిగిన యీ రామభక్తి బాల్యకాలమునందే సర్వధర్మములయందున్న భక్తితో సమ్మిళితమయి యుండెనని యిచ్చట గమనింపవలసి యున్నది.

ఆయన తండ్రి తరచుగా జైనసాధువులను ఆహ్వానించి భోజనము పెట్టుచుండువారు. వారివద్దనుండి అనేకములైన ధర్మాలోచనములను వినుచుండువారు. ఆయన తండ్రిగారి మహమ్మదీయ, పారసీక స్నేహితు లనేకులు వారిగృహమునకు వచ్చువారు. తమతమ ధర్మములను గురించి వాదోపవాదములు చేయుచుండువారు. బాలక మోహనదాసు తండ్రిగారి సేవ చేయుచు ఆ యాలోచనముల నన్నిటిని శ్రద్ధాభక్తులతో వినుచుండువాడు. తత్ఫలితముగా బాల్యకాలమునుండియు వివిధధర్మములను తెలుసుకొనుటయును, ఆ సకలధర్మములపై శ్రద్ధాభక్తులను ప్రదర్శించుటయును ఆయన హృదయమునందు దృఢమగు మనోభావ ముదయించెను.

మోహనదాసు యీనాడు దేశపూజ్యుడై 'సకలధర్మములు ఒకటే, సత్యములైనవి' అను యీ సందేశమును

పరిత్యాగము చేసియుండెను. అయినను గాంధిగారు స్వతంత్రముగా నుండియే యీ హృదయ సౌజన్యమును పొందెను. పదునారవ వయస్సులో క్రీస్తుమత దేవాలయాలు, ఉపదేశములు ఆయన హృదయమునకు ఆనందమును కలుగజేసినను, బాల్యదశలో మూలాని వాతావరణమువలన ఆయన మనస్సునందు ఎట్టి ఆకర్షణమును కలిగింపలేకపోయెను. ఆకర్షణమునకు బదులుగా అసహ్యమునే కలుగజేసెను.

దీనికి గల కారణమును ఆయనయే యిట్లు వ్రాసియుండిరి— "బాల్యకాలములో నాకు క్రైస్తవధర్మమునందు భక్తి కలుగలేదు. ఆ కాలములో హైస్కూలు ఎదుట మూలవీధిలో నిలబడి క్రైస్తవపాదరీలు అప్పుడప్పుడు క్రీస్తుధర్మమును గురించి ఉపన్యాసములు యిచ్చుచుండువారు. ఆ ఉపన్యాసములలో హిందూదేవతలను గురించి, హిందూధర్మమును గురించి నిందించువారు. నాకు ఇవి అసహ్యనీయముగా ఉండెడివి. నేను ఒక్కసారి మాత్రమే ఉపన్యాసమును వినుటకు నిలబడితిని. ఆ ఒక్కసారే చాలును. తిరుగా యిక నిలబడవలసిన ప్రయోజనము లేకపోయెను."

క్రీస్తుధర్మములలో సత్యము ఉన్నప్పటికిని మిషనరీలు పరచర్చ, పరనింద చేయుటచేత బాలుడు మోహనదాసు మనస్సులో విరాగము, వితృష్ణ ఉదయించెను.

పాలు నీళ్ళు కలిసి ఒకటి అయినవి. కాని చాతుర్యముగల హంస ...... అది నీటియందున్న అసారవస్తువును వదిలిపెట్టి కేవలము సుస్వాదుతగల పాలను త్రాగెను.

నందైనను వారిని వరింపుము. అపకారము చేయువారి పక్కనే ఉపకారము తిరుగుచుండును.”

కాని ఈధర్మవిద్య నభ్యసించు కాలములో హిందూ ధర్మమునకు శ్రేష్ఠగ్రంథమైన భాగవతము ఆయనమనస్సునందెట్టిభక్తినిగాని ప్రభావమునుగాని కలిగింప లేకపోయెను. పెద్దవాడైనపిమ్మట భాగవతసత్యమును సారమును గ్రహింప గలుగుటచే ఆయనహృదయమానందములో, ఉత్సాహములో మునిగిపోయెను.

ప్రథమజీవితమునందు మనుసంహితయొక్క అనువాదము చదివెను ఆయనకు విశేషశ్రద్ధకలుగలేదు. మను రచితస్మృతిగ్రంథములను చదివి అహింసను గురించిన ప్రాథమికజ్ఞానమును సంపాదించుకొనగలిగెను.

ఇదియే గాంధిగారి బాల్యకాలమునాటి ధర్మజీవితము. ఏజీవితముయొక్క ధర్మము, సందేశము హీనసాజర్జరితభ్రాంతు లగు భారతవాసులకు, ప్రపంచవాసులకు నూతనమార్గముల, జ్యోతుల స్థావరములను తెలిపియుండెనో, ఆ ఉజ్జ్వలజీవన ప్రభాతమునందు ఉద్భవించిన ధర్మజ్ఞానముయొక్క తరుణా లోకమును గురించి యిచ్చట ఒకటి రెండుమాటలను ముచ్చటించితిమి.

గారిని చూచుటకు వచ్చెను. ఆయన సాయంసమయమున అన్నగారిశయ్యాపార్శ్వమున కూర్చొనియుండెను. మోహనదాసును పరుండుమని చెప్పెను.

ఆరోజున మోహనదాసుకు అధికముగా నిద్ర వచ్చుచుండెను. తండ్రిగారు శాంతితో నిద్రించుచుండుట గాంచి మోహనదాసు నిశ్చింతగా వెడలిపోయెను.

అకస్మాత్తుగా అర్ధరాత్రివేళ సేవకుడు వచ్చి గుమ్మముపై గట్టిగా దెబ్బలు వేయుచుండెను. మోహనదాసు పడకనుండి లేచి ద్వారము తెరచెను. 'త్వరగా రండి, అందరు వచ్చినారు. బాబుగారికి ఏదో రకముగా ఉన్నది' అని సేవకుడు ఆతురతతో తెలియజేసెను.

మోహనదాసు పిచ్చివానివలె తండ్రిగారివద్దకు పరుగిడజొచ్చెను. కాని అప్పటికి అంతయు ముగిసినది. ఐహిక యాతనలనుండి ముక్తిపొంది పితృదేవుడు అనంతశాంతిసాగరమున ప్రవేశించెను. మోహనదాసు మృతకళేబరముపై బడి ఏడ్చుచుండెను. తన క్షణికఆరామముకొరకు అంత్యసమయములో తండ్రిగారివద్ద ఉండజాలకపోయితినని శిశువువలె వెక్కి వెక్కి ఏడ్చుచుండెను. ఆదృశ్య మత్యంతకరుణాభరితమైనది, విషాదభరితమైనది !

పితృభక్తుడు రామచంద్రుడు.........

పితృసత్యమును పాలించి పితృదేవుని మనస్సునకు శాంతి నొసంగు ఉద్దేశముతో వనమునకు తరలిపోయెను.

నుండెను. అందుచేత మోహనదాసు భావనగరు కాలేజీలో చదువుచుండెను.

కాలేజివిద్య మోహనదాసు మనస్సును ఆకర్షింప లేకపోయెను. ఆయన కాలేజికిపోయి అధ్యాపకుల ఆంగ్ల భాషావైదుష్యమును గ్రహింపలేక పోవుటచే పాఠ్యవిషయములు దురవగాహ్యములుగా ఉండెను. తత్ఫలితముగా కాలేజీవిద్య ఆయనకు దుర్బోధ్యముగాను, కష్టదాయకముగాను ఉండెను. మాతృభాష అగ్రాహ్యము పరదేశిభాషా సహాయముతో జ్ఞానార్జనము చేయుట ఎంత దుస్సాధ్యమైనదో నవయువకుడు మోహనదాసు గ్రహింపగలిగెను. కాని ధనార్జనకు డిగ్రీ ఉండి తీరవలసినదే. అందువలన మోహనదాసు సర్వశక్తులను వినియోగించి అధ్యాపకుల ఉపన్యాసములను గ్రహించుటకు ప్రయత్నించుచుండెను. కాని కఠోరపరిశ్రమ గావించినను విద్యలో అంత సంతృప్తికరముగా లేకుండెను. అప్పుడు కాలేజివిద్యను విడనాడి గృహమునకు తిరిగివచ్చెను.

కాని ఏదో యొక పని చేయవలసియున్నది. అన్నగారు రాజకోటదర్బారులో ఉద్యోగము చేసినను కుటుంబ కష్టములు తొలగిపోలేదు. గాంధీనిగురించి అందరును విచారించుచుండిరి. ఇట్టిసమయమునందే ఒక విశేషసంఘటన సంభవించెను.సంఘటన సాధారణమైనదే అయినను ఆ సాధా

రణసంఘటనయే అధునిక ప్రపంచములో ఒక సాధారణ, అద్వితీయ మహాపురుషుని జీవనసిద్ధాంతమునకు హేతువైనది.

ఈసమయములో గాంధీకి స్నేహితుడును, వారి కుటుంబమునకు హితాకాంక్షియునైన మాంభోజి అను వృద్ధ బ్రాహ్మణుడు వారిగృహమునకు తరచుగా రాకపోకలు చేయుచుండెను. మోహనదాసు విద్యావిషయమంతయు విని ఆయన యిటుల నుడివెను — మీ ఆర్థికపరిస్థితులు మారవలెనన్నచో మీలో ఎవరో ఒకరు మరల పోరుబందరులో దివానుపదవిని పొందవలయును. ఆపదవికి మీవంశగత అధికారముకూడ గలదు. అయితే యిప్పుడు ఆరోజులు లేవు. కేవలము సద్గుణము లున్న చాలదు. పరీక్షలలో కూడ ప్యాసు కావలయును. మీలో మోహనదాసే యీ కార్యమునకు యోగ్యుడు. ఉన్నతవిద్యను బడయుటకు ఆయనకు యింకను చాలా కాలము పట్టును. బి. ఎ. ప్యాసగుటకు నాలుగు సంవత్సరములు, లా ప్యాసగుటకుకూడ అంతకాలము పట్టును. కాని యింతఆలస్యము చేసినచో ఆ పదవిని మరయొకరు ఆక్రమించుకొని కూడుచుండవచ్చును. ఈవిషయములో ఒక సహజమైన మార్గము గలదు.

మోహనదాసు తల్లి, అన్నగారు యీమార్గమును గురించి తెలుసుకొన గోరిరి.

మాంభోజి యిట్లు నుడివెను— బ్యారిష్టరు చదువుటకు ఆయనను ఇంగ్లాండు పంపుడి. బ్యారిష్టరు ప్యాసగుటకు

మూఁడు సంవత్సరములు మాత్రమే చాలును. అది యీ దేశములో గౌరవజనకమైనదికూడ. మోహనదాసు బ్యారిష్టరు ప్యాసయి వచ్చినచో అనాయాసముగా ఆ దివానుపదవి లభింపగలడు.

ఆయన గాంధికుటుంబీకులకు అభయమిచ్చి, భయము లేదు. అచ్చట మూఁడు సంవత్సరములు ఉండుటకును, చదువుటకును అయిదు వేలకంటె అధికధనము అవసరము లేదు అని చెప్పెను. ఇంగ్లాండులో నాకు మూఁడునను తెలిసిన అనేకమంది ఆంగ్ల, భారతీయ స్నేహితులు గలరు. మోహనదాసుకు సహాయము చేయుమని వారందరికిని వ్రాసి యివ్వ గలను.

ఈ అయాచిత ప్రతిపాదన విని యువక మోహనదాసుని మనస్సు సంతోషములో నిమగ్న మాయెను. ఆ రోజులలో యింగ్లాండుపోవుట, అచ్చట విద్య నభ్యసించుట భారతీయులకు గౌరవప్రదమైనదిగాను, కోరదగినదిగాను నిశ్చయముగా ఉండెను. ఇంగ్లాండు జీవితము, సంఘము, విద్యను గురించిన విషయములు విద్యావంతులగు భారతీయులకు ఆలోచనా విషయములై యుండెను. ఏవిధముగానైనను ఇంగ్లాండుపోయి బ్యారిష్టరుపరీక్ష ప్యాసు కావలెనని మోహనదాసు సంకల్పము జేసికొనెను.

కాని ఈసంకల్పమును నెఱవేర్చుకొనుటకు, తల్లి, అన్నగారు ప్రథమమునసే తమ అభ్యంతరమును తెలియ

ఆచరణమునుగాని చేయుననియు, మద్యమాంసములు భక్షింప ననియు మోహనదాసు తల్లికి వాగ్దానము చేసెను.

అయినను తల్లి అంగీకరింపక బేచర్ స్వామిగారి అంగీకారమైనచో నాకభ్యంతరము లేదని చెప్పెను.

మోహనదాసు పోరుబందరులో నున్న చిన్నాన్న గారివద్దకు పోయెను. ఆయనకూడ ధర్మభీతి కలవాడు. కాని మోహనదాసు ఉత్సాహము, ఆదుర్దాచూచి ఆయన అంగీకరింపక తప్పినది కాదు.

చిన్నాన్నగారిసలహాపైన ఆనాటిఇంగ్లీషుపరిదర్శకుడైన లేలీదొరగారిని సహాయము చేయుమని కోరెను. వంశానుక్రమముగా పోరుబందరు రాజకుటుంబమునందు ఉద్యోగము చేయుటచే పోరుబందరులో వారికి కొంత అధికారముండెను. కాని లేలీదొరగారు వారిప్రార్థనను మంజూరు చేయలేదు. మోహనదాసు రాజకోటకు తిరిగివచ్చెను. అన్న గారు డబ్బు సమకూర్చెను. "నీపైన నాకు నమ్మకమున్నది. అయినను నీవిషయము, తలంచుకొనినప్పుడు నాకు చాలా కష్టము కలుగుచున్నది. నీవు ఇంగ్లాండుపోయి మద్యమాంసములు భక్షింపననియు, పరనారీసంసర్గమును పడననియు" ప్రతిన చేయుమని తల్లి తెలియజేసెను.

మోహనదాసు ప్రతిజ్ఞ చేసెను—ఆమూడువిషయముల నుండి తన్ను రక్షించుకొందునని ప్రతిజ్ఞ చేసెను. నీపుత్రుని యందు నమ్మకముంచు అమ్మా అనెను. పుతలీబాయి తన

తనయుని ఎరుగుదురు. ఆయనయందు నమ్మకము కలిగి యుందువారు.

అట్లయినచో మోహనదాసుచేత ఆ ప్రతిజ్ఞ ఎందుకు చేయించిరి? మోహనదాసువాక్యమును ఎందుకు నమ్మియుండలేదు?

ఆ ప్రతిజ్ఞ లౌకికసంస్కారమును గురించిన ప్రకటన మాత్రమే యని జవాబు చెప్పవచ్చును. దీనిలో అవశ్యకత లేదని పుతలీబాయికూడ ఎరుగుదురు. మోహనదాసుప్రవర్తనలో దృఢత్వ మున్నది. మోహనదాసుకర్తవ్యబుద్ధి, సంయమము ఆయనలోని విశేషగుణములు. మోహనదాసు హృదయము సరళమైనది, నిష్కపటమైనది. సత్యసంధుడైన మోహనదాసు మాతృదేవికోరికను అసత్యముగా పరిణమించునట్లు చేయడు. మోహనదాసు మనస్సులో కోరికయే యున్నయెడల, మూడు ఏల, సహస్రప్రతిజ్ఞలు చేసినను ఆకోరిక యొక్క ప్రబలస్రోతమును నిరోధింపజాలదు. సత్యమును పైకి ప్రచారము చేసి, దూరదేశములో రహస్యముగా అనాయాసముగా తనకోరికను నెరవేర్చుకొనగలడు.

కోరిక యుండెనా? లేదా? అది మనము చెప్పజాలము. సత్యసంధుడగు మోహనదాసు మాతృదేవికోరికను నెరవేర్చుటకు తనయందున్న కోరికయొక్క అంకురమును సహా సమూలముగా పెకలించి పారవైచెను.

ఈయువకుని ప్రవర్తన అపూర్వపవిత్రతా యుక్తమైనది. ఇతిహాసములలోగాని, కథలలోగాని యీ ప్రవర్తనకు సాటియైనది లేదా?

పితృభక్తుడు దేవవ్రతుడు. దేవవ్రతుడు విని నాడు తండ్రిగారికోరిక—వివాహము చేయుసంకల్పము, అటుంకములు విషయము తండ్రిగారు వినినారు—నవయువకుని నవీనహృదయములోని నూతనఇచ్ఛను తెలిసికొనెను.

నూతనయిచ్ఛను వినాశము చేయుటకు స్థైను. సమూలముగా— శాశ్వతముగా! ప్రతిజ్ఞగావించినాడు — భయంకర ప్రతిజ్ఞ — వివాహము చేసుకొనకేదు. భోగములను అనుభవింప నిచ్ఛగింపలేదు—సింహాసనము స్వీకరింపనని ప్రతిజ్ఞచేసికొనినాడు. తనకోరికను నిగ్రహించుకొనుటచేతను, భయంకరప్రతిజ్ఞలవల్లను, దేవవ్రతుడు మహాత్ముడైనాడు — శ్రేష్ఠుడైనాడు—భీష్ముడైనాడు.

మాతృభక్తుడు మోహనదాసు — యువక మోహనదాసు — హృదయములోని కోరిక—రంజితమైనది — తరుణమైనది—నూతనమైనది—మోహనదాసు మాతృదేవికోరికను వినినాడు.

మాతృభక్తపుత్రుడు తనకోరికను నిగ్రహించుకొని నాడు, నిరోధించుకొనినాడు.

హృదయములో ప్రతిజ్ఞచేసికొనెను — కేవలము విదేశములో కాదు—ఈజీవితములో ఇకఎన్నడును స్వీకరింపడు—

మద్యము—మాంసము—పరనారీ—మోహనదాసు పవిత్రుడై నాడు—మహాత్ముడైనాడు—దృఢసంకల్పముతో సత్యమార్గమున యాత్ర సల్పుటకు ఉద్యుక్తుడయినాడు.

మోహనదాసు తల్లివద్ద, అన్నగారివద్ద, సహధర్మిణి వద్ద సెలవు గైకొనెను.

విద్యాలయ విద్యార్థులును, ఉపాధ్యాయులును మోహనదాసుకు వీడ్కోలు అభినందనము లిచ్చిరి.

అందరిశుభేచ్ఛలను శిరమునం దిడికొని ఇంగ్లాండు ప్రయాణమునకై బొంబాయికి వచ్చిరి.

మంచి కార్యములకు ఆటంకము లనేకములు. నూతన విఘ్నములు మోహనదాసు ఔన్నత్యమార్గములను నిరోధింప నమకట్టెను. మోహనదాసు ఇంగ్లాండు పోవుచున్నాడనువార్త బొంబాయిలోని వర్తకసంఘమువారి చెవిన బడెను. వారు ఆశ్చర్యపడిరి. ఆ.........సముద్రముదాటి పోవుటా, మ్లేచ్ఛదేశములో వాసము చేయుటా, సర్వనాశనము అని నుడివిరి.

పూర్వాచారపరులగు వణిజసంఘములో మహాకలవరము బయలుదేరెను. వారు పంచాయితీసమావేశమును జరిపిరి. పంచాయితీవారికి జవాబు చెప్పుమని మోహనదాసుకు ఆదేశము పంపిరి. ఒక్కముహూర్తములో లజ్జాశీలుడగు మోహనదాసుహృదయములో విద్యుల్లతలవలె శక్తి, సాహసము ప్రకాశించెను. ఆయన నిర్భయహృదయ

ముతో పంచాయితీవారి సమీపమునకు పోయెను. "శాస్త్రములలోగాని, ధర్మములోగాని సముద్రయానము, విదేశవాసము నిషేధింప బడలేదని" తెలియజేసెను.

కాని సంఘనాయకులు పరిశ్కృతశాస్త్రములుగాని, ధర్మముగాని పాటించువారు కారు. వారు మూఢాచారములను మాత్రమే పాటింతురు. నీవు అచ్చటికి పోయినచో ధర్మభ్రష్టుడ వగుదువని వారు తెలియజేసిరి. మామాటవినుము. నీకు మంగళము చేకూరునని నుడివిరి.

"నేను యీవిషయములో గురుజనులయొక్కయు, మాతృదేవియొక్కయు అనుమతిని పొందితిని. ఇంగ్లాండు ప్రయాణమును ఆపుటకు వీలులే"దని మోహనదాసు వజ్ర సంకల్పముతో తెలియబరచెను.

పంచాయితీవారు కోపగించిరి. ఇట్లు ప్రచారము చేసిరి—మోహనదాసు కులమునుండి బహిష్కరింపబడెను. మోహనదాసు యింగ్లాండు పోవుటకు సహాయముచేయువారు కూడ బహిష్కరింపబడుదురు.

ఈవిషయము విని బొంబాయిలోనున్న మోహనదాసుస్నేహితులనేకులు ఆయనను త్యజించిరి. కాని ఉత్సాహవంతుడు మోహనదాసుగారి అన్నగారుగాని, మోహనదాసుగాని ఏమాత్రము చలింపలేదు. ఇంగ్లాండుప్రయాణమునకు కావలసిన సామానులన్నియు సమకూర్చబడుచుండెను.

వర్షాకాలము అంతమైన పిమ్మట సముద్రము స్థిరముగా ఉండునుగనుక అప్పుడు ప్రయాణము సాగించుటకు స్థిరము చేయబడెను.

ఈ సమయములోనే జునాగడ్‌లోని త్ర్యంబకరాయి అను ఒక వకీలుకూడ బ్యారిస్టరీ చదువుటకు ఇంగ్లాండు పోవుచున్నారని తెలియవచ్చెను. ఆయనతోకూడ మోహన దాసుని పంపుటకు అన్నగారు ఏర్పాటులు చేసిరి. త్ర్యంబక రాయి, మోహనదాసు ఓడలో ఒకగదిలోనే మకాము పెట్టిరి. 1888 సెప్టెంబరు 4 వ తేదీన బొంబాయి రేవునుంచి ఓడ బయలు దేరెను.

మంగళమయుడగు ఈశ్వరుడు పైనుండినవ్వుకొనెను. మానవపుత్రుడు నూతనపరీక్షలు అనుభవముల ననుభవించి మహామానవుడు కాబోవుచున్నాడు. ఆయనవిద్య, ఆదర్శము లను పొందుటకు యీనాడు యింగ్లాండులోని కర్ణధారులంద రును భారతభూమిని తీర్థస్థానముగా గావించుకొనినారు. అహింసకు, ప్రేమకు, శాంతికి అగ్రదూతయైన మహాత్మా గాంధి ఆనాడు విద్యార్థి మోహనదాసుగా కౌతూహల ముతో, భయముతో, లజ్జతో మాతృదేవియొక్క ఆదే శమును, ఆశీర్వాదము ననుశిరమునందిడుకొని ఇంగ్లాండు యాత్ర నారంభించిరి.

# 10
## ఓ డ లో

ఓడలోని విషయములు సంక్షేపముగా చెప్పెదను. లజ్జాభావ ముండుటచేత మోహనదాసు గదినుండి బయటికి వచ్చువాడు కాడు. ఓడలోనున్న ఆంగ్లేయులతో సంభాషణ చేయుచున్న మంచి ఇంగ్లీషుభాష నేర్చుకొనుటకు వీలులేదనియు, కలిసి మెలిసి యుండకపోయినచో ఇంగ్లీషు వారి రీతినీతులు తెలియవనియు, ఇంగ్లాండుకు పోయిన పిమ్మట చాలా చిక్కులలో పడవలసియుండుననియు త్ర్యంబకరాయి మోహనదాసుకు తెలియబరచెను.

మోహనదాసు వారితో మాట్లాడుటకును, కలిసి మెలిసి తిరుగుటకును కోరికయున్నను సిగ్గుచేత, సంకోచము చేత అట్లు చేయలేకుండెను. సాయంకాలము సంచరించు చుందురు. త్ర్యంబకరాయి వారితో సంభాషణలు, ఆలోచనలు జరుపుచుండువారు. మోహనదాసునుకూడా పైకి రమ్మని పిలుచుచుండువారు. కాని డెక్కుపైన చాలామంది యుండినచో మోహనదాసు అచ్చటికిపోవువాడు కాదు. డెక్కుపైన ఎవరులేనప్పుడు ఒకటిరెండుసార్లు పైకి పోవు చుండువారు.

ఓడలో ఎక్కినప్పుడు తెచ్చిన మిఠాయిలు, పండ్లు తనగదిలోకూర్చుని తినుచుండువారు. భోజనమునకు ఓడ లోని భోజనశాలకు పోవువాడు కాడు. నోరు విప్పనిచో

చూచి డాక్టరు త్వరితముగా ఆయనచేతిని పట్టుకొనెను. టోపి చెడిపోవునని తెలియజేసెను.

మోహనదాసు చాలా సిగ్గుపడెను. ఇంగ్లాండులోని రీతినీతులనుగురించి డాక్టరు ఆయనకు కొన్ని హితోపదేశ ములనిచ్చెను—ఎవరివస్తువులను ముట్టుకొనవలదు. పరిచ యము లేనియెడల భారతదేశమునవలె ఎవరిని ప్రశ్నించ కూడదు. గట్టిగా మాట్లాడరాదు. ఇచ్చట దొరలను భారత దేశములోనవలె 'సర్' అని చెప్పకూడదు. ఇచ్చట నౌకరులు మాత్రమే తమయజమానులను 'సర్' అందురు.

మోహనదాసు హోటలులో అలసిపోయెను. ఇకముందు జాగ్రత్తగా నడచుకొందునని సంకల్పించుకొనెను. హోటలులో అధికఖర్చువిషయము ఉదహరించి ఏకుటుంబములో నైనా ఉండవలసి మెహతా సలహా నిచ్చెను. అచ్చట ఖర్చు తగ్గుననియు, ఇంగ్లీషువారితో తిరుగుటకు రీతినీతులు కూడ తెలియుననియు చెప్పెను. ఇంగ్లాండుకు వచ్చినప్పుడు ప్యాసగుట కంటె ఇచ్చటి రీతినీతులు నేర్చుకొనుట అత్యంతావశ్యకమని నుడివెను.

మోహనదాసు ఉండుటకు బస యేర్పాటుచేయు చున్న వారింటిసమీపమునందే ఆంగ్లేయస్నేహితుడొకడుం డెను. మోహనదాసును కొంచెము జాగ్రత్తగా చూడమని ఆయనను వేడుకొనుననికూడ చెప్పెను.

ప్రతిజ్ఞ చేసితిని. ఇప్పుడు ఆప్రతిజ్ఞకు విలువ ఏమిటి? ఇప్పుడు ఆప్రతిజ్ఞనే పట్టుకొని యుండుట మూర్ఖత్వము. ఇప్పుడు శరీరరక్షణకొరకు మాంసము తినవలెనను సూత్రమును ఎవరు మూడబోవుచున్నారు? స్వదేశమునకు తిరిగిపోయిన పిమ్మట మాంసమును విడితేను అంతే అదేపోతుంది' అని సలహా నొసంగెను.

ప్రతిజ్ఞాభంగకారా, మరల మిథ్యావాక్యములా!

విచారగ్రస్తురాలయిన మాతృదేవియొక్క స్నేహార్ద్ర ముఖము జ్ఞాపకము వచ్చెను. శపథవాక్యములు స్మరణకు వచ్చెను.

మోహనదాసు శరీరము పులకాంకితమాయెను. తనహృదయమున ప్రభువునుంచి దృఢమనస్కుడయ్యెను. మాతృదేవి తన సంతానమునకు అనంతమైన విశ్వాసమ్మునకు ఆశ్రయమిచ్చెను. సంతానము ఆసరళవిశ్వాసమును దృఢముగా పట్టుకొనియుండెను. కష్టదాయకముగా నున్నప్పటికిని మాతృదేవివద్ద చేసిన ప్రతిజ్ఞను భంగపరచరాదనియు, మాతృదేవి కగోచరముగా నిషిద్ధాచరణము గావించి మిథ్యావాదిని కారాదనియు మోహనదాసు ఆంగ్లస్నేహితునకు తెలియజేసెను.

పుష్పముపై నొకరేఖ కలుషితము కాబోవుచుండెను. సత్యముయొక్క ఉజ్వలమైన ఆలోకనముచేత కలుషరహితమై మరలతనశుభ్ర స్వచ్ఛ రేఖలను విస్తృతము గావించెను.

మోహనదాసుకూడ నృత్యము, ఉపన్యాసములు, ఫ్రెంచిభాష నేర్చుకొనుటకు విశ్వప్రయత్నములు చేయు చుండెను.

మోహనదాసు నృత్యము నేర్పు క్లాసులో చేరిరి. వారమురోజులలో 5, 6 పాఠములను నేర్చు కొనిరి. కాని నృత్యము చేయునప్పుడు తాళము తెలియ నందున చిక్కులో పడుచుండిరి. పియానో స్వరములతో పాటు సరిగా అడుగులను వేయజాలకపోయిరి. స్వరజ్ఞానము, ధ్వనిజ్ఞానము లేకపోవుటచే పియానో తాళమును ఆయన గ్రహింపలేకపోయెనని కొందరనిరి. స్వరములను నేర్చుకొను టకు మూడుపౌన్లను వెచ్చించి ఒకఫిడేలు క్రయముచేసిరి. ఫిడేలు నేర్చుకొన మొదలుపెట్టిరి. ఉపన్యాసము లిచ్చుట నేర్చుకొనుటకు మాష్టరుగారివద్దకు పోవుచుండిరి. ఒక గినీ దక్షిణగా సమర్పించుకుని ఉపన్యాసములిచ్చు నియమములను నేర్చుకొనుచుండిరి. ఫ్రెంచిక్లాసులో చేరి ఆభాషను నేర్చు కొనుచుండిరి.

మోహనదాసు 'దొరగా' రగుటకు ఇంగ్లాండునకు వచ్చిరా, ఇంగ్లీషు 'ఎటికేట్' నేర్చుకుని భారతదేశమునకు తిరిగి వచ్చి టేబిల్‌పై భోజనము చేయుటకును, నృత్యము చేయుటకును, పార్టీలలో చేరుటకును, ఇంగ్లాండు పోయివచ్చి నానని భారతీయసంఘములో బడాయికొట్టుటకును యీగుణ శాలియువకుడు ఇంగ్లాండునకు వచ్చినాడా......

భాగ్యదేవత విధానములు నిగూఢములైనవి !

ఆంగ్లవిద్య నభ్యసించి ఆంగ్లదేశమునే అభినవవిద్యాలోకముచేత ప్రకాశితము చేయవలసినవారు, భోగలాలసల సముద్రమును దాటి సత్య, శాంతి, త్యాగముల తీరమున ఆశ్రయమును పొందవలసినవారు, భ్రాంతి అను గ్రహములనుండి విముక్తులై సత్యమును సందర్శించి సత్యజ్యోతితో సమస్త విశ్వమునకు దివ్యజ్యోతిని ప్రసాదింపవలసినవారు. నృత్యము ఉపన్యాసము, స్వరసాధనము నేర్చుకొనుచుండినరాణింగునా!

ఆనాడు నిద్రితావస్థయందున్న మోహనదాసుని భాగ్యదేవత ఆఘాతములచేత మేల్కొల్పెను. అకస్మాత్తుగా మోహనదాసుమనస్సునకు గొంత వేదనముల్ల అనుభవము కలిగెను. నేను ఇంగ్లాండులో జీవితకాలమంతయు గడుపుదునా? నేను చక్కగా ఉపన్యాసము లిచ్చుట నేర్చుకొని ఫలిత మేమి? నృత్యము చేసినంతమాత్రమున నేను నాగరికుడ నగుదునా? ఫిడేలు మా దేశములోనే నేర్చుకొనవచ్చును గదా!

జిజ్ఞాసహృదయమునకు వివేకము, సత్యమార్గము ప్రదర్శించెను—"నేను విద్యార్థిని. నేను యిచ్చట విద్యార్జన చేయుటకు వచ్చితిని. నాకు ఆంగ్లవేషభాషలతో నిమిత్తము లేదు. ఆచారముల పరిశుద్ధతయే నన్ను రక్షించగలదు. నన్ను నాగరికునిగా చేయగలదు. నేను స్వకీయ

ప్రవర్తనవలన నాగరికుడను కాజాలనియెడల ఇంగ్లాండులోని సహస్రరీతినీతులు నన్ను నాగరికునిగా చేయజాలవు.

మోహనదాసు విద్యాక్షేత్రమునందు సత్యమును దర్శించెను. మిథ్యను విసర్జించి సత్యమును స్వీకరించెను. నాగరికుడగు ప్రయత్నమును పరిత్యజించెను. ఉపన్యాసములు నేర్పు ఉపాధ్యాయునివద్ద సెలవుగైకొనెను. నృత్యము నేర్పు [illegible] ప్రయత్నమును [illegible] జేసెను. ఫిడేలు విక్రయించి స్వయముగా వంట చేసికొనుటకు ఒకస్టవ్‌ను క్రయము చేసిరి. సంపూర్ణసంయమి ఆయెను.

---

## 12

## పర్వతములను దాటగలిగెను

మోహనదాసు మాంసాహారమును విసర్జించి ఏమి తిని మూడుసంవత్సరములు ఇంగ్లాండులో వాసము చేయగలిగెనో కొంత వర్ణించెదను.

ఆంగ్లేయకుటుంబములో నున్నప్పుడు ఆయన భోజనవిషయములో చాలా ఇబ్బంది పడుచుండువాడని యిదివరకే వర్ణించితిమి. డాక్టరు మెహతాతో యీవిషయమును మాట్లాడి మరియొక యేర్పాటు చేయించమని కోరియుండెను. ఒక ఆంగ్లోయిండియను కుటుంబములో ఉండుటకు డాక్టరుగారు

ఏర్పాటు చేసిరి. కుటుంబములో ఉన్న గృహస్థురాలు, ఇద్దరు కొమార్తెలు ఆయనను చాలా సేవ చేయుచుండిరి. కాని వారుకూడ మాంసము లేకుండా భోజనము చేయువారు కారు. అందువలన అచ్చటకూడ మోహనదాసునకు చాలా కష్టదాయకముగానే ఉండెను. వారు భోజనసమయములో మోహనదాసునకు ఒకటి రెండు రొట్టెముక్కలను ఇచ్చుచుండిరి. దానివలన ఆయనయాకలి తీరుట లేదు. మోహనదాసు సిగ్గుచేత మరల ఒకటి రెండుముక్కలు అడుగజాలకుండెను.

కాని ఆకలి నివారణ కానిది చదువు సాగుటయెట్లు?

ఇంగ్లాండులోకూడ శాకాహార హోటళ్ళు ఉన్నవని యింతలో గాంధిగారు తెలిసుకొనిరి. కాని అవి చాలా తక్కువ. ఆయన వాటిని వెదకుటకై అచ్చటచ్చట తిరుగుచుండిరి. శాకాహారవిషయములో మనస్సునకు నిశ్చయము కలిగించు నుద్దేశముతో ఆవిషయమునుగురించి వ్రాయబడిన వివిధగ్రంథములను పరిశీలించుచుండిరి. హోవర్డు విలియం వ్రాసిన 'ఆహారనీతి' (The Ethics of Diet) అను పుస్తకమును పఠించి ప్రపంచములోని సాధువులు, మహాత్ములు, అవతారపురుషులు ఎట్టిసాత్వికాహారమును భుజించువారో గ్రహించిరి. మిసెస్ అనా కింగ్స్‌ఫోర్డు వ్రాసిన "ఉత్తమ ఆహారనీతి" అను పుస్తకమును తృప్తితో చదివెను.

ఎలిన్సన్ వ్రాసిన "శాకాహారమునందున్న ఉపకారము" అను విషయమును గురించి చాలా వ్యాసములు పఠించెను.

ఒకరోజున 10, 12 మైళ్ళు నడచినపిమ్మట ఫెరింగ్డన్ స్ట్రీట్ మూలలో ఒక హోటలులో కట్టబడిన సైను బోర్డుచూచెను. దానిపై శాకాహార హోటలు (Vegetarian rest uarant) అని వ్రాయబడియుండెను. శిశువును తాను కోరిన వస్తువును బడసినపుడు ఆనందించినట్లుగా క్షుధార్తుడైన గాంధికూడ అట్లే మహదానందపరవశుడాయెను. అతను హోటలులో ప్రవేశించి ఆహారమునకు ఆర్డరు ఇచ్చెను. మోహనదాసు నేడు తృప్తికరముగా భోజనము చేసెను.

మోహనదాసు ఉత్సాహము ఇనుమడించెను. ఆశాస్వతుడాయెను. ప్రతిరోజు 10 మైళ్ళు నడచి యీ హోటలుకు వచ్చి శాకాహారము చేయుచుండిరి. అయన ఆరోగ్యము చక్కబడుచుండెను. అయన మాతృదేవి విషయము స్మరించుకొనెను. మాతృదేవి ఆజ్ఞను నిలుపుకొనగలిగనని పరమానందభరితుడాయెను. 'భారతీయులు మాంసాహారులైనచో దేశమునకు బలము చేకూరు నని యింతకాలము తలంచితిని. ప్రతిజ్ఞను పాలించి స్వదేశమునకు తిరిగిపోయి మరల మాంసము తిని, మాంసము తినమని అందరికిని చెప్పవలెనని సంకల్పించుకుంటిని. కాని శాకాహారములో ఎంత

తృప్తి, ఎంత ఉపకార మున్నదో యింతకుపూర్వము గ్రహింప లేక పోయితినిగదా యని తలంచెను.'

ఇంతకాలము మోహనదాసు తనకొక అబద్ధము చెప్పవలయు నేమోయను విచారముచేత మాంసము తినుటకు యిష్టపడినవాఁడయ్యు విసర్జింప వలసివచ్చెను. నేఁడు అట్టి మోహనదాసు స్వేచ్ఛాపూర్వకముగా మాంసాహారమును విసర్జించెను. నేఁడు శాకాహారమునందు నూతనపద్ధతిని గ్రహించెను.— 'స్వదేశమునకు తిరిగిపోయినపిమ్మట శాకాహారములో గల ఉపకారమునుగురించియే దేశీయులకు బోధించెదను'

సత్యమును రక్షింపఁ గలిగితిని అను ఆనందముతో మోహనదాసు ఉబ్బిపోవుచుండెను.

ఒకసారి తనఖర్చువిషయములో శ్రద్ధ వహించెను. మోహనదాసు ఇంగ్లాండులోని విలాసవంతమైన భవనములను అనుభవించుటలోకూడ ఆయన ప్రతినిత్యము తనకైనఖర్చులను వ్రాసియుంచువాఁడు. బాహ్యాడంబరములను విసర్జించి, పిమ్మట పెక్కులపుస్తకములో వ్రాయబడియున్న ఖర్చులను చూచి ఆయన ఆశ్చర్యమానసుఁడాయెను. నేను అనవసరముగా యింత ఖర్చు చేయుచున్నాను. ఇంతడబ్బు సమకూర్చుటకు నా అన్నగారు ఎంత కష్టపడుచున్నారో గదా!

వ్యయము తగ్గించుకొనుటకు ఆయన సంకల్పించుకొనెను.

ఆంగ్లోయిండియను కుటుంబము వారికి డబ్బు యిచ్చే వారు, కాని కడుపునిండేది కాదు. ఆయన ప్రత్యేకముగా ఒకగది అద్దెకు తీసుకుని అచ్చట స్వయంపాకము చేసుకొనుటకు సంకల్పించుకొనెను. ఒకగదిని అద్దెకు ఏర్పాటుచేసుకొని బస అచ్చటికి మార్చుకొనిరి. తుదకు ఆయన స్వయముగా వంటచేసుకొని భోజనము చేయుచుండెను. అనావశ్యకవ్యయము, పోకాలఖర్చు, దుస్తులదుర్వ్యయము, ఇతర కుటుంబముతో యున్నందువల్లనయిన అధికవ్యయము అన్నియు తగ్గిపోయెను. అనాడంబరమైన శాకాహారమును శాంతితో భుజించుచుండిరి. ఇంతేగాక పూర్వము బండిఅద్దె చాలా అగుచుండెడిది. కొన్నాళ్లలో దానిని మాని బండియెక్కుట మానివేసిరి. అత్యంతప్రయోజనము లేనిదే బండి ఎక్కకుండగనే నడచియే పోవుచుండిరి. బాల్యకాలమునుండియు భ్రమణముద్వారానే ఆయన వ్యాయామమును నెరవేర్చుకొనువారు. ఇప్పుడు నడకవలన వ్యాయామము, పని రెండును నెరవేరుచున్నవి. నియమిత ఆహారము వలన, నియమిత వ్యాయామమువలన ఆయనకు మంచి ఆరోగ్యము కలిగెను. ఇంగ్లాండులో అమితవ్యయమును తగ్గించుకుని మితవ్యయమునకు అలవాటుపడిరి. ఆ నియమిత అభ్యాసము శాశ్వతముగా ఉండిపోయెను. దేశమాన్యుడును, దేశనాయకుడును అయిన పిమ్మట ఖర్చునిమిత్తము ఆయన చేతిలోకి లక్షలధనము వచ్చుచుండెను. కాని లెక్కచూచి వ్యయముచేయు అల

పాటుచేతను, మితవ్యయముచేతను ఆయన కార్యముల నన్నిటిని సుందరముగా చేయగలిగెను. కార్యాంతరములకు విశేష ధనమును కూడబెట్టియుంచగలిగిరి. మహాత్మాగాంధి కేవలము భారతదేశములోనేగాక సమస్తప్రపంచములోను మితవ్యయమును గురించిన సర్వశ్రేష్ఠమగు ఆదర్శమును స్థాపించియున్నారు. చిన్నపనిదైనను, పెద్దపనిదైనను లెక్క-చూచి ఖర్చుచేసినయెడల ఏ కార్యమైనను నిర్విఘ్నముగా నెరవేరగలదు.

ఈ సారి మోహనదాసు విద్యావిషయ మాలోచించెదము. ఆయన బ్యారిష్టరుపరీక్ష యిచ్చుటకు తయారగుచుండిరి. పరీక్షకు చదువవలసిన పుస్తకములు చదివినను ఆయనకు చాలాసమయము మిగులుచుండెను. ఆయన ఇంగ్లీషు భాషను చక్కగా నేర్చుకొనుటకు ఆ కాలమును సద్వినియోగము చేయుచుండిరి. ప్రథమమున అక్స్‌ఫోర్డులోనో, కేంబ్రిడ్జిలోనో చదువుకొనుటకు ప్రయత్నించిరి. కాని ఆరెండు విద్యాలయములలో చదువుకొనుటకు ఖర్చు చాలాఅగునని అచ్చటిస్నేహితులు సలహాల నిచ్చిరి. లండను మెట్రిక్యులేషనులో ప్యాసయినచో ఇంగ్లీషులో మంచిజ్ఞానము కలుగునని మరికొందరు స్నేహితులు సలహాల నిచ్చిరి.

లండనులో మెట్రిక్యులేషను పరీక్ష ఆరుమాసములకొకసారి జరుగుచుండును. మోహనదాసు మెట్రిక్ పరీక్షకు చదువుట కారంభించెను, పరీక్షలో ప్యాసగుటకు ల్యాటిను

భాషను నేర్చుకొనుచుండిరి. ఫ్రెంచిభాష యింతకుపూర్వము కొంత నేర్చుకొనెను. ఇప్పుడు పరీక్షకొరకు మరల చదువ నారంభించిరి. కాని ల్యాటిన్ భాష ఆయనకు కఠినముగా నుండెను. క్రమముగా పరీక్షసమయము సమీపించెను. పరీక్ష నిచ్చిరి. కాని లాటిన్ భాషలో తప్పిపోయిరి. మోహనదాసు నిరుత్సాహము చెందలేదు. మరల రెండవసారి పరీక్షకు తయారగుచుండెను. ఈసారి పరీక్షలో అధికమార్కులను పొంది ప్యాసైరి. లాటిన్ చదువుటచేత ఆంగ్లభాషలోకూడ అధిక జ్ఞానమును సంపాదింపగలిగిరి.

ఈసారి బ్యారిస్టరుపరీక్షకొరకు నియమపూర్వకముగా చదువ నారంభించిరి. చదువవలసిన గ్రంథములు ఎక్కువగా లేవు. రోమన్‌లా, ఇంగ్లీషులా. ఈరెండు చదువవలసి యుం డెడిది. ఉభయపరీక్షలకు నియమితపాఠ్యపుస్తకములుండెను. విద్యార్థులు ఆగ్రంథములను చదివెడివారు కారు. నోట్సు చదివియే ప్యాసగుచుందురు. మోహనదాసు లాపరీక్షలో పూర్ణజ్ఞానమును సంపాదించుటకు ఆరెండుమూల గ్రంథములను ఆమూలాగ్రముగా చదివెను. దీనివలన ఆయ నకు కొంతకష్టము కలిగెను. ఆయన మెట్రిక్ పరీక్ష సమయములో లాటిన్ నేర్చుకొని యుండుటచే రోమన్‌లా ఆయనకు సులభసాధ్య మాయెను. ఆయన పఠించిన విష యములలో ప్యాసయ్యెను.

బ్యారిస్టరుపరీక్షలో యితరవిషయములు కూడ యుం డెను. ఆవిషయములే పరీక్షలో ప్యాసగుటకు ప్రధానోపాయ ములై యుండెను. ఈ కూడుసంవత్సరములలో విద్యార్థులు తమస్వంతఖర్చులతో పరీక్షకులకును, విద్యార్థులకునువిందులు చేయించవలసి యుండెను. విందుసమయములో అనేకపదా ర్థములతోపాటు సారాయికూడ ఉండెడిది. ఈవిందుసమయ ములో ఉపాధ్యాయులు, విద్యార్థులలో 'లా' విషయములను గురించి అనేక విధములైన ఆలోచనములు, వాదోపవాద ములు జరుగుచుండెడివి. తద్వారా విద్యార్థులు అనేకవిషయ ములలో అనుభవమును సంపాదించెడివారు. ఈవిందువలన విద్యార్థులు వ్యావహారికజ్ఞానమును ఐకమత్యభావమును సంపాదించుకొనెడివారు. ఈవిందుపరీక్షలోకూడ మోహన దాసు కృతార్థుడాయెను. మోహనదాసు బ్యారిస్టరాయెను.

---

## 13

## లజ్జ—మోహనదాసుకు అస్త్రము

మోహనదాసు ఇంగ్లాండు వెళ్ళినపని పూర్తిఅయినది. ఆయన ఇంగ్లాండులోని జీవితచరిత్ర యింకను పూర్తి కాలేదు. ఆయనలో యున్నలజ్జవిషయము యిదివరకు కొంత చెప్పితిని. మరికొంత చెప్పవలసియున్నది.

శాకాహారి, సంయమి అగుటలో అసత్యము, పాపము ఆయనను కొన్నిసార్లు ఆక్రమించినవి కాని ప్రతిసారియు ఆయన లజ్జాశీలప్రకృతియే అస్త్రరూపము దాల్చి ఆయనను రక్షించెను. శాకాహారులగు ఒకకుటుంబీకులతో ఆయనకు పరిచయము కలిగెను. క్రమముగా ఆగృహమందున్న స్త్రీలతో పరిచయభాగ్యము కలిగెను. అగృహములోని యువతీ మణులతోకూడ పరిచయము కలిగెను. మోహనదాసు అవివాహితుడని తెలిసుకొని ఆయనయెడల విశేషమైన అనురాగమును చూపుచుండిరి. మోహనదాసు భీతిజెందెను. ఆయినను లజ్జచేత తనవివాహ విషయము తెలియజేసి వారిని వారింపలేకపోయెను. వీనిమోహమునుండి తప్పించుకొనవలయుననియు, అసత్యమునుండి తనను రక్షించుకొనవలయుననియు సంకల్పించుకొనెను. లజ్జచేత ఆయన వారిసమక్షమున చెప్పలేకపోయెను. కాని తనబసకు తిరిగి వచ్చి ఉత్తరములో వివరముగా వ్రాసి ఆగృహయజమానురాలికి తెలియజేసెను. సత్యమును రక్షింపగలిగితినని హృదయమునందానందమును ననుభవించెను.

మోహనదాసు యీసారి కామమును జయించి సత్యబలముచే బలవంతుడగుచుండెను. కాని పాపమాయ నతు అంతసహజముగా ముక్తి నియ్యలేదు. మరియొకసారి దానిబాహ్యకసౌందర్యముచేత ఆయనను విముగ్ధ పరచెను. ఆయన కొంతకాలము 'పోర్ట్సుమావు'లో ఉండెను. అనమ

యములో ఒకస్నేహితునితో ఒకకుటుంబమునకు పోయి అచ్చటి స్త్రీలతో పేకాట ఆడుట కారంభించెను. ఆస్త్రీలు దుష్ప్రవర్తన గలవారు. వారు ఆట ఆడుచున్నసమయములో చెడుమాటలను, చెడుపరివర్తనము ను ప్రదర్శించుచు మోహనదాసును, ఆయనస్నేహితుని పాపమువైపునకు ఆకర్షింప సమకట్టిరి. ఆయనస్నేహితుడు ఇట్టివిషయములలో అనుభవము గలవాడు. కాని అతడు గాంధిగారి స్వభావమును చక్కగా ఎరిగినవాడు. మోహనదాసుకూడ ఆమాయావిని మాయాజాలములలో దగుల్కొనబోవుచున్నాడని ఆస్నేహితుడు గ్రహించెను. జ్ఞానహీనుడగు మోహనదాసును తిరస్కారభావముతో యిటుల జాగ్రత పరచెను. 'ఓరీ కుర్రవాడా' నీలోకూడ సయితాను ఉన్నట్లుగా తోచుచున్నది. యీపని నీవు చేయవలసినది కాదు. నీవు త్వరగా పరుగెత్తి పొమ్ము. తక్షణమే పొమ్ము. క్షణిక దౌర్బల్యమోహముచేత మోహగ్రస్తుడైన మోహనదాసు నకు తిరిగి చైతన్యము కలిగెను. అలానా, దైవము యీ స్నేహితునిద్వారా గాంధిగారికి చైతన్యము కలుగజేసెనా!

మోహనదాసు సిగ్గుచేత తల వంచుకొనెను. అచ్చటి నుండి తప్పించుకుని బ్రతికిపోయెను.

నిజముగా ఆరోజున పరమేశ్వరుడు మంగళమయుడగు జగదీశ్వరుడు యువక మోహనదాసును ఆయాపద నుండి రక్షించెను. ప్రపంచములోని నిగ్రహహీన నియ

మహీన జనసమూహమునకు నిగ్రహమును, నియమము లును, బ్రహ్మచర్యమును మహాత్మరూపమున దానము చేయనున్న మోహనదాసుకీయాక్షణభంగురమైన దౌర్బ ల్యమేల కలిగెను?

అందువలన గాంధిగారి భాగ్యవిధాత ఆయన స్నేహి తునియందావిర్భూత మాయెను. ఆయనద్వారా గాంధిగారిని జాగ్రత పరచెను.

మోహనదాసు జీవితములో యిదియే ఆఖరుపరీక్ష. ఈపరీక్షలో జయము పొంది యువకుడు భావికాలములో జాగరూకుడై యుండెను. జీవితమును అధికతరనిగ్రహము ద్వారాను, సత్యముద్వారాను నడపుకొనుటకు నేర్చు కొనెను. తనకర్మలలోను, ఆదర్శములలోను పవిత్రు డాయెను.

దౌర్బల్యవిషయము పూర్తిచేసి యీసారి యింగ్లాం డులో నున్నసమయములో ఆయనసామాజికతను గురించి కొంత ముచ్చటించెదను. ఇంగ్లాండులో శాకాహారము చేసిన పిమ్మట శాకాహారమువైపునకు ప్రజలదృష్టిని ఆకర్షించుట కొరకు ఆయన ఆంగ్లస్నేహితులతోను, ఆనాటిశాకాహార సమర్థులైన ప్రసిద్ధలేఖకులతోను, అచ్చటచ్చట ఒకటిరెండు సంఘములను స్థాపించిరి. ఆయన ఒకటి రెండు సంఘము లకు కార్యదర్శిగా కూడ ఎన్నుకోబడిరి. కాని ఆహారమును గురించి భోజనసమయములో యితరసదస్యుల ఉపన్యాసము

లోసంగినపుడు ఆయన సిగ్గుచేత ఏమియు మాట్లాడజాలక పోవువారు. లజ్జ పాషాణమువలె ఆయన గొంతును గట్టిగా పట్టుకొనెడిది. ఆయన ఉపన్యాసమును వ్రాసి చదువ నిచ్చగించెడివారు. కాని చదువునప్పుడు ఆయననోటినుండి మాటయే వచ్చెడిది కాదు. సిగ్గుచేత దేహమంతయు చెమటలు క్రమ్మి కూరుచుండువారు.

ఈలజ్జయే ఆయనను మాగవానిని గావించెను. మరల యీలజ్జయే అనేకవిధములైన లజ్జాజనకములైన కళంకములనుండియు, ఆపదలనుండియు ఆయనను రక్షించెను. ఇంగ్లాండులో విద్యార్థిగా నున్నప్పుడు యీలజ్జయే ఆయనకు అస్త్రరూపముగా నుండెను- ఆత్మరక్షణకు ఖడ్గరూపముదాల్చి పాపపంకిలమునుండి ఆయనను రక్షించెను.

ఈసమయములో మరియొక వ్యక్తియొక్క-సరళమైన, నిష్కపటమైన ప్రవర్తన, రీతినీతులు ఆయన ఇంగ్లాండులో నున్న ఆఖరురోజులలో ఆయనకొక హితోపదేశము గావించెను. అతడు భారతీయుడైన నారాయణహేమచంద్రుడు. హేమచంద్రుడు ఆసమయములో ఇంగ్లాండులో నుండెను. గాంధిగారితో ఆయనకు పరిచయము కలిగెను. ఈ పరిచయము స్నేహరూపమునకూడ పరిణమించెను. హేమచంద్రుని రీతినీదులు సహజముగా నుండెను. ఆయన ఆంగ్లేయుల వెక్కిరింతలను సహి పెడచెవినిపెట్టిఅప్పుడప్పుడు భారతీయదుస్తులను ధరించుచుండువారు. ఇంగ్లాండులోని

కృత్రిమత్వము, కపటత్వమునందు కూడ సర్వదా సరళత్వము, నిష్కాపట్యమును ప్రదర్శించుచుండువారు. వివిధ దేశములు భ్రమణము చేయువలయునను దృఢసంకల్పము, కోరిక ఆయనయం దుండెను. అహంకారవర్జితులై తమ కార్యములను నెరవేర్చుకొని పోవుచుండువారు.

ఈవిధముగా హేమచంద్రుడు గాంధిగారికి నూతన దృష్టిని ప్రసాదించెను. హేమచంద్రునిద్వారా భారత దేశ ఆదర్శమును, సత్కార్యములను ఆయన దర్శించెను. ఇంగ్లాండులో వాసము చేసినను స్వదేశములోని ఆదర్శములను రక్షించుకొనుటకు ప్రత్యక్ష దృష్టాంతరములను దర్శింపగలిగెను. మోహనచంద్రుని హృదయాంతరాళములో స్వదేశ బీజములను ప్రచ్ఛన్నముగా నాటగలిగినది హేమచంద్రుడే.

బీజములు ఫలవంతమైన ప్రదేశములో నాటబడెను. అనుకూలసమయములో వర్షధారలచేత నూతనజన్మ మెత్తి పత్రపల్లవములను విస్తరింపజేసి మహత్తరమహీరుహముగా పరిణమించు అవకాశముకొరకు ప్రతీక్షించుచుండెను.

---

## 14

# స్వ దే శ మా ర్గ ము న

బాల్యకాలములో సహజసంస్కారముచేత గాంధిగారు ధర్మజ్ఞానము సంపాదించిన విషయమును మనము విని యున్నాము. ఆయన ఇంగ్లాండులో గడిపిన విద్యార్థిజీవిత మును గురించి చెప్పవలసివచ్చినను ఆ కాలమందున్న ధర్మ మునుగురించికూడ ఆలోచించుట అవసరము. ఇంగ్లాండులో ప్రవాసిగానున్న యువకమోహనదాసు శాకాహారమువైపు నకు క్రమముగా ఆకర్షింపబడెను. భ్రాంతి, అసత్యముల అంధకారము సత్యముపవిత్రతలుగాపరిణమించెను. తద్వారా బాల్యకాలమునాటి ధర్మసంస్కారముల అస్పష్టజ్ఞానము అను సంధానము, చర్చలవలన మహోజ్వలరూపము దాల్చెను.

గాంధిగారు ఇంగ్లాండులో గడపిన ధర్మజీవితమును గురించి సంక్షిప్తముగా ఆలోచింతము.

ఇంగ్లాండుకు పోయినపిమ్మట కొంతకాలమునకు ఒక దివ్యజ్ఞానసామాజికునితో పరిచయము కలిగెను.

ఆయన భారతదేశములోని పవిత్రధర్మగ్రంథమైన భగవద్గీతను పఠించమని వేడుకొనెను. భగవద్గీత చదువ తగినంత సంస్కృతజ్ఞానమును బాల్యకాలములో నేర్చియుండ లేదని గాంధిగారు విచారముతో తెలియజేసెను.

అప్పు డాయన భగవద్గీత ఆంగ్లానువాదముతో చదువుమ్మని సలహా నిచ్చెను. పిమ్మట గాంధిగారు భగవద్గీతను చదివి ముగించెను.

మోహనదాసు నూతనజ్యోతిని దర్శింప గలిగెను. ధర్మక్షేత్రమంను, నీతిక్షేత్రమంను గీత మానవునకు అమూల్యరత్నమని గ్రహించెను.

సముద్రము మధింపబడెను. నిమిషములో సముద్రము నుండి అమృతము ఉద్భవించెను. దేవతలు అమృతమును పానము జేసిరి. దేవతలు అమరులైరి.

ఇంగ్లాండుభూమిలో గాంధిగారి హృదయసముద్రము మథింపబడెను.

మథనమువలన — కోలాహలముమధ్య — కార్యముల మధ్య ధర్మబోధము కలిగెను — అమృతము ఉద్భవించెను. మోహనదాసు దానిని మనసార పానము చేసెను. ఆయన అమరత్వమునకు మార్గము కనుగొనెను.

మోహనదాసు గీతాపఠనము చేయుటచేత అమృతాస్వాదము ననుభవించి నట్లాయెను. ఆంగ్లగీతను పఠించుట చేత మూలసంస్కృతగీతను చదువవలెనని ఉత్సాహము కలిగెను. ఈ ఉత్సాహమువల్లనే ఆయన పరిణతవయస్సులో గీతకు నూతనవ్యాఖ్యానము చేసినారు. గీత కర్మయొక్క, భక్తియొక్క ప్రేరణమును తాను అనుభవించి విశ్వాసులకు తెలియజేయ ప్రయత్నించెను. గీతలో అంతర్నిహిత

మైన సమస్తమాధుర్యమును ప్రపంచములోని ధర్మపిపాసులకు, అహింసావ్రతులకు నూతనప్రకాశముతో పంచిపెట్టినాడు. గీతను, గీతాసందేశమును ప్రపంచములో మహత్తరమైన ఆదర్శముగా ప్రచారము చేసెను.

గాంధిగారి ధర్మజీవితమునుగురించి ఆలోచించ గోరినచో గీతావిషయము తప్పక చెప్పవలయును. గీతను పఠించినపిమ్మట యితరహిందూధర్మశాస్త్రములను పఠింపవలయునని ఆయన మనస్సులో కోరిక జనించెను. కాని ఇంగ్లాండులో ఉండి అవి చదువుటకు అవకాశము ఆయనకు లభించలేదు.

ఈసమయములో కొంతవరకు వెదకినపిమ్మట ఎడ్విన్ ఆర్నోల్డు అనువదించిన "లైట్ ఆఫ్ ఏషియా" అను బౌద్ధగ్రంథము ఒకటి ఆయనకు లభించెను. దానిని అత్యుత్సాహముతో పఠించెను. ఈసారి ఆయన గీతాధర్మముతో అదర్శ చారిత్రసమ్మేళనమును గాంచెను. కర్మలలో త్యాగమహిమను దర్శించెను. 'లైట్ ఆఫ్ ఏషియా' అనుగ్రంథము గాంధిగారిజీవితమునందొకనూతనప్రభను ప్రసరింపజేసెను.

ఈసమయములో క్రైస్తవపాదిరీగా రొకరు బైబిలు చదువుమని చెప్పిరి. బాల్యకాలమున స్వదేశమందున్నప్పుడు మిషనరీల ప్రవర్తనవలన క్రైస్తవమతమును గురించి ఆయన మనస్సులో విజాతీయభావము, అసహ్యభావము కలిగియుం

డెను. కాని ఈసారి ఆతనలోకూడ బైబిలు చదువవలె నని కౌతూహల ముదయించెను. అందువలన బైబిలు సంపూర్ణముగా పఠించెను. "ఓల్డు టెస్టమెంటు" ఆయనకునచ్చలేదు. "న్యూ టెస్టమెంటు" ఆయనను విమోహితునిగా గావించెను. జీసస్‌సందేశము, ఉపదేశములు, ఆయనకు అపూర్వజ్ఞానమును ప్రసాదించెను. ఆతనకొరకు నూతన సత్యద్వారము తెరువబడెను.

ఆసందేశమును, ఉపదేశములును హృదయాంతరాళమునందు అత్తుకుపోయెను. యువకమోహనదాసు తనను మహాత్మునిరూపమున వికసింపజేసికొనుటకు అనుకూల సత్యము, అహింస, ఆదర్శముల ఉపకరణములు సమకూర్చబడెను.

ఇదిగాక తీరిక యున్నపుడెల్ల ధర్మపిపాసులగు వ్యక్తులతో కలిసియుండుట కారంభించిరి. వివిధములైన ఆలోచనములు, తర్కములు, వాదములుద్వారా అసత్యముల సందేహముల మంచును అతిక్రమించి ధర్మముగాంచు మూలసత్యములను, సారవస్తువులను దర్శించుచుండిరి. ఈశ్వరుని అస్తిత్వమును, సాన్నిధ్యమును గ్రహించిరి. రానున్నయుగములో సంగ్రామమునిమిత్తము కా నెరుగకయే వివిధములైన అస్త్రశస్త్రములచేత అలంకరింపబడుచుండిరి.

జీసస్ అహింసాసందేశమునే ప్రచారము చేసియుండిరి.

బుద్ధుడు ధర్మసందేశమును ప్రచారము చేసి యుండెను.

శ్రీచైతన్యుడు ప్రేమసందేశమును ప్రచారము గావించెను.

జీసస్ అహింస, బుద్ధుని కర్మలు, శ్రీచైతన్యుని ప్రేమ — వీరి ఆదర్శములతో ఒకయువకుడు యింగ్లాండు దేశములో తయారగుచుండెను. హింస, అసత్యముల హాలాహలముచేత ప్రపీడితమైన ప్రపంచము ఆనాడు దానిని గ్రహింప గలిగెనా?

గాంధిగారు ఇంగ్లాండులో ఉండి చదువుట పూర్తి ఆయెను. కర్మజీవితముకొరకు ఆయన తయారయ్యెను. అంత రిక జ్ఞానాలోకముచేతను, సత్యాలోకముచేతను ఉజ్వలరూపము దాల్చెను. ఇంతలో ఒకరోజున 1890 సం॥లో ఫ్రాన్సు దేశములో జరుగుచున్న ప్రదర్శనమును చూచుటకై అచ్చటికి పోయిరి. ప్రదర్శనమును చూచి వస్తుతాంత్రికమైన యూరోపును గురించి విశేషఅనుభవమును సంపాదించిరి. ఫ్రాన్సులో జగత్ప్రసిద్ధి కెక్కిన నోటర్ డామ్ చర్చి మొదలగు అనేకభవనములను దర్శించిరి. ఫ్రాన్సువారి విలాసవైభవములను గురించియు, ఆచారవ్యవహారములను గురించియు ఫ్రాన్సుదేశములోని ప్రతిపీధి తమందురు దర్శించిరి. ఫ్రాన్సును గురించి ఒకవిధమగు జ్ఞానముతో ఇంగ్లాండుకు తిరిగి వచ్చిరి. పిమ్మట స్వదేశమునకు తిరిగి వచ్చిరి.

కృష్ణుడు కంసుని కారాగారములో జన్మించెను— కంసుని ఆశ్రయమునం దుండెను— కంసుని శాశ్వత, శక్తిని గ్రహింపగలిగెను — కంసుని స్వరూపము గ్రహించి మధురను వెడలిపోయెను — భవిష్యత్తులో కంసునివధకు సంసిద్ధమగుచుండెను.

మోహనదాసు ఇంగ్లాండు దేశములో నవజన్మ ధరించెను. ఆంగ్ల దేశములో ఆంగ్లవిద్యను నేర్చుకొనిరి — వారి బుద్ధిని గ్రహించిరి — శక్తిని తెలుసుకొనిరి.

ఆంగ్లేయుల స్వరూపమును, పాశ్చాత్యనాగరికతా స్వరూపమును తెలుసుకొని భారత దేశమునకు తిరిగి వచ్చిరి. ఆనాటియువకుడు మోహనదాసు ఆంగ్లేయులను గ్రహించిరి. పాశ్చాత్యసభ్యతాస్వరూపమును అర్థము చేసుకొనిరి.

పాశ్చాత్యవిద్యను బడసి గాంధిగారు స్వదేశమునకు తిరిగి వచ్చినారు. ఆయనకు పాశ్చాత్యసభ్యత ప్రాణహీనవస్తువుగా కానుపించెను. దానిలో భోగలాలసలు, ఐశ్వర్యముల ఆభాసములు ఆయనహృదయాంతరములో విశేష విరక్తిని కలిగించెను.

---

# 15

## జన్మభూమికి ప్రత్యావర్తనము

జూన్ 'జులై నెలలో సంక్షుభిత సముద్రమును దాటి గాంధిగారు స్వదేశమునకు తిరిగివచ్చెను. స్వదేశతీరము కాదప్తదీప్తనీలాకాశము ఆయనకు స్వాగతమిచ్చి స్వీకరించెను. ప్రవాసజీవితాంతమున మాతృదేవికి ప్రణామము లర్పింతుననియు, మాతృదేవి తనస్నేహసజలనేత్రములనుండి స్రవించుచున్న ఆనందాశ్రుధారలచేత పుత్రుని అభిషిక్తము చేసి వక్షమునం దద్దుకొనుననియు, ఊహించుకొనుచు ఆయన విదేశములో స్వీయరుపైకి ప్రవేశించిరి. కాని బొంబాయి రేవుకు చేరినవెంటనే ఆయన సుఖసంతోషము లన్నియు కాద్రాతాపముచేఎండిపోయినబాష్పబిందువులవలె శుష్కించిపోయెను. గాంధిగారు విదేశములో ఉన్నప్పుడే ఆయన మాతృదేవి పుత్లీబాయి స్వర్గస్థురాలాయెను.

అన్నగారు ఆవార్తను రహస్యముగా ఉంచిరి. విదేశములో యీ మరణవార్త వినినచో ఆయనవిద్యకు విఘ్నములు సంభవించవచ్చునని ఊహించి ఆయన యీవార్తను తమ్మునకు తెలియచేయలేదు. మాతృదేవియొక్క మరణవార్త విని గాంధిగారు విశేషదుఃఖాక్రాంతులైరి. తండ్రిగారి మరణముకంటెను యీదుఃఖము ఆయనకు దుస్సహమయ్యెను. ఆయన జీవననిర్మాణములో మాతృదేవిప్రభా

వము విశేషముగా సహాయపడి యుండుటచేతనే మాతృ వియోగవార్త ఆయనకు దుర్భరదుఃఖము కలిగించెను.

మాతృదేవియందుగల అహింసాధర్మము, భక్తుల యెడల అపారమైన భక్తి వ్రతపాలనము, ఉపవాసములు, రామాయణభాగవతముల పఠనము-యివి అన్నియు బాలక మోహనదాసు మనస్సులో ఒకమహత్తరమైన ప్రభావమును విస్తరింపజేసెను. ఏ ఆదర్శములు, ఏజ్యోతి ఆయనజీవితములో ప్రతిఫలించి ఆయనజీవితమును వికసితము గావించెనో, అవి తొలగిపోవుటచేత గాంధిగారి హృదయాంతరాళములో శోకాగ్ని ప్రజ్వరిల్లెను. కాని ఆయన తనను నిగ్రహించుకొనెను. సమస్తజీవితములో సంయమనియమముల మహత్తరప్రభావములను ప్రదర్శించిన వ్యక్తి యీదుర్భర సమయములోకూడ శోకమును అపుకొనగలిగెను. హృదయావేగమును హృదయములోనే అపుకొనెను. బయటికి ప్రకటితము చేయలేదు.

దేశమాతృశాక్రోడములో ఆశ్రయమును స్వీకరించుటచేతనే గాంధిగారు మాతృశోకమును అనుభవించెను. కాని ఒకధర్మజ్ఞుడైన సత్పురుషుని సాన్నిధ్యము పొందుటచే ఆయనశోకాగ్ని ఉపశమించెను. ఈసత్పురుషుడు 'రాజచంద్' అనువారు.

ఏక కాలములో శతవిషయములలో మనోని వేశమును చేయువారగుటచే యీసాధువునకు 'శతావధాని' యని

నామకరణము చేయబడెను. రాజచంద్రు సహస్రరూపముల వ్యాపారములను పరిదర్శించెడివారు. మణిమాణిక్యములను పరీక్షించెడివారు. వ్యాపారములలోని శతసహస్రవిషయములకు సమాధానము చెప్పుచుండువారు. కాని విషయైక వ్యాపారములతోపాటు ఆయనలో నిష్కపటమైన ధర్మానురాగ ముండెను. ఆయనయందు అపారమైన శాస్త్రజ్ఞానముండెను. పరిశుద్ధమైన స్వభావముండెను. అపరూపమైన ఆత్మదర్శన ముండెను. వ్యాపారవిషయములు ముగిసిన వెంటనే ధర్మగ్రంథములను పఠించువారు. ఆయన ముఖమండలములో అపారమైన శాంతి విరాజిల్లుచుండెడిది.

ఈసాధుసాంగత్యములో పడి ఆయన శక్తికిగల అసాధారణత్వమును పరీక్షింప గాంధిగారికి కుతూహలము కలిగెను. గాంధిగారు విదేశములో నేర్చుకొనిన భాషలనుండి వివిధశబ్దములను చెప్పుచుండిరి. రాజచంద్రు వాని నన్నిటిని పునరావృత్తి చేసెను. ఆయనయందున్న యీశక్తిని గాంచి గాంధిగారు విస్మితులైరి. ఆయనకు యీర్ష్యకూడ కలిగెను. కాని యీర్ష్యఒకవస్తువు. గౌరవము మరియొకవస్తువు. రాజచంద్రుని యందున్నస్మరణశక్తి నిదర్శించి ఆశ్చర్యాన్వితుడయ్యెను. అనతికాలములోనే ఆయనపరిచయమును పొంది గాంధిగారిహృదయము శ్రద్ధాభక్తులచే పరిపూర్ణమైపోయెను. ఆయన యింతకుముందు ధర్మగ్రంథములను చదివియుండిరి, ధర్మతత్వములను వినియుండిరి. రాజచంద్రుగారి ప్రాణమయ

సంస్పర్శచేత గాంధిగారిభావములు ఉద్దీపితము లాయెను. ఆధ్యాత్మిక వృద్ధిపొందెను. రాజచంద్రుగారి ధర్మాలోచన ములవలన ఆయన ఆనందమును పొందెను.

క్షుద్రపర్వతములలోని స్రోతస్సు ప్రస్తరములలో పడి తనమార్గమును గుర్తెఱుంగక తల్లడిలి పోయినట్లు, ప్రాణవిహీనమైన, ఆత్మవిహీనమైన పాశ్చాత్యవిద్యా ప్రవీణుడైన గాంధిగారి హృదయముకూడ తల్లడిలిపోవు చుండెను. కాని రాజచంద్రు సంస్పర్శచేత ఆయనకు నూతన దృష్టి లభించెను. సత్యసంధానము చేయుచున్న గాంధిజీ సత్యాలోకశిఖను రాజచంద్రుగారినుండి పొందెను. శాంతిచే ఆయన హృదయము ఆప్లుత మాయెను. గాంధిగారిజీవితము ఎంద రెందరిప్రభావముచేత ప్రభావాన్విత మాయెనో అందులో రాజచంద్రు లొకరు.

తరువాత సంసారములో ప్రవేశించుసమయ మేతెంచెను. గాంధిగారి అన్నగారి ఉత్సాహము అపారముగా నుండెను. తమ్ముడు బ్యారిష్టరు ప్యాసయి వచ్చి విశేష ధనము నార్జించునని అన్నగారు గంపెడాసతో నుండెను. కాని ప్రపంచములోని విధివిధానములు మానవకల్పనలవలె లెక్కలతో నెగురజాలవు. మానవుడు తలంచున దొకటి, కార్యరూపమున జరుగునది మరియొకటి. గాంధిగారి జీవితములోకూడ దీనికి వ్యతిక్రమము కానుపించలేదు. నానా

విధములైన సమస్యలను ఎదుర్కొనవలసివచ్చెను. గాంధిగారి జీవితము విచిత్ర ఆవర్తములలో పడిపోయెను.

ప్రథమమున దేశములోని జాతిమతకలహములు ఆయన జీవితమునం దొక ఆవర్తమును సృష్టించెను. గాంధిగారు ఇంగ్లాండు పోవుటచే ఆయన జాతిభ్రష్టుడని కొందరు తలంచిరి. ఆయన స్వదేశమునకు తిరిగి వచ్చినపిమ్మట సంఘరక్షకులు సచేతనులైరి. ఈసారి వారు రెండుదళములుగా విడిపోయిరి. ఒకదళమువారు గాంధిగారిని కులములో చేర్చుకొనిరి. కాని మఱియొకదళమువారు కులములో చేర్చుకొనుటకు వీలులేదని ప్రతిఘటించిరి. గాంధిగారు ఏ ప్రతివాదమును చేయలేదు. కులములో ఎందులకు చేర్చుకోలేదని ఆయన ఏవాదప్రతివాదములను చేయలేదు. తీర్పుకు విరుద్ధముగా ఆయన హైకోర్టులో ఏఅప్పీలును, చేయలేదు. నిష్క్రియత్వమువలన ఉత్తమఫలితమే ఫలించెను. ఆయన మౌనభావమువలన ధర్మరక్షకుల తర్జనగర్జనలు వాటిఅంతటవే ఉపశమించెను. గాంధిగారు గృహస్థుడాయెను.

ప్రథమమున ఆయన గృహమునందున్న పిల్లలవిద్యావిషయములో శ్రద్ధవహించెను. తనకుమారునకు నాలుగు సంవత్సరములు వయస్సు. అన్నగారికి ఒక కుమారుడుండెను. ఈయిద్దరితో గాంధిగారు ఒక స్కూలును ఆరంభించిరి. విద్యలలో వ్యాయామచర్య ప్రధానస్థానము నాక్రమించెను. ఆహారవిషయములో కూడ సంస్కరణ మారంభ మాయెను.

దైనిక ఆహారముతో ఓటుమీలు, కోకో కలుపబడెను. స్వదేశపాత్రలకు బదులు పైనాకప్పులు డిష్షులు వాడబడుచుండెను. గృహమందున్న వారందరును కోటుపంట్లాములు ధరించియుండునట్లు ఏర్పాట్లు గావించిరి.

గాంధిగారుచేసిన యీమార్పువలన నూతనత్వము ప్రవర్తింపబడినను, వ్యయము ఎక్కువగుచుండెను. గాంధిగారు స్వదేశమునకు తిరిగివచ్చినపిమ్మట ప్రథమమున రాజకోటలో బ్యారిస్టరీ ఉద్యోగములో చేయుట ప్రారంభించెను. కాని అంతగా పేరు సంపాదించలేకుండెను. యౌవనకాలములో ఆయన అత్యంతలజ్జాశీలప్రకృతి గలవారై యుండెను. అందువలన ప్లీడరువృత్తిలో ఎక్కువ పేరు సంపాదించలేకపోయెను. అదిగాక గృహములో ఆంగ్లరీతినీతులు ప్రవర్తింపబడుటచే వ్యయము అధిక మాయెను. ఆకారణముచేత స్నేహితులసలహాల ననుసరించి ఆయన బొంబాయిలో బ్యారిస్టరీచేయుటకై వచ్చెను. ఒకటి రెండు కేసులుకూడ ఆయన చేతిలోకి వచ్చెను. కాని కోర్టులో జరుగు అన్యాయమునకు ఆయన హృదయము విచారగ్రస్తమగుచుండెను. కేసులు సమకూర్చుటకు మధ్యవర్తులకు ఆయన లంచములు ఇచ్చుట కంగీకరించలేదు. అన్యాయమునకు, అసత్యమునకు విరుద్ధముగా విప్లవము ఆరంభించెను. డబ్బువచ్చినను, రాకపోయినను అన్యాయము, అసత్యముల మార్గమున నడువనని

ఆయన దృఢసంకల్పము గావించుకొనెను. సత్యాగ్రహికి సత్యముయెడల, న్యాయము యెడల విశేషనిష్ఠ గలిగెను.

ప్లీడరువృత్తివలన సంపాదనకు యిబ్బంది కలుగుచుండుటచేత ధనార్జనకు వేఱుమార్గము అవలంబింప ప్రయత్నించుచుండెను. ఉపాధ్యాయవృత్తియం దాయనకు ఎల్లపుడు గౌరవ ముండెను. ఈసమయములో ఒకసుయోగముకూడ లభించెను. ఒక ఉన్నతఆంగ్లవిద్యాలయములో ఉపాధ్యాయ పదవికి ఆయన దరఖాస్తు పంపియుండెను. కానిగ్రాడుయేటు కాదని ఆయనదరఖాస్తు అంగీకరింపబడలేదు.

ఈసారి నిరాశాంధకారము ఆయనకు నలువైపుల వ్యాపించుచుండెను. కాని గాంధీజీ నిరుత్సాహముచెందలేదు.

---

# 16

# జ్యోతిని వెదకుట

కౌటుంబజీవితములో సంగ్రామము నారంభించి నిరాశాంధకారములో గాంధిజీ ఆవరింపబడుచుండెను. అంతలో ఆయనయం దొకఆలోకరేఖ గానిపించెను. ఆయనజీవితములో ఆయన కొకదుర్లభఫలము లభించెను.

దక్షిణాఫ్రికాలో దాదా అబ్దుల్లా అనుపేరుతో ఒక ప్రసిద్ధవ్యాపారస్థు డుండెను. దక్షిణఆఫ్రికాలో ఆయనకు

గొప్పవర్తక ముండెను. ఆయనగారికి ఒక కేసుసందర్భములో ఆఫ్రికాపోవుటకు మంచియోగము లభించెను. గాంధీ యీ ఆహ్వానమును అంగీకరించి నెటాలుకు పోయిరి. అచ్చటికి చేరినవెంటనే భారతీయులకు ఆదేశములో గౌరవము లేదని గ్రహించెను. తత్క్షణమే రవీంద్రునివలె ఆయన హృదయములో యీనినాదము ధ్వనించెను.

"అన్యాయముచేయువారును, అన్యాయమును సహించువారును ఇరువురును నీతిరస్కారము చేయు సమానముగా దహింపబడుచున్నారు."

ఇంతకాలము ఆయన లక్ష్మిని పొందుటకు ప్రయత్నించుచుండిరి. ఈసారి ఆయన అన్యాయముతో సంగ్రామము చేయుటకు మొదలుపెట్టిరి.

ఆఫ్రికాకు చేరి గాంధిగారు కోర్టువ్యవహారములలో కూడనచ్చి కేతవలె సత్యమును వెదకుటకొరకు సంకల్పించుకొని యుండిరి. ప్లీడరువృత్తి ఆయనజీవితములో అప్రధానమైనదిగా నుండెను. ఆఫ్రికాలో కూడ అప్రధానముగా నుండెను. ఏమహావ్రతమును సాధన చేయుటకై విశ్వవిధాత ఆయనను యీలోకమునకు పంపియుండిరో ఆవ్రతము కొరకే ఆయన తనజీవితమును సమర్పించిరి. ఆయన బైబిలు, ఖొరాను, గీత, ఉపనిషత్తులు మొదలగు ధర్మగ్రంథములను నూతనసాధకునివలె అత్యంతనిష్ఠతో పఠించుచుండెను. ఇం తకుపూర్వమున ఆయన గ్రంథములతో పరిచయము కలిగి

యుండిరి. కాని వానిలోనుండి సత్యజ్యోతిప్రకాశించి ఆయన అంతరజగత్తును ఆలోకితము చేయజాలక పోయెను. ఈసారి ఆఫ్రికాప్రవాసకాలములో ఆగ్రంథముల నన్నిటిని పఠించు టచే ఆయనకు సత్యదర్శనము జన్మించెను. అప్పుడు జిజ్ఞాసు వగు గాంధికి నిద్రలేదు. నిశీథ దీపాలోకమువద్ద ఆయన శాస్త్రగ్రంథములనుమథించుచుండెను. టాలస్టాయి, రస్కిన్ మ్యాక్సుమూలరు, వివేకానందుని సందేశములు పఠించుచుం డిరి. క్రమముగా ఆయన సాధన సఫలీకృత మగుచుండెను. ఆయన దేహపరిశ్రమకుగల గౌరవము, హింసాద్వేషముల భయంకరరూపము, ప్రేమలోని అజేయశక్తిని గ్రహించిరి. గాంధిగారిజీవితములో అహింసా నీతి అనివార్యత మాయెను.

గాంధిజీ ఆఫ్రికాలో నున్నప్పుడు అహింసా నీతి వికసించుచుండెను. అన్యాయముతో, అవిచారముతో సంగ్రామముకూడ యీఆఫ్రికాలోనే ఆరంభ మాయెను.

---

## 17
## సంగ్రామసూచన

నెటాలుకు చేరిన వెంటనే గాంధిజీ భారతీయుల అవమానకరమైన పరిస్థితులను గ్రహించెను. వ్యాజ్యము

విషయములో కోర్టుకు వచ్చినప్పుడు కూడ ఆయన దానిని గ్రహించెను.

అబ్దుల్లా శేఠు తనప్లీడరుగారి ప్రక్కనే గాంధిగారికి కూడా ఒక ఆసనమును స్థిరపరచి యుండిరి. గాంధిగారు వచ్చి ఆయాసనముపై కూరుచుండిరి. ఆయన దొరగారి దుస్తులను ధరించి యుండిరి. కాని తలపైన భారతీయ పాగా యుండెను. ఆదుస్తులతో కోర్టుకువచ్చి కూరుచున్న వెంటనే కోర్టుమునసబుగారిదృష్టి ఆయనపై బడెను. ఆయన తల పాగాను తొలగించమని మునసబుగారు గాంధిగారికి ఆజ్ఞా పించిరి.

భారతీయులు కోర్టులో ప్రవేశించవలసివచ్చినచో తమతలపాగాలను తొలగించవలెనని ఒకనియమముండెను. మహమ్మదీయుల దుస్తులు ధరించి యుండినచో తలపాగా తోనే కోర్టులో ప్రవేశించుచుండువారు. కాని ఇతరదుస్తు లతో ప్రవేశించువారు తలపాగా తీసియే ప్రవేశించవలసి యుండెడిది. గాంధిజీ మహమ్మదీయులదుస్తులనుధరించి యుం డకపోవుటచే తలపాగా తొలగించి ప్రవేశించమని గాంధి గారికి చెప్పిరి.

తలపాగా ధరించి కోర్టులో ప్రవేశించుట అవమాన కరముగా నున్నదని తలంచి దొరగారిటోపీ ధరించుటకే సంకల్పించుకొనిరి. కాని అబ్దుల్లా శేఠుగారిసలహావలన ఆసం కల్పమును విసర్జించెను. అబ్దుల్లా శేఠుగారిట్లు నుడివెను—"ఈ

విధముగా యిట్టి అవమానమును సహించుట అనాచారము నకు ఆశ్రయమిచ్చుటయే యగును." ఆమాట గాంధిగారి మనస్సున దృఢముగా నాటుకొనెను. ఆయన అబ్దుల్లాశేఠు గారికి గల దేశప్రేమను దర్శించి విముగ్ధులైరి. ఆయనహృద యాంతరాళమునందును గౌరవభావ ముదయించెను. భార తీయులగౌరవమును గురించి ఆయన సచేతను డాయెను. కోర్టులో జరిగిన యీ అన్యాయనియమమును గురించినవార్త వార్తాపత్రికలలో ప్రకటించిరి. తలపాగాతో కోర్టులో ప్రవే శించినందువలన ఏమాత్రము అన్యాయము లేదనికూడ ఆ వార్తాపత్రికలోనే ప్రకటించెను.

దీనివలన నాలుగువైపుల కొంతఆందోళనము బయలు దేరెను.

ఆఫ్రికాలో భారతీయులు కూలీలుగా పరిగణింపబడు చున్నారు. గాంధీజీ భారతీయ తలపాగా పెట్టుకొనుటచేత కూలీ బ్యారిస్టరు అని పేరుపొందిరి. వార్తాపత్రికలలో కోర్టు నియమమునకు ప్రతికూలముగా ప్రకటన చేయుటచేత వార్తా పత్రికల సంపాదకీయములో ఆయననుగురించి "అవాంఛిత ఆగంతుకుడని" వ్రాయబడెను.

ఆఫ్రికాలో భారతీయులదుర్దశకు అంతము లేకుండెను. వారి అవస్థ బానిసలకంటె అధమముగా నుండెను. వారు మార్గమున కిరుప్రక్కల నున్న "ఫుట్ పాత్" మీద నడచు టకు వీలులేదు. సెకండుక్లాసు చార్జి యిచ్చిటిక్కెట్టుకొన్నను

సెకండుక్లాసు పెట్టెలో ప్రయాణముచేయుటకు వీలులేదు. కోర్టులో భారతీయులకు న్యాయము జరిగెడిది కాదు. దుర్భర మైన కార్యభారము, పోలీసులు విధించు గౌరవహీనమైన నియమములు, బాహ్యముగా జనసమూహమును బాధించుట, లించింగు చేయుట—మొదలగు ఉత్పీడనములు, అత్యాచార ములు ఎన్నియో భారతీయులపై బడుచుండెడివి. ఆఫ్రికా వాసులగు భారతీయుల దుఃఖమును, దురవస్థలను చూచి గాంధిగారత్యంతవిచారగ్రస్తులైరి. ఇట్టి సమయములో ప్రిటోరియా అను స్థానమునుండి ఆయనకు పిలుపువచ్చెను.

---

## 18

## వృద్ధియగుచున్న అవమానములు

అబ్దుల్లాశేఠుగారి వద్దనుండి వ్యాజ్యవివరములన్నియు తెలుసుకొని అనతికాలములోనే గాంధిగారు నెటాలునుండి ప్రిటోరియాకు పయనమయ్యెను. ఆయనకొరకు ఫస్టుక్లాసు టికెట్టు కొనబడెను.

సరియైన సమయమునకు రైలు బయలుదేరెను. గాంధిజీ ఫస్టుక్లాసు ప్రయాణికుడు. రాత్రి 9 గంటలవేళకు నెటాలు రాజధానియగు మరిజ్ బర్గుకు రైలు చేరెను. ఈ సమయములో కొందరు శ్వేతకాయులు రైలులో ప్రవేశించి

గాంధిగారిని ఎగాదిగా చూచి నెమ్మదిగా దిగిపోయిరి. కొన్ని నిమిషములుతరువాత వారు ఒకరైలు ఉద్యోగస్తుని వెంటపెట్టుకుని గాంధిగారి పెట్టెలో ప్రవేశించిరి. ఆయన దిగిరమ్మని గాంధిగారితో చెప్పెను. మూడవశ్రేణి పెట్టెలో కూర్చొమని ఆదేశించెను.

నాకు ఫస్టుక్లాసు టిక్కెట్టు ఉన్నదని గాంధిగారు చెప్పిరి. కాని ఈ జవాబుతో రైలు ఉద్యోగి సంతుష్టిచెందలేదు. గాంధిగారిని మంచితనముతో దిగిపొమ్మనిచెప్పెను. దిగి మూడవశ్రేణిపెట్టెలోకి పోనియెడల సిపాయిని పిలిచి బలవంతముగా దింపించబడుదురు అని భయపెట్టెను.

గాంధిగారు భయపడువారుకారు. అన్యాయమును సహించి స్వేచ్ఛాపూర్వకముగా దిగి పోవుటకు అంగీకరించలేదు. సిపాయి వచ్చి ఆయనను దింపి వేయవలెను.

ఆఫ్రికావాసులగు శ్వేతకాయులు భారతీయులనోటినుండి యిట్టిజవాబును ఎన్నడును వినియుండలేదు. భారతీయులు అన్యాయమును, అవిచారమును నిశ్శబ్దముగా సహించువారు. శ్వేతజాతీయుల ఆదేశములను మన్నించెడివారు. చిరకాలమునుండి చూచినది యీ విషయమే. కాని ఆనాడు గాంధిగారి నోటినుండి యిట్టివాక్యమును వినుటచే వారి ఆశ్చర్యమునకు మేరలేకుండెను. ఉద్యోగి క్రోధాంధుడై నిజముగా సిపాయిని పిలిపించెను. సిపాయివచ్చి గాంధిగారిని

బలవంతముగా క్రిందికి దించి వేసెను. సామానులన్నియు లాగి ప్లాటుఫారముమీద పారవైచిరి.

అవమానముచేత గాంధిగారి దేహమంతయు ఉడికి పోయెను.

అప్పుడు చలికాలము భయంకరమైన చలిగాయుచుండు టచేత ఆయన స్టేషనులోని విశ్రాంతిగదిలోనికి పోయి కూరుచుండెను. ఎక్కువ పొద్దుపోయినకొలది చలి అధిక మగుచుండెను. అత్యధికమైన చలిచేత గాంధిగారి దేహము ముద్ద అయిపోవుచుండెను.

గాంధిగారు విశ్రాంతిగదిలో కూర్చుని స్వదేశమునకు పోయెదనని తలంచుకొనెను. కాని మరుక్షణమునందే 'లేదు, వీలులేదు. అట్లు జరుగుటకు వీలులేదు' అని భావించెను. ఈ అవమానభారమును తలపై వేసుకుని స్వదేశమునకు తిరిగి పోయిన యెడల, ఆఫ్రికా దేశమంతటను వ్యాపించియున్న అసత్యఅనాచారములు, అవిచారములు ఏవిధమునను తొలగి పోజాలవు. అన్యాయమునకు, అవిచారములకు, అవమానము నకు ప్రతీకారము చేయవలెనని దృఢసంకల్పు డాయెను.

హృదయమునందిటుల ప్రతిజ్ఞ చేసికొనిరి. సాధ్యమైన యెడల వర్ణవిద్వేషముల యాంకర్షిణిని సమూలముగా ఛేదింప వలయును. సంగ్రామము చేయు గాంధిజీ తన హృదయమును దృఢతరము చేసెను.

గాంధీజీ యింకను ప్రిటోరియామార్గమునందే యుండెను. అవమానము, తిరస్కారము యిప్పుడే ఆరంభమాయెను.

స్టేషను వెయిటింగ్‌రూములో కూరుచుండి రాత్రి గడపెను. ఉదయము కాగానే వివేషవివరములతో అబ్దుల్లా శేటు గారికి తంతి పంపించిరి. అబ్దుల్లా శేటు గారి మధ్యవర్తిత్వము చేత గాంధిగారు భద్రముగా సంచరించుటకు యేర్పాట్లు గావింపబడెను. ఉదయమునుండియే మరిజ్‌వర్గులోనున్న భారతీయులందరును గాంధిగారికి స్వాగత మిచ్చుటకు సమావేశమైరి. వారు ఇంతకుపూర్వమే అబ్దుల్లా శేటు గారినుండి గాంధిగారి రాకవిషయమును తెలుసుకొనిరి. గాంధిగారిదర్శనము చేసుకుని వారు ఆయనకు జరిగిన అవమానమును గురించి విని యిట్లు నుడివిరి. ఇట్టిశతసహస్రఅవమానముల, అత్యాచారముల హృదయవిదారకమైన సంఘటనలు మా జీవనగ్రంథములపత్రిపుటయందును లిఖితమైయున్నవి. రైలు బండిలో మాకొరకు మూడవశ్రేణి పెట్టెయే నియమింపబడినది.

ఆమాటలు గాంధిగారికి శ్రుతికఠోరముగా నుండెను. బహువత్సరములనుండి భారతీయులు ఇట్టి అన్యాయవ్యవస్థలను నిర్విచారముగా ఎట్లు శిరసావహింప గలిగిరా యని విస్మయ మొందెను. పరాధీనతయందున్న నికృష్టతకు వ్యథితహృదయులైరి.

...రి) ప్రిటోరియాకు పోవు ట్రైను ఉండెను. నిర్ణయమిత సమయము స్టేషన్లో గడిపి రాత్రివేళ గాంధిగారు ఆ ట్రైనులో ప్రయాణమైరి. ఈసారి ముందుగనే తమకొరకు స్థానము నియమింపబడియుండెను. ఆయన మరుచటిరోజున ఉదయమున చార్లస్ పట్టణమునకు చేరుకొనిరి.

చార్లస్ పట్టణమునుండి గాంధిగారు జోహాన్సుబర్గును పోవలసియుండెను. ఈ మార్గములో రైలుబండి లేదు. ఈ మార్గములో 'సిగరమ్' అను గుర్రపుబండి యుండెను. సిగరమ్‌లో ప్రయాణికులు రెండు వరుసలుగా కూర్చుందురు. పైన డ్రైవరు, కండక్టరు కూరుచుందురు. గాంధిజీ భారతీయుడు—అందువలన బండిలోపల ఆయనకు స్థానము లభించలేదు. ఆయన డ్రైవరుప్రక్కనే కూరుచుండెను. కండక్టరు లోపల కూరుచుండెను.

కాని దీనివలనకూడ ఆయనకు అవమానము చాల లేదు. బండి కొంతదూరము పోయినపిమ్మట చాలకునివద్దనుండి ఒక వాగగుడ్డముక్కను అడిగి తీసుకుని కండక్టరు దానిని కాళ్లు తుడుచుకొనుపీటపై పరచి గాంధిగారిని కూరుచుండమని చెప్పెను. కండక్టరు సిగరెట్టు త్రాగ తలంచెను. అతడు చాలకునిప్రక్కనే కూరుచుని గాంధిగారికి యిట్టి అవమానకరమైన యేర్పాటుచేసెను.

గాంధిజీ దీనిని తిరస్కరించెను. ఈ అన్యాయ ఆదేశమును నిశ్శబ్దముగా శిరసా వహించలేనని చెప్పెను. అందు

గార్డ్ కస్టమ ఆయనను తీవ్రముగా నిందించి పైనపడి కొట్టెను.

నిందలను, దెబ్బలను సహించి గాంధిజీ స్టండర్టనుకు చేరెను. ఇచ్చట సిగ్రమ్ మార్చుకొనవలసియుండెను. ఇచ్చటనుండి గాంధిగారు జోహాన్సుబర్గుకు చేరిరి.

గాంధిజీ అపరిచితమైన యీపట్టణమున ప్రవేశించి పరిచితుల నెవ్వరిని గాంచలేకపోయెను. వంటరిగానే హోటలులో ప్రవేశించెను. కాని భారతీయకూలి యని ఆయనకు అచ్చట ఆశ్రయము లభించలేదు. మహమ్మద్ కాసిమ్ అలి అనుపేరు గల ఒకభారతీయుని అడ్రసు గాంధిగారివద్ద నుండెను. ఆయన అచ్చటికిపోయి ఆయన ఆతిథ్యము నర్థించెను. ఇచ్చట ఆయనకు ఏలోటు కలుగలేదు.

ఇచ్చటినుండి ప్రిటోరియాకు పోవలయును. జోహాన్సుబర్గునుండి ప్రిటోరియాకు 37 మైళ్లు. ఈమార్గము రైలులో ప్రయాణము చేయవలసియుండెను. ఇచ్చట భారతీయులకు ప్రథమశ్రేణిటికెట్టు విక్రయించరని గాంధిజీ అనేకసార్లువిని యుండెను. ఆయన స్టేషనుమాస్టరుగారి వద్దకు పోయి ప్రథమ శ్రేణిటిక్కెట్టుకొరకు ప్రార్థించెను. ఆయన ప్రథమ శ్రేణి టికెట్టు పొందవచ్చును. కాని దారిలో గార్డు ఏస్టేషనులోనైనా దింపివేసి మూడవశ్రేణిపెట్టెలో ఎక్కించవచ్చునని గాంధజీ స్టేషనుకు చేరుకొనిన పిమ్మట వినెను.

అయినను గాంధిజీ ప్రథమశ్రేణిటిక్కెట్టు [illegible]యమిత శ్రేణిపెట్టెలోనే ప్రయాణము సల్పుచుండిరి. దానిలో [illegible] ఆయన టిక్కెట్టుచూడ కోరెను. ఆయన టిక్కెట్టుచూపించెను. ఇది ప్రథమశ్రేణీ టిక్కెట్టై అయినను నల్లవారు ప్రథమ శ్రేణిలో ప్రయాణము చేయుటకు వారికి అధికారము లేదు. ఆయన మూడవతరగతిపెట్టెలోనే ప్రయాణము చేయవలె నని గార్డు నుడివెను.

రైలులో గాంధిగారితో ప్రయాణము చేయుచున్న ఆంగ్లేయుడు ఒకరు ఉండెను. ఆయన యీవ్యవహారములో కలుగజేసుకొని పరిష్కారము చేసిరి. నీవు చేయుచున్నది చాలా అన్యాయమని గార్డును గద్దించెను. ఆయనకు ప్రథమ శ్రేణి టిక్కెట్టు ఉండగా తృతీయ శ్రేణికి ఎందుకు పోవల యును? అని నుడివెను.

ఆయనమాట విని ముఖము మాడ్చుకొని 'మంచిది. మీరు కూలీతో ప్రయాణము చేయతలంచినచో చేయండి. నాఅభ్యంతరము లేదు' అని గార్డు నుడివెను.

ఈవిధముగా గాంధిగారు అవమానమును, అత్యాచారములను భరించి నెటాలునుండి ప్రిటోరియాకు చేరెను. కాని ఆయన అవమానములను, అత్యాచారములను సహించినకొలది ప్రతీకారము చేయవలెనని ఆయన దృఢసంకల్పు డయ్యెను.

---

గా॥ 19

## స్వాతంత్ర్యసంగ్రామ ప్రథమశంఖారావము.

అవమానముల అత్యాచారముల భారమును శిరమున వహించి గాంధిజీ ప్రిటోరియాకు చేరిరి. ఈ ప్రిటోరియానుండే గాంధిజీ స్వాతంత్రసంగ్రామ ప్రథమశంఖారావము మ్రోయించెను. ప్రిటోరియా ట్రాన్స్వాల్ రాజ్యాంతర్గతమైనది. ఇచ్చటి భారతీయులపై గావింపబడు అవమానకర అత్యాచారములు గాంధిగారిని వ్యాకులపరచెను. భారతీయుల మానభావము కూడ ఆయనకు క్లేశమును కలిగించెను. ఆఫ్రికాలోని మూఢ, మూక, మ్లాన భారతీయులకు భాషాజ్ఞానము కలిగించుటకై ఆయన ఉద్యమశీలుడాయెను. వారి హృదయాంతరాళములలో ఆశాజ్యోతిని వెలిగించుటకు గాంధిగారికి ప్రబల ఆకాంక్ష ఉదయించెను.

ట్రాన్స్వాలులో ఉన్న భారతీయకూలీలు, వ్యాపారస్థులు అనేకులు విద్యావిహీనులు; సర్కారువారిచేతులలో వారికి కలిగే అవమానమునకు మేరలేదు. 'ఫుట్ పాత్' పైన నడచినను వారు సమాధానము చెప్పవలసినదే. వారు ఫుట్ పాత్ పైన నడచుటకు వీలులేదు. ఫుట్ పాత్ క్రిందనే నడువవలసి యుండెను.

భారతీయులకు జరుగుచున్న అవమానము యింతటితో ఆగలేదు. రాత్రి 9 గం॥ల తరువాత ఏ భారతీయు

షును క్రిటోరియా షాపులలో నడువరాదు. ఒకనియమిత స్థానములోనే గృహములను నిర్మించుకొని భారతీయులు ఉండువారు. ఆస్థానమును దాటి ఇతరస్థలములలో గృహములను నిర్మించుకొనువారిపై జరుగు అవమానమునకు అంతు వుండదు.

ఇంత అవమానము, ఇన్ని అత్యాచారములు భారతీయులు సహించుచున్నారే కాని వారు ఏకముగా సంఘబద్ధమగుట లేదని గాంధిగారు కనిపెట్టెను. అన్యాయమునకు ప్రతీకారము చేయు వారు నిశ్చేష్టులైయున్నారు. అత్యాచారములను, అవమానమును, అన్యాయమును సహించుట భారతీయులకు అలవాటైపోయినది. ఒకరికి అవమానము కలిగిననో మరియొకరు సిగ్గుపడుట లేదు.

ఛిన్నవిచ్ఛిన్నమైయున్న శక్తిని కేంద్రీకృతము చేయవలెనని గాంధిగారు గ్రహించెను. దక్షిణ ఆఫ్రికా భారతీయులను సమ్మిళితము గావించి వారిశక్తిని మేల్కొల్పవలయును.

ఆఫ్రికాభారతీయులలో శేఠ్ తైయబహాజి మహమ్మద్ గారికి విశేష పేరుప్రఖ్యాతు లుండెను. గాంధిజీ ఆయన మనస్సునందున్న విషయములను స్పష్టముగా ఆయనకు తెలియజేసెను. భారతీయులు అనుభవించుచున్న అవమాన అత్యాచారములను గురించి గాంధిజీ ఒకసభలో ఉపన్యసింపవలయునని తీర్మానింపబడెను.

మహమ్మద్ హాజియుసబ్ గారి గృహములో భారతీయులు సమావేశమైరి. భారతీయుల అవమాన అత్యాచారములను గురించి హృదయవిదారకభాషలో గాంధిజీ శ్రోతలకు క్రమముగా తెలియజేసెను. ఇది నాప్రథమ ఉపన్యాసమని గాంధిజీ నుడివెను. కాని ఈప్రథమఉపన్యాసమువలన గాంధిజీ భారతీయులహృదయములలో రగుల్కొల్పిన అగ్ని ఆర్పుటకు వీలులేదు. దీపశిఖవలె దేదీప్యమానరూపముదాల్చి భారతీయులను తమగౌరవరక్షణకొరకు సంసిద్ధులనుగా చేసెను. భారతీయులు అనుభవించుచున్న అవమానము, అత్యాచారములను గురించి 'ఉపన్యాసములో విపులముగా స్పష్టీకరించి వాటి విషయములో వారి దృష్టిని ఆకర్షించెను. దీనికి ప్రతీకారము జేయదలంచినచో ఒకసంఘమును ఏర్పాటు చేయవలెనని గాంధిజీ నుడివెను. అవమానములు ప్రతీకారమునకు సంఘీభావ ఆవశ్యకతను గురించి తెలియజేసెను. హిందు ముసల్మాన్, పార్శి, క్రైస్తవ, గుజరాటి, మరాఠి, సింధి, సూరటి మొదలగు భేదములు వర్జింపవలయునని కోరెను. సర్వవిధములైన సంకుచితభావములను విడనాడి ఐకమత్యముతో ఏకముకానియెడల అత్యాచారులకు ప్రతికూలముగానిలువబడుటకు సాధ్యము కాదని ఆనాడు ఆయన స్పష్టముగా స్వదేశీయులకు తెలియజేసెను. జీవితకాలమంతయు ఆయన యీసందేశమునే ప్రచారము చేసిరి. ఆఫ్రికాలో భారతీయులను

ఏఐక్యతామహామంత్రముచేత దీక్షాబద్ధులనుగా చేయ గోరెనో, ఆ మహామంత్రముచేతనే భారతీయులనుసహా దీక్షా బద్ధులనుగా గావించి భారతభూమిని ఐక్యతాబద్ధ మహా భారతముగా నొనర్చ సాధన చేసిరి.

ఆనాడు అంధకారాచ్ఛన్నమైన మహాదేశమగు ఆఫ్రికాలో గాంధిజీ ఏదీపశిఖను వెలిగించెనో దానివలన అచ్చట భారతీయుల అంతర్లోకము ఆలోకితమాయెను. వారికి ఆత్మ గౌరవజ్ఞానము ఉదయించెను. ఉపన్యాసమువలన విశేషఫలితము కనుపించెను. ఆతడు అనుభవించిన ఆవేదము నిష్ఫలము కాలేదు.

రామచంద్రుని పాదస్పర్శచే పాషాణరూపిణియగు అహల్య ప్రాణమయియై విరాజిల్లెను. గాంధిజీ సందేశము వలన జడరూపులగు భారతీయులకు చైతన్యము ఉదయించెను. మోహబంధములు చిన్నమయ్యెను. అవమానమును అవమానముగా గ్రహించుటకు శక్తిశాలురైరి. అందరును సంఘబద్ధభావముతో గాంధిజీనేతృత్వమున అవమానఅత్యాచారముల ప్రతీకారముకొరకు జాగరూకులైరి. బహువత్సరముల నిష్క్రియత్వమునకు అవసానదశ ఏతెంచెను. అన్యాయములతో, అత్యాచారములతో, అవిచారములతో సంగ్రామము చేయుటకే శంఖారావము మ్రోయింపబడెను.

గాంధిగారు రైల్వే అధికారులతో ఉత్తరప్రత్యుత్తరములు జరుపుచుండిరి. రైలులో ప్రయాణము చేయు భారతీయులు సహించుచున్న అత్యాచారములవిషయములో వారి దృష్టి నాకర్షించి తన్నివారణార్థమై తగుచర్య గైకొనవలసినదని వారిని కోరియుండిరి. దీనివలన పరిపాలకుల ఆక్రోశము కొంత ఉపశమించెను. మంచిదుస్తులు ధరించిన యెడల భారతీయులు కూడ ప్రథమ, ద్వితీయ శ్రేణి పెట్టెలలో ప్రయాణము చేయవచ్చునని రైల్వే అధికారులు తెలియజేసిరి.

కాని ఇంకను మరియొక యిబ్బంది కలదు. మంచి దుస్తులా కాదా అనువిషయమును నిర్ణయించునది స్టేషను మాష్టరు. ధరించినవ్యక్తికి మంచివిగా తోచినను స్టేషను మాష్టరుకు చెడుగుగా తోచినచో ఆయనను ప్రథమ, ద్వితీయ శ్రేణులలో ప్రయాణము చేయనియ్యరు.

గాంధిగారు చేయుచున్న ప్రయత్నములవలన ఆయన ప్రిటోరియాలోనేగాక ఆఫ్రికా భారతీయులలో కూడ పరిచితులైరి. ఆయన అచ్చటి భారతీయులను, భారతీయులు ఆయనను గ్రహించిరి. ఈసమయములోనే ప్రిటోరియాలోని బ్రిటిషుఏజంటుతో పరిచయము కలిగెను. ఆయనకు భారతీయులపై సానుభూతి ఉన్నటుల గ్రహించెను. దక్షిణాఫ్రికా ఆరంజి ఫ్రీస్టేట్ వాలూకి భారతీయులను అచ్చటనుండి నిర్దయతో తొలగించుటకు ప్రయత్నములు జరుగుచున్నవని ఏజంటుగారిద్వారానే గాంధిజీ తెలుసుకొనెను. ఒకశాస

నము గావించి తద్ద్వారా అచ్చటిభారతీయుల నందరిని తరిమివేయుటకు ప్రతిపాదనచేయబడినది. కేవలము హోటెళ్లలో పనిచేయువారు, కూలీలు, ఈ శాసనమునుండిమినహాయింపబడినారు. కారణమేమనగా, వారిసహాయములేకుండా శ్వేతజాతివారు బ్రతుకజాలరు. అనేకవత్సరములనుండి తమ రక్తమును ధారపోసి వ్యాపారమును అభివృద్ధి చేసుకొనిన భారతీయ వ్యాపారస్తులకు నామమాత్రలాభమునిచ్చి వారిని పంపివేయుచుండిరి. భారతీయవ్యాపారస్తులు విన్నపములను గావించుకొనిరి. కాని వారిక్షీణస్వరములు గర్వాంధులు నిర్దయులునైన అత్యాచారులకర్ణేంద్రియములలో ప్రవేశించలేదు.

1885–86 వ సంవత్సరము. ఆసమయములో ఆఫ్రికాలోని ట్రాన్స్వాల్ రాజ్యములో ఒకశాసనము ప్యాసుచేసి ప్రవేశపెట్టిరి. తద్ద్వారా భారతీయులను అవమానపరచుట ఇనుమడింప జేయువిధానమే అవలంబింప బడెను. ప్రతి భారతీయుడును ట్రాన్స్వాల్ రాజ్యములో ప్రవేశరుసుము క్రింద మూడుపౌనులు పన్ను యివ్వవలయునని యీ శాసనముద్వారా నిర్ణయింపబడెను. వారు నియమితఆవరణలో మాత్రమే గృహములను నిర్మించుకుని వాసము చేయవలయునని కూడ స్థిరము చేయబడెను. ఫుట్ పాత్ పైన నడచుట అపరాధముగా పరిగణింపవలయును. రాత్రి 9 గంటలకు తరువాత లైసెన్సు లేకుండా బయటికి వచ్చినవో వారు

బందిఖానాలో నుంచబడుదురు. ఆబందిఖానాలో ఉండగలి గిన వారినే అచ్చట ఉంచబడుదురు. ఇతరులు రాజ్యము విడిచి వేరుస్థలములకు వెడలిపోవచ్చును.

ఫుట్ పాత్ పై నడుచువిషయమునుగురించి గాంధి గారు అత్యంతక్లేశకరమైన అనుభవమును సంపాదించిరి. ఆయన ప్రతిరోజు ప్రెసిడెంటువీధిలో ఒక మైదానమునకు షికారు పోవుచుండువారు. ఈ మైదానములోనే ప్రెసిడెంటు క్రూగరుగారి గృహముండెను. గృహసమక్షమున సిపాయి తిరుగుచుండును. సిపాయిప్రక్కనే గాంధిజీ ప్రతిరోజు ఫుట్ పాత్ పైన వచ్చుచు పోవుచు నుండిరి. సిపాయిలు ఆయనను ఏమియు అనేవారుకారు. కాని అప్పుడప్పుడు సిపాయిలు మారుచుందురు. ఒకరోజున సిపాయి [illegible] వచ్చి గాంధిజీని ఒకత్రోపుత్రోసి, కాళ్ళ[illegible]. [illegible]పైన పడవైచెను.

మిస్టర్ కోట్సు అప్పుడామార్గమున గుర్రముపై నెక్కి పోవుచుండెను. ఆయన యీసంఘటన చూచి సిపాయి మీద ఫిర్యాదు చేయుమనియు, గాంధిగారికి అనుకూలముగా సాక్ష్యము నిచ్చెదననియు ఆయన నుడివెను. కాని గాంధిజీ ఫిర్యాదు చేయ నిష్టపడలేదు. మిస్టర్ కోట్సు మధ్యవర్తిత్వ మున వ్యవహారము పరిష్కరింపబడెను. సిపాయి క్షమా పణ కోరుకొనెను.

ఈ సంఘటన జరిగినపిమ్మట భారతీయులపై గాంధి గారి సానుభూతి అధికతరమాయెను. భారతీయులయింత

కాలము సహించుచున్న అవమాన అత్యాచారములను గురించిన వివరములను మాత్రమే వినియుండెను. ఇప్పుడు ప్రత్యక్షముగా తనకే అనుభవము కలిగియుండుటచేత దానిప్రతీకారముకొరకు బద్ధపరికరుడయ్యెను.

ఇంతలో దాదా అబ్దుల్లా వ్యాజ్యము విషయములో నిరంతరపరిశ్రమ గావించుచుండెను. పరిశ్రమకు ఫలితము లభించెను. వ్యాజ్యములో జయము లభించెను.

---

## ౨౦

# నెటాల్ ఇండియన్ కాంగ్రెసు స్థాపన

గాంధిగారి ఆఫ్రికావాసము ఒకసంవత్సరము పూర్తి కావచ్చినది. ఆ దేశమునకు పోయిన ఉద్దేశము కూడ నెరవేరెను. ఆయన ప్రిటోరియానుండి డర్‌బాన్‌కు తిరిగివచ్చెను. అచ్చటినుండి భారతదేశమునకు తిరిగి వచ్చుటకు సిద్ధపడిరి. కాని ఇట్టిసమయములో "భారతీయుల ఓటు అధికారము" అనుశీర్షికతో అచ్చటివార్తాపత్రికలలో ప్రకటింపబడిన విజ్ఞప్తిని గాంధిజీ చూచెను. నెటాలు వ్యవస్థాపకసభలో భారతీయులకు ఉన్న ఓటు అధికారము రద్దయిపోవునను ఆవార్తాపత్రికనుచదివి గ్రహించెను. దక్షిణాఫ్రికాలో భారతీయులకు వవిధమైన అధికారము లేదు. ఈశాసనముకూడా ప్యాసు

అయినచో అంత్యచిహ్నముకూడా విలుప్తమగును. దీనిని ప్రతిఘటించు ఉద్దేశముతో గాంధిజీ తనప్రయాణమును ఆపు జేసికొనిరి. ఆఫ్రికాలోని భారతీయులు ఆయనను తిరిగి రానీయలేదు. గాంధిజీ ఆఫ్రికాభారతీయులతో నొకకార్యనిర్వాహకసంఘమును నెలకొల్పిరి. అత్యాచారములకు విరుద్ధముగా యీసంఘము భారతీయులకు కార్యక్రమమును నిర్ణయించుటనికూడ యేర్పాటు చేయబడెను.

ఇంతలో "భారతీయుల ఓటు అధికారము"ను గురించిన శాసనవిషయమై రెండవసారి ఆలోచన జరిగిపోయెను. భారతీయులు ఆశాసనమునకు విరుద్ధముగా తమ అభ్యంతరమును తెలియజేయునప్పుడు భారతీయులు నిజముగా ఓటు అధికారమునుండి తొలగింపబడుటకు అర్హులను విషయము కూడా సభలో ఆలోచింపబడినది. కాని ఆబిల్లువిషయమై భారతీయులకు ఇంతవరకు ఏమియు తెలియలేదు. అభ్యంతరమును తెలుపుటెట్లు? గాంధిజీ ఆవిషయము నందరికిని తెలియజేసి దానిని ప్రతిఘటించుటకును, సంగ్రామము చేయుటకును ప్రబోధము కలిగించిరి.

నేటాలు వ్యవస్థాపకసభాధ్యక్షునకు తంతి పంపబడెను. బిల్లువిషయమై ఆలోచన కొంతకాలము ఆపుచేయుమని కోరిరి. రెండురోజులవరకు ఆపు చేయబడునని జవాబు వచ్చెను. బిల్లుకు విరుద్ధముగా ఒక నివేదనపత్రము రచింప

బడెను, భారతీయుల సంతకములతో శాసనసభకు పంప
బడెను.

కాని బిల్లు శాసనముగా చేయబడెను. దుర్బలుల
క్షీణస్వరము నెటాలులోని వ్యవస్థాపకసభకై ప్రభావము
విస్తరింపజాలకపోయెను.

అయినను భారతీయులలో నూతనజవితము, నూతన
చైతన్యము, ఉదయించెను. గాంధిగారి నేతృత్వమువలన
ఆనాడు భారతీయసాంప్రదాయములన్నియు ఒకటియనియు,
అవిభక్తమనియు భారతీయులు గ్రహించిరి. ఐకమత్య
గౌరవము నిలుపుటకును, దానిని భారతీయులలో ప్రచా
రము చేయుటకును గాంధిజీ సమస్తజీవితమునుధారపోసెను.
ఆఫ్రికాలో యీఐకమత్య ప్రభావమును, సంఘబద్ధశక్తి
ప్రభావమును ఆయన ప్రత్యక్షముగా దర్శించినారు. సంఘ
టింపచేసినారు. ఆఫ్రికాలో గాంధిజీ జీవనవీణఏస్వరముతో
మ్రోయించబడెనో ఆగంభీర స్వరముతోనే జీవితకాల
మంతయు మ్రోయించబడెను.

వాణిజ్య అధికారముకొరకు ఎట్లు సంగ్రామము
చేయవలయునో, రాజనైతిక అధికారముకొరకు కూడ
అట్లే సంగ్రామము చేయవలయునని అచ్చటిభారతీయు
లందరును గ్రహించిరి.

అప్పుడు ఆఫ్రికాలో లార్డురిప్పన్ మంత్రిగాయుండిరి.
ప్రతికూలవిజ్ఞప్తి భారతీయుల రాజనైతిక అధికారము

కొరకు తమవాంఛ ఆయనకు తెలియచేయబడెను. గాంధి గారు అత్యంతశ్రమ కోర్చి ఆవిజ్ఞప్తిని తయారు చేసిరి. సంతకములు చేయించుటకు స్వేచ్ఛాసేవకులు విశేషశ్రద్ధ వహించిరి. ఒక నెలరోజులు గడచినపిమ్మట పదివేలమంది చేత సంతకములు చేయించి లార్డురిపన్ వద్దకు పంపబడెను.

ప్రస్తుతము గాంధిగారి కార్యము నెరవేరినది. ఆయన భారతీయులలో సకల రాజకీయాధికారముకొరకు స్వాతంత్ర్యతరంగములు ఉప్పొంగునట్లు చేసెనో ఆతరంగ ములు మహావేగముతో సర్వవిధములైన ఆటంకములను తొలగించుకొని ప్రవహించుటకు ఆవశ్యకమైన శక్తిసామర్థ్య ములను సంపాదించుకొనుచున్నవని గాంధిజీ గ్రహించి ఆయన భారతదేశమునకు తిరిగి రాగోరెను. కాని బంధు బాంధవులు ఆయనను విడిచిపెట్టలేదు. బిల్లుకు ప్రతికూల ముగా భారతీయులలో ఏమహాదేశికప్రవాహము ప్రవ హించుచుండెనో దానిప్రవాహమునకు ఆటంకము కలుగ కుండా చూచుటకు గాంధిగారిని కొంతకాలము వరకు ఆఫ్రి కాలో ఉండమని అచ్చటిభారతీయులు వేడుకొనిరి.

గాంధీజీ స్వదేశమునకు వచ్చుసంకల్పమును పరిత్య జించెను. గాంధీజీ ఆఫ్రికాలో ఉన్నంతకాలము ఆయన ఖర్చునిమిత్తము సంవత్సరమునకు 300 లు పౌండ్లు యిచ్చు నట్లు సంఘమువారు తీర్మానించుకొనిరి. గాంధీజీ యీసహా

యీ సహాయమును స్వీకరింపలేదు. ఆయన నెటాలులో స్త్రీడరుపని సాగించిరి.

స్త్రీ డ రు ప ని ఆయనజీవితములో ఎప్పుడును అప్రధానముగానే యుండెను. నిర్మాణకార్యక్రమమునందే ఆయన తనజీవితమును సమర్పించుకొనెను. దక్షిణఆఫ్రికా భారతీయులలో ప్రజ్వరిల్లిన స్వాతంత్ర్యహోమానలములో ఆహుతి నర్పించి అది ఆరిపోకుండునట్లు ప్రయత్నించుచుండిరి. ఆఫ్రికావాసులగు భారతీయులను సంఘబద్ధము గావించి ఒక శాశ్వత పతిష్ఠానముగా నొనర్చుట ఆవశ్యకమని గుర్తెరింగి 1894 మే 22వ తేదీన "నెటాలు ఇండియన్ కాంగ్రెసు"ను స్థాపించిరి.

ఆఫ్రికాలో జన్మించిన వారిసేవ చేయుటయే యీ కాంగ్రెసు ఉద్దేశములలో నొకటి. కాంగ్రెసులో వివిధసమస్యలనుగురించి ఉపన్యాసములు జరుగుచుండెడివి. దీనిలో ప్రచారపభాగమని మరియొకటి యుండెను. ఇంగ్లాండు లోను, భారతదేశములోను దక్షిణాఫ్రికాభారతీయుల దుఃఖకష్టముల ప్రకృతవిషయములను తెలియచేయుటకు ప్రచారకార్యముకూడ ఆరంభించబడెను. గాంధిజీ భారతీయుల దుఃఖకష్టములు దుర్దశలనుగురించి రెండుగ్రంథములను రచించి యుండిరి. మొదటిది—'దక్షిణఆఫ్రికాలోని ప్రతి ఆంగ్లేయునకు నివేదనము.' ఈరెండవది—'భారతీయుల ఓటు అధికారమును గురించి నివేదన.' .. రెండుపుస్తకములు

విశేషముగా ప్రచార మాయెను. విశేషఫలితముకూడ లభించెను. నెటాలుభారతీయులు వృత్తాంతములను అందరును తెలుసుకొనిరి. భారతీయుల ఓటు అధికారముకూడ ప్రమాణములతో ప్రచారము చేయబడెను. గాంధిజీ తన కార్యములను నిర్దిష్టప్రణాళికను యీకాంగ్రెసు స్థాపించిన పిమ్మటనే గ్రహింపగలిగిరి. నియమితకల్పనాప్రభావముచేత గాంధీజీ యిప్పటినుండి భారతీయులకొరకు సంగ్రామమును ఆరంభించిరి.

---

## 21

## దరిద్రనారాయణ సేవ

దీనులసేవ చేయుసంకల్పము గాంధిగారికి యౌవనము వందే కలిగెను. వారిసేవ చేయుటకు అవకాశముకూడ ఆయనకు కలిగెను.

అచ్చట నున్నభారతీయు లందరును నూతనముగా నిర్మింపబడిన "నెటాల్ ఇండియన్ నేషనల్ కాంగ్రెసు"లో సభ్యులుగా చేరిరి. అచ్చటిభారతీయకూలీలును, షరతులకు లోబడిన భారతీయశ్రమికులును అప్పటికింకను ఆసభలో సభ్యులుగా చేరలేదు. దరిద్రశ్రమికులను కాంగ్రెసు

లనుగా చేయవలసిన సమయము ఏతెంచినది. వారిసేవ, సహాయముల కొరకు కాంగ్రెసు సంసిద్ధ మాయెను.

ఒకనాడు ఒకసంఘటన సంభవించెను. ఒక రోజున ఒకమద్రాసు శ్రామికుడు గాంధిగారి సమక్షమునకు వచ్చి తలపాగా తీసి నిలువబడెను. ఆతని వస్త్రములు చిరిగిపోయి యుండెను. దారిద్ర్యముచేత ఆతడు శుష్కించి యుండెను. ఆతని దేహము కంపించుచుండెను. నోటినుండి ఎడతెగక రక్తము స్రవించుచుండెను. ముందు పండ్లు రెండున్ను విరిగిపోయి యుండెను.

ఆతడు పరతులకు అంగీకరించిన వ్యక్తి, తలపాగా తీసి చేతిలో పెట్టుకుని గాంధిగారిసమక్షమున నిలువబడెను.

తలపాగా తీసి చేతిలో పట్టుకుని నిలువబడియుండుట చూచి తలపాగా పెట్టకోమని గాంధిజీ నుడివెను. ఆవ్యక్తి తలపాగా పెట్టుకొనుటకు ఇష్టపడలేదు. గాంధిజీ మరల ఆతనికి అభయ మిచ్చెను. ఆతడు అత్యంతసంతోషముతో తలపాగా ధరించెను. తలపాగా ధరించుటచే ఆతని వర్చస్సు, నేత్రములు ఆనందముతో ఉజ్జ్వలరూపముదాల్చి యున్నట్టుల గాంధిగారు కనిపెట్టెను. ఇంత ఆనందము దేనివలన లభించెనని గాంధిగారు ఆశ్చర్య మొందిరి. అసామాన్యమైన శ్రమికునకు కూడ గౌరవ మున్నదనియు, ఆ గౌరవమును ఇతరులు అంగీకరింతురనియు, ఆతనినికూడ యితరులు గౌరవింతురనియు, అనువిషయములు ఆతడు యింతకుపూర్వము

ఊహించనైనా లేదు. దొరసానిసమక్షమున నిలువబడియున్నప్పుడు తలపాగా తీసియే నిలువబడి యుండవలయునని ఆతడు ఆఫ్రికాలో వసించుటచేత గ్రహించెను. గాంధిగారు దొరగారు కాదు అని ఆత డెరుగును. గౌరవాస్తలను కారణము చేతనే ఆతడు తలపాగా తీసి ఆయనసమక్షమున నిలువబడి యుండెను. గాంధిగారు ఆతని సందేహమును తొలగించెను. ఆయన ఆజ్ఞానుసారముగా ఆతడు తలపాగా ధరించి ఆతని విషాదగాథను వివరించెను.

ఆతనిపేరు బాలసుందరమని తెలియవచ్చెను. ఆతడొక గోరా అధీనమునందుండి పని చేయువాడు. ఏకారణము చేతనో యజమాని ఆతనిపై కోపగించి పిచ్చివానివలె ఆతనిని కొట్టి యీవిధముగా ఆఘాతపరిచెను.

గాంధిగారి మనస్సు సానుభూతితో పరిపూర్ణమాయెను. ఆయన డాక్టరు సర్టిఫికేటు తీసుకొనెను. అది తీసుకుని వెళ్ళి మేజిస్ట్రేటుతో చూపెను. మేజిస్ట్రేటు గోరాపై కోపగించి ఆతనికి సమనులు పంపమని ఆజ్ఞాపించెను.

అత్యాచారియగు గోరా యజమానినుండి బాలసుందరమును తప్పించుటకు గాంధిగారు ఉద్దేశించిరి. ఆతనికిసమను చేయించు ఉద్దేశము ఆయనకు లేకుండెను. షరతులచే బంధింపబడిన క్రిమికులను తప్పించుట అంత సహజమైనవిషయము కాదని ఆయన ఆలోచించి చూచెను. సాధారణకూలీలకును, షరతులకు లోబడిన క్రిమికులకును చాలప్రభేదము

కలదు. నియమబద్ధశ్రమికులను పనినుండి ఎవరేని తొలగించిన యెడల అతడు అపరాధి యగును. అందువలన అతడు జైలులోకూడ ఉండవలసి వచ్చును. ఇది దాసత్వమునకు నామాంతరముమాత్రమే. ఎట్లయినను బాలసుందరమును విడిపించుటకే గాంధిగారు ప్రయత్నము చేసిరి. అతని యజమానికి శిక్ష వేయించుటకు ఇచ్ఛగింపలేదు. ఆయన ప్రయత్నము సఫలీకృత మయ్యెను. బాలసుందరము గాంధిగారి సహాయముతో విముక్తిచెంది మరియొకయజమానివద్ద పని చేయుటకు ఆరంభించెను.

అనంతరము నియమబద్ధశ్రమికులు నాలుగువైపుల నుండి గాంధిగారిని చుట్టుకొనిరి. వారు ఆయనను తమకు పరమస్నేహితులని భావించిరి.

ఈసంఘటన జరిగిన కొంతకాలమునకు గాంధిగారి పేరుప్రతిష్ఠలు శతగుణముల పెరిగిపోయెను. తిరస్కృత నిపీడిత దరిద్రులును, అసహాయులును అయిన జాతీయులతరపున కూడ సంగ్రామము చేయుటకు ఒకవ్యక్తివున్నారని గ్రహించి ఆనందించిరి.

---

# ప్రారంభమవుచున్న విరోధము

1860 వ సంవత్సరము. అప్పుడు నెటాలులో చెరకుపంటలు విశేషముగా పండుచుండెను. కాని లాభపరిమాణమును అభివృద్ధిచేయుటకు శ్వేతజాతివారికి శ్రమికులు అవసరమయ్యెను. అందువలన దరిద్రపీడితభారతదేశము, భారతీయశ్రమికులవిషయము వారికి స్మరణకు వచ్చెను. నెటాలువాసులగు శ్వేతాంగులు భారతసర్కారువారికి ఉత్తరములు వ్రాసి అనేకమంది భారతీయశ్రమికులను నెటాలుకు తీసుకుని పోవుటకు అనుమతి సంపాదించిరి. శ్రమికులు 5 సంవత్సరముల షరతుతో నెటాలుకు రావలెనని చెప్పిరి. ఆషరతుకాలము పూర్తిఅయినపిమ్మట వారు స్వతంత్రు లగుదురు. వారు యిచ్ఛగించినయెడల నెటాలులో భూమి క్రయముచేసి స్వతంత్రులుగా వాసము చేయవచ్చును.

షరతు పూర్తిఅయినపిమ్మట భారతీయశ్రమికులు కృషికార్యములవలనవిశేషధనమును గడించుచుండిరి. వారు విశేషముగా కూరగాయలను పండించుచుండిరి. భారతదేశము నుండి నూతనబీజములను తెప్పించి వ్యాపింపచేయుచుండిరి. భారతదేశమునుండి మామిడిపండ్లుకూడా తెప్పించి వ్యాపింప చేయుచుండిరి. వారు ఫలములు,

కూగల వ్యాపారము చేయుటకుకూడా ఆరంభించిరి. వ్యాపారముపలన లాభము కలుగుచున్నవిషయము భారతదేశము నకుకూడ తెలిసెను. భారతదేశమునుండి పోయియున్న శ్రమికులవెనుక వ్యాపారస్థులుకూడ అచ్చటికి పోయి చేరిరి.

దీనివలన శ్వేతాంగులు ఆశ్చర్యమొందిరి. భారతీయులవ్యాపారబుద్ధిని లాభపరిమాణమును చూచి వారు చకితులైరి. నియమబద్ధభారతీయశ్రమికులు స్వతంత్రముగా కృషికులవలె ఆఫ్రికాలో నుండగోరినచో శ్వేతాంగులకు ఎట్టి అభ్యంతరము లేదు. కాని భారతీయులు వారివ్యాపార లాభములలో భాగము పంచుకొనుట శ్వేతాంగులకు అసహనీయముగా యుండెను.

తత్ఫలితముగా శ్వేతాంగులకు భారతీయులకు విరోధ మేర్పడెను. భారతీయులకు గల ఓటుఅధికారమును రద్దుపరచి, నియమబద్ధశ్రమికులపై పన్ను ప్రయోగించి యీవిరోధమునకు ఆకార మీయబడెను. 1894 వ సంవత్సరములో ఒక శాసనము చేయబడెను—నియమిత శ్రమికులు 5 సంవత్సరముల షరతుఅనంతరము భారతదేశమునకు తిరిగి పోయినచో ఉత్తమము. లేనియెడల శ్రమికుడుగా నుండుటకు మరియొక షరతు నేర్పాటు చేయవలసియున్నది. లేదా వారు సంవత్సరమునకు మనిషి ఒకటికి 25 పౌండ్లు పన్ను చెల్లించవలసియుండును. ఇది

దరిద్రులపై అన్యాయ అత్యాచార మనుటకు సందేహము లేదు! కాని స్వార్థాంధులు చిరకాలమునుండి దరిద్రులపై యిట్టిఅత్యాచారములనే చేయుచున్నారు.

గాంధీజీ తనదళబలముతో దీనికి విరుద్ధముగా ప్రచండ ఆందోళనమును ఆరంభించెను. లార్డు ఎలిన్ ఆనాడు భారత దేశములో గవర్నర్ జనరల్‌గా ఉండెను. భారతీయులపై యిట్టిఅత్యాచారములను ఆయనకూడ సమర్థించలేదు. అందువలన పన్ను 25 పౌండ్లనుండి 3 పౌండ్లకు తగ్గింపబడెను.

పన్ను తగ్గింపబడినంతమాత్రమున గాంధీజి సంతోషించలేదు. భారతీయులు పన్ను ఎందుకు యివ్వవలయునో ఆయనకు అర్థ మగుటలేదు. ఈపన్ను యిచ్చు నీతియే అన్యాయమైనదని ఆయన తలంచెను. ఆకారణముచేత యీదుర్నీతికి విరుద్ధముగా ఆయన సంగ్రామమును సాగింప తలంచెను.

పన్ను లేకుండా చేయు సంకల్పముతో నెటాలు ఇండియను కాంగ్రెసు గాంధీజీ నేతృత్వముతో ఏఆందోళనము ఆరంభించెనో అది నెరవేరువరకు కాంగ్రెసు ఆ ఆందోళనమును త్యజింపలేదు. ఇదియే 'కరెంగె ఇయె మరెంగె' అనగా మంత్రసాధన లేక మరణము.

అన్యాయముగా విధించిన పన్ను తొలగించుటకు ఆరంభమైన ఆందోళనము సార్థకపడుటకు 20 సంవత్సర

ములు పట్టెను. దానిలో కేవలము నెటాలుయేగాక దక్షి
ణాఫ్రికాభారతీయులందరును పాల్గొనిరి. మహామాన్యుడగు
గోఖలేకూడ ఆందోళనములో పాల్గొనెను. గాంధిగారి యీ
ఆందోళనము అహింస నీతిద్వారానే నడుపబడెను. ఈ
ఆందోళనములో భారతీయులుజరిమానాలు, బెత్తపుదెబ్బలు,
కారావాసములు భరింపవలసివచ్చెను. అనేకులు తుపాకి
గుళ్ళదెబ్బలచే ప్రాణములను పోగొట్టుకొనవలసి వచ్చెను.
అప్పుడు గాంధిగారు ఆఫ్రికాభారతీయులను నడపించిరి.
కర్తవ్యబుద్ధిచే ప్రబోధితులను గావించిరి. సత్యాగ్రహ
తాత్పర్యమును తెలియజేసి ఆఫ్రికాలోని సత్యాగ్రహ
భారతీయులను కర్తవ్యములతో ప్రోత్సాహపరచెను.

---

## 23

## భారతదేశమునకు తిరిగి వచ్చుట

మూడు సంవత్సరములు ఆఫ్రికాదేశములో వసించి 1896 సం॥రములో గాంధిజీభారత దేశమునకు తిరిగివచ్చెను. పరివారముతో మరల ఆఫ్రికాకు పోవనుద్దేశించియుండెను. దక్షిణఆఫ్రికాలో ఆయన దీర్ఘకాల ముండవలయునని ఆయన గ్రహించెను. అన్యాయఅత్యాచారములను ప్రతి ఘటించుటకును, ప్రతీకారము చేయుటకును, ప్రజాసేవ

కొరకును, ఆఫ్రికాయందు దానునయుండు టత్యంతావశ్యకమై యుండెను. మూడుపౌండ్లపన్ను యింకను రద్దు చేయబడ లేదు. దానిని రద్దుచేయించుటకు ఏఆందోళనమును ఆయన ఆరంభించెనో దానిని సక్రమమార్గమున పెట్టుటకు అభిల షించుచుండిరి. ఆ అన్యాయపుపన్ను భారము తగ్గిపోవువరకు ఆయనకు మనశ్శాంతి లేకుండెను.

భారతదేశమునకు తిరిగి వచ్చినను గాంధిజీ ఆఫ్రికా సమస్యలలోనే మునిగి యుండిరి. ఆయన భారతీయుల దుర వస్థలను గురించియే ఆందోళనము చేయుచుండిరి. దక్షిణా ఫ్రికాలోని ఆనాటిపరిస్థితులను గురించియే 'ఆకుపచ్చ పుస్త కమును' రచించెను.

ఈసమయములో బొంబాయిలో ఒక భయంకర వ్యాధి ఆరంభ మాయెను. నలువైపుల భయోత్పాదకములు. గాంధిగారు అప్పుడు రాజకోటలో నుండిరి. రాజకోటలో కూడ యీవ్యాధి వ్యాపించునేమో యను భయముచేత ఆరోగ్యరక్షణకు ఒక సంఘము ఏర్పాటు చేయబడెను గాంధిజీ స్వేచ్ఛాపూర్వకముగా యీ సేవాదళములో చేరెను. ఆయన తిట్టీలను చూచు భారము వహించెను. తనదళబలముతో నాలుగువైపుల అత్యంతపరిశ్రమచేయుచు తిరుగుచుండెను.

సేవాకార్యము చేయుచున్నప్పుడు అస్పృశ్యుల బస్తీ లకుకూడ పోవలసివచ్చెను. దీనికి అందరును తమ అయిష్ట తను ప్రదర్శించిరి.

ఎవని గృహములో పాదముపెట్టినంతమాత్రముననే దేహము అపవిత్ర మగునో అట్టివారితట్టిలను పరీక్షించుట అసంభవమైన విషయముగా అందరికిని తోచెను. స్వేచ్ఛా సేవకులు గాంధిగారితో పనిచేయుటకు యిష్టపడలేదు.

గాంధిగారు ఒంటరిగానే ప్రయాణమైరి. సేవా వృత్తిలో అస్పృశ్యతకు స్థానము లేదు అని నుడివెను. గాంధిగారి ఆదర్శములవలన ఒకరియందు పరివర్తనము గాన్పించెను. ఆయన గాంధిగారితో బయలుదేరెను. ఈ ఒకరి సహాయముతోనే ఆయన కర్తవ్యకార్యములను నెరవేర్చెను.

దక్షిణాఫ్రికాలోని భారతీయులనుగురించి భారతదేశము న ప్రబోధము చేయుటకు సభాసమితులను ఏర్పాటు చేయుటకుకూడ గాంధిజీయే పూనుకోవలసివచ్చెను. సర్ ఫిరోజిషా సహాయముతో ఒకసభ యేర్పాటు చేయబడెను. గాంధిగారు ఉపన్యాస మిచ్చిరి. ప్రభుత్వవిలాసులగు శ్వేత కాయులు వ్యాపారస్తులహస్తములలో నిరపరాధులగు కొందరు భారతీయులు ఆఫ్రికాలో ఎట్టి అవర్ణనీయమగు అవమానములను భరించుచున్నారో వచ్చిన వారందరును గ్రహించిరి.

మద్రాసులోకూడ గాంధిగారు ఉపన్యాసములనిచ్చిరి. బాలసుందరంవంటి శతసహస్రవ్యక్తులు పీడింపబడుచున్నట్లు

హీనావస్థలలో నున్నట్లు విని మద్రాసువారుకూడ వారిపరిస్థితులనుగురించి ప్రత్యక్షఅనుభవమును సంపాదించిరి.

ఈవిధముగా ఆందోళనమార్గము గాంధిగారికి సులభమగుచుండెను. ఇంతలో గాంధిగారిని ఆఫ్రికాకు రమ్మని టెలిగ్రామ్ వచ్చెను.

గాంధిగారు కాలవిలంబనము చేయక ఆఫ్రికాకు బయలుదేరెను. మార్గములో నెటాలు చేరుటకు ముందు మహత్తరమైన తుపాను వీచెను. ఆయన దక్షిణఆఫ్రికాకు చేరినపిమ్మట ఎదుర్కొనవలసివచ్చిన తుఫానుకు ముందు సూచనగా యీతుపాను ఉండెను.

---

## 24

## ఆఫ్రికాలో

గాంధిజీ భారతదేశమునకు వచ్చినపిమ్మట దక్షిణాఫ్రికావిషయమై ఏప్రచారకార్యము ఆరంభించెనో దాని విశృతమైన అతిరంజితమైన వివరములు ఆఫ్రికాకు చేరెను. ఆయన నెటాలువాసులగు శ్వేతజాతివారిని భారతదేశములో తీవ్రముగా నిందించినట్లును, నెటాలును భారతదేశీయులచేత నింపివేయుటకు భారతీయులను ఓడలనిండా నింపుకొని వచ్చుచున్నారనియు, ఆ దేశీయులు వినియుండిరి.

తత్ఫలితముగా ఆఫ్రికాదేశ శ్వేత కాయులు గాంధి గా రి పై అత్యంతకోపోద్రిక్తులై యుండిరి. అందువలన ఆయనఓడనుండి దిగీ దిగకముందే శ్వేతకాయులు గాంధిగారిని చుట్టివేసిరి. ఈఆక్రమణవలన గాంధిగారు దారుణముగా దెబ్బలు తినిరి. ఆయనపై ఇటుకలు విసరబడెను. ఆయన ఏదోవిధముగా ఒకయింటి ఇనుపకమ్ములను పట్టుకుని నిలువబడియుండిరి. కఠినాత్ములగు శ్వేతజాతివారు అప్పటికిని తృప్తిచెందలేదు. సౌభాగ్యవశమున గాంధిగారు నెటాలు పోలీసు సూపరింటెం డెంటుగారిసహాయమువల్లను, ఆయనభార్యగారిసహాయము వల్లను రక్షింపబడిరి.

ఆరోజులలో చేంబర్లేన్ ఇంగ్లాండులో ప్రధాన మంత్రిగా నుండిరి. గాంధిజీయెడల ఇంగ్లీషువారు గావించిన అత్యాచారములనుగురించి విని న్యాయవిచారణ జరపమని తంతి పంపించెను. గాంధిగారు కోరినయెడల నేరస్తులకు విరుద్ధముగా ఫిర్యాదు చేయవచ్చునని ఆ దేశము పంపించెను. ఆఫ్రికాఅధికారులు యీవిషయములలో ఆయనకు సహా యము చేయుదురని ప్రకటించెను.

గాంధిజీ అత్యాచారులను కొందరిని గుర్తుపట్ట గలి గెను. ఆయనకోరినయెడల న్యాయశాసనసహాయముతో వారికి శిక్ష జరుగునట్లు చేయగలరు. కాని ఆయన అహింస నీతిద్వారా తనజీవితమును నడపుకొనెను. అహింస నీతి వను

సరించి ఆయన నేరస్థులను క్షమించెను. ఆయన ఎవరి విషయములోను ఫిర్యాదు చేయలేదు.

నేరస్థులను మన్నించుటకును, వారు గావించిన అన్యాయములకు ప్రతివిధానము గావించకుండుటకును తగిన సాహసము, బుద్ధి యీశ్వరుడు ఆయనకు యౌవనకాలము నందే ప్రసాదించియుండెను. నెటాలులో జరిగిన యీ సంఘటనవలన ఆవిషయము స్పష్టముగా ప్రకటితమైనది.

నేరస్థులవిషయములోగాని, అత్యాచారుల విషయములోగాని ఆయన మనస్సునం దెన్నడును క్రోధము వహించి యుండలేదు. వారిఅజ్ఞానమునకు సంకుచితత్వమునకు విచారమునే ప్రకటించియుండిరి. ఈసారికూడ అట్లే చేసియుండిరి.

అత్యాచారులకు విరుద్ధముగా ఫిర్యాదు చేయుటకు అంగీకరింపకపోవుటచే ఉత్తమఫలితమే [illegible]ంచెను. దీని వలన శ్వేతజాతివారు తమప్రవర్తనకు సిగ్గుపడిరి. వార్తాపత్రికలుకూడ గాంధిగారు నిర్దోషియని ప్రకటించెను. అత్యాచారులను నిందించెను.

తత్ఫలితముగా గాంధిగారు సత్ఫలమునే పొందగలిగిరి. భారతీయ సాంప్రదాయసిద్ధముగా వారిప్రభావప్రతిష్ఠలు ఇనుమడించెను. గాంధిగారికార్యములు సహజముః లయ్యేను. కాని భారతీయులకుగల యీప్రతిష్ఠను గాంచియు, పట్టుదలతో సంగ్రామము చేయుశక్తిసామర్థ్యము

లను పరికించియు శ్వేతజాతివారు భయమొందిరి. భారతీయుల అధికారమును తగ్గించుటకు నెటాలువ్యవస్థాపకసభలో రెండుశాసనములు ఆమోదించిరి. తత్ఫలితముగా భారతీయుల వ్యాపారమునకు చాలా నష్టము కలిగెను.

ఈశాసనములు ప్యాసగుటచేత గాంధిజీ మరల కాంగ్రెసు, భారతీయులరక్షణకార్యములో తనను సంపూర్ణముగా నియమించుకొనెను. ఆరెండుశాసనములు ఆమోదింపబడినవెంటనే భారతీయులలో మహత్తరమైనచైతన్యము కలిగెను. వారు తమ అధికారము, పరిస్థితులనుగురించి జాగరూకులైరి. వారియందు స్వాతంత్ర్యజ్ఞానము, గౌరవజ్ఞానము, మనుష్యత్వజ్ఞానము క్రమక్రమముగా వారిలో వృద్ధిపొందెను, ఈచైతన్యమునకు మూలమున గాంధిగారి సాధనయే ప్రబలమై యుండెను.

---

# సే వా వ్ర త ము

వివేకానందస్వామిగారి ఉపదేశములు గాంధిగారి హృదయమునకు ప్రబోధము కలిగించినట్లు తోచును. మార్గభారతీయులు, దరిద్రభారతీయులు, చండాలఅస్పృశ్యభారతీ

యులు, కృషిజీవులునిస్సహాయభారతీయులు. వీరిసేవయందే గాంధిజీ తనజీవితములో చరమచరితార్థతను సంపాదించు కొనిరి. అసహాయులగు మానవసంఘముయొక్క ఔన్న త్యము సుఖశాంతికొరకు ఆయన నిత్యము ప్రబలవ్యాకులత్వ మును అనుభవించెడివారు. వారిసేవలో తనను నియమించు కొనగలిగిన యెడల ధన్యుడనని తలంచువారు.

1896 వ సం॥ములో రాజకోటలోని అస్పృశ్యుల సేవలో ఆయన అగ్రేసరుడై పరమ ఆత్మతృప్తిని పొంద గలిగెనని మన మెరుంగుదుము. అనంతరము ఆఫ్రికాకుతిరిగి వచ్చినను సేవచేయు ప్రవృత్తియే ఆయన అంతరమునందు ప్రబలముగా యుండెను.

సేవచేయుటకు తగిన సుయోగముకూడ లభించెను. ఒకరోజున ఒకకుష్ఠురోగి గాంధిగారిగృహమునకు వచ్చెను. ఆయనకు కొంత ఆహారముమాత్రమే యిచ్చి పంపివేయు టకు యిష్టపడలేదు. ఆయన నొకగదియందు ఉంచి ఆయన కుష్టువ్రణములను కడిగి సేవచేసెను. పిమ్మట ఆయనను ఆసు పత్రికి పంపివేసిరి.

ఆయనలో ఉదయించిన ప్రబలమైన సేవావృత్తి సహజముగా అంతరించలేదు. ఆర్తుల పీడితుల శుశ్రూష నియమితప్రకారము చేయు ప్రేరణమును ఆయనఅనుభవించు చుండిరి. డాక్టరు బూత్ అనువారి ఆసుపత్రిలో సేవా వ్రతము నవలంబించి సేవచేసి యుండిరి. అచ్చట ఆయన

రోగులకు ఔషధ మిచ్చుచుండువారు. ఇట్టిసేవా కార్యము చేతనే భారతీయులలో ఆయనకు ఘననిబిడస్నేహ మేర్పడెను. సేవానందమువలన హృదయమునందు నిర్మలమగు శాంతిని అనుభవించెడివాడు.

గాంధిగారి యీసేవావ్రతము బెత్ లెహెమ్ మహామానవుని విషయము స్మరింప చేయుచుండును. ఏసుక్రీస్తు వలెనే కుష్ఠురోగులసంస్పర్శను తప్పించుకొనక వారిసేవ నిస్సంకోచముగా చేసియుండిరి. దరిద్రులు, పతితులు, అస్పృశ్యులు అసహాయుల యెడల చూపిన సేవా సానుభూతులే గాంధిగారిని మహామానవునిగా గావించినవి.

ఆఫ్రికా ప్రవాసకాలములో దరిద్రులయెడల, అత్యాచారితుల ఉత్పీడితులయెడల, రోగక్లిష్టమానవుల యెడల ఆయనలోగల గభీరమైన ప్రేమాతిశయములు వెల్లడియయ్యెను. దరిద్రులయెడల సహజమైన గభీరమైన సానుభూతి ప్రథమమున ఆయనలో ఆఫ్రికాలోనే అంకురితమాయెను.

ఆయనజీవితములో ప్రథమమున గభీరమైన సానుభూతి మర్దశాగ్రస్తులగు, దారిద్ర్యపీడితులగు వారిని అవలంబించియే ప్రకాశించెను. జాతివర్ణవిభేదములు లేక దరిద్రుల యెడల ఆయనకరుణ ప్రవాహమువలె ప్రవహించెడిది. సేవావ్రతముచేతనే ప్రబోధితుడై శ్రమికశిశువులు, స్త్రీల చేత ఎల్లప్పుడు పరివృతుడై యుండువాడు. నియమబద్ధశ్రమి

తిరిగి వచ్చునప్పుడు సత్యాగ్రహమును గురించి స్పష్టమైన అభిప్రాయములు ఆయనలో జాగరితమాయెను. సత్యాగ్రహముయొక్క అలౌకికమైన వ్యాపకమైనశక్తినిగురించి ఆయన జాగరూకుడాయెను. మార్గమునందు ఓడలో కూరుచుని 'హింద్‌స్వరాజ్' అను నామముతో ఒకగ్రంథమును రచించెను. ఆగ్రంథములో సత్యాగ్రహమందుకల అపూర్వశక్తికి ప్రతికూలముగా అహింసాత్మక నీతియొక్క శ్రేష్ఠత్వమును గురించి దృఢముగా వ్రాసియుంచిరి.

పశుశక్తికి విరుద్ధముగాను హింసాయుత అస్త్రముల బలమునకు ప్రతికూలముగాను, గాంధిగారి సత్యాగ్రహ సంగ్రామము ఒకప్పుడు జయమునే సాధించియుండెను. అన్యాయము, అసత్యము, అధర్మము, అస్త్రబలముచేత సమర్థింపబడియున్నను, అది సత్యన్యాయముల నిర్విరోధ సంగ్రామ సమక్షమున నిలువజాలదనువిషయము గాంధీజీయే విశ్వవాసులకు ప్రమాణము చేయగలిగిరి. ఒకప్పుడు ప్రపంచ వాసులు ఆయన సత్యాగ్రహనీతియొక్క అసార్థకతను ఊహించి నవ్వుకొనిరి. కాని దీని సార్థకత ప్రమాణము చేయబడెను. భారతదేశవాసులు సత్యాగ్రహమందుగల దుర్జయశక్తిని గ్రహించి విస్మయమొందిరి.

ఏ సత్యాగ్రహ సంగ్రామము భారతస్వాతంత్ర్య ఆందోళనమును సార్థకముగునట్లు గావించెనో, ఏసత్యాగ్రహ ఆఘాతముల చేత భారతదేశములోని పరాధీనశృంఖలములు

కులపై ఆతనుకుగల ప్రేమ అపారమైనది. ఆర్తమానవులపై ఆయనప్రేమ అపారమైనది. దారిద్ర్యపీడితుల, నిపీడితులపై గభీరమైన అనుకంప గలిగియుండిరి. మాటలకంటె కార్యములద్వారానే పీడితుల, అసమర్థుల, రోగగ్రస్తుల, అసహాయుల యెడల అపారమైన కారుణ్యమును వ్యక్తీకరించెను.

1899 వ సం॥రములో బోయరుయుద్ధము ఆరంభమైనపుడు గాంధిజీ ఆసమయములో ఇంగ్లీషుసర్కారువారికి సహాయము చేయుటకై దెబ్బలు తినినవారికి సేవాశుశ్రూషలు చేయుటకు ఒకసేవాదళమును తయారుచేసెను. యుద్ధములో దెబ్బలు తినినవారికి సేవచేయుటయే యీసేవాదళముయొక్క ప్రధానోద్దేశము. దానికి గాంధిజీ నేతృత్వము వహించెను.

భారతీయులు ఏ ఆపత్కారసమయములోను సహాయము చేయరనియు, స్వార్థపరత్వమే వారిప్రధానాశయమనియు యింతకుపూర్వము ఆఫ్రికాలోని ఆంగ్లేయుల అభిప్రాయమై యుండెను. కాని బోయరుయుద్ధసమయములో గాంధిగారి నేతృత్వముక్రింద భారతీయుల అశ్రాంతసేవాశుశ్రూషలను దర్శించే ఆఫ్రికావాసులగు శ్వేతజాతివారు కూడ భారతీయులసేవాపరాయణత్వమును ప్రశంసించిరి. రాజనీతిక్షేత్రమందు ఆఫ్రికాలో గాంధిగారికి విరోధులైయున్నవారుకూడా ఆసేవాపరాయణతను గాంచి ముగ్ధులైరి. భారతీయుల కీర్తికూడ యినుమడించెను.

1904 వ సంవత్సరములో జోహాన్సుబర్గులో దారుణమైన ప్లేగు ఆరంభమాయెను. ఆ సమయములో కూడ గాంధిజీ అపూర్వత్యాగముతో సేవాకార్యములలో పాల్గొని పనిచేసెను.

ఈ సకల కార్యములలో ఆయన కారుణ్యము, నిర్భయము అపూర్వముగా ప్రకాశించెను.

గాంధిగారి నత్వత్వముక్రింద యీ సేవాకార్యములో ప్రవేశించిన ఆఫ్రికావాసులగు హిందువులు, ముసలమానులు, పారశీకులు, క్రైస్తవులు, మద్రాసీలు, గుజరాటీలు, సింధీయులు మొదలగువారందరును భారతీయులని ఒక దృఢమైన అనుభూతిద్వారా ప్రబోధితులైరి. దీనిద్వారా ఆయన ఒకవైపున ప్రశంసనీయమైన కార్యముల ఆదర్శముల ద్వారాను ఐకమత్యమంత్రముద్వారాను, భారతీయులను దీక్షితులనుగా గావించిరి.

---

## 26

## నిగ్రహము—త్యాగశీలము

నిగ్రహము; త్యాగశీలము గాంధిజీజీవితములో మహోత్తరగుణములు. ఈ నిగ్రహ, త్యాగశీలములను ఆయన ఆఫ్రికావాసకాలమునందే ఆశ్రయించెను. ప్రథమయావ

నమునందు ఆయన భోగమయజీవితమును గడపెను. కాని అది ఏకొన్ని దినములు నిలువలేదు. మానవుడు యౌవనము నందు ఎట్టిభోగములలో నిమజ్జితుడై యుండగోరునో గాంధిజీ ఆ వయస్సులో నుండగనే త్యాగముయొక్కయు, నిగ్రహము యొక్కయు సార్థకతను గ్రహించెను. ఆయన తృషితఆత్మ భోగసుఖములలో నిమజ్జితుడై వ్యాకులపడుచుండెను. ఈ భోగములే జీవితములో పరమ, చరమ సత్యములా కాదా యనుప్రశ్నకూడ ఆయనమనస్సులో ఉదయించెను. సత్యాన్వేషియగు ఋషీశ్వరుని హృదయము సత్యాలోకముచేత ప్రకాశిత మయ్యెను. ఆ దివ్యాలోకముచేతనే జీవితములో బ్రహ్మచర్యముయొక్క సార్థకతను, త్యాగముయొక్క ఆవశ్యకతను ఆయన గ్రహించెను.

1906 వ సంవత్సరము. ఏమహామానవుడు జీవితకాలమంతయు సత్యదర్శనముకొరకు ఉన్ముఖుడై యుండెనో యీ సమయములో ఆయన పరమ చరమ సత్యమునుపొందగలిగెను. ఆయన బ్రహ్మచర్యవ్రతమును స్వీకరించెను. బ్రహ్మచర్యమును సంపూర్ణముగా పాలించుట అనగా బ్రహ్మదర్శనమేనని ఆయన గ్రహించెను. బ్రహ్మదర్శనము కొరకు దేహమును, మనస్సును శుచిగాను శుభ్రముగాను నిర్మలముగాను ఉంచుకొనుటకు సాధన ఆరంభించెను.

ఆయనకు శాస్త్రములు దేనినిప్రసాదింపలేకపోయెనో బ్రహ్మచర్యము దానిని ప్రసాదించెను. శాస్త్రములను పరి

శీలించినను, వివిధశాస్త్రగ్రంథములు మథించినను ఆయన బ్రహ్మదర్శనమును పొందలేకపోయెను. కాని బ్రహ్మచర్యమువలన ఆయన కోరినవస్తువులను పొందగలిగెను.

బ్రహ్మచర్యముద్వారా శరీరమును, బుద్ధిని, ఆత్మను రక్షించుకొనవచ్చునని తలంచిరి. ఈ అనుభూతివలన గాంధి గారికి బ్రహ్మచర్యము కఠినమైన తపశ్చర్యకు బదులుగా ఒక రసపూర్ణవస్తువుగా పరిణమించెను. దీనిద్వారా ఆయన జీవితము నడుపబడుచుండెను. బ్రహ్మచర్యపాలనము ఆరంభించినదిమొదలు ఆయన దాని సౌందర్యమును నిత్యము నూతనముగా దర్శించుచుండెను.

విశేషజాగరూకతతో గాంధిగారుజీవిత కాలమంతయు యీ బ్రహ్మచర్యపాలనము గావించియుండిరి. బ్రహ్మచర్య పాలనకు సకలేంద్రియములపై నిగ్రహమును రక్షించుకొను ఆవశ్యకతను ఆయన ప్రథమమునందే గ్రహించెను. స్వాదమును జయింపగలిగినయెడల బ్రహ్మచర్యపాలనము సులభమగునని ఆయన గ్రహించెను. ఆ కారణముచేత ఆయన శాకాహారముపై పునకు ఆకర్షింపబడెను. బ్రహ్మచారి ఆహారము అల్పముగను, పరిమితముగను, సాధారణముగాను, మసాలాలరహితముగాను, స్వాభావికమైనదిగాను ఉండవలెనని ఆయన తలంచిరి. బ్రహ్మచర్యవ్రతముఆరంభించినప్పటి నుండియు ఆయన శుష్కమైన, తాజాయైన ఫలమూలాదులపై ఆధారపడియుండువారు. బ్రహ్మచర్య పాలనకొరకై

ఆహార పరిశ్రుతిని, పరిణామమును ఆయన నియమించుకొనెను. ఉపవాసవ్రతముయొక్క ప్రయోజనమునుకూడ ఆయన యీ సమయములోనే తెలుసుకొనిరి.

బ్రహ్మచర్యవ్రతపాలనతో సరళజీవనయాత్ర ప్రణాళికనుకూడ గాంధిగారు కనిపెట్టిరి. స్వావలంబనమాహాత్మ్యమును ఆయన గ్రహించి బాల్యకాలమునందే స్వావలంబి ఆయెను.

ఈ బ్రహ్మచారితనజీవితమును, స్వావలంబిభావమును తనజీవితకాలములోసఫలత్వముతోరక్షించుకొనగలిగిరి.

---

## 27

## భారతీయకాంగ్రెసు

1900 సంవత్సరము. బోయరుయుద్ధములో కఠినమైన భాగమంతయు 1900 సం॥లో అంతమొందెను. యుద్ధకాలములో ఆహతులైనవారి సేవాకార్యములో గాంధిగారు తత్పరులై యుండిరి. యుద్ధానంతరము ఆకర్తవ్యమునుండి విముక్తుడై స్వదేశమునకు తిరిగి వచ్చు అభిలాషతోఉండిరి.

స్వదేశమునకు తిరిగి వచ్చువిషయము ఆఫ్రికాలో యున్న బంధుబాంధవులందరికిని ఆయన తెలియజేసెను. ఆఫ్రికాలోయున్న భారతీయులు ఒక షరతుతో గాంధిగారిని

విడిచిపెట్టుటకు అంగీకరించిరి. ఒకసంవత్సరములో గాంధి గారు తిరిగి ఆఫ్రికాకు రావలసిన అవసరమున్నచో తిరిగి రావలెనని కోరిరి. పిమ్మట స్నేహితులవద్ద శెలవుగైకొని భారతదేశమునకు తిరిగి వచ్చెను.

భారతదేశమునకు తిరిగి వచ్చినపిమ్మట గాంధిగారు కొంతకాలము దేశసంచారములో గడపిరి.

1901 వ సంవత్సరము—కలకత్తాలో జాతీయ కాంగ్రెసుసమావేశము జరుగనుండెను. దీనషా ఎదుల్జీ వాచా మహాసభకు అధ్యక్షులు. గాంధిగారు యీవార్త విని ఆ కాంగ్రెసుమహాసభలో పాల్గొన సంకల్పించుకొనెను. భారతీయకాంగ్రెసులో ఆఫ్రికావాసులగు భారతీయులకు ఉపకారము చేయువిషయములో విధినిషేధములు, అత్యాచారములు, అన్యాయములవిషయమై తెలియజేసి ఆ విషయములో భారతీయులను జాగరూకులనుగను, కార్యశీలురుగను చేయవలెనని గాంధిగారు ఉద్దేశించిరి.

ఆఫ్రికావాసులను భారతీయులవిషయము కాంగ్రెసులో తెలియజేయుటకై గాంధిజీ రైలుబండిలో ప్రవేశించెను. ఆయన బొంబాయినుండి వర్రైలులో ప్రయాణమాయెనో ఆ బండిలోనే ఫిరోజషామెహతా, దీనషాజీ, చిమన్‌లాల్, శీతలబాద్ మొదలైనవారుకూడ ప్రయాణము చేయుచుండిరి.

మార్గములోనే దక్షిణఆఫ్రికాను గురించి వారికి తెలియజేయవలెనని గాంధిగారు స్థిరపరచుకొనిరి.

మధ్య ఒకస్టేషనులో రైలు నిలిచిపోయెను. గాంధిజీ కంపితహృదయముతో సంకుచితభావముతో వారిపెట్టెలో ప్రవేశించెను. ఆఫ్రికాలో భారతీయుల దురవస్థలనుగురించి తెలియజేసెను. భారతీయులపై శ్వేతజాతివారు గావించు చున్న అత్యాచారములకు ప్రతికూలముగా ఒక తీర్మానము పెట్టించమని కోరెను.

గాంధిజీమాట విని ఫిరోజషా యిట్లు నుడివెను—
"గాంధి! నీ కార్యము నెరవేరదు. నీ తీర్మానమును మేము ఆమోదింపచేసెదము. కాని మన దేశములోనే మనకు న్యాయమైనది లభించునా? మన దేశములో మన కర్తృత్వము స్థాపించబడనంతవరకు ఉపనివేశములవలన మన పరిస్థితులు చక్కబడ నేరవు"

గాంధిజీ నిరాశ చెందెను.

కలకత్తాకు చేరుకుని కాంగ్రెసుప్రతినిధులతో పాటు ఆయన రిపన్ కాలేజీలో బసచేసిరి. అచ్చట కొన్నివస్తువులు ఆయన నేత్రములకు వికృతముగా కానుపించుచుండెను. అందులో అస్పృశ్యత ఒకటి. ద్రావిడపాక ప్రత్యేకముగా రహస్యస్థలమందుండెను. కాంగ్రెసుసభ్యులలో వర్ణవైషమ్యమును గాంచి ఆయన బాధపడుచుండెను. కాంగ్రెసుప్రతినిధులలో యిట్టి అస్పృశ్యతా భేదనీతిని చూచి ప్రతినిధులను

# 28

# మరల దక్షిణాఫ్రికాలో

ఆఫ్రికాలో భారతీయులపై శాసకులు ప్రతిదినము నూతనవిధినిషేధములను ఆరోపించుచుండిరి. భారతీయులపై అన్యాయాచరణములు, అత్యాచారములు జరుగుచునే యుండెను. ఇట్టిసమయములో మి: చేంబర్‌లేన్ ఆఫ్రికాకు వచ్చియుండిరి. దక్షిణాఫ్రికాపరిస్థితులను పరిశీలించుటయే ఆయన యుద్దేశ్యమై యుండెను.

భారతీయుల అభావ అభియోగములను గురించి ఆయనకు సవిస్తరముగా తెలియజేయుటకై గాంధీజీని ఆఫ్రికాకు రమ్మని ఆహ్వానము వచ్చెను.

నెటాలులో గాంధిగారు మి: చేంబర్లేన్ గారినిదర్శించి భారతీయుల దురవస్థలవిషయమై ఆయనకు మొరకపరచిరి. కాని ఈవిధముగా నివేదించుకొనినందువలన అంతగా ఫలితము లభించలేదు. గాంధిజీ నిరాశ చెందెను. ఆఫ్రికాలో మరల నూతనముగానిర్మాణకార్యక్రమము ఆరంభించవలయునని ఆయన తలంచెను. ట్రాన్స్‌వాల్‌లోకి భారతీయులప్రవేశము నిషేధింపబడెనని ఆయన ఆఫ్రికాకు చేరినపిమ్మట తెలుసుకొనెను. బోయరుయుద్ధమునకు ముందు భారతీయులు యథేచ్ఛగా ట్రాన్స్‌వాలుకు పోవుచుండువారు. కాని ఆ రోజులు మారిపోయినట్లు గాంధీజీ గ్రహింపగలిగెను. ట్రాన్స్‌వాలులో ప్రవేశించుటకు భారతీయులైనను, ఆంగ్లేసనం
ఉత్పీడన,

వేదికపై శాస్త్రిగురువులు—వీరందరిని దర్శించి గాంధిజీ తన్మయుడాయెను.

ఈ మహత్తరసమావేశములో గాంధిగారు ఒకమూల ఎవరికి పట్టనిబిడ్డగా కూరుచుని యుండెను. సంశయము, భయమువలన ఆయనహృదయము ఆందోళనము చెందు చుండెను. ఆయనతీర్మానము ఏమగునో యని భావించు చుండెను. ఎందరో వక్తలు ఎన్నిటినో తీర్మానములను ప్రసాదించుచున్నారు. ఆమోదింప చేసుకొనుచున్నారు. ఈశంఖారావములో నాక్షీణస్వరమును ఎవరు విందురని గాంధిజీ సందేహించుచుండిరి. ఇంతకుపూర్వము ఆ ఘన గోఖలేగారిని దర్శించి యుండిరి. ఆఫ్రికాను గురించిన తీర్మానము విషయమై ఆ ఘనతో మాట్లాడియుండిరి. తుదకు ఆయన సహాయముతో గాంధిగారితీర్మానము బయటికి వచ్చెను—దానిని అంగీకరించిరి.

ఈ సమయములో ఆఘనత గోఖలేగాక ఆచార్య ప్రఫుల్లచంద్రరాయి, లోకమాన్యతిలక్ మొదలగువారితో కూడ పరిచయము కలిగెను. వీరిచారిత్రమాహాత్మ్యము, జ్ఞానము, దేశభక్తి గాంచి గాంధిగారు విముగ్ధులైరి. వీరి ప్రభావముకూడ గాంధిగారిపై ప్రసరింపబడెను.

———

## 28

## మరల దక్షిణాఫ్రికాలో

ఆఫ్రికాలో భారతీయులపై శాసకులు ప్రతిదినము నూతనవిధినిషేధములను ఆరోపించుచుండిరి. భారతీయులపై అన్యాయాచరణములు, అత్యాచారములు జరుగుచునే యుండెను. ఇట్టిసమయములో మి: చేంబర్‌లేన్ ఆఫ్రికాకు వచ్చియుండిరి. దక్షిణాఫ్రికాపరిస్థితులను పరిశీలించుటయే ఆయన యుద్దేశ్యమై యుండెను.

భారతీయుల అభావఅభియోగములను గురించి ఆయనకు సవిస్తరముగా తెలియజేయుటకై గాంధిజీని ఆఫ్రికాకు రమ్మని ఆహ్వానము వచ్చెను.

నెటాలులో గాంధిగారు మి: చేంబర్లేన్ గారిని దర్శించి భారతీయుల దురవస్థలవిషయమై ఆయనకు మొరపెట్టుకొనిరి. కాని ఈవిధముగా నివేదించుకొనినందువలన అంతగా ఫలితము లభించలేదు. గాంధిజీ నిరాశ చెందెను. ఆఫ్రికాలో మరల నూతనముగానిర్మాణకార్యక్రమము అరంభించవలయునని ఆయన తలంచెను. ట్రాన్స్‌వాల్‌లోకి భారతీయులప్రవేశము నిషేధింపబడెనని ఆయన ఆఫ్రికాకు చేరినపిమ్మట తెలుసుకొనెను. బోయరుయుద్ధమునకు ముందు భారతీయులు యథేచ్ఛగా ట్రాన్స్‌వాలుకు పోవుచుండువారు. కాని ఆ రోజులు మారిపోయినట్లు గాంధీజీ గ్రహింపగలిగెను. ట్రాన్స్‌వాలులో ప్రవేశించుటకు భారతీయులైనను, ఆంగ్లేయులైనను అనుమతిపత్రము పొందవలసియుండెను.

వను ప్యాసులొనునట్లు యేర్పాటు చేయబడెను. ఆంగ్లేయులు దరఖాస్తు పంపిన వెంటనే వారికి ప్యాసు లభించెడిది. కాని భారతీయుల దరఖాస్తులు నిరాకరింపబడెడివి. ట్రిటోరియా లోని వాతావరణముకూడ ఆందోళనకరముగా ఉండెను. 'ఏషియాటిక్ విభజన' భారతీయులను పీడించుటకు ఒక యంత్రస్వరూపముగా నుండెను.

చేంబర్లేన్ గారిని దర్శించి భారతీయులహీనమైనఅవ మానకరమైన పరిస్థితులనుగూర్చి ఆయనకు తెలియజేయు నిమిత్తము గాంధిజీ ఆఫ్రికావాసులద్వారా ఆహూతులైరి. దానివలన ఎట్టిఫలితము లేకపోవుటచేతను, చేంబర్లేను ఇంగ్లాండునకు తిరిగిపోవుటచేతను గాంధిగారు చాలా సంకట ములు పడిపోయిరి.

ఒకవైపున భారతభూమిపై ఆకర్షణ— భారత దేశసేవ చేయవలయునని విశేషముగా ఆకర్షింపబడుచుండిరి. భారతదేశములోని వివిధసమస్యలు ఆయనను విశేషముగా ఆకర్షించుచుండెను. ఆసమస్యలన్నిటినిపరిష్కారముగావించి భారతదేశబృహత్తరక్షేత్రమునందు సేవచేయుటకై ఆయన మనస్సులో ప్రబలమైన కోరిక ఉదయించెను. మరియొక వైపున ఆఫ్రికాలోకూడ ఆయన నెరవేర్చవలసినకార్యము ...డెను. ఆకార్యమునుకూడ ఆయన ఉపేక్షించలేక

ఆఫ్రికాలో భారతీయుల సమక్షమునందున్న ఆపదలను లక్ష్యపెట్టక వెడలిపోయినచో ఆయన విధ్యుక్తధర్మములు అసంపూర్ణముగా ఉండిపోవునని ఆయన భావించెను. ఈకర్తవ్యములను నెరవేర్చుటకు ఆయనహృదయము విశేషముగా పరితపించుచుండెను. ఆఫ్రికాలో ఆసన్నమేఘములు తొలగిపోనంతవరకును, మేఘములద్వారా, తుపానుద్వారా వారు కొట్టుకొని పోకుండుటకు విశ్వప్రయత్నములు చేయవలసి వచ్చినను, ఈకర్తవ్యములను నెరవేర్చుటకు జీవితకాలమంతయు ఆఫ్రికాలో యుండవలసివచ్చినను ఉండిపోవుటకే సంకల్పించుకొనెను.

ఆఫ్రికాలో భారతీయనాయకులకు ఈవిషయము తెలియజేసెను. ఆఫ్రికాలో భారతీయులసేవ చేయుటకు సంకల్పించుకొని ఆయన ట్రాన్సువాలులో బ్యారిస్టరీ పనిచేయుటకు దరఖాస్తు పంపించెను. ఆయన దరఖాస్తు నిరాకరింపబడునేమోయని భయపడుచుండిరి, కాని ఆయన భయమునకు కారణమేమియు లేదు. ఆయన సుప్రీమ్‌కోర్టులో ఎటర్నీగా నియమింపబడి జోహాన్సుబర్గులో పని నారంభించెను. ట్రాన్సువాలునందున్న జోహాన్సుబర్గులో కంటె అధికముగా భారతీయులే వసించుచుండిరి. ఆయన అచ్చటనే ప్రజాసేవ చేయుటకును, అనుకూలముగా ఉండునని 1903 వ సంవ గము ఆరంభించిరి.

ఒకవిశేషవస్తువు ఆయనమనస్సునం వాడు కాదు, ఉత్పీడన,

అనంతరము 'ఏషియాటిక్ విభజన' వ్యాప్తి నిరోధించుటకే రెండుసం. వత్సరములు పట్టెను. 'ఏషియాటిక్ విభజనభారతీయులను దేశమునుండి తరిమివేయుటకును పీడించుటకును నూతనమార్గములను కనిపెట్టుచుండిరి. దక్షిణాఫ్రికా భారతీయుల ప్రవేశనిషేధమునకును, లేక వారిని బహిష్కరించుటకును ఉత్సాహముతో పనిజరుగుచుండెను. గాంధీజీ దీనిప్రతీకారమునకు దృఢసంకల్పుడాయెను.

ఆఫ్రికాలో ఉన్న భారతదేశమునకు విరుద్ధమైన శాసనముల వర్ణవిద్వేషకమూలకమై యుండెను. భారతీయులు ఓటు నివ్వజాలరు. వారికొరకు నియమింపబడిన గృహస్థలము తప్ప బయట ఎక్కడను స్థలము కొనకూడదు——ఇట్టిశాసనముండెను. 'ఏషియాటిక్ విభజన' ఈసమయములో యీశాసనములను అత్యుగ్రాలా అమలు జరుపుచుండెను.

బోయరుయుద్ధసమయములో గాంధీజీ ఆదేశానుసారముగా శ్వేతజాతివారికిని, భారతీయులకును జరుగుచున్న భా[illegible]ము విలిపివేయబడెను. అప్పుడుభారతీయులు యుద్ధసేవా ఆకర్ష[illegible] నిమగ్నులై యుండిరి. అనుకూలముగా ప్రవ భారతదేశ[illegible]సాభాజనులైరి. కాని యుద్ధము ముగిసిన మనస్సులో [illegible]ములకష్టములు తొలగిపోక వృద్ధియగు వైపున ఆఫ్రికాలో సహాయపడినందులకు ఎట్టిఫలిత[illegible]డెను. ఆకార్య[illegible]ద లేకపోయిరి. పైపెచ్చు ఈసమయ

జ లో 'ఏషియాటిక్ విభజన' యన్నట్లు స్పష్టముగా చెప్పు చుండెను. ఇంతకు పూర్వము ట్రాన్సువాల్ సర్కారువారు ఏషియాటిక్కు విరుద్ధముగ పరోచట్టములను ఆమోదించి యుండిరి. అవి అంత కఠినమైనవి కావు. నియమబద్ధమైనవి కూడ కావు. ఆఫ్రికావాసులు ఆసియావాసులను నియమ బద్ధము చేయుటకును, వారి అధికారములను తగ్గించుటకును, నియమబద్ధమైన కుట్ర జరుగుచుండెను. గాంధిజీ యీవిష యమును గ్రహించెను.

భారతీయుల, ఆసియావాసుల అధికారమును తగ్గించుటకు మూలకారణము ఆర్థికమైనది. భారతీయులు యథేచ్ఛగా ట్రాన్సువాలులో ప్రవేశింపగలిగిన యెడల, ఇష్టమున్నస్థానములో వ్యాపారము సాగించుకొనగలిగిన యెడల ఇంగ్లీషువ్యాపారస్తులకు విశేషనష్టము కలుగునని వారు భావించుచుండిరి. ఏషియాటిక్ విభజన వారి యీహేతువును, ఇతర కారణములను చూపించి వారు తమ అధికారమునకు భంగము కలుగకుండా చుండిరి. విభజనవారు స్వార్థాన్వేషులుగా అనుకూలముగా సహాయపడుచుండిరి.

గాంధిగారు యీవిషయములో ఆయన నిష్క్రియత్వము వహించలేదు.

---

# సత్యాగ్రహము—దానిపరిణామము

1906 వ సంవత్సరములో ట్రాన్స్వాల్ సర్కారు వారు విశేషమైన జరూరైన బుల్లెటిన్ ప్రతిని ప్రకటించిరి. ఈప్రతిలో 'ఏషియాటిక్ ఎమెండుమెంటు, ఆర్డినెన్సు' చిత్తు ప్రకటితమైయుండెను. ఈ చట్టములో భారతీయులఅధికారమును సంపూర్ణముగా తగ్గించు ప్రతిపాదన యుండెను. ఈచట్టముయొక్క ఉద్దేశము యిట్లు ఉండెను— "భావి కాలమున భారతీయులేగాక ఆసియావాసులందరును దక్షిణాఫ్రికాలో ప్రవేశించుటకు వీలులేదు. ఇంతకుపూర్వమునుండి ట్రాన్స్వాలులో వసించుచున్నవారిని బహిష్కృతము గావింపనియెడల, వారు నేరస్థులవలె అవమానిత జీవితమును గడుపవలసియుండును.

చుండె భారతీయుల ఆసియావాసుల అధికారమును, మనుష్య
త్వ, మర్యాదను న్యూనపరచుచట్రములు ట్రాన్సు
గా జరుగుచున్నప్పుడు నెటాలులో జులువిప్లవము
భా ము నిలిచిపోయె. నెటాలుతో గాంధిగారికి యిదివరకె
అక నిమస్థుయుండెను. కావున ట్రాన్స్వాల్
భారత దేశ నా ఖాఇండ్ మెంటు ఆర్డినెన్సు, కు విరుద్ధముగా
మనస్సులో ములకమును తాత్కాలికముగా విరమించి
నైపున ఆఫ్రికాలో జరుగు జులువిప్లవములో సేవచేయుటకై
డెను. ఆకార్య రి.

ఈవిప్లవములో దెబ్బలు తగిలినవారికి శుశ్రూష చేయు నిమిత్తము సేవాదళము నొకదానిని నిర్మించుటయే గాంధిగారి ఉద్దేశ్యమై యుండెను. 25 గురుతో ఒకసేవాదళము ను ఆయన తయారుచేసెను. ఈదళము చిన్నదైనను దీనిలో భారతదేశములోని సకలప్రదేశములవారును ఉండిరి. ఈదళమువారు మాత్రమే తమను సేవాకార్యములలో నియమించుకొనిరి. ఈసేవాకార్యములో నిమగ్నమైయున్నప్పుడు గాంధిజీ హృదయమునం దపారానందము ననుభవించుచు సేవాకార్యములో జీవనసార్థకతను గ్రహింపగలిగెను.

సేవాకార్యములలో నిమగ్నమైయున్నప్పుడు గాంధిగారిహృదయములో విశేషమైన కొన్నివిషయములు ఉద్భవించెడివి. ప్రథమతః—సేవాధర్మి బ్రహ్మచారిగా ఉండవలయును. ద్వితీయతః— సేవాధర్మమును స్వీకరించినయెడల దారిద్ర్యమునుకూడ శాశ్వతముగా వరింపవలసియుండును. బ్రహ్మచర్యము, దారిద్ర్యము—యీరెంటిని సేవచేయువానిని సార్థకతచే నలంకరింపజేయును. ఈవిషయమును ఆయన విప్లవసమయములో గ్రహింపగలిగెను. బ్రహ్మచారి, దారిద్ర్యవ్రతధారి సేవచేయుటలో ఎట్టిసంకోచమును అనుభవించడు.

గాంధీజీజీవితములో అనేకసారులు ఒకవిశేషవస్తువు కాన్పించుచుండెడిది— ఉత్పీడకులపై ఆయనమనస్సునం దెట్టి ద్వేషభావమును వహించియుండెడివారు కారు. ఉత్పీడన,

నేటాలు గవర్నరు ఆయనకు హృదయపూర్వకకృతజ్ఞతను బహిరంగసభలో వెల్లడిచేసెను.

గాంధీజీ జులుతిరుగుబాటు సమయములో నేటాలులో సేవా కార్యములలో నిమగ్నుడై యున్నప్పుడు ట్రాన్సువాలుకు తిరిగి రమ్మని పలువురనుండి ఆహ్వానములు వచ్చుచుండెను. విప్లవము ఆగిపోయెను—గాంధీజీ అన్యాయ అసత్యములకు విరుద్ధముగా సత్యాగ్రహము సాగించవలెనని చేయుచున్న ఆలోచనములను మూర్తీభవింపచేయు నుద్దేశముతో ట్రాన్సువాలుకు తిరిగి వచ్చెను.

ట్రాన్సువాలుకు తిరిగి వచ్చిన తరువాత భారతీయుల అధికారములను తగ్గించుటకు ఆమోదింపబడిన బిల్లును విశేష జాగ్రత్తతో పరిశీలించుచుండెను. ప్రవర్తనా చిత్రము ప్రత్యక్షముగా దర్శించి గాంధీజీ ఆశ్చర్యాన్వితుడాయెను. బిల్లులో భారతీయులపై విద్వేషము తప్ప మరేమియు కానుపించలేదు. ఈబిల్లు ఆమోదింపబడి భారతీయులు దానిని శిరసా వహించినచో భారతీయులు ఆఫ్రికానుండి శాశ్వతముగా తరుమబడుదురని స్పష్టముగా గ్రహించెను. ఈబిల్లులో భారతీయులచావుబ్రతుకులప్రశ్న యిమిడియున్నదని ఆయన స్పష్టముగా అర్థము చేసుకొనిరి.

గాంధీజీ యిక నిర్లిప్తుడై యుండలేకపోయెను. అన్యాయమునకు విరుద్ధముగా ఆయనహృదయములో విప్లవము బయలుదేరెను. ప్రథమమున ఆ వేదనని వేదనముల

ద్వారా బిల్లును ఉపసంహరింపుమని కోరుటకు సంకల్పించుకొనెను. కాని యంత వ్యర్థమునొందినచో నిశ్చేష్టుడై యుండజాలనని సంకల్పించుకొనెను. ఈ ప్రత్యక్షసంగ్రామములో ప్రవేశింప సంసిద్ధులై యుండిరి.

ఆఫ్రికాలో భారతీయులపై బహుదినములనుండి అన్యాయఅత్యాచారములు జరుగుచుండుట చూచి ఎన్నో వేదన ననుభవించుచున్నాడు. ఆయన గావించిన నిరంతర కృషిచేత ఆఫ్రికాలోని భారతీయులు మేలుకొనిరి. ఈసారి యీప్రబుద్ధభారతీయులను వెంట నిడికొని ప్రత్యక్షసంగ్రామములో దుముకుటకు ఆయన సంకల్పించుకొనెను.

'ఏషియాటిక్ చట్టము' లో భారతీయుల అగౌరవ అవమానదాసత్వముల శాశ్వతరూపము దాల్చునట్లు స్పష్టముగా వ్రాయబడియున్నది. ఆ కారణముచేత విజయమో లేక వీరస్వర్గమో అనుదీక్షపూని యీ ఘాతుకశాసనమునకు విరుద్ధముగా సంగ్రామములో ప్రవేశించిరి. ఈ శాసనము ఘోరాగ్నివలె నిర్దయముగా భారతీయుల సకలస్వార్థసన్మానములను మంటగలుప గోరుచుండుటచే "ఘాతుకశాసనము" అని గాంధిగారు దీనికి నామకరణము చేసిరి.

గాంధిగారు పక్షమున ఆఫ్రికాలోని నాయకులైన భారతీయులందరిని ఆహ్వానించి యీ అవమానకరమైన శాసనముయొక్క తాత్పర్యమును అందరికిని తెలియజేసెను.

గాంధీజీ నోటినుండి శాసనమునుగూర్చి వినుచున్న వివి గాంధీజీవలెనే యితర భారతీయు లందరును అవమానముచేత క్రోధముచేత చంచలులైరి. ఆఫ్రికానుండి భారతీయుల అస్తిత్వమును సహా లోపింపచేయుటయే యీశాసనము యొక్క యుద్దేశమని అందరును గ్రహించిరి. ఈశాసనమే అంత్యశాసనము కాదనియు, దక్షిణాఫ్రికానుండి భారతీయులను తరిమి వేయుటకు యిది ప్రథమవ్యవస్థయనియు అందరును గ్రహించిరి. ప్రతిపాదింపబడిన యీశాసనములో కేవలము ఆఫ్రికావాసులగు భారతీయులను అవమానించుటయేగాక సకలభారతదేశవాసులను కూడ అవమానపరచుటయే యైయున్నది. అనువిషయమును అందరును గ్రహించిరి. గ్రహించి ఆయవమానమునకు ప్రతీకారము చేయ సంసిద్ధులైరి. కాని గాంధిజీ ఉద్రిక్తజనసమూహమును శాంతింపమని కోరెను. అసహిష్ణులై క్రోధోన్మత్తులై, జ్ఞానశూన్యులై సంగ్రామము నారంభించినయెడల ఆసంగ్రామములో మనకు పరాజయమో అవమానమో కలుగవచ్చును, అని నుడివిరి. కాని ప్రశాంతభావముతో ప్రతీకారమును నిర్ణయించి అనుకూలసమయములో ప్రతిఘటించినయెడల, అందరము ఏకమై అవమానమునకు విరుద్ధముగా నిలువబడి సకలదుఃఖములను సహింపగలిగినయెడల, ఈశ్వరుడు మనకు సహాయము చేయునని నుడివెను.

ప్రభుత్వపు జైలు అధికారుల ద్వారా దెబ్బలు తినవలసి యుండును. ధనధాన్యములను పోగొట్టుకొనవచ్చును. దేశ బహిష్కృతులము కావలసివచ్చును. ఆకలిచేత, జైలు కష్టములచేత పీడింపబడవచ్చును. కొందరు ప్రాణములను సహితము పోగొట్టుకొనవచ్చును. ఎన్నెన్ని దుఃఖకష్టములను మీరు ఊహించుకొనగలరో అన్నిటిని భరింపవలసి యుండును. దీనియందు అసంభవమైన దేదియు లేదు.”

ఈవిధముగా యీసభలోనే సత్యాగ్రహనీతినిగురించియు, సత్యాగ్రహులు భరింపవలసిన అత్యాచారములను గురించియు గాంధిగారు వ్యాఖ్యానముచేసిరి. అప్పటికి యింకను ‘సత్యాగ్రహము’ అనేనామము ఉదయించలేదు. అన్యాయ అసత్యములకు విరుద్ధనీతివిషయమై తగిననామమును సూచించుటకు గాంధిగారు తమపత్రికయైన ‘ఇండియన్ ఒపినియన్’ లో ఒకబహుమానమును ప్రకటించిరి. బహుమాన పోటీదార్లు నామకరణవిషయములో అనేక నామములను సూచించిరి. లభించిన నామములలో ‘సదాగ్రహ’ అను నామమును గాంధిగారు ఎన్నుకొనిరి. ఈసదాగ్రహ అను నామమునే గాంధిగారు పిమ్మట ‘సత్యాగ్రహము’ గా మార్పుచేసిరి.

గాంధిగారు యీసమయములోనే అహింసానీతిమూలకమైన సంగ్రామములోగల మహత్తరశక్తినిగురించిన పరిచయమును పొందిరి. సత్యాగ్రహములో విరోధపక్షము

వారికి కష్టమును కలిగించు అవకాశము లవలేశమైనను లేదు. తాను స్వయముగా సుఖములను సహించి, దుఃఖములను భరించి విరోధులను వశీభూతులను గావించుకొనెడిశక్తియే అత్యంతావశ్యకము. ఈతత్వదర్శనము గాంధిగారికి ఆరోజుల లోనే లభించెను. ఈసిద్ధాంతమునకు మూలకారణము టాలస్టాయిగారి ప్యాసివ్ రెసిస్టాన్స అనునీతిప్రభావమై యుండెను.

'ఘూనిక శాసనము' నకు విరుద్ధముగా ఆందోళన మారంభింపబడెను. ప్రతినిధిమండలికి నాయకుడై గాంధిజీ ఇంగ్లాండునకు పయనమై పోయెను. ఉపనివేశ కార్యదర్శితో చాలాసేపు సంభాషణ జరిగియుండెను. కాని ఫలితమేమియు కానుపించలేదు. భారతీయుల అవమానకరమగు పరిస్థితులకు ఎట్టి ప్రతీకారము కలుగలేదు.

గాంధిజీ ఆఫ్రికాకు తిరిగి వచ్చిరి. శాసనము ఆమోదింపబడెను. శాసనానుసారముగా ట్రాన్సువాలులో వసించుటకు భారతీయులందరును నూతనముగా సర్కారుపుస్తకములలో తమనామములను వ్రాయించవలయునని ప్రకటింపబడెను. గాంధిజీ అప్పుడు భారతీయులకు నాయకుడు. ఆయన సంస్ఫూర్తిచేత, ఆదర్శముంచేత భారతీయుల ఆత్మగౌరవము జాగృత మాయెను. అందువలన ఎవరును పేరులు వ్రాయించలేదు. ఇప్పుడే ప్రథమమున సత్యాగ్రహము ఆరంభమాయెను. గాంధిగారును, ఇంకా రెండువందలు ప్రజలును కారాగారములో పెట్టబడిరి. ట్రాన్సువాలులో ఆనాటి శాసన

కర్త జనరల్ స్మట్సు. ప్రజలు స్వేచ్ఛాపూర్వకముగా తమ నామములను రిజిస్టరీ చేయించుకొనినయెడల ఆశాసనము రద్దుచేయబడునని జనరల్ స్మట్సు గాంధిగారితో రాజీ కుదుర్చుకొనిరి. గాంధిగారు అందులకు అంగీకరించిరి. కాని స్మట్సు ప్రతిజ్ఞనునిలుపుకొనలేకపోయెను. భారతీయులు నామములను రిజిస్టరు చేయించుకొనిరి. కాని శాసనము రద్దు చేయబడలేదు. అప్పుడు మరల సత్యాగ్రహము ఆరంభమయ్యెను. భారతీయులగౌరవరక్షణకొరకు ప్రజాసేవలో జీవితమును సమర్పించుటకొరకు నిర్ణయించుకొని గాంధిగారు యీసమయములోనే వకీలుపనికి స్వస్తి జెప్పిరి.

స్మట్సు ప్రతిజ్ఞాభంగమునకు ప్రతికూలముగాను, భారతీయులస్వాతంత్ర్యసత్త్వాను అభికాంక్ష స్థిరపరచుసంకల్పముతోను గాంధిగారు సత్యాగ్రహాందోళనమును ఆరంభించినారు. తత్ఫలితముగా ఆయన వరుసగా మూడుసార్లు కారాగారములోకి త్రోయబడిరి. ఆయనకు కారాగారములో తివక్లాసు నిర్ణయించిరి. ఆయనను కాళ్ళుచేతులు కట్టి ఒకసారి పంజరములో పారవైచిరి.

కాని గాంధిగారు సర్వవిధములైన అవమానములను సహించిరి. ఆయన విశ్వాసములో ఎట్టిపరివర్తనము కలుగలేదు. ప్రతిసారియు అన్యాయములతో, అసత్యములతో సంగ్రామము గావించుశక్తి ప్రబలతరమగుచుండెను.

నమునకు ప్రతికూలముగా సంగ్రామము నారంభించెనో అది నష్టము పోయెను.

గాంధీజీ ఆరంభించిన యీ సత్యాగ్రహమును కీర్తించుచు మహాపండితులు గోఖలే గారు యిట్లనుడివియుండెను. "అపారమైన శౌర్యము, మహత్తరమైన ఆత్మయొక్క ఐంద్రజాలిక శక్తులు ఫలించినవి. ప్రశాంతిశక్తి సమక్షమున హింసాయుతబలము నశ్యమైపోయినది. భారతీయుల ఆశా ఆకాంక్షలకు ప్రబలశత్రువు జనరల్ స్మట్సు. ఆయన 1906లో శాసనగ్రంథమునుండి భారతీయులకు ప్రతికూలమైన యీ శాసనమును ఎంతమాత్రము తొలగింపనని ప్రకటించెను. అట్టివారు అయిదుసంవత్సరములపిమ్మట సంతోషముతో దీనిని తొలగించిరి.

ఏమి భారతీయులు స్వతంత్రశ్రమికులుగా దక్షిణాఫ్రికాలో నుండగోరుదురో అట్టివారు ఆఫ్రికాలో గౌరవముతో నుండుటకు అనుమతి యివ్వబడినట్లు 1941 వ సంవత్సరములో ఒక్కబిల్లు ఆమోదింపబడెను. ఈవిధముగా గాంధిగారి అప్రతిహత సత్యాగ్రహసంగ్రామము సార్థకమయ్యెను.

భారతస్వాతంత్ర్యసంగ్రామము అసాధారణత్యాగము వలన శక్తిని సంపాదించినట్లు ఆఫ్రికాసంగ్రామములోకూడ త్యాగము, నిష్ఠ, సహిష్ణుతలే సత్యమును ప్రతిష్ఠితముగావించెను. దీనికొరకు వేలకొలది భారతీయులు కారాగారమును

వరించిరి. గాంధిపక్షమున కారాగారమున క్రుగ్గిపోయిరి. అసంఖ్యాకులైన భారతీయుల కొరకు కారాగారములలో స్థానము చాలకపోవుటచే వారు గనులలో బంధింపబడిరి. కాని ఈసంగ్రామమువలన సమస్తప్రపంచములోని నాడులన్నియు కంపించిపోయెను. భారతదేశములో దీనిపై సానుభూతి జాగరితమాయెను. భారతదేశములోని గవర్నర్ జనరల్ ప్రజాభిప్రాయ ప్రోత్సాహముచేత దక్షిణాఫ్రికాలో సర్కారువారు కావించిన కార్యములకు తన అసమ్మతిని తెలియజేసెను. తత్ఫలితముగా భారతీయుల స్వాతంత్ర్య సత్తావాగౌరవములు సుపరిక్షితము లయ్యెను.

ఇంతలో 1913 వ సంవత్సరములో గాంధిగారు తృతీయసత్యాగ్రహమును ఆరంభించిరి. ఈఆందోళనము ట్రాన్సువాలులోని 'ఘాతుకశాసనము' ను గురించి కాదు. ఇది నేటాలులో ఒకసంఘటనగురించి ఉత్తమ నేటాలు గనుల ప్రాంతములలో 3 పౌండ్లు 'జిజియా' పన్నుకు ప్రతికూలముగా ఆరువేల పారిశ్రామికులు ప్రబలమైన సమ్మెనారంభించిరి. ఆసమ్మెదారులు గాంధిగారి సహాయమును కోరుటకు నేటాలులో న్యూక్యాసల్ పట్టణములో సమావేశమయిరి.

గాంధిజీ చిరకాలము అన్యాయ అసత్యములకు విరుద్ధముగా సంగ్రామములను సాగించియుండిరి. సమ్మెదారులలో న్యాయసత్యములున్నవని గ్రహించి వారి ఆహ్వానమునకు

తను సమాధానమిచ్చిరి. వారికి నాయకత్వము వహించుటకు సంసిద్ధులైరి.

కాని నేతృత్వమునువహించి ఆయన మహాసమస్యలను ఎదుర్కొనవలసివచ్చెను. ఇంతమంది సమ్మెదారులకు ఆయన ఆశ్రమము ఎచ్చట యియ్యగలరు? వారికి ఆహార మెట్లు? ట్రాన్సువాలులోని 'ఘాతుక శాసనము' నకు విరుద్ధముగా ఆయన ఏసంగ్రామమును ఆరంభించియుండెనో ఆసంగ్రామమునకు చెందిన సత్యాగ్రహులు టాల్‌స్టాయిఆదర్శములతో స్థాపింపబడినఫినిక్సుఆశ్రమములోవాసముచేయువారు. అచ్చటవుండి సత్యాగ్రహయాత్రకు తయారగుచుండువారు. కాని నెటాలుసమ్మెదారులకు ఆయన ఆశ్రయ మెచ్చట యియ్యగలరు? వారిని ఎచ్చటవుంచి సత్యాగ్రహమంత్ర కూలీలను ఉత్తేజితులనుగా చేయగలరు?

నెటాలుపారిశ్రామికులను నడపించుకొని ట్రాన్సువాలుకు తీసికొనిపోవుటకు ఆయన స్థిరపరచుకొనెను. అచ్చట వారు కారాగారములో త్రుంచబడినను అనాహారమునుండి బ్రతికిపోదురు, ఆశ్రయమును పొందుదురు.

2037 గురు పురుషులు, 127 గురు స్త్రీలు, 75గురు శిశువులు గల జనసమూహము గాంధిగారి నేతృత్వమున నెటాలుసర్కారువారికి తెలియజేసి నెటాలునుండి ట్రాన్సువాలువైపునకు ప్రయాణము సాగించిరి.

గాంధీగారు యిరువదిసంవత్సరములు ఆఫ్రికాలో సత్యాగ్రహ ఆందోళనమును నడిపియుండిరి. ఈసంగ్రామము జయప్రదముగా సఫలీకృతమగుటకు గాంధీగారిత్యాగము నిష్ఠ, దృఢత్వము అసాధారణముగా కార్యము లొనర్చెను. ఏమంత్రశక్తివలన ఆయన ఆఫ్రికాదేశవాసులను దీక్షితులను గావించెనో, ఏశక్తివలన వారిని ప్రబోధితులనుగా గావించెనో ఆశక్తి అపరిమేయమైనది. అందువలన దానిని నిరోధింపగల శక్తి సామ్రాజ్యవాదులకుగాని, స్వార్థాన్వేషులకుగాని లేదు.

---

## 30

## టాల్స్టాయి ఆశ్రమము

1909 వ సంవత్సరములో గాంధీజీ ఆఫ్రికాలోని నిపీడిత భారతీయుల ప్రతినిధిరూపమున ఇంగ్లాండుకు ప్రయాణమైపోయిరి. ఈసమయమునుండియే అపరిమితమైన సంగ్రామసత్యాగ్రహముల సమర్థనీయమైన శక్తియొక్క మహిమను ఆయన విశేషముగ గ్రహించుట కారంభించిరి. ఇంగ్లాండునుండి ఆయన ఏ శుభవార్తను తీసుకొనిరాని మాట వాస్తవమే. సర్కారువారికి తెలుపుకొనిన ఆవేదన నివేదనములు వ్యర్థమైనమాట నిజమే. కాని స్వదేశమునకు

తిరిగి వచ్చినప్పుడు సత్యాగ్రహమును గురించి స్పష్టమైన అభిప్రాయములు ఆయనలో జాగరితమాయెను. సత్యాగ్రహముయొక్క అలౌకికమైన వ్యాపకమైనశక్తినిగురించి ఆయన జాగరూకులాయెను. మార్గమునందు ఓడలో కూర్చుని 'హిం-ద్‌స్వరాజ్' అను నామముతో ఒకగ్రంథమును రచించెను. ఆగ్రంథములో సత్యాగ్రహమందుగల అపూర్వశక్తికి ప్రతికూలముగా అహింసాత్మక నీతియొక్క శ్రేష్ఠత్వమును గురించి దృఢముగా వక్కాణించిరి.

పశుశక్తికి విరుద్ధముగాను హింసాయుత అస్త్రముల బలమునకు ప్రతికూలముగాను, గాంధిగారి సత్యాగ్రహ సంగ్రామము ఒకప్పుడు జయమునే సాధించియుండెను. అన్యాయము, అసత్యము, అధర్మము, అస్త్రబలముచేత సమర్థింపబడియున్నను, అది సత్యన్యాయముల నిర్విరోధ సంగ్రామ సమక్షమున నిలువజాలదనువిషయము గాంధీజీయే విశ్వవాసులకు ప్రమాణము చేయగలిగిరి. ఒకప్పుడు ప్రపంచవాసులు ఆయన సత్యాగ్రహనీతియొక్క అసార్థకతను ఊహించి నవ్వుకొనిరి. కాని దీని సార్థకత ప్రమాణము చేయబడెను. భారతదేశవాసులు సత్యాగ్రహమందుగల దుర్జయశక్తిని గ్రహించి విస్మయావిష్టులైరి.

ఏ సత్యాగ్రహ సంగ్రామము భారతస్వాతంత్ర్య ఆందోళనమును సార్థకమగునట్లు గావించెనో, ఏసత్యాగ్రహ ఆఘాతములచేత భారతదేశములోని పరాధీనశృంఖలములు

విచ్ఛిన్నములై పోయినో, ఆ సత్యాగ్రహ శక్తి మహాత్మ్యమును గాంధిగారు ఆఫ్రికావాసులగు భారతీయుల కొరకు సంగ్రామమును ఆరంభించిన పిమ్మట తన హృదయాంతరాళమందు అనుభవించెను.

ఆఫ్రికాలో అవమానితులైన భారతీయుల అవమాన నివారణ కొరకు ఏ శక్తి పరీక్షింపబడెనో, ఏ శక్తి ప్రథమమున ప్రయోగింపబడెనో, సకల భారతదేశమునందు ఆ శక్తినే ప్రయోగింపబడెను. ఆఫ్రికాలో యిది సార్థకపడెను. ఆఫ్రికాలో యిది సార్థకపడుటచేత దీని యెడల గాంధిగారికి దృఢవిశ్వాసము, అచంచలశ్రద్ధాభక్తి అభివృద్ధిచెందెను.

ఈ విశ్వాసము, శ్రద్ధ ఒక్కదినమైనను మ్లానము కాలేదు. సంశయములచే నాచ్ఛన్నము కాలేదు.

గాంధిజీ తన దేశవాసులను యీ సత్యాగ్రహ సంగ్రామములో సైనికులనుగా ఎట్లు తయారుచేయగలిగిరో ఆలోచించిన నాశ్చర్యము కలుగక మానదు.

సత్యాగ్రహ సంగ్రామములో తయారగుటను, యీ ఆందోళనమును సార్థకపరచుటకును, ఆఫ్రికాలో 1910 వ సంవత్సరములో టాలస్టాయి ఆశ్రమము అను పేరుతో ఒక ఆశ్రమమును స్థాపించెను. భారతదేశములో సబర్మతీ ఆశ్రమము స్థాపించి సత్యాగ్రహులను తయారుచేయుటకు భావి సూచన యీ టాలస్టాయి ఆశ్రమములో చేయబడినది. ఈ

ఆశ్రమమును ప్రతిష్ఠించిన తరువాత గాంధీజీ బ్రహ్మచర్యవ్రతమును స్వీకరించెను. సత్యాగ్రహులు యీ ఆశ్రమమున నుండువారు, త్యాగమంత్రముతో, స్వావలంబనమంత్రముతో దీక్షను గైకొనుచుండువారు.

సత్యాగ్రహులను ఒకచోట సంఘబద్ధము కావించి యుంచుటకును, సత్యాగ్రహాందోళనమును శక్తివంతము గావించుటకును, గాంధీజీ బహుదినములనుండి యిట్టి ఆశ్రమమును స్థాపించవలెనని సంకల్పించుకొనియుండిరి. ఆఫ్రికానుండి భారతీయుల గౌరవమును, స్వాతంత్ర్యమును విలుప్తముగావించుటకు జనరల్ స్మట్సు, ఆఫ్రికాదేశ ఆంగ్లేయులు ఏ కఠినమనోభావమును పోషించుకొనుచుండిరో, దానితో సంగ్రామము చేయుటకు శక్తిని సంపాదించవలసిన అవసరమేతెంచెను.

జనరల్ స్మట్సునకు, ఆంగ్లేయులకు హింసాత్మకమైన అస్త్రములుండెను. కావున సంగ్రామలో దీర్ఘకాలము సాగుననుట నిశ్చయము. ఈదీర్ఘకాలస్థాయియగు సంగ్రామమును సాగించుటకు ఆర్థికప్రయోజనముకంటె ఆత్మబలము చారిత్రబలము అత్యంతప్రయోజన మనువిషయము గాంధిగారు యీసమయమున గ్రహించిరి. గాంధీజీ సత్యాగ్రహ ఆందోళనము ఆరంభించబోయి దానవశక్తితో యుద్ధము చేయవలసియుండునని తలంచెను. సత్యన్యాయములను అస్త్రములతో వారు యుద్ధముచేయవలసియున్నది. కావున వారికి

సత్యాగ్రహుల నందరిని ఏకముగా నుంచుటకు స్థలాన్వేషణములో గాంధీజీ నిమగ్నులై యుండిరి. వారిని పట్టణములో ఉంచుట అంతసులభముగా కనుపించలేదు. దానివలన వ్యయ మధికమగుటయేగాక సరళమైన అనాడంబరమైన జీవనయాత్రకు అనుకూలముగా నుండదు.

గాంధీజీ ఫినిక్సులో స్థాపించిన ఒక ఆశ్రమ ముండెను. ఇచ్చటినుండియే గాంధీజీ "ఇండియన్ ఒపీనియన్" అను పేరుతో ఒక పత్రికను ప్రకటించుచుండిరి. అచ్చట వ్యవసాయముకూడ చేయబడుచుండెను. ఇతరములైన అనుకూల్యములుకూడ అచ్చట ఉండెను. కాని జోహాన్సుబర్గునుండి 300 మైళ్ళదూరము సంభవించుటచే నిచ్చట సత్యాగ్రహుల శిబిరమును స్థాపించలేదు. ట్రాన్సువాలులోను, జోహాన్సుబర్గుసమీపములోను కాలెన్‌బేక్ 1100 ల యకరముల భూమిని క్రయము చేసియుండిరి. అచ్చట సత్యాగ్రహ శిబిరమును స్థాపించుటకు గాంధీజీకి ఆస్థలము ఒసగబడెను.

ఆ భూమిలో ఫలవనములు, జలస్రోతస్సులు ఉండెను. జోహాన్సుబర్గునకు ఇది 21 మైళ్ళదూరములో యుండెను. ఇచ్చట గృహములను నిర్మించి సత్యాగ్రహులను, వారి కుటుంబములను ఉంచుటకు నిర్ణయింపబడెను. ఆత్మనిర్భరశీలమైన ప్రతిష్ఠానము టాల్‌స్టాయిఆశ్రమము అను పేరుతో స్థాపింపబడెను. సత్యాగ్రహులు యీ ఆశ్రమములో వసించుచుండిరి. తమ జీవితమును సత్యాగ్రహ ఆదర్శములతో

తయారుచేయుట. సాక్షాత్కారము [illegible] త్యాగము, విద్య, స్వావలంబనము, కష్టసహనము, వారి జీవనవ్రతములై యుండెను. సత్యాగ్రహులను విశ్వాసపాత్రులనుగా భావించుటకును, త్యాగము, స్వావలంబనము, కష్టసహనములను మహాప్రతిజ్ఞలలో చేర్చుటను భావించి సత్యాగ్రహులను శక్తివంతులుగ చేయవలెనని తలంచెను, గాంధీజీ సహనాతీతమగు నిరంతర పరిశ్రమను గాంచి మెచ్చుకొనెను. గాంధీజీ ఆరంభించిన యీ ఆందోళనమును, స్వావలంబ ఆదర్శములను ఆశీర్వదించుచు ఋషి టాల్‌స్టాయి గాంధీజీకి నొక లేఖను వ్రాసియుండెను. గాంధీజీకి టాల్‌స్టాయి వ్రాసిన యుత్తరము దేశదేశాంతరములలో వెల్లడి ఆయెను.

టాల్‌స్టాయి ఆశ్రమమువంటి ఆశ్రమమును స్థాపించుటలో సత్యాగ్రహుల కుటుంబములను కార్యములలో నియమించుట, వ్యయము తగ్గించుట, స్వావలంబులగుట యివియే యుద్దేశ్యములై యుండెను. వారు యీవిధముగా తయారైనచో అధికారప్రమత్తులగు సర్కారువారికి ప్రతికూలముగా ఎంతకాలమైనను యుద్ధము చేయగలరని తలంచెను.

టాల్‌స్టాయి ఆశ్రమము ఒకమహత్తరకుటుంబమువలె నుండెను. అచ్చట గాంధీజీ పితృరూపముదాల్చి యుండెను. యువకుల విద్యావిషయిక బాధ్యత, వారిజీవనయాత్ర [illegible] శ్రమనిర్మాణము, శారీరకఆరోగ్యరక్షణ, ఆత్మిక[illegible]

పాదనము — యీ సకలవిషయములలో బాధ్యతను ఆయనరే స్వీకరించెను.

ఆశ్రమములో నౌకరులు లేరు. పాయ్‌ఖానా పరిశుభ్రము చేయుట మొదలుకొని వంట చేయువరకుగల పనులన్నియు సత్యాగ్రహులే చేయుచుండిరి. చెట్లు చేమలను పెంచువారు. మి: కలెన్ బెక్ యీ ఆశ్రమములో సత్యాగ్రహిరూపమున ప్రవేశించెను.

ఆయనకు కృషియందు అభిలాష యుండెను. యువకులు, బాలకులు ఆయనతో కూడ కృషికార్యములందును, ఉద్యాననిర్మాణములందును పాల్గొనుచుండువారు. ఉద్యానములలో గోతులుత్రవ్వుట, చెట్లునరకుట, బరువులు మోయుట మొదలగుపనులు చేయవలసియుండెడిది. దీనివలన బాలకులకు యువకులకు శరీరకవ్యాయామము, ఆనందానుభవము రెండును కలుగుచుండెడివి. ప్రత్యేకముగా వ్యాయామము, ఆటపాటలు వారికి అవసరముండెడివి కావు.

ఆశ్రమవాసులను స్వావలంబులనుగా గావించుటకు గాంధీ చేయు ప్రయత్నములకు అంతము లేకుండెను. ఆశ్రమవాసులకు గృహములు నిర్మింపవలసిన అవసరముండెను. కలెన్ బెక్ గారిసహాయముతో వడ్రంగి, తాపీవానిపనులు అందరునుకలిసి చేసియుండిరి. సత్యాగ్రహులకు గృహములు నిర్మింపబడెను. సత్యాగ్రహులు ఆశ్రమములో రస్తాలను నిర్మించిరి. ఆశ్రమమును పరిశుభ్రముగా నుంచుటకు ప్రతి

వాడును శుభ్రపరచుచుండిరి. ఆశ్రమముయొక్క ఆయు
తనము విశాలముగా నున్నను చెత్త – చెదారములు,
ఆకులు-అలములు ఎవరికిని కాన్పించెడివికావు. ఆకులు అల
ముగను. మైలను గోతులలో కప్పిపెట్టెడివారు. కొంత
కాలమునకు అది అమూల్యమైన ఎరువుగా మారిపోయెడిది.
ఈపనులన్నియు ఆశ్రమవాసులే చేయుచుండువారు. మైలను
శుభ్రముచేయుట, దానిని ఉపయోగకరముగా చేయు
ఉత్సాహము ఆశ్రమవాసులలో అధికముగా నుండెను.
దీనిమూలకారణము గాంధీజీయే.

టాలస్టాయి ఆశ్రమములో విద్య గరపుటకుకూడ
గాంధిజీ యేర్పాట్లు గావించియుండెను. విద్య నేర్పుభారము
గాంధిజీ మీద, కలెన్ బెక్ మీద పడియుండెను. ఆశ్రమ
ములో హిందు, ముసల్మాన్, శిఖ్, పార్శి, క్రైస్తవ ధర్మ
ములకు చెందిన బాలబాలికలు ఉండిరి. సకలదేశముల
వారును ఉండిరి. వారికి విద్య నేర్పుట ఒకసమస్యగా
నుండెను. వారికి మాతృభాషలో విద్య నేర్పవలెనని
గాంధిజీ కోరుచుండిరి. మాతృభాషాసహాయముతో నేర్పిన
విద్యమీదనే విద్యయొక్క సంపూర్ణత్వము ఆధారపడి
యుండునని ఆయన గ్రహించెను. కాని సకలదేశముల
భాషను, ముఖ్యముగా తెలుగుభాష తెలియకపోవుటచే
ఆయనకు చాలచిక్కుగా ఉండెడిది. అందున అన్ని దేశ
ములలో మాతృభాషద్వారా విద్య నేర్పుటకు అవకాశము

లేకుండెను. అప్పుడప్పుడు ఆంగ్లభాషద్వారా పనిజరుపుకొని పోవుచుండువారు. దానివలన ఆయన విచారపడు చుండెడివారు.

గాంధిజీటాలుస్టాయి ఆశ్రమములో ప్రవర్తింపచేసిన విద్యావిధానములో నవీనత్వ ముండెను. అక్షరముల పరిచయము, పుస్తకములోని విద్య బాలబాలికలకు, యువకులకు నేర్పబడుచుండెను. అదిగాక వారు ఆనందము ననుభవించుటకు తగినకథలు చెప్పబడుచుండెను. పుస్తకములు చదివి వినిపింపబడుచుండెను. వివిధధర్మావలంబకుల వివిధ దేశవాసుల బాలబాలికలను, యువకులను యేకముచేసి మిత్రభావమును, సేవాభావమును నేర్పుటయే ప్రధాన ఉద్దేశ్యమై యుండెను.

ఆత్మవిద్యకొఱకు—ప్రార్థనా పూర్వకమైన భజనలు చేయబడుచుండెడివి. నీతివిషయికపుస్తకములు చదివి వినిపింపబడుచుండెడివి. కాని దీనివలనకూడ గాంధీజీ హృదయమునకు తృప్తి కలుగుటలేదు. ఆత్మవిద్యకొఱకు యీ యుపాయము అంత తృప్తికరముగా లేదు. బాలబాలికల ఆత్మశుద్ధికై పుస్తకములోనివిద్య, నీతియే చాలునని ఆయన సంతుష్టి చెందలేదు. శరీరమునుగురించిన విద్య శారీరక వ్యాయామమువలన నేర్పబడును, జ్ఞానమును గురించిన విద్య జ్ఞానచర్చవలన కలుగును. ఆత్మోన్నతి ఉపాధ్యాయునియొక్క లేక గురువుభార్యయొక్క ప్రవర్తనమందిగాని

లభించును. ఈవిషయమునుగురించి గాంధిజీ యిట్లనుడివి యుండిరి—"నేను అసత్యమును చెప్పుచు, నా శిష్యులచేత సత్యము చెప్పించుటకు ప్రయత్నించినయెడల ఆప్రయత్నము వ్యర్థమై పోవును. భీరుడగు ఉపాధ్యాయుడు శిష్యులకు శౌర్యమునుగురించి బోధింపజాలడు. జారుడగు ఉపాధ్యాయుడు శిష్యులకు నిగ్రహమునుగురించి ఎట్లుబోధింపగలడు?" గాంధీజీ యీసత్యమును గ్రహించి ఆయన ఆశ్రమవాసులగు శిష్యులసమక్షమున తనను ఆదర్శముగా నుంచుటకు యత్నశీలుడాయెను. శిష్యులకొరకు గురువుగారి ఆచరణము లన్నియు పరిశుద్ధమగుట అత్యంతావశ్యకమని, ఆయన గ్రహించెను. ఏనిగ్రహసాధనావశ్యకతను ఆయన బహు దినములకిత్రమే గ్రహించి యుండెనో, దానిని ఆయన టాలస్టాయిఆశ్రమములోఅత్యంతశ్రద్ధతో పరిశీలించిరి. ఆయన ఆదర్శముల ననుసరించి ఆశ్రమవాసులుకూడ నిగ్రహ సాధనలో సిద్ధిపొందిరి.

ఈఆశ్రమములో ఆశ్రమవాసులకు అక్షరజ్ఞానము, పుస్తకములోనిజ్ఞానము నేర్పుటయేగాక హృదయవికాసము నకు, సచ్చారిత్రమునకు ఆయన ప్రధానస్థానముల నిచ్చి యుండిరి. అదియే విద్యయొక్క సారమనియు ఆయన తలంచుచుండిరి. అందువలన సత్యాగ్రహులహృదయవికాసము మెడల, సచ్చారిత్రముయెడల విశేషశ్రద్ధను చూపు చుండిరి. సచ్చారిత్రమే సకలవిద్యలకు పునాదియని ఆయన

తలంచుచుండెను. సకల శక్తులకు మూలమే అది. అప్పుడే దృఢతరమైన యున్నయెడల బాలబాలికలు తమంతట తామే యితరవిద్యలను అభ్యసింపగలరు.

శారీరకవిద్యయొక్క ఆవశ్యకతనుకూడ గాంధీజీ గ్రహించెను. అందువలన కార్యములద్వారా ఆవిద్యను ఆశ్రమవాసులకు నేర్పియుండెను. అందును తమస్వంత కార్యములచేగాక ఆశ్రమకార్యములనుకూడ నెరవేర్చు చుందురు.

ఆశ్రమవాసులు గావించు కార్యములయెడల వారు ఎన్నడును విరక్తిభావమును బ్రదర్శించి యుండలేదు. కార్యములతో ఆనందము సమ్మిళితమై యుండెడిది. ఏకార్యమును ఉపాధ్యాయుడు చేయునో ఆకార్యమును బాలురు కూడ చేయుదురు అనునియమము టాల్‌స్టాయిఆశ్రమమున నుండెను. అందువలన పిల్లలు ఆనందముతో నేర్చుకొను వారు, ఆనందముతో పనిచేయువారు.

జీవితావశ్యక శారీరకవిద్యలో నొకఅంశముగా గాంధీజీ భావించువారు. ఉపయోగకరమగు నేదో యొకపని అందరికిని నేర్పబడుచుండెను.

కలెన్‌బెక్ ఒకనాడు మఠమునకు పోయి చెప్పులు తయారుచేయుట నేర్చుకొని వచ్చెను. ఆయనవద్ద గాంధీజీ కూడ ఆపనిని నేర్చుకొనెను. ఈపని నేర్చుకొనగోరిన పిల్లలందరికిని ఆయన నేర్పియుండెను.

టాల్‌స్టాయిఆశ్రమములో యిట్టివిద్యను నేర్పుట వ్యర్థము కాలేదు. ఆశ్రమవాసులు పరస్పరులకై సహనశీలురై యుండిరి. పరస్పరుల ధర్మముపై, ఆచరణములపై ఔదార్యమును ప్రదర్శించుట నేర్చుకొనిరి. నాగరికత నేర్చుకొనిరి. కార్యనిపుణులైరి.

ఆశ్రమవాసులలో పారివారిక సంబంధము ప్రతిష్ఠితమాయెను. సత్యాగ్రహులు విశుద్ధాశ్రమములో స్థానము సంపాదించిరి. అసదాచారములయొక్కయు, దాంభికత్వముయొక్కయు మార్గము కూడ విసర్జించిరి. మంచిచెడ్డలు వేరై పోయెను. సత్యాగ్రహులు నియమములకు వశీభూతులైరి. వారిసదాచరణ, సచ్ఛీలముల ఖ్యాతి నలుప్రక్కల వ్యాపించెను. సత్యాగ్రహులకు వివేకము, ధైర్యము వారి కష్టసహనశక్తి — ఇవి అన్నియు టాల్‌స్టాయి ఆశ్రమము స్థాపించుటవల్లనే లభించినవి.

నిజముగా సత్యాగ్రహయుద్ధముకొరకు కావలసిన ఆధ్యాత్మికశుద్ధికి సాధనము అనుకూలమైన స్థానము టాల్‌స్టాయిఆశ్రమమై యుండెను. ఇట్టిస్థానము లభించకపోయినను, ఆశ్రమము నిర్మింపబడకపోయినను, గాంధీజీ ఆఫ్రికాలో స్థాపించిన సత్యాగ్రహసంగ్రామమునకు శక్తి లభించెడిదో లేదో, జయము పొందగలిగెడిదో లేదో, చెప్పజాలము. గాంధీజీ యీ ఆశ్రమమును నిర్మించిన ఫలితముగా వేలకొలది ప్రజలు ఆకర్షింపబడి యీఆశ్రమములో

చేరువారు. సత్యాగ్రహ సంగ్రామములో పాల్గొనువారు. అవుసరమునుబట్టి కారాగృహమునకు పోవువారు. 1913 వ సంవత్సరములో ఏమహత్తరశక్తితో సత్యాగ్రహసంగ్రామము ఆరంభించబడెనో, ఆసంగ్రామమునకూడ యీఆశ్రమమునుండియే శక్తిని సంపాదించుకొనెను. ఇచ్చట బాలకులను యువకులను శాసనబద్ధులనుగా చేయుటకు గాంధీజీ సంపూర్ణముగా నూతనపద్ధతిని అవలంబించెను. ఆయన తన ఆచరణముద్వారా ఆశ్రమవాసులలో న్యాయాన్యాయముల, కర్తవ్యాకర్తవ్యముల జ్ఞానమును కలిగించెడివారు. ఎవరియెడలను ఆయన కఠినముగా ప్రవర్తించి ఎరుగరు. ఎవరియెడలనైన ప్రవర్తించినచో దానికి కారణమును తెలియచేయువారు.

ఒకసారి యీ ఆశ్రమములోనున్న దుష్టబాలునకి బుద్ధి చెప్పి శిష్టుగాను చేయుటకై గాంధీజీ ప్రయత్నించియుండిరి. కాని ఆసారి ఆయనప్రయత్నము సఫలీకృతము కాలేదు. బాలకునకు ఎంతబోధించినను ఏట్టిఫలితము లభించలేదు. ఆతనిదుష్టబుద్ధి మారుపు చెందలేదు. అందువలన గాంధీజీ కోపగించి హస్తకర్రతో ఆతనిచేతిపై దెబ్బలు వేసిరి. కాని దెబ్బలు వేసిన మరునిముషములోనే క్రోధమువలన కలుగు హానిగుర్తించి జాగరూకుడై అనుతప్తహృదయముతో విచారించుచుండిరి. గాంధీజీ జీవితములో అనుతాప భావము వ్యాపించెను. బాలుడు బాధపడుటచూచి ఆవేదన

పొందెను. ఆఆవేదన ఆయన దేహమంతయు వ్యాపించెను. బాలకుడు దానినిచూచి ఏడ్చెను. తాను గావించిన కార్యములకు, దుష్టత్వమునకు అతడు విశేషముగా విలపించెను. అతడు గాంధిజీవద్ద క్షమాపణ కోరుకొనెను. దెబ్బలవలన కలిగినబాధచే అతడు ఏడువలేదు. అనుతాపమువలన అతడు ఏడ్చెను.

గాంధీజీ తనజీవితములో ఒకటి రెండుసారులుతప్ప ఎవరిని దెబ్బలచేత దిద్దుటకు ప్రయత్నించలేదు. కాని ప్రతి సారియు యీవిధమున దెబ్బలుకొట్టి అనుతాపముచేత బాధపడియుండిరి. దెబ్బలద్వారా విద్య నేర్పువిధానమునకు ఆయనజీవితకాల మంతయు విరోధిగానే యుండెను. ఎవరి నైనను సరిచేయుటకు దెబ్బలకంటె సహృదయతవలన విశేష ఫలితము లభించునని ఆయన తలంచువారు. దెబ్బల వలన ఎవరికి దిద్దుబాటుచేయుటకు ప్రయత్నించినను, ఆతని ఆంతరికమైనపశుశక్తియే ప్రకాశితమగుచుండును. ఆయన ఆత్మయొక్క పరిచయముగాని, సహృదయతయొక్క పరిచయముగాని ప్రకటితములుకావు.

టాల్‌స్టాయి ఆశ్రమములో గాంధిజీ జీవితము, సందేశముల అపరూపసమన్వయము గావించెను. ఇచ్చట ఆయన జీవితమే ఆయన సందేశము. వ్యక్తిగత ఆచార అనుష్ఠానములద్వారా యిప్పటినుండియే ఆయన సందేశమును

"పిల్లలు విద్యావంతులై యుండుటలో నాకు ఎంతశ్రద్ధాగౌరవములు కలవో ప్రాకృతికనియమములచేత చికిత్సచేయు విషయములలోను నాకు అంతశ్రద్ధాగౌరవములే యుండెను." అని ఆయన నుడివియుండిరి.

ప్రాకృతికనియమముల ననుసరించి చికిత్సచేయు విషయములో గాంధీజీ అనేకగ్రంథములను కూడ గదివిరి. మట్టినీటి సహాయముతో రోగములను కుదుర్చువిషయములో ఆయనకు అపారమైన విశ్వాస ముండెను. ఈసమయము లోనే టాల్‌స్టాయి ఆశ్రమములో రోగుల ఆరోగ్యముకొరకు ఆయన ప్రాకృతికపద్ధతులలో చికిత్సచేయ నారంభించిరి. నీరు, మట్టి, ఉపవాసములద్వారా, ఆహారపరివర్తనము ద్వారా సర్వవిధములైన రోగములను కుదర్చవచ్చునని ఆయన విశ్వసించుచుండువారు. ఈపద్ధతుల ననుసరించి చేయు చికిత్సలో గాంధీజీ ఆశాతీతఫలితము పొందియుండిరి. ఇట్టి పద్ధతులలో ఆయనకు గంభీరమైన శ్రద్ధయుండెను.

ఆశ్రమములో ఏ రోగమునందును ఔషధముగాని, డాక్టరుగాని అవుసరము లేకుండెను. డెబ్బది సంవత్సరముల వృద్ధుని ఉబ్బసవ్యాధిని గాంధిజీ ఆహారపరివర్తనమువల్లను, నీటిప్రయోగమువల్లను నయము చేయగలిగిరి.

టాల్‌స్టాయి ఆశ్రమములో గాంధిజీ ఉపాధ్యాయుని వలెను, అవిభావికనివలెను సత్యాగ్రహులహృదయములలో ప్రవేశించిరి. వారిసుఖదుఃఖములలో పాల్గొనిరి. వారిజీవిత

ములలోని అనేక రహస్యములను వెదకి కనుగొనిరి. వా
యుచ్ఛ్వాసిత పావనతరంగములను సన్మార్గములలో నడపి
యుండిరి.

ఆశ్రమవాసులగు సత్యాగ్రహులలో లోటు కనిపించి
నప్పుడు గాంధిజీ ప్రాయశ్చిత్తము కొరకు ఉపవాసము చేయు
వారు. ఆయన ఒకసారి ప్రాయశ్చిత్తము నిమిత్తము ఏడు
దినములు ఉపవాసము, నాలుగున్నర నెలలు ఒంటిపూటభోజ
నము చేయువ్రతమును గైకొనిరి. ఆశ్రమవాసుల లోపము
లనుగాంచి గాంధిజీ అత్యంతఆవేదనము ననుభవించువారు.
ఆశ్రమవాసుల లోపములకొరకు ఆయన ప్రాయశ్చిత్తము
చేసుకొనినయెడల లోపములున్నవారు ఆయన ఆవేదనమును
గ్రహించి తమదోషములను సవరించుకొనుటకు ప్రయత్నింప
వచ్చునని ఆయన తలంచెడివారు.

ఈ మహదాశయముతోనే గాంధిజీ ఉత్తరకాలములో
అనేకసార్లు ప్రాయశ్చిత్తరూపమగు ఉపవాసవ్రతమును
పాలించియుండిరి. దోషులను, పాపులను వారి దోషములను
గురించి పాపములనుగురించి జాగరూకులను గావించుటకు
ఆయన అనేకసార్లు ఉపవాసవ్రతమును అవలంబించిరి.
దేశము సాంప్రదాయిక విషముచే పరిపూర్ణమైయున్నప్పుడు,
ప్రపంచము హింసలచే పరిపూరితమైయున్నప్పుడు, సంకుచిత
చిత్తములుగలవారిలోను, హింసాపూర్ణసంఘములోను చైత
న్యమును, కర్తవ్యజ్ఞానమును కలిగించుటకు ఆయన ఉపవాస

ప్రాపమైన అస్త్రమను ప్రయోగించువారు, దానిలో కృతకృత్యులైరి.

ఒకసారి గాంధీజీ ఆఫ్రికాలో నున్నప్పుడు ఆశ్రమవాసుల దోషములకొరకు పదునాలుగు దినములు ఉపవాసము చేసియుండిరి. దీని పరిణామము కూడ జయప్రదముగా ఫలించెను.

ఆయన ఉపవాసమువలన ఆశ్రమవాసులందరును ఆవేదనము ననుభవించిరి. అపరాధిగావించిన అపరాధము వలన ఆయన ఎంతటి దుఃఖముననుభవించెనో ఆయన అవలంబించిన ఉపవాసమువల్లనే అందరును గ్రహించిరి. ఆయన ఉపవాసమునందు క్రోధములేదు. సానుభూతియుండెను. సంశోధనకు అతితీవ్రమైన వ్యాకుల ప్రార్థనయుండెను. ఆశ్రమవాసులందరును ఆవిషయమును గ్రహింపగలిగిరి. అందువలన దుష్కృతము లాచరించిన వారియందు కూడ అనుతాప ముదయించెను. ఆశ్రమవాతావరణపరిశుద్ధమాయెను. పాపపంకిలము పరిష్కృతమాయెను. పాపమాచరించుట ఎంతభయంకరమైన విషయమో దానిని గాంధీజీ ఉపవాసమువలన ఆశ్రమవాసులు గ్రహింపగలిగిరి. దీని ద్వారా ఆశ్రమవాసులకును గాంధీజీకిని మధ్య నిబిడమైన సరళమైన సంబంధము సంఘటితమాయెను.

---

ప్రతీదానిని యుక్తి తెలిసికొనెను. “స్ట్రైక్” అను భయంకరమైన దారుణమైన పద్ధతినిగురించి గాంధీజీ వినియుండెను. దుగ్ధమును విసర్జించుటకు సంకల్పించుకొనెను. ఈసంకల్పములో కలెన్‌బెక్ భాగస్తుడయ్యెను. ఆయన అత్యంతసాహసియు, సంయమియునైయుండెను. అందువలన దుగ్ధమును పరిత్యజించుట సాధ్యమా కాదాయనువిషయమును పరీక్షించుటకు సంసిద్ధులైరి. గాంధీజీ, కలెన్‌బెక్ దుగ్ధమును పానము చేయుట విడనాడిరి. ఎండిన పండిన ఫలమూలములపై ఆధారపడియుండిరి. ఈసంఘటన టాల్‌స్టాయి ఆశ్రమములో 1912 వ సంవత్సరమునందు సంభవించెను. పక్వ ఆహారమును సహా యూసమునుకూడ గాంధీజీ విసర్జించెను.

ఫలాహారమునకు కారణము గాంధీజీ యిట్లుల నిరూపించిరి—“ఫలాహారము అనగా, చవుకగానున్న ఫలములపై ఆధారపడియుండుటయే. దీనివలన దరిద్రులు జీవనయాత్ర గడుపుకొనవల్లె మేమును అట్టిజీవనయాత్రను గడుపుకొన స్థిరము చేసుకొంటిమి. ఫలాహారమువలన మాకుమంచి అవకాశముకూడా లభించినది. ఫలాహారముకొరకు పొయ్యి వెలిగించవలసిన పని లేదు. పచ్చిపెసరపప్పు, అరటిపండ్లు ఖర్జూరపండ్లు, ఆలివ్‌నూని—ఇవియే మాకు సాధారణ ఆహారము.

కాని ఈవిధముగా దుగ్ధమునుపరిత్యజించి కేవలము ఫలమూలములను భుజించుటకు ఆరంభించిన పిమ్మట గాంధీజీ

యెట్టి దౌర్బల్యమునుగాని, వ్యాధినిగాని అనుభవించలేదు. అప్పుడు అతనకు శారీరకశక్తి సంపూర్ణముగానే యుండెను. ఒకరోజున 51 మైలు నడచిపోగలిగినంత శక్తి యుండెను. 40 మైళ్ళు నడచుట సర్వసాధారణముగానే యుండెను.

ఈపరీక్షయందు గల ఆధ్యాత్మికపరిణామము గాంధీజీ జీవితములో విశేషముగా ఫలించెను. దుగ్ధమును పరిత్యజించుటచే ఆయనకు ఆత్మశుద్ధి కలిగెనని గ్రహించిరి. ఈఆత్మశుద్ధియందుగల అనుభూతియు, ఆధ్యాత్మిక ప్రేరణము, దక్షిణాఫ్రికా సంగ్రామ పరిచాలనలో గాంధీజీకి ప్రేరణము, ఆత్మవిశ్వాసమును సమకూర్చెను. ఈయనలోని సంయమ సాధన ఆశ్రమవాసులలో సంయుక్త ఆచరణమును కలిగించెను. వారిని మస్తయశక్తిశాలురనుగా గావించెను.

దుగ్ధమును, అన్నమును పరిత్యజించి గాంధీజీ ఫలాహారములను పరీక్షింప సమకట్టెను దానితోపాటు నిగ్రహముకొరకు ఉపవాసమునుకూడ ఆయన ఆరంభించెను. గాంధీజీ యింతకుపూర్వము కూడ ఉపవాసము చేయుచుండిరి. కాని అది శరీరారోగ్యమును కాపాడుకొనుటకును, శరీరమును రోగహీనముగా నుంచుటకొరకునై యుండెను. దైహికప్రవృత్తులను నిగ్రహించుటకుకూడ ఉపవాసము అవసరమను విషయము ఆఫ్రికాప్రవాసకాలమునందాయన చక్కగా గ్రహించెను. వైష్ణవకుటుంబములో జన్మించుటచేతను, మాతృదేవి కఠినవ్రతధారిణియై యుండుటచేతను,

స్వదేశమునం దుండగా ఏకాదశిమొదలగు వ్రతములను పాలించుచుండిరి. కాని వాటన్నిటియందును అనుకరణ ప్రవృత్తియే ప్రబలముగా నుండెను. తల్లిదండ్రులను సుఖపెట్టుటయే ప్రధానఅభిలాషయై యుండెను. ఆ వ్రతముల వలన లాభమున్నది, లేనిది గ్రహించరైరి. లాభము లేదనియే గ్రహించువారు. కాని ఆఫ్రికాలోనుండగా బ్రహ్మచర్యమునకు సహాయముగా ఉపవాస వ్రతములను పాలింప నారంభించిరి. ఆత్మశుద్ధి, సంయమసాధనకొరకు ఉపవాసవ్రతపాలన ఆవశ్యకతను యీసమయములో గ్రహించిరి. ఏకాదశిమొదలగు వ్రతసమయములలో అనేకులు ఫలాహారమును చేయుచుందురు. కాని గాంధీజీ సహజముగా ఫలాహారము చేయుటచేతనే ఏకాదశీ ఉపవాసవ్రతపాలన సమయములో నీరముతప్ప మరేమియు సేవించువారు కారు.

టాలస్టాయి ఆశ్రమములో నున్నప్పుడు గాంధీజీ తన జీవితములో ఆరంభించిన సంయమసాధన చూచి ఆశ్రమ వాసులుకూడ ఆసాధనలో నిమగ్నులైరి. "నేను ఏదేని సత్కార్యమును గావించుచున్నప్పుడు నాతోకూడా ఉన్న వారినికూడ దానితో యుక్తము చేయుటకు ప్రయత్నింతు వని" గాంధీజీ నుడివెను. గాంధీజీ ఆదర్శములవలన ఆయన ఆశ్రమములో సంయమసాధన విశేషముగా ఫలప్రద మాయెను.

ఒకసారి మహమ్మదీయుల రోజాయును, హిందువులు ప్రదోషవ్రతమున్ను ఏకకాలములోనే అనగా శ్రావణ మాసములో వచ్చెను. గాంధీజీని చూచి ఉపవాసస్వార్థకతను హిందూమహమ్మదీయు లందరును సమానముగానే గ్రహించిరి. ఈసందర్భములో హిందూవ మహమ్మదీయు లెల్లరున్ను ఉపవాసవ్రతమును పాటింప నారంభించిరి. ఈసమయమునందు పార్సీ, శిఖ్కు, క్రైస్తవులు మహమ్మదీయుల ఉపవాసవ్రతములో పాల్గొనవలెనని గాంధీజీ నడిపి యుండిరి. సంయమవ్రతములో పాల్గొనుట అందరికిని కర్తవ్యమను విషయము గాంధీజీ అందరికిని తెలియజేసిరి. గాంధీజీ గావించిన యీ ప్రతిపాదనమును ఆశ్రమవాసు లందరును మహదానందముతో నంగీకరించిరి.

ఇట్టి ఉపవాసవ్రతమును అవలంబించుటచే సత్ఫలమే ఫలించెను. దీనివలన అందరును ఉపవాసవ్రతమాహాత్మ్యమును గ్రహించుటయేగాక ఒకరిపై ఒకరికి ఔదార్యము, పరమతసహనము, సాంప్రదాయములలో మధురసఖ్యభావము జనించెను. ఈవిషయములో గాంధీజీ నుడివిన ఒకసూక్తి గలదు— "హిందూ ముస్లిమ్ పిల్లలలో ధర్మవిషయమైన వివాదము ఒక్కసారియైనను జరిగినట్లు తోచదు. దీనికి భిన్న భావమునే నేను గావించితిని— అందరును తమతమ ధర్మము నందు దృఢవిశ్వాసము కలిగియుండి ఒకరిపై ఒకరికిగల గౌరవమును కాపాడుకొనుచుండువారు. ధర్మానుష్ఠానము

స్థలో ఒకరి కొకరు సహాయము చేసుకొనుచుండువారు.”

ప. వివిధసంప్రదాయములు కలిసి మెలసి స్నేహభావ ముతో, ఉదారభావముతో నుండగలవను దానికి ప్రత్యక్ష ప్రమాణమును ఆయనయే చూపియుండిరి.

టాల్‌స్టాయి ఆశ్రమములో శాకాహారమును చేయు నియమ ముండెను. గాంధిజీయెడలగల శ్రద్ధాభక్తులచేతనే అందరును యీ నియమమును పాలించుచుండిరి. గాంధిజీ ఆశ్రమవాసులకు మాంసాహారము నేర్పాటుచేయుసంసిద్ధులై యుండిరి. కాని గాంధిజీని చూచి ఆయనప్రవర్తనమును వీక్షించి, నిగ్రహమునకు మాంసాహారముపరిత్యజించుటయే మంచిదని ఆశ్రమవాసులు గ్రహించిరి. అందువలన వారు స్వేచ్ఛాపూర్వకముగానే మాంసాహారమును విసర్జించిరి. సాధారణఆహారముయొక్క ప్రయోజనీయతను ఆశ్రమ వాసులు గాంధిజీనుండియే తెలుసుకొనిరి. అందువలన ఆశ్రమములో సాధారణమైన ఆహారమే భుజించుచుండిరి. ఈవిధముగా ఆశ్రమములో నిగ్రహశక్తియే అభివృద్ధి నొందుచుండెను. ఉపవాసము, మితాహారముల విషయములో ఆశ్రమవాసులలో ఏకాభిప్రాయము, మధురస్నేహభావము అభివృద్ధి చెందెను.

---

# 32

## కలెన్‌బెక్-గోఖ్లే

కలెన్ బెక్ సాహచర్యవిషయము, గోఖ్లేగారితో పరిచయవిషయము వర్ణింపబడకుండినచో ఆఫ్రికాలోని సత్యాగ్రహము అసంపూర్ణముగా ఉండును. టాల్‌స్టాయిఆశ్రమ చరిత్రకూడ అసంపూర్ణముగానే యుండును. కావున కలెన్ బెక్ గోఖ్లేగార్లవిషయముకొంత ముచ్చటింపబడుచున్నది. వీరిప్రభావముగా గాంధిజీ జీవితము ఎట్లు నడపినదియు గ్రహించుటకు ప్రయత్నించెదము.

కలెన్ బెక్ ప్రథమజీవితములో—ముఖ్యముగా గాంధిజీతో సంబంధము కలుగుటకు ముందు—అత్యంతవిలాసియు, భోగియునై యుండెను. ఆయనతో ప్రథమమున పరిచయము కలిగినప్పుడు గాంధిజీ ఆయనపోకలయొక్క, వ్యయము యొక్క లెక్కలను చూచి ఆశ్చర్యాన్వితు డాయెను. కాని ఆపరిస్థితులు మారిపోయి సాధారణజీవితము గడపుటకు అలవాటుపడిరి. ఆపరివర్తనము గాంధిజీగాంచి విముగ్ధులైరి. విస్మితులైరి. కలెన్ బెక్ గాంధిజీవలెనే కఠోరమైన త్యాగవ్రతములో దీక్షను గైకొనిరి. గాంధిజీవలెనే సరళ అనాడంబరజీవితమును గడుపజొచ్చిరి.

ఆశ్రమవాసు లందరితో కలిసిమెలసి వారిలో ఒకరైపోయిరి. కలెన్ బెక్ తనజీవితములో ఎన్నడును కాయికపరి

శ్రీమతి అలవాటుపడి యుండలేదు. ఎప్పుడును ఏ యిబ్బంది యు ఆయన అనుభవించలేదు. ఆరామవైభవములలో జీవితమును గడపుటయే ఆయన ధర్మమై యుండెను. ప్రపంచములో సుఖకరమైన ప్రతిదానిని ఆయన అనుభవించియుండిరి. ధనముతో పొందదగిన ప్రతివస్తువును ఆయన తనసుఖము కొరకు సంపాదించి అనుభవించి యుండిరి.

ఇట్టివారు టాల్‌స్టాయిఆశ్రమములో వసించుట, అందరివలె సాధారణముగా భుజించుట, పరుండుట సహజమైన విషయము కాదు.

గాంధిజీప్రభావమువలన ఆయన ఉద్దేశ్యముల, ఆదర్శముల అంతర్యమును గ్రహించుటచే కలెన్ బెక్ జీవితములో ఆశ్చర్యకరమైన పరివర్తనము సంభవించెను.

కలెన్ బెక్‌లో ఉన్న త్యాగశక్తిని గాంచి ఆశ్రమవాసులదృష్టియే మారిపోయెను. ఆయనయెడల అందరికిని శ్రద్ధాగౌరవములు ఇనుమడించెను. ఆశ్రమవాసులు తమను ఆయాదర్శములతో నిర్మించుకొనుటకు విశేషప్రయత్నము చేయువారు. కలెన్ బెక్ తనత్యాగమును దుఃఖదాయకమైనదిగా ఎన్నడును తలంచలేదు. ఆయన ఐశ్వర్యములను, భోగములను అనుభవించి పొందిన ఆనందముకంటె గాంధిజీ వద్ద త్యాగమంత్రములో దీక్షను పొందినపిమ్మట అత్యంతానందమును అనుభవించుచుండిరి. సరళజీవితములో గల సుఖమునుగురించి వర్ణించుచు తన్మయులగుచుండువారు. సరళ

జీవనయాత్రను గురించిన మహిమాన్వితన ఆమెవద్ద నే వారు. సరళజీవనయాత్రవలన కలుగు ఆనందము ననుభవించుటకు కుతూహలపడుచుండువారు. చిన్న పెద్ద యను భేదము లేక అందరితో సమానముగా స్నేహభావముతో కలిసిమెలిసి యుండువారు. శారీరకపరిశ్రమను ఆయన గౌరవదృష్టితో చూచువారు. అందుచే ఉద్యానములో పనిచేయుటలోగాని, చెప్పులు కుట్టుటలోగాని ఆయన లజ్జగాని, సంకోచముగాని అనుభవించలేదు. శారీరకపరిశ్రమలోని గౌరవము, స్వావలంబన ఆదర్శములను గాంధీజీ తనఆశ్రమసత్యాగ్రహులలో ప్రతిష్ఠితము గావింప కోరినవాడినది. అవి యన్నియు కలెన్‌బెక్‌లో మూర్తీభవించినట్లు ఉండెను.

కలెన్‌బెక్ గాంధీజీతో ధర్మాలోచనలుచేయు స్నేహితుడై యుండెను. ప్రకార్యమును వివేకము సమర్థించునో అట్టి కార్యమును నెరవేర్చుటయే యుచితము, ధర్మము అని గాంధీజీతో పరిచయము కలిగిన ప్రథమపర్యాయమే ఆయన గ్రహించెను. "ఏదినమ్మదగినదో అదియే శాస్త్రము. ఏది శాస్త్రమో అది నమ్మదగినది కాదు" అను సూక్తియొక్క తాత్పర్యమును గాంధీజీ, కలెన్‌బెక్ ఉభయులును గ్రహింపగలిగిరి. తదనుసారముగా జీవితములను నియమించుకొనువారు, ఆశ్రమవాసులజీవితములను తదనుసారముగా నియమితముచేయ గోరుచుండువారు.

ఆహారమును సేవించియు ఆహారనిగ్రహమును గూర్చి యు గాంధిజీ, కలెన్‌బెక్‌లు ఆలోచనలు జరుపుచుండువారు. ఆఫ్రికాలో ఈ యిద్దరు మహానుభావులజీవితములు ఏకసూత్రములో బంధింపబడియున్నట్లుండెడివి. ధర్మము, సంయమసాధన, సత్యాగ్రహముల ఆదర్శములు మొదలగు సకలవిషయములలోను గాంధిజీ తనఅభిప్రాయములను యీ మహానుభావుని అభిప్రాయములతో సరిపోల్చుకొని చూచుచుండువారు.

గోఖలేగారియెడల గాంధీజీకిఅపారమైన గౌరవ ముండెను. ఆ కారణముచేత ఆఫ్రికాలోని భారతీయులపరిస్థితులను ప్రత్యక్షముగా దర్శించి వెళ్ళవలయునని గాంధిజీ బహుదినములనుండీ గోఖలేగారిని కోరుచుండిరి. భారతీయస్వాతంత్ర్య సంగ్రామనాయకులు ఎవరైనను వచ్చి గాంధిజీసత్యాగ్రహసంగ్రామస్వరూపమును, సత్యాగ్రహులత్యాగము, నిష్ఠ, శక్తిసామర్థ్యములను ప్రత్యక్షముగా చూచి పోవలయునని గాంధిజీ కోరుచుండిరి. ఆయనకోరిక నిజముగా ఫలించినది. గోఖలేగారు ఆఫ్రికాకు వెళ్ళిరి.

గాంధీజీ ఆనందమునకు మేరలేకుండెను. ఆయన గోఖలేగారికి స్వాగతమిచ్చుటకు రాజోచితములగు ఏర్పాటులను గావించిరి. అనేకస్థానములలో ఆయనకు స్వాగతము ఇవ్వబడెను. ఆయన ఉపన్యాసములుకూడ గావించిరి.

అనంతరము గోఖలేఆఫ్రికామంత్రిమండలిని సందర్శించిరి. ఒకసంవత్సరములోపల గాంధిజీ భారతదేశమునకు

దీనివలన గాంధీజీలో పట్టుదల అభివృద్ధి చెందెను. వాగ్దానము రక్షింపబడకపోవుటచే ఆయన సత్యాగ్రహుల సంగ్రామావశ్యకతను విశేషముగా గ్రహించిరి. ప్రాణోద్యమముతో సత్యాగ్రహము ఆరంభించబడెను. భారతీయులందరు ఏకమై తమకోరికలన్నియు నెరవేర్చుమని ఆఫ్రికా ముఖ్యులపై ఒత్తిడి కలుగజేయుచుండిరి.

ఆఫ్రికాకు గోఖలే వచ్చుటచే గాంధీజీ ప్రవర్తింప చేసిన సత్యాగ్రహసంగ్రామము విశేషముగా శక్తిని సంపాదించుకొనుచుండెను. సత్యాగ్రహసంగ్రామముయొక్క ఉద్దేశములు, ఆదర్శములు విశేషముగా నలుదెసల వ్యాపింపజొచ్చెను. భారతీయులగౌరవరక్షణకు అవమానకరమైన విధివిధానముల నన్నిటిని రద్దుచేయుదుమని ఆఫ్రికామంత్రిమండలివారు గోఖలేసమక్షమున వాగ్దానముచేసియుండిరి. వాగ్దానము రక్షింపబడకపోవుటచే అవమానకరమైన ప్రతిశాసనమును, పన్నును రద్దుచేయించి భారతీయుల గౌరవమును, స్వాతంత్ర్యమును నిలబెట్టుటకు గాంధీజీ సంగ్రామము నారంభించెను. ఈ సంగ్రామముకొరకు భారతదేశమునుండి విశేషధనసహాయము లభించెను. లార్డుహార్డింజికూడ సత్యాగ్రహసంగ్రామముపై సానుభూతిని చూపించెను. ఈ సమయములోనే భారతదేశమునుండి ఆండ్రూసు, పియర్సన్ గారలు సత్యాగ్రహసంగ్రామములో పాల్గొనుటకు బయలుదేరి

ఏనో ఇంత కాలము గడపియుండిరి. ఆఫ్రికాలో తన కార్యము నెరవేరినదనియూ, అచ్చటనున్నవారు ఆయన ఆరంభించిన కార్యములను సమర్థతతో నెరవేర్చుకొనగలరనియూ ఆయన తిరిగివచ్చునప్పుడు తలంచిరి.

ఒకప్పుడు ఆఫ్రికాయందున్న భారతీయులు తమ అవమానకరమైన పరిస్థితులకు ప్రతీకారము చేయుటలో ఉదాసీనులుగను, నిశ్చేష్టులుగను ఉండిరి. ఉదాసీనులగు భారతీయులలో స్వాతంత్ర్యగాఢవాంఛలను, చైతన్యబోధమును, గాంధీజీ కలిగించెను. అది మనము దర్శించితిమి. ఆఫ్రికావాసులను ఏమహామంత్రముచేత దీక్షితులను గావించెనో అది వెన్నటికిని మరువదగిన విషయము కాదని ఆయన ఆఫ్రికానుండి భారతదేశమునకు తిరిగి వచ్చునపుడు గ్రహించెను. ఆఫ్రికాభారతీయులు తమ గౌరవస్వాతంత్ర్యములను కాపాడుకొనుటకు జాగ్రత వహింతురు.

ఆఫ్రికాకర్మక్షేత్రమునందును, స్వాతంత్ర్యయుద్ధమునందును, నిరాటంకసంగ్రామశక్తిని దర్శించి గాంధిజీ భారతదేశమునకు ప్రయాణమయ్యెను. ఆఫ్రికాలో భారతీయుల స్వాతంత్ర్యసత్తా, గౌరవము, ప్రతిష్ఠలవిషయములో గాంధిజీ నిరంతరపరిశ్రమ గావించి యుండుటచేతను, త్యాగము, నిష్ఠ, శ్రద్ధ, సాఫల్యతలపరిచయమును ప్రదర్శించి యుండుటచేతను, పరాధీనమై, శృంఖలాబద్ధమైయున్న భారతదేశములో ఆయనకొరకు కర్మక్షేత్రము సంసిద్ధమాయెను. ఆఫ్రికాభార

తీయులసంకెళ్ళను త్రెంచివేయుటకు గాంధీజీను, పరికల్పనములను కన్నపక్షులను గోఖలేమహాశయుడు పరిత్యక్తముగా చూచి భారతదేశమునకు తిరిగి వచ్చెను. భారతీయుల పరాధీనశృంఖలములను ఛిన్నముచేయుటకు గాంధీజీవంటి ఒకకర్మవీరుడు అవసరమని ఆయనయొక్క సహృదయ సహాయముచేత భారతీయుల స్వాతంత్ర్య ఆందోళనమునకు నాయకులైన వారిలో ప్రచారిత మయ్యెను.

ఆకారణముచేత ఆఫ్రికాలోని సత్యాగ్రహ ఆందోళనము గాంధీజీని రాజనీతిక్షేత్రములో సుప్రతిష్ఠితము గావించెను. ఆయన నాయకుడను గౌరవమును బడసి, పరాధీన భారతదేశముయొక్క అవమానమును తొలగించుటకు శక్తి సామర్థ్యములను సంపాదించి భారతదేశమునకు తిరిగి వచ్చెను. ఇరువదవ శతాబ్ద ప్రారంభములోనే భారతజాతీయ స్వాతంత్ర్య ఆందోళనము ఆయన నేతృత్వమువల్లనే సంఘబద్ధమై విరాజిల్లుటకు సుయోగము లభించెను.

---

## 33

## స్వదేశ వృత్తిక

కరంచంద్ గాంధీ శాంతియుత స్వదేశక్రోడమునకు తిరిగి వచ్చెను.

మనము 1906 వ సంవత్సరమునాటి విద్యార్థియగు కరంచంద్ గాంధిని నేడు స్మరించుకొనుచున్నాము. ఆయన ఇంగ్లాండులో నాగరికతావిలాసము లవధ్య మానకలు వేసి నను విలాసముల పంకిలము దేహమునకు అంటుకొననీయక ఆంగ్ల నాగరికతలోని మిథ్యామోహమును వర్జించి సత్యము యొక్క నూతనజ్యోతిస్ఫూర్తిని పొందుటకు అనేకవసనముల సన్నిటిని త్యజించుటకు వెనుదవలేదు. దీనితోపాటు 1915 వ సంవత్సరములోని కరంచద్ గాంధి సరిపోల్చి చూడుడి!

సత్యాగ్రహోద్యమము సత్యాన్వేషణకు మరియొక నూతనద్వారమును తెరచి చూపినది — అది అహింసాతత్త్వముయొక్క శాంతిమయమైన, అసీమశక్తిశాలియైన అస్త్రము!

సత్య అహింసల అమృతస్ఫూర్తిని ఆయన ఆఫ్రికా కర్మక్షేత్రమునందు పొందగలిగిరి. సత్య అహింసల కల్పనాతీతమైన శక్తి, సాఫల్యములవలన స్ఫూర్తిపొందుటయేగాక బాపు బుద్ధులుకూడ నైరి. ఆయనను యిట్లు తలంచిరి. “ఈశక్తిని నాదేశము అంగీకరించునా? పథహీనభారత

రిక్తమై నిరాధారమై స్మశానములోని నిర్జీవవ్యక్తి కపై నిలువబడియుండెను. కాని రిక్తమును నిరాధారము నైన సత్యాగ్రహాస్త్రము తప్పక్కన మెరసిపోయెను.

దాంభికమైన విశ్వామిత్రుడు పరాజితు డయ్యెను— మృత అంధకార స్మశానము జీవనదీపముచే వెలిగించెను. హాహాకారములమధ్య ఆనందవాద్యములు వినిపించెను.

బ్యారిష్టర్ మోహన్ దాస్ సత్యరక్షణకొరకు సుఖమును విసర్జించెను— విలాసమైన భవనమును త్యజించెను— ఐశ్వర్యమును విడనాడెను — సత్యాగ్రహ ధురుడు, దీనదరిద్రుడు మోహనదాసు— ప్రాణహీన భారతదేశముయొక్క నిర్జీవ మైన అస్థిరమైన వ్యక్తికపై రిక్తహస్తములతో నిలువబడి యుండెను. కాని రిక్తమోహనదాసుయొక్క అస్త్రము జ్వలించినదా! ఏంతటిలోకబాహుబలముయొక్క నవశక్తిజ్ఞానబలము చేత బలవంతుడును దాంభికుడునైన విశ్వామిత్రుడు పరా జితు డయినాడా—?

ఉద్యమవిహీనమై నిర్జీవమైయున్న భారతదేశవ్యక్తి కపై నవజీవనవాయువులు వీచుచున్నవా?—

దీనికి జవాబు మనకు లభించినది. అందువల్లనే ఆనాటి యుద్ధము, ఆనాటి జయము, నవజీవననిర్మాణేతి హాసము తెలుసుకొనుటకే 1915 వ సంవత్సరము నాటి సంఘటన పంచాంగమును విప్పి పఠించ ప్రయత్నించు చున్నాము. అస్థికావ్యక్తికపై నిలువబడియే మోహన

సినదేకదా. ఈసత్యానుసంధానము, అహింసలే ఆయన హృదయములో స్వదేశప్రేమను రగుల్కొల్పెను. కాని సత్యయజ్ఞములో యింకను అసహాయోద్యమమను ఘృతము పడలేదు. అందువలన యజ్ఞములోని ప్రశాంతశిఖలు ఆనాటి రాజశక్తిని దగ్ధము చేయుటకుబదులు ఆశిఖల ఆలోకనము చేత మహోజ్వలము గావింప సంకల్పించుకొనెను. రాజశక్తి సహాయముచేతను, ప్రతివిధానముచేతను స్వదేశమునకు మంగళమును సమకూర్చుటకును, అంధకారమును తొలగించుటకును కోరుచుండిరి.

నిజముగా ఆనాటిగాంధి రాజద్రోహియైయుండలేదు. రాజభక్తుడును, అనుగతనాగరికుడునై యుండెను. ఆశావాదియై యుండెను. భారతదేశముయొక్క, భారతీయుల యొక్క సత్యన్యాయముల అధికారమును బ్రిటిషు అధికారులు అంగీకరింతురనియు, సత్యగౌరవములను రక్షించుటకు తుదివరకు భారతదేశము సామ్రాజ్యమునందుస్వతంత్రమైన స్వేచ్ఛానియంత్రితమైన రాష్ట్రముగా పరిణమించుటకు అవకాశమును కలిగింతురనియు ఆశించియుండిరి, కాని ఈఅవకాశమును పొందుటకు భారతదేశము పరీక్ష నీయవలసియుండును. భారతదేశము బ్రిటిషువారికి హృదయపూర్వకమైన సహాయకారిగా నుండవలయును. భారతదేశము విశ్వస్తముగాను, యోగ్యముగాను కావలయును.

1915 వ సంవత్సరమునాఁటికి మితవాదియైన మోహన దాసు యీభావముతోనే సర్వరోగవిముక్తుఁడగు దేహముతో బొంబాయి రేవునం దవతరించిరి.

---

## 34

## గోఖ్లేగారి ఉపదేశము

మోహన్‌దాస్‌గాంధీ బొంబాయికి చేరినపిమ్మట ఆయనమిత్రబృందము ఆయనకు స్వాగత మిచ్చుటకు ఒక సభను ఏర్పాటుచేసిరి. ఆనాటిభారతీయులు ఆంగ్లవిద్యా మోహములో విమోహితులై యుండిరి. గృహసంబంధ మగు సభాసమితులలోసహా ఆంగ్లభాషలో ఉపన్యాసము లిచ్చుట సహజమై యుండెను. అఫ్రికాసత్యాగ్రహదళము నకు ప్రధాననాయకుడును, బ్యారిష్టరునైన మోహనదాసు గాంధిగారికి ఆంగ్లములో స్వాగత మిచ్చుటయే శుభప్రద ముగా నుండుననియే ఆనాటివిజ్ఞు లందఱును భావించిరి. కాని గాంధీజీ సభలో స్వదేశభాషలోనే స్వాగతమునకు జవా బిచ్చి అందఱిని ఆశ్చర్యాన్వితులను గావించెను. ఆంగ్లభాష ఎంత ప్రయోజనీయమైనదయినను, సులలితమైనదయినను, భారతీయుల వ్యక్తిగతమనోభావములను ప్రకటించుటకు

దానిఅవ్వసరము లేదనియు, దాని కెట్టి విలువ లేదనియు తమ ఆచరణముద్వారా స్వదేశీయులకు నేర్పియుండిరి.

అప్పటి గుజరాతీక్షులందరును ఆయనఆచరణవలన విస్మితులైరి, లజ్జితులైరి, ఆంగ్లమోహమునుండి విముక్తులైరి, పాశ్చాత్యభావాచారములలో తన్మయులై యుండి యెట్టి దేశసేవయు చేయుట యుచితము కాదని గ్రహించిరి. కృత్రిమత్వముచేత దేశసేవ చేయ వీలులేదు.

గోఖలేబొంబాయిలో నున్నారని గాంధిజీ వినెను. గోఖలే తనవక్తృత్వమువల్లను, అపారపాండిత్యమువల్లను, నిర్భయత్వమువల్లను, ఆయనయందుగల శిశువువంటి సరళప్రవర్తనమువల్లను మోహనదాసు మనస్సును తనవైపునకు ఆకర్షించుకొనిరి. ఈఉదారహృదయముగలమహత్తరవ్యక్తిని తనహృదయములో గురుస్థానమునం దధిష్ఠితునిగా గావించిరి.

విదేశశాస్త్రములద్వారా స్వదేశ సేవాభావములు మోహనదాసు హృదయములో వికసించెనని యిదివరకే గ్రహించితిమి. కాని ఆఫ్రికాలో కర్మప్రవాహములచేత స్వదేశసమస్యలలోను, ప్రయోజనములలోను శ్రద్ధవహింప లేకపోయెను. స్వదేశములో దీర్ఘకాలము వసింపజాలకను పోయెను. స్వదేశముపై ప్రేమ యున్నను, దేశములోని దుఃఖదుర్దశలలోపములవిషయమై ఆయన కంతగా జ్ఞానము లేకుండెను. అంత పరిచయము లేకుండెను. ప్రథమమునే దేశసేవకులలో అగ్రగణ్యులుకాక, దేశసేవామార్గమును తెలుసు

కొనుటకు అంగీకరించిరి. ఈమార్గమును తనకుగోఖలేగారు నిర్ణయించలేదని ఆయనహృదయమునందు ప్రబోధము కలిగెను. ఆదర్శనుల మార్గమును తెలుసుకొనుటకు గోఖలేగారి దర్శనము చేసుకొనిరి.

గోఖలే అప్పుడత్యంతరోగగ్రస్తులై యుండిరి. శయ్యాగతుడగు గోఖలే గాంధిని చూచి ఆనందముతో తన్మయుడై పోయెను. ఆతని సత్యాంతప్రేమాదరములచేత హృదయమున కౌగలించుకొనెను. గోఖలేతనస్నేహబంధనముచేత మోహనదాసుని బంధించెను. దేశసేవకొరకుస్థాపింపబడిన 'సర్వెంట్సు ఆఫ్ ఇండియా' అను సంఘములోకి మోహనదాసుని చేర్చుటకు ప్రయత్నించిరి. కాని సమితియందుగల యితరసభ్యులు గాంధీజీస్వీయకార్యప్రణాళికను, ఆదర్శములను గాంచిఆయనను సమితిలో చేర్చుకొనుటకు సందేహించిరి. గోఖలేదీని గ్రహించిరి. గాంధీజీకూడ గ్రహించెను. అందువలన గోఖలే మోహనదాసుని బంధించుటకు ప్రయత్నించలేదు. మోహనదాసుకూడ ప్రతికూలదృష్టితో సమితిలో ప్రవేశించి అభిప్రాయభేదములసంఘర్షణ కలుగజేసి సభ్యులకును గోఖలేగారికిని మనఃక్లేశమును కలిగింప నిష్టపడలేదు. అందువలనగోఖలేగారికి హృదయపూర్వకమైన కోరిక యున్నను తనఅయిష్టతను ఆవేదనతో ఆయనకు తెలియజేసెను.

ఇచ్చట ఒకప్రశ్న యుదయించవచ్చును. సమితిలోని సభ్యులందరును మోహనదాసుపై గౌరవప్రేమలను

మూపువారు, ఆయనను వారు ఆయనను సమితిలో ఏల చేర్చుకొనకొనలేను

దీనికి జవాబు ఇవ్వవలసి వచ్చినప్పుడు కర్మధారల, చింతాధారల ప్రభేదమే దీనికి కారణమై యుండునని తలంచెను. కేవలము అసమ్మతి తెలియచేయుటచేతను, ప్లాటుఫారముపై ఉపన్యాసము లిచ్చుటచేతను, తమకోర్కెలను వార్తాపత్రికల ద్వారా ప్రభుత్వమువారికి తెలియచేయుటచేతను వారు దేశసేవ చేయుచున్నట్లుగా సమితిసభ్యులు తలంచెడివారు. ఇంతకంటె ఉన్నతమార్గముద్వారా దేశసేవ ఎవరును చేయజాలరు. చేసినను ఆపని మంచిదని వారు అంగీకరింపజాలరు. ఇచ్చటనే యిద్దరిలో మతభేదములమహాసముద్రము సృష్టింపబడెను.

ప్రయోజనానుసారముగా, ప్రత్యక్షముగా బ్రిటిషు శాసనమునకు విరుద్ధముగా కార్యక్షేత్రమున ప్రవేశించుటకును, అపారశక్తిశాలురగు సర్కారువారిని యుద్ధమునకు ఆహ్వానించుటకును మోహనదాసు అభిలషించుచుండిరి. ఆయన అభినవసత్యాగ్రహము ఈ అభిలాషను సభ్యులకు సహజముగా వ్యక్తీకరించెను. కేవలము సత్యాగ్రహము ద్వారా దృఢముగా ప్రతిష్ఠితమైన శక్తిశాలురగు ప్రభుత్వమువారిని తిరిమివేయుట ఎట్లు సాధ్యమగునని వారు భావింపలేకనే పోయిరి, తరిమి వేయుటయా!

తరిమివేయు విషయమును వారు ఊహింపజాలరైరి. ఆవేదన నివేదనముల ద్వారా సర్కారువారి మనస్సులను మెత్త బరచియు, శాసనవిషయములో కొంత సంస్కరణ గావించియు, సంస్కరణముల ద్వారా కొంత అధికారము పొందుటకును వారు భావించుచుండిరి.

భస్మమునకు అడుగుననున్న అగ్నిశిఖలు — అనుకూల వాయువు వీచిన వెంటనే భస్మమును భేదించుకొని శిఖల తేజస్సు పరిజ్వరిల్లును—

చిత్తవికారములను దగ్ధముచేయుచు, "సర్వెంట్సు ఆఫ్ ఇండియా సొసైటీవారు ఈశిఖను చూడజాలకపోయిరి. గోఖలే చూడగలిగిరి. అందువలన ఆయన మోహనదాసుకు సమితిలో ఆశ్రయము నీయక తన అంతరములో ఆశ్రయమిచ్చెను. ఆరోజున గోఖలేగారు స్నేహపూర్వకముగా ఇట్లు నుడివెను— "నీఆదర్శముల ప్రభేదమువలన సమితిసభ్యులతో నీకు పొసగలేదు. నీవు సమితిలో సభ్యుడవైనను, కాక పోయినను, నాహృదయములో నిన్ను నావానినిగ స్వీకరించుచున్నాను" గోఖలే స్నేహమును తా నెన్నడును మరువజాలనని స్నేహవిముగ్ధుడగు మోహనదాసు తెలియబరచెను.

దేవతతో దేవతకు స్నేహము కుదిరిన ట్లాయెను— శ్రీకృష్ణునితో అర్జునునకు స్నేహము కలిగెను. గురువుతో శిష్యునకు బాంధవ్య మేర్పడెను.

గోఖ్లేను మోహనదాసుగాంధీకి సుపరిచితుని చేసుకు వచ్చెను. ఉదారుడైన, సరళహృదయుడైన, స్వ స్వభావుడైన మానవుని చారిత్రము మోహనదాసు హృదయఫలకమందు నిలిచె, గౌరవభారమును మేల్కొల్పెను.

గోఖ్లేగారి యిచ్ఛానుసారముగా సమితిసభ్యులు గాంధీజీని ప్రీతిభోజన సమావేశములలో గౌరవించుటకు ఏర్పాట్లు గావించిరి. అభిప్రాయములలో, ఆదర్శములలో మోహనదాసుతో ఏకీభవించకున్నను సభ్యులు ఆయన వినయము, సత్యప్రవర్తన, నిష్కాపట్యమును గాంచి ముగ్ధులైరి. మోహనదాసు మాంసము, అన్నము విసర్జించిరి. వారు మోహనదాసుకొరకు ఫలాదులయేర్పాటు గావించిరి. విందులో మోహనదాసు సభ్యులందరితోను పరిచయము కలుగ జేసికొనిరి.

మోహనదాసు భారతదేశములో తన కార్యక్షేత్రమును ఏవిధముగా విస్తరింప చేయుదలచినాడో గోఖ్లేగారు తెలుసుకొనగోరెను. ఏదేని నిర్మాణకార్యక్రమము ఆరంభించుటకు ముందు ఆఫ్రికాలో స్థాపించిన ఆశ్రమముయొక్క ఆదర్శముల ననుసరించి ఒక ఆశ్రమమును స్థాపించ నిచ్ఛగించి నటుల తెలియజేసిరి.

ఫినిక్సుఆశ్రమమును, టాల్స్టాయిఆశ్రమములను గురించి ఆఫ్రికాసత్యాగ్రహ వివరణగ్రంథములో తెలిసికొంటిమి. మోహనదాసు ఆఫ్రికాను విడనాడి భారతదేశమున స్థిర

నివాస మేర్పరచుకొనదలచినట్లును ఫినిక్సు ఆశ్రమవాసులను కూడ భారతదేశమునకు రప్పించ సంకల్పించెను. ఆశ్రమములోని విశిష్ట అధివాసులైన దీనబంధు ఆండ్రూసు, మగనలాల్ గాంధి, పియర్సన్ మొదలగు విశిష్టవ్యక్తులుకూడ ఆయనతో భారతదేశమునకు వచ్చి కార్యక్షేత్రమును రచింప సంకల్పించుకొనిరి. భారతదేశములో నేదియో యొకనిర్జనశ్యామలప్రాంతమందు ఆశ్రమమును స్థాపించుటకును, సరళప్రకృతిలో సహజ ఆడంబరహీనజీవితయాత్రను గడపుటకును, ప్రశాంత ఆశ్రమ వాతావరణములోనుండి నీరవముగా మనుష్యత్వసాధనలో నిమగ్నము కావలయుననియు సంకల్పించుకొనిరి. కాని కోరికయున్నంతమాత్రమున నే పనియు నెరవేరజాలదు. ఆశ్రమముకొరకు భూమి కావలెను, ధనము కావలెను. తగిన ఏర్పాట్లు కావలయును. ప్రథమముగ భూమి దొరుకకున్నను తరువాత ఆలోటు తొలగిపోయినది. ఆఫ్రికాలో సత్యాగ్రహవిజయమువలన గాంధీజీ విషయమున సానుభూతిపరులు గ్రహించియున్నను, విద్యావంతులు, దేశహితైషులనేకులు ఏర్పడుచుండిరి. అందువలన గాంధీజీ దేశపర్యటనమునకు బయలుదేరినప్పుడు అనేకమంది ధనికులు, నాయకులు, అవసరమగు భూమిని, ధనమును, దానము చేయుదుమని సూచనలు వచ్చియుండెను.

గాంధీజీ ప్రథమముగ భారతదేశమునకు వచ్చిన పిమ్మట మొదటివద్దనుండియు ధనము ఆశించకపోవుట ఆయన

యొక్కయు ఆశ్రమవాసులయొక్కయు కోరికయై యుండెను. భారతదేశములో ఆశ్రమమును నిర్మించుటయే వారియుద్దేశము కాని నేను గోఖలేగారు ప్రశ్నించుటచే ప్రియమైన ఆశ్రమపరిస్థితులకు తగిన యేర్పాట్లు గావించవలెననియే ఆయన తనకోర్కెను వెల్లడించెను.

ఆశ్రమనిర్మాణము, కార్యక్రమముల విషయమై విని గోఖలేగారు మహదానందపరవశులైరి. ఆయన తత్క్షణమే యిట్లనుడివిరి— "నీవు ఆశ్రమమును స్థాపించుము, నీ ఆశ్రమమునకు కావలసినదంతయు నానుండి లభించును. దానిని నాఆశ్రమముగానే భావింతును.

విస్మయమొందిన గాంధిజీహృదయము కృతజ్ఞతతో నిండిపోయెను. ఆయన యిట్లు తెలిపిరి— "నా కార్యములకు సర్వశ్రేష్ఠమైన సహాయమును బడిసితిని, నాయాత్రామార్గమున సముద్ధరించు పథప్రదర్శకుని దర్శనము పొందితిని"

దుశ్చింతిలమంచును భేదించుకొని విశ్వాసజ్యోతి వికసించెను.

మోహనదాసు గోఖలేవద్ద శెలవు యిప్పించమని ప్రార్థించెను.

శయ్యాగతగోఖలే నేత్రములు మూసుకొని ఏదియో కొంచము భావించి, పిమ్మట చిరునగవుతో "నీవు యిప్పుడు ఎచ్చటికి వెళ్ళెదవు? అని ప్రశ్నించెను.

గాంధీజీ 'నాయకోటుకు సర్వాధిగ్రహమునకు' అని జవాబిచ్చెను.

గోఖ్లేగారు నవ్వుచు యిట్లు నుడివెను—'నీవు యీసారి భారతగవర్నమెంటుకు విరుద్ధముగా సత్యాగ్రహముచేయుటకు పోవుచున్నావని తలంచితిని.'

గాంధీజీసరళహృదయులైన గోఖ్లేగారిహాస్యములో పాల్గొనెను. 'ఇకను ఇప్పుడు అవకాశమేది. యుద్ధములో సర్కారువారికి సహాయము చేయుటవలన సర్కారువారు నాకు బిరుదు కొసంగియున్నారు.

గాంధీజీ స్వేచ్ఛాసేవకసైన్యమును తయారుచేసి యుద్ధసమయములో బ్రిటిషువారికి సహాయము చేసియుండుటచే ఆయనకు విశేషగౌరవము సమకూరెను. ఆయన 'కైజర్ హింద్' అను బిరుదుచేత గౌరవింపబడిరి.

గాంధీజీవద్ద గోఖ్లేగారు అన్నియు వివరముగా వినియుండిరి. పిమ్మట యిట్లు నుడివిరి. కాని నేడు ఏసర్కారు నిన్ను గౌరవించుచున్నారో వారే రేపు కొన్నిదినములతరువాత మరల నిన్ను ఖైదీగాచేయవచ్చును. ఏఆదర్శములచేత సర్కారు వారిసేవ నీవు చేయుచున్నావో, ఆయాదర్శములకొరకే సర్కారువారిని మరల నీవుయుద్ధమునకు ఆహ్వానింపవచ్చును. నీవు నీసత్యముద్వారా అన్నిటిని పరీక్షించుము.

గాంధీజీ అంగీకారసూచనగా తలయూపెను. కొంచెముసేపు తరువాత మరల గోఖ్లేయిట్లునుడివిరి—"ఈవిష

యములో నీకు నేను చెప్పవలసిన దొకటికలదు' గాంధీజి జిజ్ఞాసునేత్రములతో గోఖలేవైపునకు చూచుచుండిరి. గోఖలే యిట్లు నుడివిరి — "భారతదేశమునకు, భారతీయులకు నీవు సేవచేయుటకు ముందు భారతదేశమంతయు ఒకసారి తిరిగి రమ్ము. దక్షిణాఫ్రికాలోనవలె యిచ్చట నీ కార్యక్షేత్రము కొన్నివేలజనముతో సమకూడునది కాదు — ఇచ్చట 40 కోట్లప్రజలలో పని చేయవలసియుందువు. 40 కోట్లప్రజల సేవ చేయవలసివచ్చినప్పుడు నీవంటికర్మయోగి 40 కోట్ల ప్రజలను తెలుసుకొనుట మంచిది. సమస్తభారతదేశములో వివిధస్థానములందున్న భారతీయుల అభావములను దుఃఖ కష్టములను ముందు తెలుసుకొనుట మంచిది.

గాంధీజీ గోఖలేవైపునకు చూచుచుండెను. సత్యాశ్రియుడగు మోహనదాసుడు ఇట్లు తలచెను— 'నిజముగా, దేశసేవ చేయదలంచిన దేశమును ముందు తెలుసుకొనుట చాలా అవసరము. కేవలము బొంబాయి, రాజకోట తిరిగి వచ్చినంతమాత్రమున కోటానకోట్లప్రజల సాధకబాధకములు గ్రహించుటకు వీలులేదు. ముందుభారతదేశములోని లోపములన్నియు తెలుసుకొని అనుభవమును సంపాదించవలయును.'

గాంధీజీ భారతదేశములో తన ఆదర్శముల ననుసరించి సేవచేయ సంకల్పించుకొనిరి. కాని కార్యప్రణాళికను

స్థిరపరచుకొనలేను. గోఖలే ఆయనకు ఆ ప్రణాళికను ప్రశంసించెను.

గోఖలేగారి ఉపదేశానుసారముగా నడచుకొందునని గాంధీజీ సంతోషముతో ఆయనకు తెలియజేసిరి. రాజకోటకు పోయి వచ్చి సమస్తభారతదేశమును పర్యటన గావించుటకు స్థిరము చేసికొనిరి.

రోగగ్రస్తుడైన గోఖలే సంతృప్తితో నవ్వుచుండెను. గాంధీజీకూడా నవ్వుతో నిట్లు తెలియజేసిరి. 'నేను శలవు తీసుకొనుచున్నాను. ప్రతిసమస్యలో తమసలహాకొరకు వచ్చి తమకు శ్రమ కలుగచేయుచుందును.

గోఖలే— నీవు ఎన్నిసార్లు అయినను రావచ్చును. నాద్వారము నీకొరకు ఎల్లప్పుడు తెరువబడియే యుండును.

శిశువువంటి సరళమైన, దేవతవంటి మహాత్ముడైన వ్యక్తికి ప్రణామములు సమర్పించి గాంధీజీ ఆయనవద్దశలవు గైకొనిరి.

ఇచ్చట ఒక్కవిషయమును చెప్పి గాంధీజీ భారతదేశభ్రమణచరిత్రమువైపునకు దృష్టిని మరల్చెదము. ఇదివరకే చెప్పితిమి. ఆయన ఇతిహాసప్రసిద్ధమైన సత్యాగ్రహముద్వారా బ్రిటిషుసర్కారువారి కోపదృష్టిని ఆకర్షింపగలిగినారు. మరలప్రథమమహాయుద్ధములో సర్కారువారికి సహాయముచేసి సర్కారువారి శ్రద్ధాగౌరవములను ఆకర్షింపగలిగిరి. ఇంగ్లీషువారు గాంధీగారిఉద్దేశమును కనుగొనలేక

పోయిరి. కాని ఆయనహృదయములోని సత్యమును, నిష్కా-
పట్యమును గ్రహింపగలిగిరి. అందువలన గాంధీజీఇంగ్లాండు
నుండి బొంబాయికి వచ్చినప్పుడు బొంబాయిశాసనకర్త
(లార్డు విల్లింగుడన్, 1915 లో గవర్నరు) ఆయనను చూచి
వెళ్ళుమని గాంధిగారికి ఆహ్వానము పంపిరి. గాంధీజీ శాసన
కర్తను దర్శించిరి. శాసనకర్త గాంధీజీతో యీమాట
ఆమాట మాట్లాడినపిమ్మట ఆయనతో యిట్లు నుడివెను.
'నేను ఒకవిషయము మీకు చెప్పుచున్నాను. సర్కారువారికి
మీరు ఎప్పుడైనను ఏదయినను పని తలపెట్టినప్పుడు ముం
దుగా నాకు తెలియజేసి, నాతో మాట్లాడి, తరువాత మీ
యిష్టానుసారముగా చేయవచ్చును. ఇది నాకోరిక.' 'నేను
యీవిషయములో మీకు సహజముగా వాగ్దానము చేయు
చున్నాను. సత్యాగ్రహిగా నేను ఎవరికిని విరుద్ధముగాఏపని
తలపెట్టినను, ఆవిషయమును సంపూర్ణముగా తెలుసుకొని,
దానికి అనుకూలముగా సర్వప్రయత్నములు చేయుటయే
నానియమము. దక్షిణాఫ్రికాలో యీనియమమునే అవలం
బించితిని. ఇప్పటికూడ దానినే పాలింతును.

శాసనకర్త ఆయనమనోభావమును గ్రహించి ఆయ
నకు ధన్యవాదము లర్పించెను. గాంధీజీ తిరిగి వచ్చెను.

ఇచ్చట గాంధీజీకార్యక్రమమునుగురించి మరికొంత
గ్రహింపవలసియున్నది. గాంధీజీసత్యాగ్రహము అపూర్వ
మైన, విచిత్రమైన అస్త్రము. ఈసత్యాగ్రహవిషయమై

ప్రపంచములో ఏమి ఆలోచనలు జరుగుచున్నవో మహాత్ము తెలియును. భావికాలములో నేవిధముగా వ్యాఖ్యానము చేయబడునో మన మెఱుగము. కాని ఆయనద్వారా మనకు తెలిసినవిషయ మేమనగా, ఆయన ఎవరికి విరుద్ధముగాయినా అస్త్రమును ప్రయోగింప సమకట్టినను ముందుగా ఆయనను బాగుగా గ్రహింతురు. ఆ మనస్స్వభావము, కార్యప్రణాళికను గురించి ఆలోచింపగోరుదురు. కేవలము అంతియేగాక, ఆయనకు విరుద్ధముగా సంగ్రామము చేయుతలపెట్టినప్పుడు ఆయనలో హృదయపరివర్తనము కలిగించుటకు ప్రయత్నింతురు. గాంధీజీ లౌకికలవిషయములో ఆయనకు సానుభూతి కలుగునట్లుగా చేయుదురు. ఆయనఉద్దేశమును తెలియచేయుదురు; కోర్కెను తెలియచేయుదురు. వాంఛించినదానిని నెరవేర్చమని ఆయనవివేకమును వేడుకొందురు. ఆప్రసంగమునుబట్టి వినయపూర్వకముగా ఆయనను ప్రార్థించుకొందురు. కాని ప్రార్థనకూడ ఫలింపనప్పుడు, యీసత్యాగ్రహి కార్యపద్ధతిని స్థిరము చేసుకొనుచుందురు. అప్పుడు ఆ నిరుపాయ పరిస్థితులలో ఆయనకు విరుద్ధముగా సత్యాగ్రహాస్త్రమును ప్రయోగింతురు. ఆయనను సత్యము, నీతివిషయములలో పరాజితుని గావింతురు.

ఆయన సత్యాగ్రహధారను ఆలోచించు యోగ్యత మనకు లేదు. కాని ఆయన భవిష్యత్కార్యప్రణాళికను వర్ణించుటకై, యిచ్చట ఆయనసత్యాగ్రహమును గురించి

ప్రపంచములోనున్న ఒక మహానుభావుడు, సాహిత్యవిశారదుడునైన 'రోమేన్ రోలండు' ఏమి వచించారో మనము తెలుసుకొందుము. రోమేన్ రోలెండు ఇట్లు వచించెను— "ఆయన ఆందోళనముయొక్క మూలసిద్ధాంతము 'సక్రియ ప్రతిఘటన—' ప్రేమద్వారా, విశ్వాసముద్వారా, త్యాగముద్వారా, మూడుశక్తులు సత్యాగ్రహము, అనుపేరుతో ప్రకాశింపబడినవి. ఆయన ఎన్నడును రాజీబేరములకు సమ్మతింపడు. కుటిలనీతిని ఎన్నడును ఆశ్రయింపడు. ఉపన్యాసములలో తన్మయులను చేయనొల్లడు. గర్జనముగా నిశ్శబ్దముగా నుండగోరును. విధాతయొక్క నీరవమైన, నిర్మలమైన సందేశమును వినగోరుచుండును"

పండిత రోలెండు మహాత్ముని సత్యాగ్రహరూపమును సంపూర్ణముగా దర్శించెను. సత్యమునకు మధ్యమార్గముతో నిమిత్తము లేదు. సత్యము అన్యాయములను, మిథ్యలను, చాతుర్యమును, కుటిలనీతిని స్పర్శింపదు. ఉపన్యాసముల జయభేరిని మోగించి తనవాదమును ప్రచారము చేసుకొన కోరదు. సత్యాగ్రహి నిష్కపటహృదయముతో సత్యమును వరించి నిర్భయముగా తనమార్గమున అగ్రసర మగుచుండును. గాంధీజీజీవితములో యీ స్వభావము, కార్యప్రణాళికయే దర్శించితిమి.

౩౯

# భారతభ్రమణము



సుదీర్ఘ మార్గము.........

మార్గములో బాధలు, కష్టములు, భయములు..... దృఢచిత్తముగ పథికుడు అగ్రసరు డగుచున్నాడు.........

బాధలను దూరముచేసి— కష్టములను సహించి— భయమును జయించి—

జీవనమార్గమున అత్యంతదీర్ఘమైనది.

మార్గమునం దెన్నియో బాధలు— కష్టములు— భయములు—

దృఢచిత్తముగల మోహనదాస్ గాంధీ—సత్యాశ్రయి యగు మోహనదాసుగాంధి-

మార్గమం దగ్రేసరుడై— బాధలను తొలగించు కొనెనురా?

కష్టములను సహించెనా?

ఆపదలను జయించెనా?

గాంధిజీ భ్రమణవృత్తాంతమునుండియే ఆయనమార్గమందుగల బాధలు, కష్టములు, ఆపదలను జయించిన యితిహాసమును తెలుసుకొనగలము.

గాంధీజీ ఆయనపదినెగాదని, ఆత్మీయులను దర్శించుటకు రాజకోటకు వెడలిపోయిరి. బొంబాయినుండి వడవాన్ ?

అనుఒక స్టేషనుకు వచ్చిరి. రాజకోటపోర్బుబండికొరకు నిరీక్షించు చుండిరి ఈసమయములో ఒకయువకుడు వచ్చి ఆయనవద్ద నిలువబడెను. 'తమపేరు మోహన్ దాస్ గాంధీ ?' అని ప్రశ్నించెను.

మోహనదాసు మధురహాసముతో తల యూపి అంగీకారము తెలియజేసెను. 'తమరు ఆఫ్రికాలో గావించిన విషయములను మే మెఱుగుదుము. ఇచ్చట జరుగుచున్న అన్యాయముల, అత్యాచారముల పరిహారముకొరకు తమకు నివేదించుకొనుచున్నాను'' అని యువకుడు నుడివెను.

మోహనదాసు అట్లే నవ్వుచు 'నేను యిచ్చటికి వచ్చుచున్నానని మీకెట్లు తెలియును?' అనెను.

యువకుడు—'నాపేరు మతిలాలు, నేను యిచ్చట దర్జీపని చేయుదును. మేము బొంబాయినుండి తమను గురించి వార్తలు తెలుసుకొనుచుంటిమి. నేడు తమరు యిచ్చటికి వచ్చెదరని తెలిసికొంటిమి.' అనెను.

మోహనదాసు—'మీవిషయములు చెప్పండి. నేను తప్పకుండా తోడ్పడెదను' అనెను.

మతిలాలు—'ఇచ్చటి రైలుయాత్రికుల దుర్దశను గురించి తమకు నివేదింపగోరుచున్నాను. ఇచ్చటినుండి ప్రయాణము చేయు యాత్రికులనుండి రైలుఅధికారులు అధికమైన పన్నును, అధికమైన రైలుచార్జిని వసూలు చేయుచుందురు. సామానుల తక్కువగా యున్నను ముక్తి లేదు, పన్ను

కట్టలేని బీదప్రయాణీకులనుండి రైలుఅధికారులు బలవంత ముగా లంచములు వసూలు చేయుచుందురు. లంచములు చెల్లించకపోయినచో అత్యాచారములు, నిందలు, పక్రాంతి గదిలో బంధించియుంచుట మొదలగు కార్యములను జరుపు చుందురు. ఈదుర్నీతులు యాత్రికులకు అసహనీయముగా నున్నవి. తమరు దీనికి ప్రతీకారము చేయవలెనని మాప్రార్థన.'

మోహనదాసు కొంచెముసేపు ఆలోచించెను.

మరల ముఖము పైకెత్తి యిటుల నుడివెను—'ప్రతీ కారము నేను చేయజాలను. తమరే చేయగలరు. నేను మార్గమును మాత్రమే చూపింపగలను. తమరు, యిచ్చటి సాధారణప్రజలు అవుసరమునుబట్టి జైలుకు పోగలరా?'

యువకుడు శాంతిభావముతో జవాబిచ్చెను— 'తప్ప కుండా పోగలము. అన్యాయములను, అత్యాచారములను అంతమొందించ గోరుచున్నాము.' గాంధీజీ మనస్సులో విద్యుల్లతలస్పర్శ తగిలెను. కీర్తిలేని జ్ఞానములేని పడచాన యువకులు అన్యాయమునకు, అసత్యమునకు విరుద్ధముగా శిరముల నెత్తి నిలువబడుటకు సాహసము కలిగినది. భారత దేశమునందంతటను అన్యాయమునకు, అధర్మమునకు, అత్యాచారములకు విరుద్ధముగా యిట్టితీవ్రతరమైన అను భూతిని కలిగింప గలిగినయెడల ఆయన ఆఫ్రికాలో నడిపిన

సత్యాగ్రహమువలన శక్తివంతముగ పోరాటమారంభించుటకు అవకాశము కలుగునని తలంచిరి.

గాంధీజీ మనస్సు ఆనందముతో నాట్యము సలిపెను. మనస్సునందున్న ఆశను, ఆనందమును సంగ్రహించుకొని పైకి శాంతభావమును ప్రకటించుచు ఆయన యిట్లు తెలియజేసిరి—"మంచిది, నేను రాజకోటనుండి తిరిగి వచ్చి మిమ్ములను కలిసికొందును. దీనికి ప్రతీకారము చేయుటకు తప్పక ప్రయత్నము చేయుదము."

యువకమణిలాల్— 'ఈ విషయములో ఇచ్చటి యువకుల ఉత్సాహమును జూచి మేము సంతోషించెదము. ఇచ్చటిపని యేదైనను తమరు మమ్ములను ఏపనిలోకి స్వీకరించినను తమ పవిత్రోద్యమము ఆనందముతో అనుభవించెదము' అని ఆతడు నుడివెను. అప్పటికే మణిలాల్ శలవుగైకొనెను. బండి త్వరలో వచ్చుచున్నదని తెలుసుకొని తృతీయశ్రేణి టిక్కెట్టుకొనుటకు గాంధిజి వెడలిపోయెను.

రైలునుండి గమ్యస్థానమందున్న స్టేషనులో దిగిన పిమ్మట స్థానిక రైల్వేచికిత్సకునివద్ద ఆయన ఆరోగ్యమును గురించి పరీక్ష చేయించుకొనవలయునని టిక్కెట్టు తీసుకొనునప్పుడు విధిరి. అప్పుడు వడవానులో నలువైపుల ప్లేగు వ్యాపించి యుండెను. ప్లేగు యితరచోట్ల వ్యాపించకుండ అరికట్టుటకు అధికారులు ఈ ఏర్పాటు గావించియుండిరి.

గాంధీజీ యీ వ్యాఖ్యానమునకు విచారించలేదు. కాని స్టేషన్లలోనున్న స్నానపుగదులను చూచి విచారించెను రెండురకములగు లోపములుండెను— మొదటిది, ఉన్నతశ్రేణులలో ప్రయాణముచేయు యాత్రికులు పరీక్ష చేయించుకొనవలసిన అవసరము లేకుండెను. రెండవది—తృతీయశ్రేణికి చెందిన దీనదరిద్రులగు యాత్రికులను పరీక్ష అను పేరుతో అనేకవిధముల బాధించుచు, అత్యాచారములు చేయుచుండిరి. మానవునిపై మానవులు ఇట్లు ప్రవర్తింప జాలరు.

గాంధీజీకి ఆఫ్రికాదినములు స్మరణకు వచ్చెను. దుఃఖభారాక్రాంతహృదయముతో ఆయన రైలులో కూరుచుండెను.

రైలులో ఎక్కి తృతీయశ్రేణి యాత్రికుల పరిస్థితులను చూచి స్తంభించిపోయిరి. సన్నని కర్రబెంచీలపై మనుజులు దగ్గరదగ్గరగా కూరుచుండిరి. మూటలపై మూటలు వేసి యున్నట్లుగా కనుపడుచుండిరి. ఒకరి మెడపై మరియొకరి కాలు, ఒకరివీపుపై యింకొకరితల పడియుండెను. కూరుచుండుటకు సామాన్యసౌభాగ్యమైనను లేనివారు నిలువబడియే యుండిరి.

నిలువబడియున్నవారికి మాత్రమే, ఏ అవలంబనము గాని ఏయాధారముగాని పట్టుకొనుటకు లేకుండెను. జన సమూహముచే అణగిపోయి, సలుపైపుల వేయబడిన ఉమ్ములలో, దుమ్ములలో ఊపిరిసలుపక, ప్రక్కనున్న పాయిఖానా

లోని మలమూత్రముల దుర్గంధముచే త్రాహి త్రాహి యనుచు, ఒకరు మరియొకరివీపుమీదను, ఇంకొకరు మరి యొకరి మెడమీదను, వేరొకరు ప్రక్కవారిరొమ్ముమీదను పడుచు ఏదోవిధముగా బందిలదొడ్డిలోని మేకలమందవలె అసహాయులై నిలువబడియుండిరి.

గాంధీజీకూడ వారిబాధలలో, దుర్దశలలో భాగస్వాములైరి. తృతీయశ్రేణి యాత్రికులకు ఇంతదుర్దశయూ, దీనికి ప్రధానకారకులు రైల్వే అధికారులు. తృతీయశ్రేణిలో ప్రయాణము చేయువారుకూడ 'మనుజు' లేనని వారు తలంపరైరి.

అందువలన వారు ధనికులకొరకు చక్కని యేర్పాటులు, చక్కని పెట్టెలు ఏర్పాటుచేయుంచినారు. మానవ జన్మమెత్తియు దరిద్రు డగుటచే మానవాధికారమునుండి వంచితులై పశుతుల్యులగు ప్రయాణీకులకు ఈయేర్పాటులు చాలునని తలచిరి. ఇట్టిపరిస్థితులకు ప్రయాణీకులలోగల లోపములుకూడ కొంతవరకు కారణభూత మగుచున్నవి. వారు బండిలో కష్టము లనుభవించుచుందురు. అయినప్పటి కిని ఒకరు మరియొకప్రయాణీకునకు స్థలమున్నను ఇవ్వక కష్టపెట్టుచుందురు. వారు ఒకరినొకరు నెట్టుకొనుచుందురు. ఒకరి నొకరు తిట్టుకొనుచుందురు. అవుసరమున్న దానికంటె ఎక్కువస్థలమును ఆక్రమించుకొందురు. తమదురవస్థలను వృద్ధి చేయుటకు ఉమ్మి, అరటితొక్కలు, నారింజతొక్కలు, కాగి

తప్పుముక్కలతో బండినంతయు నింపివేసి అనారోగ్యకరముగాను, దుర్గంధయుక్తముగాను గావించుదురు.

ఆఫ్రికాదేశములోని తృతీయశ్రేణి పరిస్థితులచిత్రములే గాంధీజీసమక్షమున ప్రత్యక్షముగా ప్రకాశించెను. స్వదేశములోని దీనదరిద్రులయెడల అధికారుల యీయత్యాచారములు, దేశవాసులలోటుపాటులు, వీనియన్నిటిని తిలకించినపిమ్మట గాంధీహృదయము వేదనాఘాతములచేత కృంగి విరిగిపడిపోయెను. దీనికి ఎట్టి ప్రతీకారము లేదా? తృతీయ శ్రేణికి చెందిన యీఅజ్ఞఅసహాయయాత్రికుల దుఃఖమోచనకు ఎట్టిమార్గము లేదా యని ఆయన తలపోసెను. బండిలో యిన్నిబాధలు పడినను వారికష్టములకు అంతము లేకుండ యున్నది. ఉద్యోగులు వీరిధనమును కొల్లగొట్టెదరు. టిక్కెట్లు యిచ్చుటలో హయరాణా పరతురు. ఆలస్యముచేసి రైలు అందకుండాచేయుదురు. ఏమాట చెప్పబోయినను తిట్టుచుందురు. కొట్టుచుందురు. ఈ అనాచారములకు ఎట్టి విధానము లేదా?

దీని ప్రతీకారమునకు పరిహారవిధానమునకు ఉపాయములు ఆయనహృదయములో జాగరితమయ్యెను. దీని పరిహారప్రతీకారమునకు మార్గము యాత్రికులహస్తములందే గలదు. తృతీయశ్రేణికి చెందిన యాత్రికులు తమ అధికారమును గురించి జాగరూకులైనయెడల, తమ కష్టదుఃఖములను గురించి అధికారులకు సంఘబద్ధముగా నివేదించుకొనినను

కొంతవరకు తగినయోగ్యతలు చేయవచ్చును. కాని ఈ అత్యాచారములకు ప్రతిఘటనము చేయగలవారు ధనికులు, విద్యావంతులు. అసహాయులగు తృతీయశ్రేణి యాత్రికుల విషయము స్మరించుకొని, యాత్రికుల అజ్ఞానమును స్మరించుకుని, సమవేదనాపూర్ణహృదయముతో ధనికులు, విద్యావంతులు తృతీయశ్రేణిలో బీదవానివలె ప్రయాణము చేసి, న్యాయాధికారకవిషయములోను, ప్రాప్తివిషయములోను తమ కోరికలను తెలియజేసినను, అత్యాచార దురాచారములను నిశ్శబ్దముగా సహింపక వానిని ప్రతిఘటించినను, కష్టవముతో ఏమియున్నను, అప్పుడు అధికారులకు చైతన్యము కలుగవచ్చును. శాస్త్రజ్ఞానము స్మరణకు రావచ్చును. అధికారులు తమ అపరాధమును దిద్దుకొనుటకు తొందరపడవచ్చును.

ఆహోజన శైలిలో తృతీయశ్రేణిలో కూరుచుని యాత్రికులయవస్థలను దర్శించి ఆయన ఏ ప్రతీకారమును హృదయములో భావించియుండిరో, దానిని భావిజీవితములో అనేకసారులు దేశవాసులవద్ద ప్రచారము చేసియుండిరి. ఆయన ప్రచారమువలన దేశములో సంపూర్ణచైతన్యము కలుగకపోయినను, ఒక ఆందోళనము బయలుదేరెను. ఆ యాందోళనఫలితముగా అధికారులుకూడ జాగరూకులైరి. అప్పుడప్పుడు తృతీయశ్రేణిలోగల యిబ్బందులను కొంతవరకు సంస్కరించిరి. ఇంకను విశేషముగా సంస్కరింపబడు

నని ఆశను కలిగించిరి. బ్రిటీషువారి హయాములో తృతీయశ్రేణి యాత్రికులదురవస్థలు తొలగింపబడలేదు. మనజాతీయసర్కారువారైనను మహాత్ముని హృదయమును స్మరించుకొని, తమ స్వదేశములోని కోటానుకోట్ల దరిద్రప్రజల హృదయములను స్మరించుకొని యీయిబ్బందులను సంపూర్ణముగా తొలగింతురని ఆశించుచున్నాము.

దరిద్రబాంధవుడైన గాంధీజీ రాజకోట స్టేషనులో దిగెను. ఆరోగ్యపరీక్షకై స్టేషనులోనున్న చికిత్సకునివద్దకు వెళ్ళిరి. చికిత్సకుడు సంభాషణద్వారా ఆయనపరిచయమును పొందగలిగెను. ఆయన సిగ్గుపడి, అనుమతిపత్రమిచ్చి గాంధీజీని పరీక్షనుండి తప్పించెను.

తాను తప్పించుకొనినాడు. కాని దరిద్రులు అసహాయులునగు సోదరులకష్టములు ఆయనహృదయమును పీడింపజొచ్చెను.

రాజకోటనుండి మరల వఢవానుకు వచ్చెను. మోతీలాలును, ఇతరయువకులను కలుసుకొని మాట్లాడెను. నేను ముందు అధికారులకు తెలియజేసి ప్రతీకారమునకు ప్రార్థించెదనని ఆయన వారికి తెలియజేసెను. వారు యీఅన్యాయములను తెలుసుకొని దానికి తగిన ప్రతీకారము చేయుదురని ఆశించుచున్నాను. కాని వారు అంగీకరించక పోయినచో మీరు కార్యక్రమమును సాగించవలసియుండును.

యువకులు ఆయన ఆజ్ఞానుసారముగా నడచుకొనుటకు సంసిద్ధులైరి.

గాంధీజీ స్టేషనుకధికారులకార్యకలాపములనువర్ణించి ఢిల్లీలోని కేంద్రప్రభుత్వమువారికి ఉత్తరము వ్రాసిరి. అధికారులు ప్రథమమున దీనికి అంతగా ప్రాధాన్యము నియ్యలేదు. గాంధీజీకూడ సహజముగా వదలలేదు. దాదాపుగా రెండుసంవత్సరములు ఈవిషయమై ఉత్తరప్రత్యుత్తరములు జరిగెను. తుదకు లార్డు చెమ్స్‌ఫోర్డును వారు దర్శించినపుడు రైల్వేఅధికారులనుగురించి ఆయనకు తృతీయశ్రేణియాత్రికులదురవస్థలనుగురించి తెలియజేసిరి. చెమ్స్‌ఫోర్డు అప్పుడు దీనిలో కలుగజేసికొనెను. ఆయన గావించిన విచారణఫలితముగా అధికారుల అన్యాయమునుగురించియు, దుర్నీతిని గురించియు తెలిసికొనిరి. యాత్రికులవస్తువులపై పన్ను వసూలుచేయు పద్ధతిని రద్దు చేసిరి.

పదునారుయువకులు సిద్ధులైరి. వారు జలగలాంటి కర్మనిరతితో యేకీభవించి కార్యము లొనర్చుటకు అంగీకరించిరి. వారికి తప్పక పని చూపించెదనని గాంధీజీ మాట యిచ్చెను. భారతదేశము పర్యటించినపిమ్మట వారిని ఆహ్వానింప తలంచెను. గాంధీజీ యీ యువకులలో అనేకులను సబర్మతీఆశ్రమములో చేర్చుకొనెను. వారు ఆయన ఆదర్శములతో ప్రబోధితులై అనేకవిధముల ఆశ్రమసేవ చేసియుండిరి.

దీనితరువాత గాంధీజీ గుజరాతుజిల్లాలో కొన్నిస్థానములలో సంచారము చేసెను. ఆయనసేవవలన, కార్యములవలన గుజరాతులో ప్రజల ఆదరణమును సంపాదించెను. గుజరాతురాజనైతికసభలో ఒకసారి సభాపతిగాకూడ నుండిరి. గుజరాతుబాగ్ సేరా అనుష్ఠానములో ఒకసారి సత్యాగ్రహమునుగురించి ఉపన్యాసముకూడ నొసగి యుండెను. ఆయనఉపన్యాసవార్త గుప్తచరునిద్వారా సర్కారువారికి కర్ణగోచర మాయెను. సర్కారువారి ఉన్నతోద్యోగి ఆయనను దర్శించి, యీ అప్రీతికరమైన ఉపన్యాసము నెందుకు గావించిరో తెలుసుకొనగోరెను. గాంధీజీ దానికి జవాబుగా యిట్లు వచించెను. 'స్వదేశప్రజల మంగళముకొరకు నేను దేశవాసులను జాగరూకులనుగామాత్రమే చేయుచున్నాను. ఇది లోకవిద్య. ప్రజలకు తమదుఃఖకష్టములను తొలగించుకొనుటకు సర్వవిధములైన ఉపాయములను చూపించుట నా ధర్మము. స్వాతంత్ర్యమును పొందనభిలషించువారు తమను రక్షించుకొను మార్గములనుకూడా తెలిసికొని యుండుట మంచిది. మామూలుగా యీ యుపాయము హింసామూలకమై యుండును. నేను హింసకు బదులుగా సత్యాగ్రహము అనుమార్గమును చూపించితిని. సత్యాగ్రహము కేవలము అహింసాస్త్రము, అయినను దీనిరీతినీతులను తెలియజేయుట నాకర్తవ్యము.'

భారతీయుల దుఃఖదుర్దశల ప్రతీకారోద్దేశముతో గాంధీజీ తనసత్యాగ్రహమను అస్త్రమును భారతసర్కారువారికి విరుద్ధముగా ప్రయోగించుటకు ఆయన అనేకోపాయములను సంకల్పించుకొనెను. ఆఫ్రికాలోని అనుభవమువలన సత్యాగ్రహము సర్వమును జయించు అస్త్రమని ఆయన గ్రహించెను. విరుద్ధపక్షమువారు ఎంత శక్తివంతులైనను తగినవిధముగా తగినవాతావరణములో ప్రయోగింపబడినచో సత్యాగ్రహమునకు తప్పక జయము కలుగును.

సత్యాగ్రహసంగ్రామమును ఆరంభించుటకుముందు భారతదేశములో ప్రథమమున ఒకవిశేషసమస్యను పరిష్కరింపవలసిన అవసరముండెను. తగినభావములను, తగిన వాతావరణమును సృష్టించుట, సత్యాగ్రహము ఆరంభించుటకుముందు దానివిషయములో దేశవాసులను జాగరూకులనుగాను, యోగ్యులనుగాను చేయవలయును. దేశము దీనికొరకు ఎంతవరకు సంసిద్ధముగా నున్నదో చూడవలయును. స్వాతంత్ర్యముకొరకు భారతీయులు ఎంత ఆతురతతో నున్నారో తెలిసికొనవలయును. భారతదేశము ఆత్మశోషణ నీతికబళమునుండి సముద్ధరణ కోరుచున్నది. స్వాతంత్ర్యమును కోరుచున్నది. ఈవిషయమును గాంధీజీ హృదయపూర్వకముగా గ్రహింపగలిగెను. అయినను విద్యార్జనకొరకు, ఆఫ్రికాలోని పీడితభారతీయులకొరకు ఆయన 23 సంవత్సరములు స్వదేశమునుండి దూరముగానుండెను. అందు

వలన స్వదేశమునకు తిరిగి వచ్చినపిమ్మట దేశములో నలు వైపులనున్న పరిస్థితులను గ్రహించుట, దేశవాసులపరి స్థితులు, వారి ఉత్సాహము, అనుభూతి ప్రత్యక్షముగా గ్రహించి, తనచింతనములను, అనుభూతిని, కర్తవ్యములను స్థిరపరచుకొనుట ఆయనకు ప్రధాన కార్యములై యుండెను.

అందువలన సత్యాగ్రహముతో సంగ్రామక్షేత్రము లోనికి దిగుటకుముందు ఆయన సాధ్యానుసారముగా భారతదేశ ములో అచ్చటచ్చట తిరుగుట ప్రారంభించిరి. అవసరమును బట్టి ఒకటి రెండుస్థానములలో ఆఫ్రికాలో జరిగిన సత్యా గ్రహేతిహాసమును వర్ణించుచు దానికౌశలమును సాధారణ ప్రజలకు తెలియజేయుచుండిరి. అప్పుడప్పుడు భావనాశీల మానసముద్వారా మానవునిఆకాంక్షలను, కోరికలను గ్రహిం చుచుండిరి. ఆయనయందుగల యీ యనుభూతి గుజరాతు లోని బాగసేరాయను గ్రామములో కొంతవరకు ప్రకాశిం చెను. ఈ యనుభూతిని గురించియే ఆయన నిర్భయముగా సర్కారుఉద్యోగస్థునకు తెలియజేసెను.

---

## 36

## శాంతినికేతనము

అనంతరము గాంధీజీ రవీంద్రనాథఠాకూరు వంగ దేశములో స్థాపించిన 'శాంతినికేతనము' అను ఆశ్రమము

నకు ఏతెంచిరి. ఆసమయములో రవీంద్రకవీంద్రుడు శాంతినికేతనములో లేడు. కాని శాంతినికేతనములో వ్యవస్థాపక సభాసభ్యులు, అధ్యాపకులు పరమాదరముతో, ఆనందవదనములతో శీర్ణదేహియు, ఆఫ్రికాలో భారతదేశ ముఖమును మహోజ్వలపరచినవాడును, వీరపురుషుడునైన గాంధీజీని తమఆశ్రమప్రశాంతవాతావరణములోనికి శ్రద్ధాభక్తులతో వరించి స్వాగత మిచ్చిరి.

రవీంద్రకవీంద్రుడు అప్పుడు విదేశములో నుండెను. విదేశమునుండియే ఆఫ్రికాలో సత్యాగ్రహ సాఫల్యతను సాధించిన గాంధీజీకి ఉత్తరములద్వారా అభినందనములను తెలియజేసెను. తనఆశ్రమమైన శాంతినికేతనమును చూడుమనికూడా గాంధీజీని ఆఉత్తరములోనే కోరియుండెను. గాంధీజీ ఆఫ్రికాలో ఫినిక్సుఆశ్రమవాసులనుకూడా భారతదేశమునకు తీసుకొనివచ్చుటకు సంకల్పించెననికూడ రవీంద్రుడు వినియుండెను. అందువలన గాంధీజీకి అంగీకారమైన యెడల, ఆయన భారతదేశములో అన్యస్థానమందు ఆశ్రమమును స్థాపించుటకుముందు, ఫినిక్సు ఆశ్రమవాసులను తన ఆశ్రమమగు శాంతినికేతనములో ఉంచుటకు ఏర్పాటు చేయవచ్చునని కూడ రవీంద్రకవీంద్రుడు గాంధీజీకి తెలియజేసెను. ఈ విషయములో తగిన యేర్పాట్లు చేయుటకు కూడ శాంతినికేతన అధికారులకు ఉత్తరము వ్రాసిరి.

గాంధీజీ ఫినిక్సుఆశ్రమవాసులను ఆయనతో కూడా భారతదేశమునకు తీసుకొనివచ్చుటకు సంకల్పించుకొని యుండెనని మనము ఇదివరకే తెలుసుకొంటిమి. కాని వారినితీసుకొనివచ్చి ఎచ్చట ఉంచుట యనియు, వారు ఉండుటకు భోజనాదులకు ఏర్పాట్లు యెట్లు జరుగుననియు, ఆశ్రమవ్యయ భారమును వహించుట యెట్లు అనియు ఆయన చింతాగ్రస్తుడయ్యెను. రవీంద్రుని ఉత్తరములో గాంధీజీకి తాత్కాలిక యేర్పాట్లు అన్నియు గావింపబడియున్నవని తెలిపెను. ఆశ్రమవాసులను తాత్కాలికముగా శాంతినికేతనములో ఉంచిరి.

పిమ్మట పర్యటనముగావించుచు ఆయనకూడ శాంతినికేతనమునకు వచ్చెను. ఆశ్రమఅధ్యాపకులు రవీంద్రుడు వ్రాసిన మరియొకఉత్తరము గాంధీజీహస్తములో పెట్టిరి. "మహాత్మాజీ, ఆయనసహధర్మిణి యింతలో ఆశ్రమమునకు వచ్చియుందురని తలంచుచున్నాము" అని ఉత్తరములో వ్రాసిరి.

గాంధీజీ సహజసిద్ధముగా నవ్వుకొనెను.

విశ్వకవి రవీంద్రుడే ప్రప్రథమమున గాంధీజీని మహాత్మునిగా గ్రహింపగలిగెను. కాని ఎందువలన?

పూర్వాకాశమున ఉదీయమానమగుచున్న మహోజ్జ్వలసూర్యుడు—

సూర్యుడు తనజ్యోతిని సాగరనీలతరంగములలో
వ్యాపింపజేసెను—

నీలసాగరము తనఅగాధవైశాల్యముచేత, మహత్తర స్వరూపముచేత, అపారశక్తిచేత సూర్యునిసముకుమునప్రకాశిత మయ్యెను.

ఆ అనంతసాగరములలో అపారజలరాశి విస్తృతమైయున్నటుల ప్రపంచములో ప్రథమమున సూర్యుడే గ్రహించెను. ప్రభాతపుప్రశాంతగంభీర జలరాశిగర్భమున తరంగములమహత్తరగర్జనములు దాగియున్నవి — విలీనమగుచున్న ఆయనంత దిగంతమున ప్రళయకాల ఝంఝామారుతములు దాగియున్నవి.

శాంతసంద్రమునగల అశాంతరూపమును సూర్యుడే ప్రథమమున గ్రహింపగలిగెను.

అనంతజలరాశిలోని అనంత మాహాత్మ్యమును గ్రహించెను.

మహోజ్జ్వలసూర్యుడు మహత్తరసముద్రమును ప్రభాతలగ్నమున వరించి స్వీకరించెను.

ఆమహామానవునిలో సంచితమైయున్న అనంతశక్తిని ప్రపంచములో ప్రథమమున విశ్వకవియే దర్శింపగలిగెను. ప్రశాంతమైన, ధీరగంభీరమైన, మృదుమందహాసపూర్ణమైన వదనమండలములో సంకల్పముల, ప్రబోధముల మహత్తర ప్రవాహము దాగియుండెను — క్షుద్రదేహములో కర్మల,

ములను చూచి ఆయన విశ్వకవికి భక్తిపూర్ణప్రణామము లర్పించెను. ఈ ఆశ్రమము, దీని విద్యాపద్ధతులు, దీనిలోని జీవనయాత్రా ప్రణాళికలవలన ప్రాచీనకాలపుగౌరవాన్వితమైన భారతదేశవిషయములు నాకు స్మరణకు వచ్చుచున్నవని ఆశ్రమఅధ్యాపకులకును, విద్యార్థులకును తెలియజేసిరి. విశ్వకవి కేవలము శ్రేష్ఠమైన కవియేగాక, ఆధునికమైన కృత్రిమమైన సభ్యతామోహముచేత భ్రాంతులైన, పథభ్రష్టులైన భారతీయులకు మార్గప్రదర్శకుడు, నాజీవితమునకు కూడ మార్గదర్శకుడు. నాకు 'గురుదేవు' లుకూడ నైరి.

విశ్వకవి నుద్దేశించి విశ్వములోని శ్రేష్ఠమానవుడు అపారశ్రద్ధాభక్తులతో శిరమును నత మొనర్చెను.

ఆఫ్రికాలోని గాంధీజీఆశ్రమవాసులు దాదాపుగా అందరును శాంతినికేతనములో వసించుచుండిరి. మగన్‌లాల్ గాంధీ, ఆండ్రూసుగారు, పియర్సన్ గారు, శ్రీమతికస్తూరిబాయి మొదలగువారందరును, శాంతినికేతనములో ప్రశాంతవాతావరణములో వసించుచు నూతనకార్యములకొరకు నూతనశక్తిని సంపాదించుకొనుచుండిరి. గాంధీజీ ఆదేశము కొరకు నిరీక్షించుచుండిరి.

ఈసమయములో శాంతినికేతనఆశ్రమమందుగలఒక విషయము సంస్కరింపబడవలెనని గాంధీజీ దృష్టికి కనుపడుచుండెను. కాని ఈవిషయమై ప్రథమమునతన సహచరులతో ఆలోచించెను. పిమ్మట దీనిని సంస్కరించుట, పరివర్తనము

చేయుట యనుచితమని తలంచి ఆశ్రమఅధ్యాపకులకును, విద్యార్థులకును తెలియజేసిరి.

ఆవిషయమును ఇచ్చట ఉల్లేఖించుట అప్రకృతము. ఆశ్రమవాసులు ప్రత్యేకముగా వంటబ్రాహ్మణుడు వండిన పదార్థములను భుజించుచుండిరి. దీనివలన ఆశ్రమవాసులకు ఆత్మనిర్భరత, విద్యావిషయములలో లోపములు యేర్పడుచున్నవి. ప్రత్యక్షముగా మాడకపోవుటచేత ఆహారవిశుద్ధతకు, పరిచ్ఛిన్నతకు హాని కలుగుచున్నదని గాంధీజీ వారికి తెలియజేసెను. వేతనభోగియగు పాచకుడు విశుద్ధత, పరిచ్ఛిన్నతల విషయములో దృష్టినుంచక త్వరిక గతిని పని పూర్తి చేయువిషయములోనే విశేషశ్రద్ధ వహించును. దీనివలన గురుదేవునిఆశ్రమధర్మమునకు హాని కలుగుచున్నది.

ప్రాచీన భారతదేశ విద్యార్థులచరిత్రను కథారూపమున అచ్చటివిద్యార్థులకు వినిపించెను. ఆకాలపువిద్యార్థులు విద్యనభ్యసించువారు. ఆశ్రమముకొరకు ఆహారపదార్థములను, కట్టెలను సంపాదించువారు, స్వహస్తములతో వంట చేయువారు, సకలకార్యములు నెరవేర్చువారు, అప్పుడే వారిద్వారా పూర్ణమైన ఆశ్రమధర్మము నెరవేర్పబడుచుండెను.

ఆయనమాటలను ఆలకించినపిమ్మట అధ్యాపకులును, విద్యార్థులును ఉత్సాహములో నిమగ్నులైరి. వారుసంకోచమును పరిత్యజించిరి. జడభావమును విసర్జించిరి. సమయానుసారముగా తమఆహారమును తామే వండుకొనుచుండిరి.

అనాడంబరమైన, విశుద్ధమైన ఆహారమును వారు తృప్తితో భుజించుచుండిరి. గాంధీజీ సహచరులు కూడ యీ స్వావలంబన ఆశ్రమవాసులలో యొకరై పనిచేయుచుండిరి. వంటలో సహాయము చేయుచుండిరి. వంటపాత్రలు, భోజనపాత్రలు కడుగుచుండిరి. వంటసాల శుభ్రముగా కడుగుచుండిరి. ఆశ్రమములో నవజీవనస్ఫూర్తి ఆరంభమాయెను. సేవావ్రతుడును, సత్యాగ్రహియునైన గాంధీజీకి ఇది నూతనఆదర్శము కాదు. ఈఆదర్శము ఆఫ్రికాఆశ్రమములోనే చూచితిమి. 1901 వ సంవత్సరములో కలకత్తాలో జరిగిన కాంగ్రెసు స్వేచ్ఛాసేవకదళమున యీ సేవాదర్శముయొక్క పరిచయమును పొందితిని. నిగ్రహమును, స్వావలంబనమును మూలమంత్రముగా స్వీకరించుటయే సత్యాగ్రహిని ధర్మము. సాధారణప్రజలపనియు, తనపనియు సాధ్యమైనంతవరకు తనశక్తిద్వారా నెరవేర్చుటయు, ఏవిషయములోనైనను పరులసహాయమును కోరక ఆత్మనిర్భరశీలురగుటకు ప్రయత్నించుటయే సత్యాగ్రహికర్తవ్యము. ఈఆత్మనిర్భరతయొక్క ఆదర్శములనే ఆనాడు శాంతినికేతనవాసులకు ఆయన బోధించెను.

శాంతినికేతనములో ఆయన అధికదినములు వసింపలేదు. గోఖలేమహాశయుడు పరమపదించినట్లు హఠాత్తుగా ఆయనకు తంతి వచ్చెను. గాంధీజీ వ్యాకులత చెందెను. గోఖలే చూపించిన స్నేహమునను, ఉపదేశములలోను,

చిత్రమును దర్శించెను. ఆ వేదనచే ఆయన హృదయము ద్రవీభూతమై పోవుచుండెను. రంగూనులో పని ముగించి తిరిగి భారత దేశమునకు వచ్చెను.

ఆసంవత్సరము హరిద్వారములో కుంభ మేళ జరిగెను. తనఆశ్రమ వాసులను తోడ్కొని కుంభ మేళకు పోవలయునని గాంధీజీకి కోరిక కలిగెను. మేళా క్షేత్రమున నసంఖ్యాకులగు యాత్రికుల సేవచేయ సంకల్పించుకొనెను. కుంభ మేళకు పయనమై పోయిరి. అచ్చటికి గోఖలే సేవకులకు చెందినకొందరు స్వేచ్ఛా సేవకులుకూడ సేవచేయుటకు వచ్చిరి. గాంధీజీ దళము వారితో సహకరించి భక్తులను, దర్శనార్థులైన యాత్రికులకు వివిధవిషయములలో సేవ చేయుచుండిరి. యాత్రికులకొరకు పాయిఖానాలుగా ఉపయోగించుటకు గోతులను త్రవ్విరి. పాయిఖానాలనుండి మైలను వారు శుభ్రము చేయుచుండువారు. మేళాక్షేత్రమును పరిశుభ్రముగను, దుర్గంధరహితముగను చేయుచుండిరి. గోఖలేగారి స్వేచ్ఛా సేవకులుకూడ గాంధీజీదళమువారి సేవను చూచి ముగ్ధులైపోవుచుండిరి. గాంధీజీ పేరు మేళాక్షేత్రములోకూడ నలువైపుల వ్యాపించెను. తీర్థయాత్రికు లనేకులు గాంధీజీ దళమువారి కార్యములను చూచుటకు వచ్చుచుండిరి. సుధీవరులు, పండితవరులు గాంధీజీ కార్యములకు, ప్రణాళికలకు పక్షమునను, విపక్షమునను, సేవావిషయములోను, ధర్మ విషయములోను వివిధములైన ఆలోచనములను గావించు

చుండెరి, గాంధీజీ కేవలము అందరికిని పరిచితులేగాక, విఖ్యాతినికూడ గడించిరి. బయటికి పోయినయెడల వందలకొలది వేలకొలదిజనము ఆయనతోకూడ నడచుచుందురు. దేశాలో ప్రవేశించినయెడల దర్శనముకొరకు ఆయనచుట్టూ వేలకొలది ప్రజలు మూగుచుందురు.

గాంధీజీ విచలితుడయ్యేను. నాస్తికులఅంధప్రేమను గాంచి అప్పుడప్పుడు విరక్తుడగుచుండెను.

స్తుతిప్రశంసలపై గాంధీజీకిగల అనాసక్తి, విరక్తి ఆయనసచ్చారిత్రములో మహత్తరమైన విశేషత్వము. సామాన్యమైన కుంభమేళవిషయము విడిచిపెట్టినను, ప్రపంచములో ప్రసిద్ధులైనపిమ్మట, మహాత్ములైనపిమ్మట పూజితులైనపిమ్మటను, అనేక దేశముల కోటానుకోట్లప్రజలు, సంఘములు ఆయనపై శ్రద్ధాభక్తులను నివేదించుకొనిరి. ఆకాశపాతాళములు ముఖరితమగునట్లు జయధ్వనులను గావించిరి. దీనివలన మహాత్మాగాంధి అనేకసారులు దుఃఖించినారు. విరక్తి చెందినారు. అట్టిస్థానములను వదలి ఆయన వెడలిపోయిరి. 1947 వ సంవత్సరము ఆగస్టునెలలో కలకత్తా బెలెఘాట్ విషయము స్మరణకు వచ్చుచున్నది. గాంధీజీ దర్శనార్థులకు దర్శనమిచ్చుటకు బయటికి వచ్చిరి. భారతదేశ సజీవ దేవతనుగాంచి జనసముద్రము ఆనందోచ్ఛ్వాసముతో 'మహాత్మాగాంధీకీ జయ్' అని కేకలు వేసిరి.

కాని గాంధీజీ—

ఆయన ప్రశాంతముఖబింబముపై తాండవించుచున్న శాంతిపూర్ణ ఆనందజ్యోతి ఆరిపోయెను. అత్మప్రశంసనువిను టచే నిరాశచే, అసంతోషముచే ముఖము దీనముగు వెండి పోయెను. ఆయన రెండు చెవులను రెండుచేతులతో గట్టిగా పట్టుకొనెను. సంకోచముతో శిరము వాల్చుకొని లోపలికి పోయెను.

గాంధీజీచారిత్రములోయిది యొకవిశేషవైశిష్ట్యము. ఈశ్వరేచ్ఛవలన మానవసేవ చేయుటకు ఆయన ప్రతించెను. సేవకు బదులుగా శ్రద్ధను, భక్తిని, స్తుతిస్తోత్రములను స్వీక రించుటకు రాలేదు. ఈశ్రద్ధ, భక్తి ఆయనను ఆత్మవిస్మృ తులనుగా జేయ ప్రయత్నించుచున్నవి. ఆయనను లక్ష్య భ్రష్టునిగా చేయ సమకట్టుచున్నవి. స్తుతిస్తోత్రములపైగల యీవైరాగ్యము గాంధీజీని అనంతస్తుతిస్తోత్రములకు యోగ్యునిగను, అసాధారణమహత్వముచే భూషితునిగను చేసి వైచెను.

కుంభమేళలో హిందువులకు సంస్కారములు, బహు విధభ్రాంతులు, మూఢాచారముల దృశ్యములు ఆయనకు విశేష ఆవేదనమును కలిగించెను. కేవలము ధర్మముకొరకే యిచ్చటికి వచ్చుట లేదనియు, ప్రవంచన ఉపాయముల తోను, మిథ్యాకౌశలముతోను స్వార్థముకొరకును, ధనార్జన కొంకును వచ్చుచుందురని ఆయన గ్రహించెను. ప్రవంచ నాపరులే మేళాక్షేత్రమునకు విశేషముగా వచ్చుచుందురు.

ముతో కార్యములు గావించుకొనుటకు అవకాశమును కూడ పొందిరి.

ఈ వ్రతమును ఆయన జీవితములో అంతమువరకు పాలించిరి. ఆయన అల్పాహారమును, పరిమితాహారమును భుజించి మహత్తరమైన కార్యములను నెరవేర్చు యోగ్యతను గాంచి విస్మయమొందుచున్నాము. ఇది కేవలము గాంధీజీవంటి మహాత్మానవులకే తగియున్నది.

---

## 37

## ఆశ్రమప్రతిష్ఠ

ఆఫ్రికాలోని ఫినిక్సుఆశ్రమమువంటి ఆశ్రమమును భారతదేశములో స్థాపించవలెనని గాంధీజీమనస్సులో ప్రబలతరమైన కోరిక జనించెను. భారతదేశమునకు తిరిగివచ్చిన పిమ్మట ఆయన యీవిషయములో ప్రయత్నించుటయందు ఎట్టిలోటును చేయలేదు. కాని ధనాభావముచేతను, తగిన స్థానాభావముచేతను, ఆయన తనభావములను వాస్తవరూపమున పరిణమింప చేయజాలకపోయెను.

భారతదేశపర్యటన గావించినపిమ్మట ఆశ్రమమును స్థాపించుటకై గాంధీజీ విశేషశ్రద్ధ వహించెను. ఇచ్చట ఒకవిషయము చెప్పవలసి యున్నది. గాంధీజీ భారతదేశము

నకు వచ్చిన పెంటనే యీవిధముగా పరిత్యాగశీలురో నిమగ్నులై యున్నారు కదా! తనకుటుంబపోషణ విషయములో ఏమి మార్గము నవలంబించినారని అనేకులు తలంచుచుండిరి.

కుటుంబపోషణకు ఆయన బ్యారిష్టరీపనిగాని లేక ఏఉద్యోగమునుగాని చేయుటకు సిద్ధపడలేదు.

అట్టిప్రయత్నము చేయుటకుకూడ ఆయనకు అవుసరము లేకుండెను. ఋత్విగాచార్యుడైన మోహనదాసు తనసహధర్మిణియైన శ్రీమతి కస్తూరిబాయినికూడ తనజీవనధర్మములో యథార్థసహయోగినిగా గావించుకొనెను. పుత్రులనుకూడ తన ఆదర్శములతో అనాడంబరమైన, ప్రశాంతమైన విద్యతో లాలనపాలనములు చేయు చుండిరి. సంసారసంబంధమైన ఆలోచనమును ఆయన మరచియే పోయిరి. ఆదర్శముల ఆలోచనములలో నిమగ్నులై పోయిరి.

ఆశ్రమప్రతిష్ఠకు అనుకూలమైన స్థానమును నిర్ణయించుటకే అత్యంతసమస్య సృష్టింపబడెను. వివిధప్రదేశములలో నున్నవిశిష్టవ్యక్తులందరు తమతమ ప్రదేశములలో ఆశ్రమమును స్థాపించమనియు, దానికి కావలసిన స్థలమును ఇచ్చెదమనియు కోరికను తెలియజేయుచుండిరి. వంగదేశమునుండియు ఆయనకు అనేకనివేదనములు వచ్చియుండెను. ఢిల్లీలోనున్న ధనికు లనేకులు ఉత్తమమైనస్థలమునిచ్చెదమని కోరికను వెల్లడించిరి. వివిధదేశములవారు తమ నివేదనములను తెలియజేసికొనినప్పటికిని గాంధీజీ తమ

దేశమునందే ఆశ్రమమునుస్థాపించుటకు సంకల్పించుకొనెను. దీనికిగల కారణమును ఆయన ఆత్మకథలో ఇటుల వర్ణించు కొనిరి:— "నేను అహమదాబాదుద్వారా ప్రయాణము చేయుచున్నప్పుడు అహమదాబాదునే నిరూపించమని అనేక మంది స్నేహితులు కోరియుండిరి. ఆశ్రమమునకు కావలసిన వ్యయమునంతను వారే సమకూర్చెదమని తెలిపియుండిరి. గృహమును సంపాదించిపెట్టు భారముకూడ వారేవహించెద మని నుడివియుండిరి. అహమదాబాదువిషయములో నాకు కూడ ఆకర్షణ యుండెను. గుజరాతువాడ నగుటచే గుజ రాతుభాషద్వారా ఎక్కువ సేవచేయ గలుగుదునని తలం చువాడను. అహమదాబాదు ఒకప్పుడు చేనేతవస్త్రములకు కేంద్రముగా నుండుటచే, అచ్చటనే నూలుతీయుటకును, గృహశిల్పమును పునరుద్ధరించుటకును మంచిఅవకాశము కలుగగలదనియు నాకు నమ్మకము కలిగెను. గుజరాతునకు ప్రధాననగర మగుటచేతను, ధనాఢ్యులందరును ఇచ్చటనే యుండుట చేతను, ధనసహాయము కూడ లభించునని ఆశించితిని."

తన స్వస్థానములో ఆశ్రమప్రతిష్ఠకు కారణము గ్రహించితిమి. అహమదాబాదులోని ధనికబ్యారిష్టరు కోచ్‌రబు అనుపేరుగల గ్రామములో తనగృహమును ఆశ్రమ ప్రతిష్ఠచేయుటకు గాంధీజీకి అద్దెకు ఇచ్చెను. గృహమును ఏర్పాటుచేసి తనఆశ్రమవాసులను శాంతినికేతనమునుండి

తీసుకొని వచ్చెను. ఆండ్రూసు, పియర్సన్, మగన్‌లాల్ గాంధి, అనేకమంది తమిళయువకులు, సహధర్మిణి కస్తూరి బాయి, కోచరబులో స్థాపించిన ఆశ్రమమునకు వచ్చిరి.

ఈసారి ఆశ్రమముయొక్క నామమునుగురించి ఆలోచనలు సాగెను. వివిధవ్యక్తులు దానిని తమయిష్టానుసారముగా వివిధనామములతో పిలువ నభిలషించుచుండిరి. కాని గాంధీజీ యీసారి నామమువిషయములో ఒకసమాధానమునకు వచ్చిరి. ఆశ్రమనామము "సత్యాగ్రహ ఆశ్రమము" అని అందరికిని తెలియజేసెను. ఈనామమువలన సేవాభావము, సేవచేయుపద్ధతి సహజముగా మనస్సులో ఉదయించగలుగునని యీనామముపెట్టుటకు కారణ మయ్యెను. నామమాహాత్మ్యమువలనకూడ ఆశ్రమవాసులు సత్యమును సేవించుటలో ఉత్సాహితులు కావచ్చును.

1915 వ సంవత్సరములో మే 25వ తేదీన గాంధీజీ ఆశ్రమమును స్థాపించెను. ఈసారి ఆశ్రమవాసులతో సలహా చేసి ఆశ్రమమునకు కావలసిన నియమావళినికూడ తయారు చేసెను. ఇచ్చట వసించువారు సత్యాగ్రహులుగా ఉండవలయునని నిర్ణయింపబడెను. సత్యాగ్రహికి యోగ్యమగు స్వభావమును, ఆచరణమును అలవాటు చేసుకొనవలయును. సత్యవాదిగను, అకపటునుగను, ఆత్మాభిమానరహితుడుగను కావలయును. మానవులలో భేదము లేదని నమ్మవలయును. అస్పృశ్యతను విసర్జించి సకలమానవులతో సరళ

మనస్సుతో వసించవలయును. జాతివిచారమును, జాతిభేదములను తొలగించవలయును. ఆశ్రమ కార్యములు, తమ కార్యములు స్వహస్తములతో నిర్వర్తించుకొనవలయును. ప్రయోజనానుసారముగా నిర్మాణయుతమైన కార్యములను గావింపవలయును. కార్యముల ద్వారా హరిజనుల సేవ చేయవలయును. నిగ్రహము నవలంబించి సరళ అడంబరజీవితమును గడుపవలయును.

ఆశ్రమము తనసారవస్యము. ఈ ఆశ్రమమును ఆయన ఏ ఉద్దేశముతో నిర్మించినారని ప్రశ్న ఉదయింపవచ్చును. దీనికి సరియైన జవాబు నియ్యలేము. ఈ ఆశ్రమమును ప్రతిష్ఠించుటవలన, దీనిని నడుపుటవలన ఒకటి రెండు ఉద్దేశములను నెరవేర్చుటకు కోరికయున్నట్లు తోచును

ఆశ్రమజీవితము ద్వారా ఆశ్రమవాసులను నిగ్రహశీలురుగను, స్వావలంబులుగను అగునటుల సహాయము చేసెను. అందరిని ఒకటిగా కార్యములను నెరవేర్చునట్లు చేసియు, ఏకముగా భోజనములను చేయునట్టి కాలమును కలిగించియు, ఆశ్రమవాసులను స్పృశ్యులనుడి మానవనిర్మిత కృత్రిమభేదముల సంస్కారములను, ఆచారములను విలుప్తము చేయ సంకల్పించెను. ఆశ్రమవాసుల కార్యములను, ఆచరణాదృష్టాంతములను చూచి భారతీయులు నిగ్రహశీలురుగను, స్వావలంబులుగను అగుటకు ప్రబోధమును గాంచుచుండిరి. ఆశ్రమములో జాతిభేదమును తొలగించి భారతీయులందరును జాతి

భేదముల కృత్రిమ సంస్కారములను విసర్జింపవలయునని ఉపదేశము నొసగియుండెను. సత్యాగ్రహమునకు పరీక్షా కేంద్రముగా చేయుటనే యీ ఆశ్రమమును స్థాపించుటలో ప్రధానోద్దేశమై యుండెను. కొందరిని యథార్థమైన సత్యాగ్రహ సేవకులుగ తయారుచేయవలయును. ప్రయోజనానుసారముగా సత్యాని యొక్క గౌరవరక్షణకు కర్మక్షేత్రములో ప్రవేశింపవలయును. వారి ఆచారముల ద్వారా, ఆదర్శముల ద్వారా భారత దేశములో అనేక సత్యాగ్రహులను తయారు చేయవలయును. సత్యాగ్రహుల దళము సత్యమను అస్త్రము చేత అపారశక్తిశాలురగు ఆంగ్లేయసర్కారు వారిని యుద్ధమునకు ఆహ్వానింపవలయును.

ఆశ్రమ సేవకదళము వారు తమ ఆచరణముల ద్వారా, భారత దేశీయులను ఉత్సాహపరుపవలెననియు, ఆశాన్వితులనుగా గావింపవలెననియు మహాత్ముని ఉద్దేశమై యుండెను. అసత్య, మిథ్యలకు విరుద్ధముగా సంగ్రామము చేయుటకును, కష్టములను వహించుటకును సత్యాగ్రహులగు వీరులను ఉత్సాహితులనుగా సాధింపవలయును. భారత దేశము యొక్క సత్యమును, శాశ్వతరూపమును ప్రకాశితము చేయవలయును. భారత దేశ జాతీయ, స్వదేశ ఆచార అనుష్ఠానములను, రాజనైతిక విషయములను మరల పునరుజ్జీవితములుగ గావింపవలయును.

ఆశ్రమజీవనధారను తనఆదర్శములప్రకారము సంపన్నము చేయుటకు ఈనాడి గాంధీజీ కార్యదీక్షలో ప్రవేశించెను. ఆశ్రమములో జాతిభేదమునుతొలగించుటకును, ఉచ్ఛనీచశ్రేణీభేదములను పరిహారము చేయుటకును ఒకబీదనిమ్నజాతీయకుటుంబమునకు ఆశ్రమములో ఆశ్రయ మిచ్చెను. ఆకుటుంబములో మూడురు వ్యక్తు లుండిరి. దుదాభాయ్, ఆయనభార్య దానిబహెన్, వారిచిన్నబిడ్డ లక్ష్మి. వారు ఆశ్రమనియమములను పాలించి యితరఆశ్రమవాసులతో పాటు వసించుచుండిరి.

కాని సత్యమార్గము అత్యంతసంకటమయమైనది. అత్యంత అవమానమైనది. అస్పృశ్యులకు ఆశ్రమములో ఆశ్రయమిచ్చుటచే ఒకదళమువారు నొకరులువిరక్తిచెందిరి. అస్పృశ్యకుటుంబముతో ఏకముగా పనిచేయుటకుకూడా అసహ్యమును ప్రకటించిరి. ఆశ్రమవాసులుకూడ కొందరు అస్పృశ్యులతో ఇంత సామీప్యత పనికిరాదని తలంచిరి. తుదకు ఈఅంత్యజకుటుంబీకులతో కలసి మెలసి యుండుట వలన కలిగిన విప్లవవృత్తాంతము నాలుగువైపుల గ్రామములలోను, పట్టణములలోను వ్యాపించెను.

ఆశ్రమమునకు సహాయము చేయువారు, పోషణకర్తలు విరక్తి చెందిరి. అసంతుష్టి చెందిరి. ఆశ్రమమునకు సహాయము చేయుట విరమించుకొనిరి. సత్యమునుపూజించు పూజారి భయపడ లేదు. సాధ్యమైనంతవరకు వ్యయమును

తగ్గించుకుని ఆశ్రమకార్యములను నెరవేర్చుచుండిరి. కాని ఒకరోజున ఆశ్రమవ్యవస్థాపకుడు మగన్‌లాల్‌గాంధి 'వచ్చే నెలలో ఆశ్రమమును నడపుటకు కావలసిన డబ్బులేదని' గాంధీజీకి తెలియజేసెను.

గాంధీజీ అంతయు వినెను. ఆనందవదనముతో ఇట్లుల నుడివెను— 'ఆశ్రమము నిలుపవలసినదే' ఇచ్చట తగిన ధనము లభింపకున్నచో మనము అంత్యజులున్న పల్లీగ్రామమునకు లేచి పోవలసియుండును.

మగన్‌లాల్— 'కాని అట్లయినయెడల అభిజాతవంశీయులలోను, ఉచ్ఛజాతీయులలోను ఎక్కువ తక్కువ యను భేదాభేదములను తగ్గించునట్టి దృష్టాంతములను ఎట్లుస్థాపించ గలరు?'

గాంధీజీ— 'నేను ఈయుపాయము నవలంబించితిని. కాని ఇది అసత్యమైనయెడల, దీనిలో ఈశ్వరుని అంగీకారము లేనియెడల మనము ఈస్థానమును త్యజింపవలసియేయున్నది'

మగన్‌లాల్ విచారముతో నిట్లు నుడివెను— 'కాని ఇదియే చరమసత్యమని మన మెరుగుదుము. మానవులతో భేదములు కలిగియుండుటకన్న మానవులతో సామ్యమే ఈశ్వరరాజ్యమందు ఏకైకమంగళవిధానము. అట్లైనచో తుదివరకు ఈశ్వరునియందు విశ్వాస ముంచవలయు' నని గాంధీజీకినుడివెను. ఈప్రయత్నమే సత్యమైనయెడల ధనాభావముచేత ఈశ్వరుడు దీనిని నష్టము కానియ్యడు.

గాంధీజీమనస్సులో నిశ్చయము, దృఢవిశ్వాసము స్థాపితమై యుండెను. గాంధీజీ కంఠస్వరము గూడ దృఢత్వము ను గలిగియున్నది. ముఖము ఆత్మవిశ్వాసముయొక్క జ్యోతిని వెలిగించెను.

ఒకటి రెండు రోజులు జరిగినపిమ్మట ఆశ్చర్యకరమైన ఆంతరికమైన సంఘటన సంభవించెను.

మరియొకనాడు ఉదయము ఒక సేటుగారు గాంధీజీకొరకు వెదకుచున్నారని ఒకనాడు ఆశ్రమమునందలి ఒకబాలకుడు వార్త తెచ్చెను. గాంధీజీ ఆయనకడకు వెళ్ళెను. 'నేను తమ ఆశ్రమమునకు కొంతసహాయము చేయగోరు చున్నాను. తమరు స్వీకరింతురా?' యని సేటుగారు గాంధీజీని ప్రశ్నించెను. గాంధీజీ తనసత్యమును స్మరించుకొనెను. ఈశ్వరుని స్మరించుకొనెను. 'తమసహాయమును నేను తప్పక స్వీకరింతును. నేను ఇప్పుడు పరీక్షలను ఎదుర్కొనుచున్నాను' అనెను.

'రేపే నేను సాధ్యమైనంతవరకు పంపించెదనని' శేట్ జీ నుడివి వెడలిపోయెను.

మరునాడు మరల ఆసమయమునకే వచ్చెను. గాంధీజీ హస్తములో రు 13000 ల నోట్లు పెట్టి వెడలిపోయెను.

పరీక్షాసమయములో గాంధీజీ ఈశ్వరసహాయము బడసెను. నవీనోత్సాహముతో ఆశ్రమ కార్యములలో శ్రమ పడుచుండిరి. ఈసంఘటన జరుగుటకూడా విశేషముగా

వ్యాపించెను. ఆశ్రమకార్యములలో, ఆచరణములలో విశ్వసించనివారి మూఢవిశ్వాసముల పునాదులు కదలిపోయి శిథిలమయ్యెను. గాంధీజీ సాగించుచున్న యీ మ్లేచ్ఛకార్యమునకు సహాయము చేయుటకు తుదకు పూర్వాచారపరాయణుడగు హిందువే ధనమును దానము చేయుట విని వారే లజ్జితులైరి. ఆశ్రమమునకు విరుద్ధముగా నిందలను ప్రచారము చేయుట విరమించిరి.

గృహములోను, బయటను బాధావిహీనుడై సత్యసంధుడగు గాంధీజీ సత్యపరీక్షలో దృఢవిశ్వాసముతో అగ్రసరుడాయెను.

ఆశ్రమము స్థిరరూపమును దాల్చెను. కాని మరియొక సంఘటనవలన ఆశ్రమము కోచవరనుండి అన్యస్థానమునకు మార్చబడెను. కోచవరగ్రామ పరిసరప్రాంతములలో అంటువ్యాధి వ్యాపించెను. ఆశ్రమములో పరిశుభ్రత కాపాడబడినను నలువైపులనున్న అనాగరికులగు గ్రామవాసుల అశుభ్రతవలన తుదకు ఆశ్రమమునకుకూడ ఆపద సంభవించవచ్చునని తలంచిరి. అల్పదినములలో గ్రామవాసులకు బోధించుట అసంభవమని తలంచి ఆశ్రమమును కోచవరనుండి అన్యస్థానమునకు మార్పించుటకు సంకల్పించుకొనెను.

ఈసారి గాంధీజీ ఆశ్రమమును విశాలప్రదేశములో స్థాపించ సంకల్పించెను. గ్రామపట్టణముల జనప్రవాహము

నుండి కొంచెము దూరముగా ప్రకృతిలో ప్రశాంతనిర్జన స్థానమున సత్యాన్వేషణను ప్రసాదించు ఈసత్యాగ్రహ ఆశ్రమమును స్థాపించ నుద్దేశించి వెదకుచుండగా అనుకూల మైన స్థానము ఆయనకు లభించెను. కోచవరగ్రామమునకు ఉత్తరదిశగా మూడుమైళ్ళదూరములో 'సబరమతి' అను గ్రామములో విశాలప్రాంతరమంతా ఆశ్రమమునకొరకు స్థలము క్రయము చేయబడెను. అల్పకాలములోనే ఆశ్రమ ముకొరకు గృహములు నిర్మించబడెను. నిర్జననదీతీరమున ఆశ్రమము ప్రకృతిశోభతో విరాజిల్లుచుండెను. ఆశ్రమ వాసులు నూతనఆశ్రమములో ప్రవేశించి నూతనోత్సాహ ముతో కర్తవ్యకార్యములను నెరవేర్చు చుండిరి.

---

## 38

## ఎగ్రిమెంటు ఆచారనిర్మూలనము

ఆశ్రమస్థాపన కార్యములలో నిమగ్నుడై యుండియు గాంధీజీ దురాచారమగు ఎగ్రిమెంటు ఆచారవిషయములో శ్రద్ధ వహించెను.

ఇది అత్యంత అసహ్యమైన ఆచారము. భారత జాతీయ అస్తిత్వముపై ఆంగ్లవణిజులు గావించిన అవమాన కరమైన ఆచారము, ఆంగ్లవణిజులు, ఆఫ్రికా, భారతీయ

ద్వీపపుంజము, మలయా మొదలగు స్థానములలో మహత్తర
మగు వ్యాపార కేంద్రములను స్థాపించిరి. క్షేత్రమునుండి
పచ్చిసరుకు ఉత్పత్తి చేయుటకు ఏర్పాటు గావించియుండిరి.
కాని వ్యాపారములో సరకును మోయుటకు పారిశ్రామి
కులు అవసర మయ్యెను. భారతదేశముజనబాహుళ్యమైనది.
కాని ఆంగ్లేయుల పరిపాలనమువలన దుర్దశాగ్రితమైనది.
శోషింపబడినది. దరిద్రావస్థయం దున్నది. దరిద్రులును,
నిరుద్యోగులును నగు భారతీయులకు అన్నము లభించునని
ఆశపెట్టి వారిని పనిపాటలకొరకు విదేశములకు తీసుకొని
పోవుటకు స్థిరపరచుకొనిరి. వారుభారతదేశీయులసమక్షమున
పనిపాటలనుగురించియు, ధనాధిక్యతనుగురించియు ప్రచా
రము చేయుచుండిరి. భారతీయులు ముఖ్యముగా మద్రాసు
మున్నగుప్రదేశములోని దరిద్రఅధివాసులు గుంపులు గుంపు
లుగావిదేశమునకు వడలిపోయిరి. కానివారికష్టములు తొలగి
పోలేదు. ప్రచారము చేసినటుల వారు సుఖమును, ఆహార
మును పొందకపోగా, ఏదో యొకవిధముగా కడుపుమంట
చల్లార్చుకుని గుడిసెలలో వసించు పశువులవలె జీవనయాత్ర
గడపుచుండిరి. పరిశ్రమవలన ఆరోగ్యము చెడిపోయినది.
కార్యములదీనత్వమువలన జాతిగౌరవమునకు హానికలిగెను.
అదిగాక విదేశవ్యాపారస్తులు కార్యములను చేయించుకుని
స్వార్థపరు లగుచుందురు. భారతదేశవాసులు గుంపులు
గుంపులుగా వచ్చి తమజనసంఖ్యను అభివృద్ధి చేసుకొను

చున్నారని తలంచిరి. వారు భయకంపితులైరి. భారతీయులు పనులకొరకు వచ్చి తుదకు తమ జనసంఖ్యను వృద్ధి పరచుకొని అధికారములను కోరుచుందురని వారు రక్షణ కవచములను ఏర్పాటు చేసుకొనిరి.

కూలినిబంధనలు ఇన్‌స్ట్రూమెంట్సు ఆనాటిభారత సర్కారువారితో ఒకవిధముగా ఏర్పాటు చేసుకొనిరి. నియమిత కాలములో పనులు చేసెదమని ఒప్పందములు చేసి భారతీయకూలీలు ఆఫ్రికా ఫ్రాన్సుభారతీయద్వీపపుంజము మొదలగు దేశములకు పోవలయునని షరతుతో స్థిరపరుపబడెను. షరతుకాలము పూర్తిఅయినవెంటనే వారు మరల భారతదేశమునకు తిరిగి పోవలయును. ఇదియే ఎగ్రిమెంటు ఆచారము. షరతులకు బద్ధులైన వారిశ్రామికులని సంబోధించుచుండిరి, భారతీయులు తాత్కాలికముగానైన స్వదేశమునకు తిరిగివచ్చినప్పటికిని విదేశములలో [illegible] ద్బటి అధివాసులద్వారా వారు ఆచారనిర్మూలనాభిమానములు, అత్యాచారములు మొదలగు విషయములనుగురించి ప్రచారము చేయమొదలిడిరి. వ్యాపారస్థులమోసము, శోషణ విషయము విదేశములోనున్న విద్యావంతులను భారతీయుల ముఖతః క్రమముగా భారతీయులందరును తెలుసుకొనగలిగిరి. తమజాతీయులకు కలిగిన అవమానమువలనను, బాధలవలనను భారతీయులు విచారగ్రస్తులైరి. వారు ఆలోచనములను, ఆందోళనములను ఆరంభించిరి.

ఇంతపూర్వము అఫ్రికాలో భారతీయులపై జరిగిన అత్యాచారములు, అవమానములు 1914 సంవత్సరములో గాంధీజీ ప్రయత్నకారణమున రహితమై యుండెను. దీనిని మనము అఫ్రికాలో సత్యాగ్రహచరిత్రద్వారా తెలుసుకొంటిమి. కాని ఇతరదేశములలో అది యింకను పూర్తిగా జరుగుచుండెను. ఆత్మగౌరవముగల భారతీయులు విద్యావంతులగు భారతీయులు ఈ అత్యాచారముల, యీప్రవంచనముల మార్గములను బంధింప ప్రయత్నించిరి.

కొందరు ఈవిషయములో గాంధీజీతో ఆలోచనములను గావించియుండిరి. ఈ దురాచారమును సంపూర్ణముగా నిర్మూలించుటకు వారు ఆయనను వేడుకొనిరి. అఫ్రికాలో ప్రత్యక్ష అనుభవముద్వారా యీఅవమానము ఎంతహృదయ విదారకమైనదో గాంధీజీ ఎరుగుదురు.

గాంధీజీ ఆలోచించెను. ఈవిషయములో ప్రథమమున భారతసర్కారువారిని ప్రార్థించుటకు స్థిరపరచుకొనెను. తరువాత దేశవాసుల అభిప్రాయములను తెలుసుకొని కార్యమునకు గడంగుదురు. తనసిద్ధాంతానుసారముగా వైస్రాయ్ లార్డ్ చెమ్స్‌ఫోర్డుకు ఉత్తరములు వ్రాసెను. ఒకసారి రమ్మని వైస్రాయి గాంధీజీకి కబురు పంపెను. వైస్రాయిని చూచి యీ దురాచారములోగల హానికరమైన పరిణామములనుగురించి ఆయనతో సంభాషించిరి. వైస్రాయ్ ఆయనకు ఎట్టివాగ్దానమును చేయలేదు. కేవ

35

లము వరాభిక సానుభూతిని స్వీకరించి శెలవిచ్చి పంపివేసెను. గాంధీజీ నిరాశచెంది తిరిగి వచ్చెను. దేశసామర్థ్యము విషయములో శ్రద్ధవహించెను. దేశములో ఈవిషయమై విశేష ఆందోళనము బయలుదేరెను. దేశము ఈదురాచారమును తుదముట్టించ గోరుచున్నదని గాంధీకి గ్రహించెను. గాంధీజీ దేశీయుల మనోబలమును మేల్కొల్పుటకు సంకల్పించుకొనెను. దైనికవార్తాపత్రికలలో ఈఅన్యాయములకు విరుద్ధముగా తీవ్రముగా విమర్శింపసాగిరి. అనేకమంది నాయకులు ఉత్సాహముతో ఈప్రతిఘటనలో పాల్గొనిరి. భారతీయస్థాపకసభలోనున్న శిష్ట భారతీయసభ్యులు ఈదురాచారమును నిర్మూలించుటకు శాసనమును ఆమోదింపచేయ సమకట్టెను. కాని ఈవిషయములో ఎట్టితీర్మానమును ప్రతిపాదించుటకును వైస్రాయ్ అంగీకరించలేదు.

సర్కారువారి శుభబుద్ధిపై ఆధారపడి యుండినచో లాభములేదనియు, దేశీయుల దృఢమైనకోర్కెలను మేల్కొల్పవలయుననియు గాంధీజీ గ్రహించెను. గాంధీజీ భారతదేశమునందు వివిధస్థానములలో సభలు జరుపుటకు ఏర్పాట్లు గావించిరి. ప్రథమసభ సమావేశము బొంబాయిపట్టణములో జరిగెను. సభలో అనేకములైన ఆలోచనములుజరిగినపిమ్మట వైస్రాయివద్దకు ఒకడెప్యుటేషను పంపించవలయుననితీర్మానించబడెను. సర్కారువారు 1915 సంవత్సరము జులై 31వ తేదీలోపున భారతదేశమునకు అవమానకరమైన ఆదురా

చారమును నిర్మూలించని యెడల దేశవాసులందరును దానికి విరుద్ధముగా క్రియాపూర్వకమైన పద్ధతుల నవలంబింతురని డెప్యుటేషను ద్వారా వైస్రాయికి తెలియజేయ తీర్మానించిరి.

ఈసారి వైస్రాయి డెప్యుటేషను చేసిన నివేదనమును సాదరముతో ఆకర్ణించెను. వారి ప్రతిపాదనవిషయములో విశేషముగా ఆలోచించెదనని వాగ్దానము చేసిరి.

గాంధీజీ డెప్యుటేషను పంపించి అంతటితో విరమించలేదు. సమస్తభారతదేశమునందు పర్యటన గావించి యీ విషయములో ప్రజలను జాగరూకులను గావించెను. కరాచీ కలకత్తాపట్టణములలో కూడ బ్రహ్మాండమైన సభలు జరిగెను. ప్రజలు ఉత్సాహోద్రేకములలో నిమగ్నులై పోయిరి.

తుదకు సర్కారువారికి చైతన్యము కలిగెను. 'ఎగ్రిమెంటు దురాచారము' రద్దుచేయబడెనని ప్రచారము చేయబడెను.

వేలకొలది భారతీయదరిద్రపారిశ్రామికులు, విదేశ వ్యాపారస్థుల అత్యాచారములనుండి రక్షింపబడిరి. విదేశములలో భారతజాతీయుల ఆత్మ ఒక్క అవమానమునుండియైనను ముక్తిని బడసెను.

భారత దేశకల్యాణముకొరకు అవసరమునుబట్టి సత్యాగ్రహమును ఆరంభించుటకు కూడా గాంధీజీ సంసిద్ధమై యుండెను. ఇంతకుపూర్వము ఆయన తనశక్తిని సత్యాగ్రహము కొరకు యోగ్యముగా తయారుచేయుచుండిరి. ముక్తికి ఉపాధు

స్వభావముగా సత్యాగ్రహసహాయమును పొందుటకు దేశ వాసులు ఎంతవరకు సంసిద్ధులై యున్నారో, యోగ్యులై యున్నారో అనియు మాకునుకూడ పరిశీలించుచుండిరి.

భారతదేశము ఆత్మముక్తిని కోరుచున్నదని భారత దేశమంతయును ఒక్కటై చేసిగ్రహించెను. భారతదేశము ఈ ముక్తిని హింసాయుతమగు సాధనములచే సంపాదించజాలదని తలపోయు చుండెను. ఆయుధశక్తిగలవారైనను విదేశప్రభువులవారికి విరుద్ధ ముగా అస్త్రబలమును ప్రయోగించి ముక్తిసంగ్రామమును ఘోషణచేయుటకు ఆయన ప్రోత్సహించలేదు. కాని అది బలహీనుల అశక్తతయైనది. దానిని తృణీకరింపక పోయి నను ఆమోదించువాడు కాడు. పశుశక్తిప్రయోగమువలన పశుశక్తిని నాశనము చేయుట ఆయనకు అంగీకారమైన విష యము కాదు. ఆత్మనైతికశక్తిద్వారా నిశ్చయముగా అల్ప సమయములోనే పశుశక్తిని పరాజితము చేయవచ్చునని ఆయనకు విశ్వాసముకలిగెను. శత్రువును బాహ్యిక ఆఘాత ములతోగాక, ఆంతరిక ఏకాగ్రతాయుక్తమగు, దృఢమగు ఇచ్ఛల ఆఘాతములద్వారా దుర్బలముచేయవచ్చును. శత్రు వులను అన్యాయాచారములు చేయక మనన్యాయప్రాప్తికొరకు ఆంతరికసత్యన్యాయముల ఆఘాతములద్వారా దుర్బలపరచి భారతదేశఅధికారమును సంపాదించుటకు ఆయనహృదయము ఈసమయమునుండియే తయారగుచుండెను. కాని అప్పటికి ఇంకను ఆయన నిశ్చయము, ఆలోచనములు, అనుసంధానము

సిద్ధాంతముల సమస్యలలో ఊగులాడుచు నుండెను. ఇంకను ఆయన మనస్సులో సందేహములు ఉదయించుచుండెను. దేశవాసులు సత్యమును అస్త్రముచేత సంగ్రామము చేయ సమర్థులా కారా యని భావించుచుండిరి.

ఆయన సందేహము క్రమముగా అంతరించెను. దేశవాసులు అన్యాయములకు, అత్యాచారములకు విరుద్ధముగా శిరము లెత్తి నిలువబడ గలుగుచున్నారని ఆయనమనస్సులో ఆశాజ్యోతి ప్రకాశించెను. అవసరమునుబట్టి ఆయన కార్యక్షేత్రమున ప్రవేశింపవచ్చునని ఆశావిశ్వాసములు ఆయన హృదయములో జనించెను.

ఎగ్రిమెంటుదురాచారమునకువిరుద్ధముగా చేయబడిన ఆందోళనములో సత్యాగ్రహస్పర్శ లేకపోయెను. ఇది భారతభూమిపై సత్యాగ్రహభూమిక యనియే అంగీకరింపవలసి యుండును.

---

## ౩౯
## చంపారణ నీలితోటల విషయము

గాంధీజీ నాయకులతోను సేవకులతోను కలిగిన పరిచయ ఆవరణములను అతిక్రమించి క్రమముగా సాధారణ భారతీయులకుకూడ పరిచితులు కాజొచ్చిరి. ఎగ్రిమెంటు

దురాచారమునకు విరుద్ధముగా జరిపిన ఆందోళనముద్వారానే ఆయన జనసామాన్యులకు పరిచితులైరి. సాధారణభారత వాసులు ఆయన సత్ప్రయత్నములందుగల నూతనత్వము వలనను విశేషత్వమువలనను ముగ్ధులై ఆయననునాయకునిగా గౌరవించిరి.

ఆయనసంకల్పము నూతనత్వము, విశేషత్వమును గురించి యిచట ముచ్చటించెదను. గాంధీజీ నేతృత్వము పొందుటకుముందు భారతదేశములో చైతన్యము కలిగిన మాటనిజము. భారతదేశవాసులు తమఅధికారమునుగురించి జాగరూకులైరి. శాసనవిషయమై అధికారమును పొందుటకు గోఖ్లే, సురేంద్రనాథుడు, తిలక్ మహాశయుడు మొదలగు నేతృబృందముకూడా ఆందోళనము గావించియుండిరి. బ్రిటిషుసరిపరిపాలనలో భారతీయులవిశ్వాసముకూడ తగ్గిపోవుచుండెను. ఆత్మనిర్భరశీలు రగుటకు అచ్చటచ్చట ఆందోళనములుకూడ జరిగియుండెను. కాని నాయకుల ఆందోళనములలో విప్లవాత్మకమైన విషయములు వర్జింపబడెను. పోటీలకు బదులు ఆవేదనని వేదములు, ప్రార్థనాభావముకే అప్పుడు అధికముగా నుండెను. అధికారము ప్రార్థనావిషయముగా మారిపోయెను. ప్రార్థనపరిపూర్ణము కానియెడల నాయకుల మానాభిమానములు ఉద్రిక్తములై ఉపన్యాసవేదికలపై చిచ్చుబుడ్లవలెసహస్రశిఖలతో చిందులు త్రొక్కెడివి. కానిప్రజల హృదయములు నాయకులకార్య

కలాపములను చూచి సంతోషము ననుభవించుట లేదు. సాధారణభారతీయులు అధికారములను పొందుటకై ప్రార్థనములు, నివేదనములు, గావించుట పూర్తిచేసి నూతనమైన, క్రియాపూర్వకమైన కర్మమార్గములను ఆశ్రయించుటకు ప్రయత్నించుచుండిరి. నూతనదృక్పథముగల పరిచారకుల అభావమువలన వారి ఆకాంక్షలు నిరాశలుగా పరిణమించజొచ్చెను. సరిగా ఈసమయములోనే గాంధీజీ తననూతనదృక్పథముతో భారతభాగ్యాకాశమున ఉదయించెను. ఆయనలోగల వినీతచరమకౌశలమును ప్రయోగించు సంసిద్ధమాయెను. అన్యాయముల ప్రతీకారముకొరకు కోరికలను నెరవేర్చుటకొరకు, మామూలువానివలె సర్కారువారిని ప్రథమమున వేడుకొందును. కాని ఆప్రార్థన తిరస్కరింపబడినప్పుడు దృఢమైన యిచ్ఛాశక్తితో, సంకల్పముతో సర్కారువారికి విరుద్ధముగా నిలువబడుదును. నియమితచరమ అవుసరములను నెరవేర్చువరకు క్రియాపూర్వకమైన అహింసాసంగ్రామ క్షేత్రములో అవతీర్ణుడ నగుదును. సర్కారువారిని యుద్ధమునకు ఆహ్వానించెదను.

మిరవాదనాయకుల మామూలు ఆవేదనని వేదనములలో క్లాంతి నిరాశల చెందిన ప్రజలమనస్సులు యిట్టి అ-మితవాదమార్గముననే కోరుచుండెను. అందువలన వారు గాంధీజీనే నాయకునిగా వరించిరి. కొలదిదినములలోనే

గాంధీజీని గురించిన జయధ్వానములతో ఆకాశపాతాళము ముఖరిత మగుచుండెను.

మన మిప్పుడు గాంధీజీజీవితములోని సంఘటనలను వర్ణించుచు ఆయన నాయకత్వమునుగురించిన ఇతిహాసము ఆలోచింతము.

గాంధీజీ ఎగ్రిమెంటు మహాచారమును నిర్మూలించుటకు ప్రయత్నించుచున్నను ఆశ్రమకార్యక్రమములో నిమగ్నులైయే యుండెను. ఆశ్రమవాసులను నిగ్రహశీలురగను, ఆత్మనిర్భరశీలురగను అగుటకు ఏర్పాటు గావించిరి. తానుకూడ అవిధముగా క్రమముగా అధికనిగ్రహశీలురగను, ఆత్మనిర్భరశీలురగను తయారగుచు ఉన్నత సోపానములను ఆరోహణము చేయుచుండిరి. ఈసకలకార్యములద్వారా ఆయనమనస్సునం దభినవభావములును, ఆదర్శములును ఉద్భవించుచుండెను. ఆయనచింతనములు అనుశీలనము, వివేచనములద్వారా భారతస్వాతంత్ర్య ఆందోళనములో సత్యాగ్రహ అస్త్రమును ప్రయోగించుటకును ఆఅస్త్రముతో అహింసను సమ్మిళితము చేయుటకును ఆలోచించుచుండిరి. తుదకు సత్యాగ్రహమును అహింసను ఒక్క ఆదర్శముతో సమ్మిళితము చేసిరి. సమయమును, సుయోగమును కనిపెట్టిదానినిప్రయోగించుటకు సంసిద్ధులై యుండిరి.

1917 వ సంవత్సరములో లక్నోపట్టణములో జాతీయమహాసభాసమావేశము జరిగెను. గాంధీజీకూడ అప్పుడు పరిచితనాయకుడయ్యెను. తత్ఫలితముగా ఆయనకు ఆహ్వానము పంపబడెను. ఆసమావేశములో గుజరాతుప్రతినిధి హాజరైరి.

గాంధీజీ ఆఫ్రికాలో సాగించిన సంగ్రామవిషయమై సాధారణవిద్యావంతులు గ్రహించిరి. విద్యావిహీనులును, గ్రామవాసులును ఆవిషయమును గ్రహించుటకు అవకాశము కలుగలేదు. కాని 'ఎగ్రిమెంటు దురాచారము' విషయమై నూతనఆందోళనమునకు ఏర్పాట్లుగావింపబడినపిమ్మట గ్రామస్థులును, విద్యావిహీనులనేకులును ఆయనవిషయమై తెలిసికొనగలిగిరి. ఆవిషయమును గ్రహించుటచేత అధికోత్సాహితులై యింకను తెలిసికొనకోరిరి. ఆయనవిషయమై ఆఫ్రికాలో వ్యాపించిన కీర్తివిషయమునుకూడ ఆకర్ణించిరి. ఆకర్ణించినప్పటినుండి చిరకాలమునుండి తాము అనుభవించుచున్న దుఃఖదురవస్థలకు విరుద్ధముగా యుద్ధము సలుపుటకు గాంధీజీసహాయమును సానుభూతిని కోరుచుండిరి.

బీహారుప్రదేశములలో చంపారణమను గ్రామనివాసి రాజకుమారుడను శుక్ల యనుపేరు గలిగియుండెను. ఆతడు విద్యాగంధము లేనివాడయ్యు గాంధిగారి కార్యకలాపములకు విముగ్ధుడై ఆశాన్వితుడయ్యెను. ఆతడాయుద్దేశముతో లక్నోపట్టణమునకువచ్చెను. లక్నోలో కాంగ్రెసుసమావేశ

సందర్భంలో గాంధీజీని దర్శించెను. తనగ్రామములోను, నలువైపులనున్న గ్రామములలోను బహుకాలమునుండి ప్రచలితమైన దుఃఖకరమైన దురాచారమునకు విరుద్ధముగా నివేదించుకొనెను. దాని ప్రతీకారమునకు, ఉపాయముకొరకు ప్రార్థించెను.

ఈ ఆచారము చంపారణములోను, నలువైపులగ్రామములలోను గల నీలితోటల వ్యవసాయవిషయమైన దురాచారము. ఆగ్రామముల జమీందారులు అధికపన్ను రాబట్టుటకు వారిభూములను నీలియందువ్యాపారస్థులగు ఇంగ్లీషువారికి నొసగియుండిరి. వారు ఆభూమిలో లాభదాయకమైన నీలితోటలను పెంచుటకు పర్యాప్తముగా వినియోగించియుండిరి. ప్రతివారును తమవ్యవసాయభూమిలో మూడవవంతులో నీలితోటలకొరకు నియమించి ఉంచవలయుననియు, దానిలోమరియేపంటను పండించక కేవలము నీలితోటలనే పెంచవలయుననియు గ్రామవాసులకు ఆదేశించియుండిరి. దొరలు, జమీందారులు ఈమరతుతోనే వ్యవసాయదారులకు భూమినియిచ్చియుండిరి. ఆకారణముచేత యీమరతునుపాలింపక శాసనము ప్రకారము వారికి ఏవిధమైన ఉపాయము లేకుండెను. కాని దానివలన దరిద్రగ్రామవాసులదారిద్ర్యము ఇంకను అధికతరమయ్యెను. నీలితోటలవలన వారికెట్టి లాభము కలుగకుండెను. అయినను నీలితోటలను పెంచుట మానివేయుటకు కూడ వారికెట్టిఅధికారము గాని, శక్తిగాని లేకుండెను. ఆహార

సస్యములను పండించక దొంగలభయముచేత వారు నీలితోటలనే పెంచవలసివచ్చెడిది. దీనివలన సమయము, పరిశ్రమ వ్యర్థమయ్యెడివి, అభావముల దుఃఖములభార మధిక మయ్యెడిది, ప్రతిగృహములో దారిద్ర్యవిలాపములు ప్రతిధ్వనించెడివి. ప్రతివిధానమునకు ఉపాయమెరుగక, దుర్బలులు విద్యావిహీనులునగు గ్రామవాసులు నిరాశతో దిగులుపడుచుండిరి. వంగదేశములో నీలితోటలను పెంచు ఇతిహాసము ఈవిధముగానో, ఇంతకంటె అత్యంతహృదయవిదారకము గానో యుండెను. సౌభాగ్యవశాత్తు చంపారణమునకు పూర్వమే యీవ్యవసాయము వంగదేశములో ఆపివేయబడెను. చంపారణ అధివాసియగు రాజకుమారుడు శుక్ల కూడ యీవిధముగానే పీడింపబడుచున్న నీలితోటల కృషీవలుడు. నిపీడితుడై విశేషబాధలవలన అయిన అమిత వాదియైరి. అసమయములో దేవునిదయవలన గాంధీజీనామమును, కార్యకలాపములను వినియుండిరి. ఆయన అత్యంత ఆశతో ఆవేదనములను, దుఃఖకష్టములను తెలియజేయుటకు లక్నోలోనున్న గాంధీజీవద్దకు వచ్చెను.

గాంధీజీఆయనవివేదనములను శ్రద్ధతో నాకర్ణించెను. నూతన అనుభవమును పొంది దుఃఖితుడాయెను. రాజకుమారుడు, ఆయన వకీలుముఖతః చంపారణగ్రామములలో నీలితోటలవ్యవసాయము, వ్యవసాయదారుల దురవస్థలను గురించి అన్నియు క్రమముగా తెలుసుకొనెను. ఆయనయీ

విషయములో ఇతర నాయకులతో సమాలోచనములు జరిపెను. పిమ్మట బహిష్కర వస్త్రములను గురించి జాతీయ మహాసభా సమావేశములో ఒక ప్రతిపాదనము గావించెను. కాని నాయకులు ఆ విషయములో ప్రతిపాదనమును ఆమోదింపజేసి అంతటితో విరమించిరి. విశేషఫలప్రదమైన ఏర్పాటు గావించుటకు గాని, సమాలోచనములు చేయుటకు గాని విశేష కాలమును వ్యయపుచ్చుటకు గాని అంగీకరింపలేదు. ఉత్సాహమును ప్రకటింపలేదు. దీంతో గ్రామవాసుల స్వార్థము కూడ ముడిబడియున్నటుల గాంధీజీ గ్రహించెను. అందువలన మహాసభ జవాబు చెప్పకపోయినను గ్రామవాసులు స్వావలంబులు కావలసియున్నది. తమ పాదములపై ఆధారపడి నడువవలసియున్నది. గాంధీజీ ప్రతికారమునకు తగిన ఆలోచనములు చేయుచుండెను, రాజకుమారుని మరియొకసారి వచ్చి కనబడమని గాంధీజీ నుడివెను.

ఇంతలో గాంధీజీ కలకత్తాకు వచ్చెను. ఆలోచనములలో నిమగ్నమైయున్నప్పుడు నూతనమార్గ మొకదానిని కనిపెట్టెను. ఈ విషయములో సత్యాగ్రహము అవలంబించిన యెడల మంచిఫలితము లభించవచ్చునని తలంచిరి.

గాంధీజీ హృదయము ఆశాజ్యోతితో ప్రజ్వలిత మయ్యెను. ఇంతలో రాజకుమారుడు మరల కలకత్తాకు వచ్చి గాంధీజీదర్శనము చేసుకొనెను. ఈ వ్యక్తియు గ్రామవాసులను ప్రతికారముకొరకు హృదయపూర్వకముగ

తహతహలాడుచున్నారని గాంధీజీ గ్రహించెను. 'అవసరమునుబట్టి సత్యాగ్రహానికి సిద్ధముగా నుండవలసియుండును. జైలులోనికి కూడ పోవలసియుండును. అట్లు చేయగలరా?' యని గాంధీజీ రాజకుమారుని ప్రశ్నించెను. 'ఈ దుర్వస్థలు' అత్యాచారములను అనుభవించుటకంటె జైలులో నుండుటకే కోరుచున్నామనియు, దీనికి తగినప్రతీకారమే కావలయుననియు, రాజకుమారుడు పట్టుదలతో నుండెను.

గాంధీజీ అస్వస్థుడయ్యెను. భారతభూమిపై తన యీ ప్రథమసంగ్రామములో యోధులు లభింతురని విని కార్యమునకు గడంగుటకు సంసిద్ధుడాయెను. నీలివ్యవసాయముల ప్రతిషిధానమునకు తగినసహాయము చేయుదునని గాంధీజీ రాజకుమారునకు వాగ్దానము నొసంగెను.

కాని ఈవిషయములో ఇంకా అనుసంధానము చేయుట అవసరమనియు, గ్రామమును, గ్రామవాసుల పరిస్థితులను ప్రత్యక్షముగా దర్శించుట అవసరమనియు, గ్రామవాసుల కోరికలను, మనోబలమును తెలుసుకొనుట కూడ అవసరమనియు గాంధీజీ తలంచెను. ఈఅవసరములను బట్టియే రాజకుమారునితో చంపారణ వెళ్ళుటకు అన్ని యేర్పాటులను గావించుకొనెను. ఆయన కలకత్తానుండి బిహారుకు వచ్చెను.

ముందుగా గావించుకొనిన యేర్పాటుప్రకారము గాంధీజీ పాట్నాలో శ్రీరాజేంద్రప్రసాదుగారిగృహమునకు

వచ్చెను. అప్పుడు రాజేంద్రప్రసాదుగారు పాట్నాలో లేరు. కాని గాంధీజీ స్థానీయ యితరనాయకులతో ఈవిషయమై ఆలోచనలు జరిపెను.

ఆలోచనములను జరిపినపిమ్మట ఆశాజ్యోతిని చూడ గలిగెను. పాట్నానుండి ఒకరిద్దరిని తోడ్కొని చంపారణకు పోవుటకు సంసిద్ధులైరి.

ఈసమయములో ఆయన జీవితములో ప్రియమైన దేశ వరేణ్యులైన కొందరు సహకారులను చూచుభాగ్యము ఆయనకు లభించెను. చంపారణకార్యములద్వారా ఆప్రథమ దర్శనము పరమస్నేహరూపమున పరిణమించెను. పాట్నాలో ప్రసిద్ధనాయకులు బాబు రాజేంద్రప్రసాద్ యీ చంపారణ సత్యాగ్రహసమయములోనే ప్రథమమున గాంధీజీతో కార్యక్షేత్రమున సమ్మిళితమయ్యెను. చంపారణములో గాంధీజీ అనుచరుడుగను, సహకారిగను కార్యములు గావించెను. ఈసమయములో ఆచార్యకృపలానికూడ గాంధీగారి శిష్యత్వమును స్వీకరించెను. ఆయనదళములో చేరి భారత దేశరాజనీతిక్షేత్రములో ప్రత్యక్షముగా అవతీర్ణులైరి. ఈసమయములోనో కొంతకాలముపిమ్మటనో ఆయనజీవిత ములో, ఆదర్శములలో సహకారియగు సర్దార్ వల్లభాయ్ పటేల్ కూడ ఆయనస్నేహమును ప్రీతినిపొంది ధన్యులైరి. చంపారణములోని క్షీణమైన కర్మప్రవాహమునుండి గాంధీజీ భారతదేశముక్తిసాధనకై ఆపదలతో పండిన కర్మసాగర

ము లో దుమికినపుడుకూడ, ఆయన యీసహకారులను భక్తి విశ్వాసులదళము ఆయనతో నిష్కపటముగా దేశ సేవలోను దేశీయుల సేవలోను తమ నుసమర్పించుకొనిరి. స్వాతంత్ర్యము బడసినపిమ్మట భారత దేశముయొక్కయు విశ్వముయొక్కయు మంగళముకొరకుఅస్పృశ్యతను, సాంప్రదాయికముల వైషమ్యమును తొలగించుటకు జీవితమును సమర్పించి నప్పుడుకూడ, యోగ్యులగు ఆయనఅనుచరబృందముకూడ ఆయనచేఆరంభింపబడి అసమాప్తమైయున్న కార్యములను సార్థకపరచుటకును, సంపూర్ణముగా నెరవేర్చుటకును దృఢచిత్తముతో ప్రతిజ్ఞలను గైకొనిరి. గాంధీజీ జీవనఘటనాప్రవాహముతో ఆయనఅనుచరులభక్తుల జీవితములుకూడ అచ్ఛేద్య భావములతో సమ్మిళితమై యున్నవి.

ఈసారి గాంధీజీతననియమానుసారముగా చంపారణములో కార్యములారంభించెను. వ్యవసాయదారుల తరపున చరమమార్గము నవలంబించుటకుముందు ఆయన స్థానికసర్కారువారికిని, దొరలకును వ్యవసాయదారుల దుఃఖకష్టములను గురించియు అభియోగములను గురించియు ప్రతీకారము చేయవలెనని కోరుచు ఉత్తరములను వ్రాసిరి. ఆయన స్థానీయకమిషనరు డివిజనల్ కలెక్టరు, జమీందారులను తమ్ముదర్శించు అవకాశముకలిగించమని వారికిఉత్తరములను వ్రాసిరి.

దొరలు ఆయన రాకవిషయమును ఉద్దేశవిషయమును తెలుసుకొని విశేషక్రోధావిష్టులైరి. గాంధీజీ ఒక పరిచిత విదేశీయుడు స్థానికవ్యవసాయదారుల మంచిచెడ్డల విషయములో ఆయన అభిమానము చూపించవలసిన పనిలేదని వారు కఠినముగా జవాబిచ్చిరి. ఆయన మంచితనము కోరినయెడల తక్షణము చంపారణజిల్లాను వదలిపోవలయునని తెలియజేసిరి. వారిజవాబు నూహకొని గాంధీజీ నవ్వుకొనెను. పనిసే చేయవలసివచ్చినయెడల కృషీవలుల దుఃఖనివారణముకొరకు తుదివరకు సంగ్రామము చేయవలసివచ్చినయెడల కృషీవలులలోనుండుటయే ఉత్తమమని అనుచరులతోను సహకారులతోను ఆలోచించి పిమ్మట స్థిరపరచుకొనెను. దీని వలన కృషీవలులు తమదుఃఖకష్టములనుగురించి జాగరూకులగుదురు. ప్రబోధమును, అనుభవమును పొంది తమదుఃఖ కష్టములను తొలగించుకొనుటకు తామే పాటుపడవచ్చును. అందువలన ముందు ముతిహారిగ్రామమునకును, రాజకుమార శుక్లగారి నివాసమున్న బేతియాగ్రామమునకును పోవలయునని అందరును సంకల్పించుకొనిరి. వారు సంకల్పించుకొనిన ప్రకారము గ్రామమునకై పునకు బయలుదేరిరి.

డివిజనల్ కమీషనరు గాంధీజీ ఉత్తరమునకు జవాబు వ్రాయలేదు. కాని ఆయనగమనాగమనములను అతితీవ్రముగా కనిపెట్టుచుండెను. గాంధీజీ గ్రామములో ప్రవేశించుచున్నారని విని ఆయనను హాజరమ్మని కబురు పంపెను.

గాంధీజీ యీ ఆహ్వానములోని అర్థమును స్పష్టముగా గ్రహిం చెను. కమిషనర్ ఆయనను అరెస్టుచేయునని తెలుసు కొనియు ఆయనవద్దకు వెళ్ళుటకే సంసిద్ధమయ్యెను. సత్యా గ్రహి సకలసమయములలోను కష్టములను, శిక్షలను వరించి స్వీకరించుటకు సంసిద్ధుడై యుండవలెనని ఆయనను తలి యును. కృషీవలుల యీ కార్యములో ఆయన నేతృత్వము, బాధ్యత స్వీకరించినారుగనుక తాను స్వయముగా అరెస్టు అయి యీ విషయములో ప్రథమమున ఆదర్శమును చూపించుట ఉత్తమమని తలంచెను. గాంధీజీ అనుచరుల వద్దనుండి శెలవుతీసుకుని ఠాణాకు వెళ్ళెను. కమిషనర్ ఆయనకు వారంటు చూపించి బందీగా చేసెను.

ఆయన గ్రామగ్రామాంతరములు తిరిగి యే కార్యము లను నెరవేర్చుటకు సంసిద్ధులాయెనో, ఆ కార్యములు ఆయన అరెస్టువలన సులభముగా నెరవేరుచున్నవి. ఆయన ఆగమనవార్త గ్రామవాసులు విని ఆనందము ననుభవించు చుండిరి. కాని ఈసారి ఆయన అరెస్టువార్త విని దుఃఖాక్రాంతు లైరి. విచారణదినమున జనసమూహము గుంపులు గుంపు లుగా వచ్చి జిల్లా మేజస్ట్రేటుగారికోర్టులో హాజరైరి. కాని ఆయన అనుచరులును, సహకారులును ఎట్టి ఉత్తేజముగాని ప్రతివాదముగాని ప్రకటింపక, అహింసాభావముతో విచా రణఫలితకొరకు అపేక్షించి యుండిరి. విచారణదినమున గాంధీజీ తాను గ్రామమునకు వచ్చిన విషయమునుగురించి

కోర్టులో నొసంగిన జవాబు అత్యంతనవీనమైనది. సత్యా గ్రహము, కర్మమార్గములవిషయములో కూడ యుక్తిప్రధానమైనది. ఆయన మేజస్ట్రేటుగారికి యిట్లుల తెలియజేసెను. సర్కారువారు నన్ను 144 సెక్షనుప్రకారము నేరస్థునిగా చేసి అరెస్టు చేసియున్నారు. 144 సెక్షనుప్రకారము జారీ చేయబడిన ఆజ్ఞను ధిక్కరించుటవంటి గురుతర కార్యమును నేను ఎందుకు చేసియుంటినో ఆవిషయములో సంక్షిప్తముగా కోర్టువారికి తెలియజేయ కోరుచున్నాను.

నాయభిప్రాయానుసారముగా యిది శాసనధిక్కార విషయమే కాదు. ఇదిస్థానికసర్కారువారితో నాయభిప్రాయ భేదములను గురించిన ప్రశ్న. ఈగ్రామమునకు ప్రజలసేవ, దేశ సేవ చేయునుద్దేశముతో ప్రవేశించితిని. రైతులకు నీలి మందువ్యాపారస్థులకు మధ్య న్యాయసంగతమైన షరతులు లేవు. ఆకారణముచేత రైతులకు సహాయము చేయునుద్దేశముతో నన్ను కొందరు ఆహ్వానించుటచేత నేను ఇచ్చటికి రావలసివచ్చినది. విషయములనన్నిటిని చక్కగా గ్రహింపక నేను వారి కెట్లు సహాయపడగలను. అందువలన నేను ఈ విషయమును తెలిసికొనుటకు, సాధ్యమైనయెడల సర్కారు వారి సహాయముతోను, నీలిమందువ్యాపారస్థులసహాయము తోను గ్రహించుటకే వచ్చితిని. నాకు ఇతరఉద్దేశ మేదియు లేదు. నేను వచ్చుటవలన ప్రజలలో అశాంతి కలుగునని గాని, లేక ఖూనీలు, హత్యలు జరుగుననిగాని నాకుతోచను

ఈవిషయములో నాఅనుభవము సత్యమైనది. ఇదియే నేను కోరుచున్నది. కాని యీవిషయములో సర్కారువారి విచారణ నాకు విపరీతముగా తోచుచున్నది. వారికిగల యిబ్బందులను నేను గ్రహించుచునేయున్నాను. వారు ఎట్టిపరిస్థితులలో వార్తలను పొందుదురో వానినే నమ్మవలసియుండునని కూడ నేనెరుగుదును. శాసనాధికారికారిగా నాపై జారీ చేయబడిన ఆజ్ఞను శిరసా వహించుటయే సహజమైనది. కాని అట్లు చేసినయెడల నేను ఎవరికొరకు ఇచ్చటికి వచ్చితినో వారిపై దెబ్బవేయుట యగునని నానమ్మకము. వారి మధ్య ఉండియే వారిసేవ చేయగలనని నానమ్మకము. అందువలన స్వేచ్ఛాపూర్వకముగా చంపారణను వదలిపోజాలను. ఈధర్మసంకటములో నన్ను చంపారణనుండి తొలగించు భారము సర్కారువారిపైన వేయక తప్పదు. నావంటివ్యక్తిపైన పేర్కొనబడిన మార్గము నవలంబించుటచేత ప్రజలకు ఏదృష్టాంతము చూపబడునో, దాని బాధ్యత యెట్టిదో నే నెరుగుదును. కాలి నిట్టిపరిస్థితులలో పడిపోయిన ఆత్మగౌరవము గల వ్యక్తి యీఆజ్ఞను ధిక్కరించి, తగినశిక్షను స్వీకరించుట కంటె గౌరవప్రదమైన మార్గము మరియొకటి లేదు. నాకు తక్కువశిక్ష వేయుమని నేను వాదించుటలేదు. శాసనానుసారముగా ప్రతిష్ఠితమైన కర్తృత్వమును తృణీకరించుటయే నాయుద్దేశము కాదు. నాహృదయములో గలసర్వశ్రేష్ఠ సియమంతరయొక్క నియమమును నేను అంగీకరించుచున్నాను.

అయినయెడల గౌరవమును చూపుటకే నాయంతరాత్మ ఆహ్వానమును అంగీకరించుచున్నాను. ఈ దేశమును ధిక్కరించు ఉద్దేశము కూడ అదిగాదని తెలియజేయుచున్నాను.

గాంధీజీయొక్క ఈనూతనజవాబును విని మేజస్ట్రేటు ఎట్టితీర్పును చెప్పవలయునో స్థిరము చేసుకొనలేకపోయెను. అదిగాక ప్రక్కగ్రామములో కలిగిన చైతన్యమువలనకూడ అధికారులు విచలితులైరి. మేజస్ట్రేటు విచారణమును వాయిదా వేసి యీవిషయములో బీహారుసర్కారువారికిని, గవర్నరుగారికిని ఉత్తరములను వ్రాసిరి. తనయుద్దేశ్యముల, కర్మమార్గముల సంకల్పముల దృఢభావమును తెలియజేయుచు గాంధీజీకూడ వైస్రాయికి ఒకఉత్తరమును వ్రాసి సమస్తమును తెలియబరచిరి.

తత్ఫలితముగా సర్కారువారి సకలవిభాగములలోను త్వరితగతిని అనుసంధానము జరిగెను. ఆ యనుసంధానమునకు పరిణామస్వరూపముగా స్థానీయశాసనాధికారులు గాంధీజీకి విరుద్ధముగా శాసనధిక్కారవిషయమై జరుపుచిన్న కేసును రద్దుచేసిరి. గాంధీజీ ఏదో యొకఅభిప్రాయముతో గ్రామములో ప్రవేశింపగోరినయెడల వారు ఆయనమార్గమునకు ఆటంకము కలుగజేసి విధినిషేధములను ఆరోపించెదమని సర్కారువారు గాంధీజీకి తెలియబరచిరి.

గాంధీజీ ముక్తిపొందెను. భారతదేశములో ఆయన వ్యక్తిగతమైన ప్రథమసత్యాగ్రహము జయమును బడసెను. ఆయన సర్కారువారి అన్యాయనియమములకు ప్రతీకారము చేయవచ్చిరి. కాని ఈవిషయములో సర్కారువారికి ప్రథమముగా సవిస్తరముగా తెలియజేసిరి. సర్కారువారు శిక్షించెదమని భయపెట్టిరి. గాంధీ నిర్భయముగా వినయపూర్వకముగా సర్కారువారి ఆదేశమును తిరస్కరించుటకు సంసిద్ధులైరి. సర్కారువారు పరాజితులైరి.

ఇది యొక అద్భుతమైన, అసాధారణమైన యుద్ధకౌశలమువలన గాంధీజీ ప్రథమముననే సాఫల్యతను సంపాదించిరి. అహింస సత్యాగ్రహములలో ఆయనకు విశ్వాసము ఇనుమడించెను. సమస్త దేశవాసులకుకూడ అహింసలోను, సత్యాగ్రహములోను విశ్వాసము జన్మించెను, ఆయనకు చంపారణలో లభించిన కీర్తినిగురించి హిందూదేశములోని వార్తాపత్రికలన్నిటిలోను ప్రచారిత మయ్యెను. గాంధీజీనామము సంపాదకీయ వ్యాసములకు శిరోభూషణముగా పరిణమించెను.

ఈస్థానికవిషయములో ఇంతప్రచారము గాంధీజీకి నచ్చలేదు. ఈవిషయములో ప్రచారము చేయువలదని నిషేధించి పత్రికాధిపతులకు ఉత్తరములు వ్రాసిరి. ఈవిషయములో విశేషఆందోళనము జరిగినయెడల చంపారణగ్రామవాసులకు హాని కలుగవచ్చునని పత్రికలద్వారా సాధారణ ప్రజలకు తెలియజేసిరి.

ఈసారి ఆయన కృషీవలులకొరకు ప్రకృతకార్యము లలో ప్రవేశించెను. ఆయన తనఅనుచరులతోను స్థానికగౌరవనీయవ్యక్తులతోను, కృషీవలుల దురవస్థలను గురించియు, అభావలభియోగములనుగురించియు యదార్థవిషయములను సేకరించుటకు సర్కారువారికి సంబంధములేని ఒకవిచారణ సంఘమును నిర్మించెను. గ్రామములలో ఈసంఘసమక్షమున సాక్ష్యము నిచ్చుటకు కృషీవలులకు నోటీసులు పంపించబడెను. కృషీవలులు ఉత్సాహితులైరి. గాంధీజీ కార్యములను చూచి వారు సర్కారువారిశిక్షలను తిరస్కరించుటకు సంసిద్ధులైరి. వారు యీసారి గుంపులుగుంపులుగావచ్చి నీలిమందువ్యాపారస్థులు గావించిన అత్యాచారములను గురించియు, అనాచారములను గురించియు అనేకవిధములైన దుఃఖాక్రాంతచరిత్రలను వర్ణింప మొదలుపెట్టిరి.

కృషీవలులలో కలిగిన యీచైతన్యము, సాహసము, ఐకమత్యములను చూచి ప్రాదేశికసర్కారువారు చింతాక్రాంతులైరి. ప్రాదేశికగవర్నరు భారతసర్కారువారితో సంప్రదింపులను జరుపుచుండిరి. చంపారణకృషీవలులును నీలివ్యాపారస్థుల విషయములో ప్రాదేశిక సర్కారువారు సర్కారువారితరపున విచారణసంఘమును నిర్మించుటకు సంకల్పించుకొనినారని తుదకు గవర్నరు స్వయముగా గాంధిగారికి ఉత్తరముద్వారా తెలియబరచెను. ఈసంఘములో

గాంధీజీకూడా ఒకసభ్యుడుగా ఉండి విచారణకార్యములలో సర్కారువారికి తోడ్పడెదరని గవర్నరుకు తెలియబరచెను.

ఉత్తరముచూచుకుని గాంధీజీతనసహచరులతో ఆలోచించెను. సర్కారువారికి యిట్లు తెలియజేసెను. అన్యాయ ప్రతీకారములకొరకు సకల సమయములలో సర్కారువారితో సహకారము సల్పుటకు సంసిద్ధమై యున్నాననియు, అన్యాయములపై సర్కారువారికి చైతన్యము కలిగినయెడల ప్రజలు మరియే అప్రియమైన, వేదనాదాయకమైన ప్రతీకారము యొక్క సహాయమును స్వీకరింపవలసినపని లేదనియు తెలియజేసిరి. గాంధీజీ సర్కారువారు అవలంబించిన సంకల్పములకు వారికి ధన్యవాదములు తెలియజేసిరి.

సర్కారువారికి సంబంధము లేని సంఘమువారు గావించిన సిద్ధాంతములే సర్కారుసంఘమువారి విచారణములో కూడ ప్రమాణితము లయ్యెను. నీలిమందు వ్యాపారస్తులు ఎంత అమానుషికముగా కృషీవలులపై అత్యాచారములను గావించుచున్నారో, సాక్షులసాక్ష్యములవలన ప్రకాశితము లయ్యెను. కృషీవలులపై గావింపబడుచున్న అత్యాచారముల అమానుషికకథలను విని సంఘసభ్యులుకూడ విచారగ్రస్తులైరి. సంఘమువారు కృషీవలులకు అనుకూలముగా విచారణఫలితమును ప్రకటించిరి.

అనంతరము బీహారుసర్కారువారు ఉదారపూర్ణమైన కార్యమును గావించిరి. సంఘమువారి సిద్ధాంతముల ననుస

రించి బలాత్కారముగా కృషీవలులభూమిలో పదాడవ భాగము నీలితోటలను పెంచు ఆపదలనుండి విముక్తులైరి. చంపారణ దరిద్రగ్రామవాసులు నీలిమందు విషమును డి రక్షింపబడిరి.

త్రేతాయుగము నాటి చరిత్ర..................

సముద్రమునుండి విషము ఉత్పన్నమై సృష్టిని ధ్వంసము చేయ సంసిద్ధమయ్యెను.

విషముచే తల్లడిల్లుచున్న దేవతాదళము ప్రాణములను సృష్టిరక్షణకొరకు దేవాదిదేవుడగు మహాదేవుని శరణు జొచ్చిరి.

ఆశుతోషుడు ఆనందకందముతో ఆవిషమును పానము చేసెను.

అసహాయ దేవతలను రక్షించెను—

విషమును కంఠమున ధరించెను—

నీలకంఠు డయ్యెను—

ఈ యుగములో జరిగిన ఇతిహాసము—

చంపారణములోని నీలిమందువిషము అమాయికులైన అనేక గ్రామవాసులను ధ్వంసము చేయుటకై సంసిద్ధమయ్యెను—

నీలిమందు అత్యాచారములచే జర్జరులైన గ్రామవాసులు భారతదేశములో సర్వశ్రేష్ఠుడగు సత్యాగ్రహి శరణు జొచ్చిరి—

సత్యాగ్రహి గాంధీజీ నిర్వికారచిత్తముతో నీలి మందువిషయమును పానముచేసిరి.

అసహాయులగు గ్రామవాసులను రక్షించిరి.

నీలిమందువిషయమును ఆయన స్వయముగా స్వీకరించెను.

ఆయన జయము నొందెను.

కాని సర్కారువారు ఆయనపై నిర్వికారముగాతీరముగా వ్యవహరించినను, యీవిషయములో సర్కారువారు ఆయనపై కోపావిష్టులైయుండిరి, ఆయనకు శత్రువులై యుండిరి.

సత్యాగ్రహియగు గాంధీజీ సమస్తమును గ్రహించెను. కాని తనఅంతరంగసత్యమును స్మరించుకొని నిర్భయహృదయముతో ప్రశాంతమందహాసమును వెలిబుచ్చిరి.

ఈసారి చంపారణములోని బాహ్యక్రియాకలాపముల విషయము విడిచి దాని ఆంతరికక్రియాకలాపములవిషయము యిచ్చుట ఉదహరించుట అవసరము. చంపారణములో పని చేయుటకు పోయిన గాంధీజీభారతదేశములోని దురవస్థలకు మూలకారణమును గ్రహింపగలిగెను. సకల గ్రామవాసులు విద్యావిహీనులు, ఆరోగ్యసూత్రములు తెలియనివారు, మూఢాచారముల అగాధపంకిలములో మునిగియున్నవారని ఆయన గ్రహించెను. గ్రామవాసులు తమదోషములవలన తామే కష్టపడుచున్నారు. బోధశక్తి, ఉన్నతచిత్తవృత్తుల అభావముల వలన తమదుఃఖకష్టములను, ఆవేదనములను, అత్యా

చారములను తెలుసుకొనజాలరు, తెలుసుకొనగోరరుకూడ. దుఃఖములను, అజ్ఞానమును, అత్యాచారములను, ఉత్పీడనములను తమ దురదృష్టములని నిరాశహృదయముతో భరించుచుందురు.

చంపారణ్యములో మూర్ఖతకు, అజ్ఞతకు పరిస్థితుల పరిమాణములు గాంధీజీ గాంచెను. అచ్చటి యువకులు పనిపాటులు ఏమియు చేయక యింటింటికి తిరుగుచు కాలమును వ్యర్థము చేయుచుందురు. స్త్రీలు 4. లేక 6 డబ్బులకొరకు రోజంతయు శ్రమపడి పనిచేయుచుందురు. ఈహీనత్వము వారి దురదృష్టమని నిస్సంకోచముగా అంగీకరింతురు. గ్రామవాసుల ఈ అవిద్య, మూఢాచారములు, మాలిన్యములు తొలగించనిదే వారు న్యాయమైన సత్యమైన అధికార నిర్ణయములో తమవాటాను నెరవేర్చుకొనుటకు యోగ్యులు కాజాలరు. అన్యాయమెవరిగా జరిగెనో, దానికి ప్రతీకారమేమిటో, వారికి లభించు అధికారమెట్టిదో, విద్యాసంస్కారముల అభావమువలన దీనిలో దేనినికూడ వారు గ్రహింపజాలరు.

అందువలన గాంధీజీ నీలిరైతుల ఆగ్రహముతో పాటు గ్రామవాసుల మానసిక ఉన్నతవిషయములోకూడ విశేష వ్యవస్థను అవలంబించెను. ఆయన తన సహచరులతో ఆవిషయమై విశేష ఆలోచనములను జరిపియుండిరి. అహమదాబాదు ఆశ్రమమునుండి సేవికాగణములనుకూడ

తీసుకొని వచ్చిరి. సేవయందును, పాలనమునందును స్త్రీలే దక్షులని తలంచి వారిపై నవిద్యా సేవలభారమును సమర్పింప బడెను. సేవికలు గ్రామములలో తిరుగుట కారంభించిరి. సాధారణ బాలబాలికలయొక్కయు, గ్రామ్యరమణీమణుల యొక్కయు అజ్ఞానమును తొలగించు కార్యములలో వారు తమను సమర్పించుకొనిరి. ఆదశలో ఒకరిద్దరు చికిత్సకులు కూడ నుండిరి. వారు గ్రామవాసులకు అశుభ్రత, గజ్జి, కురుపులు మొదలగువిషయములలో అనేకఉపదేశముల నొసంగిరి. అవసరము ననుసరించి గ్రామస్థులకు రోగము లలో సేవాశుశ్రూషలనుకూడ చేసియుండిరి. సేవకులుకూడ గ్రామములలో అచ్చటచ్చట వ్యాపించిరి. పగలుగాని రాత్రి గాని అనుకూలమునుబట్టి వయస్కులకుకూడ విద్య నేర్పు చుండిరి. ప్రాథమికవిద్యద్వారా ఆచారవ్యవహారములు, రీతి నీతులు, న్యాయాన్యాయములు, ఆరోగ్యరక్షణము మొద లగు విషయములలో విద్య గరపుచుండిరి. ఈప్రయత్నముల ఫలితముగా కొలదిదినములలోనే స్పష్టమైన పరివర్తనము కనుపించెను. గ్రామవాసులలో అనుశోచన, ఆత్మచైతన్యము మేల్కొనెను. గ్రామోన్నతికరమగు యిట్టికార్యముల సాఫల్యతవలనకూడ గాంధీజీ ఆశాన్వితు డయ్యెను. ఇంత కంటె యింకను మహత్తరక్షేత్రమునందు ఆయన పరీక్షిం చిన యీప్రణాళికను ప్రయోగించి దేశవాసులను జాగ రూకులుగను, చైతన్యవంతులుగను నొనర్ప ఉత్సాహితు

వైరి. గాంధీజీ భారతదేశ గ్రామములు, గ్రామవాసుల శారీరక మానసిక ఉన్నతికొరకు ఎంతయో ప్రయాసపడి సమాజ సంఘ మెరుగునకు. ఎన్నియో అభినవమార్గములను, శాస్త్రసమ్మతమైనవాని సూచించినాడు. భారతదేశములో లక్షలకొలది గ్రామవాసుల ఆరోగ్యము, విద్య, చారిత్ర బలమువలననే భారతదేశమునకు ఉత్తశక్తి మరల తన గౌరవసింహాసనమున ప్రతిష్ఠనము కాగలదని ఆయన తన ప్రయత్నములద్వారా మనకు బోధించియుండిరి.

---

## 40
## శోషిత పారిశ్రామికులలో చైతన్యము

చంపారణ కృషీవలులను నీలిబాధనుండి ఉద్ధరించి గాంధీజీ ఇంటిలో విశ్రమించలేదు. సబర్మతీసత్యాగ్రహ ఆశ్రమమునకుపోయి ఆశ్రమ కార్యములలోకూడ శ్రద్ధతో పాల్గొనుటకై సమయము లేకుండెను.

రెండు నూతన సమస్యలు ఆయన సమక్షమునకు వచ్చెను. ఒకటి అహమదాబాదులో పారిశ్రామికుల అసంతోషము, రెండవది గుజరాతు ప్రదేశములో ఖేడాజిల్లాలో పన్నులనిరాకరణము.

1918 వ సంవత్సరములో ఒక దేశసేవకునిద్వారా అహమదాబాదుపట్టణములోని దరిద్రపారిశ్రామికులపై మిల్లు

యజమానులు గావించిన అత్యాచారముల, అన్యాయముల గాథాగాథను గాంధీజీ వినియుండెను. మిల్లుయజమానులు కూలీలద్వారా ఎంతపని చేయించుకొనెడివారో దానికి తగిన మజూరియిచ్చుటలేదు. వారిచ్చు అల్పవేతనము పారిశ్రామికుల అన్నవస్త్రములకైనను సరిపోవుటలేదు. కూలీలు యజమానులకొరకు రక్తము నీరైపోవునటుల శ్రమపడుచుందురు. కూలీలు అర్ధభోజనము చేసియుందురు. ధనికులు ధనమును బ్యాంకులలో జమకట్టుకొనుచుందురు. ఇది గాంధీజీకి చాలా అన్యాయముగను, అసత్యముగను తోచెను. ఆయన యీ అసత్యమును తొలగించుటకు సంకల్పించుకొనెను. అహమదాబాదుమిల్లుయజమానుల, కూలీల విశేషవివరములను తెలుసుకొనుటకు ఆయన అహమదాబాదుకు పయనమైపోయి పారిశ్రామికులదుఃఖకారవస్థలను ప్రత్యక్షముగా దర్శించెను. వేతనము న్యాయముగా వృద్ధిపొందిన యెడలవారిదుఃఖకష్టములు కొంతవరకు తొలగిపోగలవు అని గ్రహించెను. ఈసారి యజమానులను చూచెను. యజమానులలో కొందరు గాంధీజీని యెరుగుదురు. కొందరు వ్యక్తిగతముగా ఆయనను గౌరవించుచుండిరి. కాని వారిస్వార్థము, ఉద్దేశములకు వ్యాఘాతము కలుగునన్నదని మిక్కిలి అసంతుష్టి చెందిరి. వారు మధుర వాక్యములతోను పారిశ్రామికులపై బాహ్యసానుభూతితోను గాంధీజీకి ఇటుల తెలియజేసిరి. 'మాకు మాకూలీలకు మధ్యగల సంబంధము తండ్రికొడుకులసంబంధమువంటిది. అట్టి

విషయములో ఇతరులు జోక్యము కలుగజేసికొనిన యెడల యెట్లు సహింపగలము, ఇందులో ఇతరుల జోక్యమెందుకు?'

గాంధీజీకూడ మందహాసముతో తెలియజేసిన దేమనగా— తమమాటలు చాలాత్యాగామున్నవి. కాని మిథ్యచే పరిపూర్ణమైయున్నవి. నిజముగా మీరు కూలీలక్షేమమును కోరుట లేదు. నోటితో తండ్రికొడుకుల సంబంధమని చెప్పుచున్నారు. నిజముగా మీకు అట్టి అభిప్రాయమే యున్న యెడల వారికష్టములను తొలగించుడు. వారివేతనములను వృద్ధిజేయుడు.

మిల్లుయజమానులు కోపావిష్టులైరి. అయిష్టమును చూపించిరి. గాంధీజీ మధ్యవర్తిత్వమువలన ఎట్టిపరతులనను అంగీకరించలేదు.

గాంధీజీ ఆయనకర్తవ్యమును ఆలోచించెను. ఈవిషయములో కూలీలు ఆత్మనిర్భరశీలురగుటయే ఉత్తమమని తలంచెను. సత్యముకొరకు సంగ్రామము చేయవలయునని స్థిరసంకల్పము గావించుకొనెను. ఆయన కూలీలు, కూలీల నాయకులు సమావేశమైన సభలో తనసంకల్పమును తెలియజేసెను. 'మీన్యాయమైన కోరికలను నెరవేర్చుకొనుటకు మీరు హరతాళము చేయవలయును.'

పారిశ్రామికులు యీప్రతిపాదనకు అంగీకరించిరి.

హరతాళకార్యక్రమమునుగురించివిశేషముగా వారికి గాంధీజీ తెలియజేసెను. సత్యాగ్రహమునుగురించి అందరును

గ్రహింపలేదు. సత్యాగ్రహప్రణాళికనుమాత్రము ఆయన వ్యక్తపరచెను. అందరును హరతాళము చేయుటకే నిశ్చయించుకొనిరి.

(1) యజమానులు మనకోర్కెలను నెరవేర్చునంత వరకు ఎవరును మిల్లుపనిలోకి వెళ్ళవలదు.

(2) ఈసమ్మెసమయములో ఎవరును శాంతికి భంగకరముగా ప్రవర్తించవలదు.

(3) ఏవ్యక్తి పనిలోకి పోవకోరుచుండునో అతనిని బలవంతపెట్టవలదు.

(4) కూలీలు భిక్షాన్నమును తినవలదు.

(5) సమ్మె ఎంతకాలము జరిగినను దృఢమనస్కులై యుండవలయును. డబ్బులేనియెడల భోజనమునకు సరిపోవునంతవరకే కూలి చేయవలయును.

గాంధిజీయీసమ్మెను అహింసా, నిగ్రహముల పవిత్ర బంధనములచేత బంధించెను. సత్యాగ్రహము, అహింసల మధ్య సన్నిహితసంబంధ మున్నదని గాంధిజీ పరీక్షలద్వారా తెలియబరచెను. సత్యాగ్రహమును, అహింసను ఆఫ్రికాలో ఆయన సమానముగా ప్రయోగించెను. భారతక్షేత్రములో కూడ ఆయన అట్లే ప్రయోగింపకోరుచున్నారు. అయితే భారతభూమిపై సత్యాగ్రహముతో అహింసాప్రయోగము సంభవమగునో కాదో, సఫలీకృతమగునో కాదో అనువిషయములో పరీక్షించుటకు ఆయన స్థానికసీమాబద్ధసమస్యల

ఇరువదియొక్క దినములవరకు సమ్మె చక్కగా శాంతియుతముగా పరిపాలింపబడెను. కూలీల యైకమత్యము, సంఘబద్ధభావము, దృఢత్వములగాంచి మిల్లుయజమానులు కొంత చింతాక్రాంతులైరి. కాని తుదకు దరిద్రులును, బుభుక్షువులు నగుకూలీలు తమపట్టుదలను, సంకల్పములను నిలుపుకొనజాలకపోయిరి. ఆకలిమంటచే వారు బెదరిపోయిరి.

దళములోనివారు కొందరుకొందరు పనులలో ప్రవేశించుచుండిరి. కాని ప్రవేశింపనిచ్ఛగింపనివారు పరతులను భగ్నపరచి ప్రవేశించినవారిపై బలమును ప్రయోగించి ఆటంకము కలుగజేయుచుండిరి. కూలీలమనోబలము తగ్గిపోవుచుండెను. వారి మనస్సులలో హింసాభావము రగులుకొనుచుండెను.

గాంధీజీ తమప్రయత్నములు విఫలమగుట గాంచి అనుతప్తుడాయెను. అజ్ఞులు దరిద్రులునగు పారిశ్రామికులు సత్యాగ్రహము, అహింసలకు యోగ్యులు కాజాలకపోవుట చేతనే సమ్మె భగ్నమై పోవుచున్నదని గ్రహించెను. వారిని యోగ్యులనుగా చేయక సంగ్రామములోనికి లాగి తెచ్చుట తనదే పొరపాటు అని గ్రహించెను — కాని తనపొరపాటును ఆయన తృణీకరింతురా?—ఎంతమాత్రము తృణీకరింపరు. ఆయన పొరపాటుకు ఆయన దోషమునకు కూలీలు ఫలమనుభవింపవలయునా— ఈ దోషమునకు శిక్ష ఆయనయే

ప్రతివాదములను ధిక్కరించి, కొండా విమర్శనములకు విచలి
తుడుగాక ఉపకరణము ద్వారా చూపించెను. తనకర్మలు,
ఆదర్శములు, లేక మార్గములు ఎప్పుడుతప్పులని తెలుసు
కొనెనో, అనేక్షణమే ఆయన ఆతప్పులను నిష్కపటముగా
అంగీకరించి, ఆ వాపద్దను బాహాటముగా వెల్లడిచేసియుం
డెను. రోమెన్ రోలండు అను మహానుభావుడు ఆయనస్వభా
వమును వర్ణించబోయి యిట్లు నుడివెను— 'నేను పొర
పాటు చేసితిని, ఈవిషయమును అంగీకరించుటకు ఆయన
సర్వదా సంసిద్ధుడై యుండెను.'

ఆయనలో గలయీదోషస్వీకార ఆదర్శనము ఆయన
జీవితములో అనేకసార్లు మనము గాంచితిమి.

ఈసారి గుజరాతు ఖేడా జిల్లాలో జరిగిన సంఘటనము
లను వర్ణించెదను.

గుజరాత్ ప్రదేశములలో కృషికులకొరకు స్థానిక
సర్కారువారు ఒకశాసనమును చేసియుండిరి. భూమిలో
నాలుగవవంతు లేక నాలుగవవంతుకంటె తక్కువపంట
పండినసంవత్సరము పేదరైతులు ఇవ్వవలసినపన్నురద్దు చేయ
బడునని ప్రకటింపబడెను. 1918 వ సంవత్సరము ఖేడా
మొదలగుగ్రామములలో పంటలు సరిగా పండలేదు. నాలు
గణాలసస్యములుకూడ పండలేదు. రైతులకు అన్నాభావము
వలన ధనాభావముకూడకలిగెను. వారు పన్నువిషయములో
క్షమించమని స్థానికోద్యోగస్థులకు మొరపెట్టుకొనిరి. కాని

వారిమొర నిరాకరింపబడెను. అంతేగాక నాలుగుఅణాల కంటె పంటలు అధికముగా పండెనని ఉద్యోగస్థులు పై అధికారులకు తెలియజేసిరి. ఆవార్తలనుబట్టి పన్ను వసూలు చేయుటవిషయములో కఠినముగా వ్యవహరించమని పై అధికారులు ఉద్యోగస్తులను ఆదేశించిరి.

రైతులు అసహాయస్థితిలో పడిపోయిరి. ఏమిచేయ వలసినదియు వారికి తెలియుటలేదు. ఇట్టిసమయములో ఈ అన్యాయములు, అత్యాచారములనుగురించి గాంధీజీ విన గలిగెను. రైతుల యీదురవస్థలవలన ఆయనహృదయము ద్రవీభూతమాయెను. ఆయన దళబలముతో ఖేడాలో ప్రవేశించిరి. రైతులనుచూచి మాట్లాడిరి. వారిపంటలవిషయము పరీక్షించిరి. వారితో నలువైపులనున్న పరిస్థితులనుగురించి సంప్రతించిరి. పన్నునుండి రక్షింపబడకపోయినచో రైతుల అభావములపై అభావములభారము వేయబడును. వారికష్టములకు అంతముండదు.

గాంధీజీ యీసారి చరమప్రతీకారమును గురించి ఆలోచించెను. ఆయన సహకారులతో విశేషాలోచనములు సల్పిన పిమ్మట రైతుల యీఅత్యాచారములకు విరుద్ధముగా సత్యాగ్రహము చేయవలయుననియు స్థిరపరచుకొనిరి. ఈ విషయములో రైతుపెద్దల అభిప్రాయములనుకూడ గాంధీజీ తెలుసుకొనగోరెను. గాంధీజీ రైతులయెడల చూపుచున్న సానుభూతివిషయము వారు రైతులపెద్దలద్వారావిని ఉత్సా

హితులైరి, ఆశావిశ్వాసులైరి. సత్యాగ్రహము అవలంబించుటకు మహోత్సాహముతో అంగీకరించిరి.

కాని గాంధీజీహృదయములో చంపారణ, అహమదాబాదు విషయములు ఉజ్వలరూపము దాల్చెను. సత్యాగ్రహసంగ్రామము ఆరంభించుటకు ముందు రైతులలో అహింస సత్యనిష్ఠలను మేల్కొల్పుటకు ఉద్యుక్తులైరి. ఆయన సంకల్పమును రైతులు గ్రహించిరి. సత్యమును పొందవలెనన్నచో సత్యమును అనుసరించుసంకల్పమును స్వీకరించవలయును. సత్యముకొరకు వినయపూర్వకముగా కష్టములను వరించుటకును, అత్యాచార ఉత్పీడనములను సహించుటకును, మనోబలమును సంపాదించవలయును.

ప్రతిగ్రామవాసులును, రైతులును, గాంధీజీవద్దకు వచ్చి ప్రతిజ్ఞాపత్రములో సంతకము చేసిరి. 'మాగ్రామ పంటలు నాలుగుఅణాలకు మించి పండలేదు. ఈవిషయము మే మెరుగుదుము. ఈకారణముచేత పన్నువసూలు రాబోవు సంవత్సరమువరకు అపుదలచేయించమని మేము సర్కారువారికి దరఖాస్తు పెట్టుకున్నను పన్నువసూలుచేయుట నిలుపుదల చేయలేకపోతిమి. అందువలన మేము ఇటుల ప్రతిజ్ఞ చేయుచున్నాము. సంవత్సరమునకు చెల్లించవలసిన సంపూర్ణమైన పన్ను, లేక మాలో ఎవరిపన్ను కొంతబాకీయున్నదో, ఆబాకీయున్న పన్ను మేము చెల్లించుకొనజాలము. ఈపన్ను వసూలుచేయుటకు సర్కారువారు శాసనప్రకారము ఏమి

చేయవలయునో చేయవచ్చును. దానికొరకు దుఃఖకష్టములను సహింపగలము. మాభూములను వేలము వేయగోరుదురేని అట్లు చేయవచ్చును. అట్లయినను మేము మాచేతులతో పన్ను చెల్లించి మాఫిర్యాదు అసత్యమైనదని ప్రమాణితము చేయజాలము. సర్కారువారు రాబోవుచున్న వసూలు అన్ని జిల్లాలలో నిలుపుదలచేసినయెడల, మాలో శక్తి ఉన్నవారు పూర్తిగాగాని, అంశికముగాగాని బాకీయున్నపన్ను జమకట్టుటకు సంసిద్ధులై యున్నాము.

సత్యాగ్రహము ఆరంభించబడెను. రైతులు పన్ను చెల్లించుటకు నిరాకరించిరి. అసమర్థులు చెల్లింపలేకపోయెను, సమర్థులు చెల్లింప నిరాకరించెను. ఉద్యోగస్థులు బాధింప జొచ్చిరి. అచ్చటచ్చట అత్యాచారములుకూడ ఆరంభించబడెను. రైతులమనోబలమును గట్టిపరచుటకు గాంధీజీ, ఆయన సహకారులు గ్రామగ్రామాంతరములకు తిరిగి అహింసాసత్యాగ్రహవిషయములలో ప్రచారము చేయమొదలు పెట్టిరి. అధికారులు కంగారుజేసినను భయపడవలదని వారు తెలియజేసిరి. వినయముతో దృఢసంకల్పముతో ఉద్యోగుల మాటలను పెడచెవిని పెట్టవలయును. వారు దెబ్బలుకొట్టినను దృఢసంకల్పముతో ఆదెబ్బలను భరించవలయును. అరెస్టుచేసినయెడల ప్రశాంతమనస్సుతో వారు తీసుకొనిపోయినస్థానమునకు పోవలయును. కానిసకలసమయములలో నీసంకల్పములలో విశ్వాసవంతుడవై యుండవలయును.

అరెస్టు చేసిరి. దీనివలన ప్రజలలో ఉద్రేకభావము అధికమాయెను. దుర్బలులు, భీరులైన వారిలో కూడ మరల సాహసము, చైతన్యము కలిగెను. జనమనమును వహించిన సత్యాగ్రహప్రవాహము మరల నూతన వేగముతో ప్రవహించుచుండెను.

ఇంతలో రైతుల మనోబలము, కష్టసహిష్ణుత చూచి సర్కారువారు విచారగ్రస్తులైరి.

దాదాపుగా, అసమర్థులైన రైతులవిషయములో సర్కారువారిహృదయములో కూడ కొంతపరివర్తనము కలిగెను. సర్కారువారు తుదకు ఇట్లు ప్రకటించిరి. "సమర్థులు, శక్తిశాలురు మాత్రమే పన్ను చెల్లించవలయును. దరిద్రరైతుల పన్ను క్షమించబడినది."

సర్కారువారు జిల్లాకలెక్టరుద్వారా తమఅభిప్రాయమును గాంధీజీకి తెలియజేసిరి.

గాంధిజీ సహచరులతో ఈవిషయములో సంప్రతింపులు గావించెను. సర్కారువారు రైతులపరిస్థితులను గ్రహించినారని తెలుసుకొనెను. సర్కారువారి ఆప్రకటనసంపూర్ణముగా సంతోషదాయకమైనది కాకపోయినను దానిని అంగీకరించెను. ఆయన సత్యాగ్రహమును విరమించెను. ఆసంవత్సరమునకు రైతులు బ్రతికిపోయిరి.

ఈఖేడాజిల్లాసత్యాగ్రహవిషయము భారతదేశమంతయు వ్యాపించెను. గాంధీగారి యీనూతనసంగ్రామమును,

నిరాకరణచేయుదుము. కాని ఆ ప్రతిబాదమును నిరుపద్రవకర ముగా గావింపవలయును. ప్రతివాదకార్యములలో హింస, నీచత్వము, క్రోధము మొదలగు దుర్గుణములుండకూడదు. 'నేను దీనిని అంగీకరింపను. దీనిని పాలింపను. ఇది అసత్య మైనది. ఇది అన్యాయమైనది, ఈ అభిప్రాయముతో దృఢ చిత్తముతో, నిలువబడుము. అన్యాయ, అసత్యకార్యముల నుండి విరమింపుము. అన్యాయములకర్తయు, ఆదేశకారియు అన్యాయకార్యములలో సహాయపడదు. వినయముతో, శాం తముతో, ధైర్యముతో, మానసికస్థిరత్వముతో ధీరత్వముతో నిగ్రహముతో అన్యాయమును ప్రతిఘటింపుము. 'నేను సత్యా న్వేషిని, సత్యమునకు క్రోధము లేదు. హింసలేదు. స్వేచ్ఛా భావము లేదు. నేను శాంతిని, వినయమును, దృఢత్వమును, దృఢత్వముతో వినయముతో ప్రతిపక్షుల కార్యములకు ఆటం కముల కలిగించెదను. ప్రతిపక్షులు నాయుద్దేశములను, నా సత్యాచరణమును బహుశా గ్రహింపజాలరు. ఆటంకముల వలన నాపై కోపగింతురు. అత్యాచారములు గావింతురు. సత్యముకొరకు, ఆ అత్యాచారములను ధైర్యముతోను, విన యముతోను స్వీకరింపవలయునని స్మరించుకొందును. కష్టము లను వరింతును. దుఃఖమును సహింతును. అవమానమునుబట్టి దెబ్బలు సహింతును కాని సకలసమయములలో అత్యాచారిని గౌరవదృష్టితో చూచుచుందును. సకలపరిస్థితులలో అత్యా చారిని ప్రేమింతును. అత్యాచారిహృదయమును గౌరవిం

డును. స్వేచ్ఛాచారము నుండి క్రోధముత్పన్న మగును. సత్యాగ్రహము నందు హింసయొక్క అస్తిత్వము లవలేశ మున్నను జయము గనేరదు. హింసయనగా వెనుకకు నడచుట. నిగ్రహాభ్యాసము చే క్రోధమును అనవసరముగా వ్యర్థము చేయుట.'

గాంధీగారి మహత్తర సత్యాగ్రహ కౌశలమునుగురించి సాక్మన్‌కోలాండు అను మహానుభావుడు ఒకచోట యిట్లు వచించెను— "ప్రతిపక్షులపై హింసను ప్రయోగించుట నిషేధించెను. కారణమేమనగా, ప్రతిపక్షులు హృదయపూర్వకముగా నాశించుచున్న ఆదర్శములను వారు అంగీకరింపవలసి వచ్చెను. ఒకరికి సత్యముగా తోచినది మరియొకరికి భ్రాంతిగా తోచవచ్చును. హింసద్వారా ఎవరినైనను ఉచ్ఛ్వాసము ఉదయింపజాలము. సత్యాగ్రహులు ప్రతిపక్షులను ప్రేమ ద్వారా జయింపవలయును. విశ్వాసములో ప్రేమను జన్మింపచేయుట ద్వారాను, ఆత్మత్యాగతత్పర భావము చేతను, బాధలను సాదరముతో స్వీకరించుటద్వారాను జయింపవలయును. నిజముగా యిది యొకవిధమైన ప్రచారము. దీనిని ప్రతిఘటించుటకు వైజ్ఞానికుల, ధాతువుల అస్త్రములద్వారా సాధ్యపడదు. ఈ ప్రచార ఫలితము చేత క్రీస్తు ప్రభువు, ఆయన అల్పసంఖ్యగల శిష్యులద్వారా విశాలమైన సామ్రాజ్యమే జయింపబడినది.

ఈ సత్యాగ్రహములో అంతర్గతమైన అహింసానీతిని కొందరు అపార్థము చేసుకొనవచ్చుననే ఉద్దేశముతో గాంధీజీ అహింసాసత్యాగ్రహమును గురించి విశేషముగా

స్పష్టముగా ఆలోచనములు సల్పియుండెను. సత్యాగ్రహ ముతో గల అహింసనీతియే సత్యాగ్రహప్రణాళికను యింత అభినవముగా గావించినది. మానవుని హింసద్వారాకంటె ప్రేమసహాయముతో శాశ్వతముగా వశీభూతునిగాను, స్వమతావలంబునిగను గావించుకొనవచ్చును. సత్యాగ్రహి ప్రేమవిశ్వాసము, త్యాగములవలన ప్రతిపక్షుని హృదయ మును శాశ్వతముగా జయించును.

కాని ఆయన యీ అహింస పిరికితనము చేతగాని దౌర్బల్యముచేతగాని కూడుకున్న అహింస గాదు. ప్రతి పక్షులతో శక్తివలన పోరాడలేక నిరాశతో కూడుకున్న అహింస కాదు. ఒకదుర్బలమైన సీమకుందేలుశక్తిశాలియగు వ్యాఘ్రముతో యుద్ధముచేయుటకు అసమర్థురాలై వనము లోకి పారిపోయి దాగియుండును, ఇది అహింసకాదు. ఇది పిరికితనముయొక్క లక్షణము. కాని ఒకవ్యాఘ్రము సింహ ముతో యుద్ధముచేయ సమర్థురాలయ్యు దానిని కాలిగోరుల తోనైనను ఆక్రమింప నిష్టపడలేదు—దీనిని అహింస యన వచ్చును.

నేను బలములో సమర్థుడను, శక్తివంతుడను, యోగ్యుడను అయివుండికూడ ప్రతిపక్షులపై హింసను ప్రయోగింపను, ప్రతిపక్షులను ఆత్మశక్తిద్వారా మనో బలముద్వారా ప్రతిఘటింతును. వశీభూతులనుగా చేసుకొను టకు ప్రయత్నింతును—

———

## 41
# మహాయుద్ధము—విపన్నులగు ఆంగ్లేయులు

గాంధీజీ ఆశ్రమ కార్యములలోను స్థానికసత్యాగ్రహ కార్యములలోను నియుక్తుడై యున్నప్పుడు యూరోపులో ప్రళయమహాయుద్ధగర్జనములు వినవచ్చెను. బ్రిటీషుశక్తి ఆ మహాయుద్ధములో చిక్కుపడి పోయెను. బలశాలియైన, మహాస్త్రముగా నిర్మింపబడిన జర్మన్ శక్తికి విరుద్ధముగా తనపరిమితశక్తిని సంపదను ప్రయోగించినను బ్రిటిషువారు జర్మనుల కబళమునుండి తమను రక్షించుకొనలేకపోయిరి. అప్పుడు తనశక్తిని వృద్ధి చేసుకొనుటకై ప్రపంచములో నాలుగుమూలలను తేరిచూచెను. తాను జయించిన విశాల భారతదేశము తన నేత్రములకు కనుపించెను. అది తన ఆత్మ రక్షణకొరకు భారతదేశసంపదను, జనబలమును ఉపయోగించుకొనుటకు సంకల్పించుకొనెను. అది తన అధికారబలము చేత భారతదేశమును మోసముచేసి దానిసంపదను లాగి తీసుకొన మొదలుపెట్టెను. కాని భారతదేశజనశక్తిని అంత సులభముగా మోసము చేయజాలక పోయెను. అప్పుడు భారతదేశపు పూర్వదిక్కున ఆశాజ్యోతి ప్రకాశించనుండెను. భారతీయులు సంపూర్ణముగా జాగరూకులు కాకపోయినను క్రమముగా జడత్వమును, నిష్క్రియత్వమును పరిత్యజించి తమ అధికారమును తమకోరికలను నెరవేర్చుకొనుటకు ప్రబల ప్రయత్నములు చేయుచుండిరి. ఆంగ్లేయుల కార్యములకు

సహాయముచేయుటకు. ఉత్తర[illegible] చూపించి లోలోపల యీర్ష్యాద్వేషములను పెంచును. హృదయములోని కాపట్యముచేత బాహ్యకపటహింసను దాచియుంచుట గాంధీజీఆదర్శములకు విరుద్ధమైనది. అందువలన బ్రిటిషువారు సహాయముకొరకు గావించిన ప్రార్థనను జపానుయొక్క విరాగముచే భారతదేశము జపానుచే వహింపబడిన శ్రేష్ఠత్వమువలన కొనకులు ధ్వంసమగునేమోయని కోరుట గాంధీజీఆదర్శములకు విరుద్ధమైనవియగును. ఆయన భారతీయుల యీ మానసికహింసను పరిహరింపచేయుటకై బ్రిటీషువారికి సహాయము చేయ సంకల్పించెను. భారతదేశ సత్యాగ్రహి లోపలనుండి అహింసాఆదర్శములతో జాగ్రత్తగాచేయుసమకట్టెను. అందువల్లనే ఆయన సైన్యము [illegible]తీయుల అకపటహృదయమును బ్రిటీషువారికి తెలియచేయుకోరెను.

ఆయనయొక్క యీ అహింసానియమములో ప్రజలు పొరపడకుండునట్లు హింసాహింసలవిషయమై అనేకసత్యములను మనకు బోధించియున్నాడు. అహింస దైహికకార్యము కాదు, మానసిక కార్యము మనస్సులో సంపూర్ణహింసను ధరించి పైకి అహింసాసాత్త్వికాది ప్రదర్శనములను ప్రదర్శించినయెడల అది తీవ్రతరహింసయని గాంధీజీ తలంచెను. హృదయములో బ్రిటీషువారిపై విద్వేషమునుంచుకొని పైకి దానిని ప్రకటింపచేయకనిగ సేవాభావముతో సత్యసంధుగనని

వానికి తెలియజేసెను. వైస్రాయి ఆయన ప్రతివాదమును నిర్ద్వంద్వముగా అంగీకరించెను. త్వరలో యీ విషయములో విచారణ సల్పి తగిన చర్యలు తీసుకొనబడునని ఆయనకు తెలియ జేసెను.

గాంధీజీ ఢిల్లీనుండి గుజరాతుకు తిరిగివచ్చెను. సైన్య మును సంపాదించవలెనన్న ముందు తనస్వస్థానములోనే ప్రయత్నము చేయుట ఉత్తమమని తలంచెను. ఆయన తన సత్యాగ్రహ సంగ్రామ క్షేత్రమును ఖేడాజిల్లాకు బదలీ చేసిరి. ఈ మహాయుద్ధములో బ్రిటిషువారికి సహాయము చేయుటకు గ్రామ వాసులను, రైతులను సైన్యమున చేరవలయునని వేడుకొనిరి. ఈ విషయములో సాధారణప్రజలకు తెలియజేయుటకై ఆయన తన అనుచరబృందమును, సేవకదళమును వెంటనిడుకొని ఆ జిల్లాలో అనేకసభలను జరుపుచుండిరి.

కాని గాంధీజీ ఒకప్పుడు యేప్రజల స్వేచ్ఛాపూర్వక సహాయమును, సానుభూతిని పొందియుండిరో నేడు వారివిరోధమునకు, విద్రూపమునకు ఎదురైరి. ఆయనకు ఆయనదళమువారికి ఎవ్వరును బండి నిచ్చుటకు కూడ నిరాకరించిరి. ఆయన గావించు సభలకు ప్రజలు హాజరగుటలేదు. ఇంగ్లీషువారికి సహాయము చేయవలెనని చెప్పినప్పుడు ఆయనను వెక్కిరించుచుండిరి. సందిగ్ధభావముతో ఆయనను ప్రశ్నిం

చుచుండిరి. ఇంగ్లీషువారికి సహాయము చేసి విదేశశాసనము శాశ్వతముగా నుంచవలయునా?

గాంధీజీ యీ ఆటంకములను అంతరికశక్తులతో జయించుచుండిరి. బండి లేకపోయినను బహుదూరము నడచిఒక స్థానమునుండి మరియొకస్థానమునకు పోవుచుండిరి. సభల కేతెంచిన ప్రజలకు తనఆదర్శములను, ప్రణాళికను తెలియ జేయుచుండిరి. మనము స్వతంత్రముకొరకు ఇంగ్లీషువారివద్ద నివేదించుకొనుచున్నాము. ఇంగ్లీషువారు ఇంతకు పూర్వము మనకోర్కెలను అంగీకరింపలేదు. కాని ఇప్పుడు ఆపదలో చిక్కుకొని మనసహాయమును అభిలషించుచున్నారు. మనకు కూడ ఆత్మనియంత్రణాధికారము ఉన్నదని అంగీకరించినారు. వారు క్రమక్రమముగా భారతీయులకు స్వతంత్రశాసనమార్గమున ముందుకు నడుచుటకు సహాయము చేయుదురు. ఈయుద్ధాంతమున శాసనవిషయములలో మహత్తరసంస్కరణములను గావింతురు. భారతీయులకు శాసనాధికారమును ప్రసాదింతురు అని ఆయన నుడువుచుండిరి. కావున ఇప్పుడు మనము ఇంగ్లీషువారి వాగ్దానమును విశ్వసించి సత్యసంధతను ప్రమాణము చేయవలయును. ఇంగ్లీషువారికి కలిగిన ఆపద సమయములో వారు మనయెడల గావించిన ఆచరణములను మరచిపోయి సహాయమును చేయవలయును. మనము మన ఆచరణముద్వారా దేశరక్షణకు, దేశశాసనమునకు యోగ్య

లమని ప్రమాణము చేయవలయును. ఈప్రమాణమునకు ప్రథమమార్గమే యుద్ధములో చేరి యుద్ధముచేయుట, యుద్ధము ద్వారా భారతదేశసహృదయతకు సానుభూతినిగురించి పరిచయము కలుగచేయవలయును.

గాంధీజీప్రచారము క్రమముగా సఫలీకృతమగుచుండెను. ప్రజలవిరుద్ధమనస్సులు సుముఖము లగుచుండెను. రిక్రూటింగుపని చక్కగా జరుగుచుండెను. అప్పుడు గ్రీష్మకాలము. దారుణమైన ఎండలలోకూడ గాంధీజీ శ్రమపడుచుండెను. క్రమముగా గ్రామవాసులు గుంపులుగుంపులుగా సైన్యములో చేరుచుండిరి.

ఇంతలో భారతీయమహమ్మదీయులు ఇంగ్లీషుసర్కారువారికి ఒకనివేదన సమర్పించుకొనిరి. యుద్ధాంతమున శత్రుశక్తికిసహాయముచేసిన టర్కీ తనసామ్రాజ్యఅంశమునుండి వంచితపబడకూడదని కోరుకొనిరి. కారణమేమనగా టర్కీవారిధర్మము మహమ్మదీయధర్మము,టర్కీసుల్తాను మహమ్మదీయప్రపంచమునకు ధర్మగురువు. వారు శత్రుపక్షము నవలంబించుటవలన దురవస్థలపా లగుదురు. సంధిననుసరించి రాజ్యభ్రష్టుడగును. ధర్మగురువు ఖలీఫా మక్కా లేక బాగ్దాద్ మొదలగు పవిత్రస్థానములనుండి వంచితుడగును. ఈ దురవస్థలను గురించి భారతీయమహమ్మదీయులు ఊహించ

లేకున్నారు. అందువలన యుద్ధములో ఆంగ్లేయులకు సహాయము చేయుటకుముందు టర్కీ గౌరవరక్షణావిషయమును, ఇంగ్లీషువారివద్దనుండి వాగ్దానము కోరెను.

సర్కారువారుకూడ ముసలమానుసంప్రదాయమువారికి మౌఖిక వాగ్దానము నొసగిరి. 'యుద్ధానంతరము టర్కీలోని యేఅంశముకూడ విచ్ఛిన్నము గావింపబడదు. సంధి ప్రకారము ఏఅంశమునుకూడ మిత్రపక్షమువారు విభాగించి పంచుకొనరు. వారి అధికారప్రాబల్యము యథాప్రకారముగానే యుండును. ఖలీఫాయొక్క గౌరవమునకు కించిత్తుకైన భంగము కలుగదు.'

మహమ్మదీయులు అత్యాసక్తులైరి. వారుకూడ యుద్ధమునకై సైన్యములో చేరుచుండిరి.

యుద్ధము పూర్ణోత్సాహముతో జరుగుచుండెను. లక్షోపలక్షల భారతీయులై విశాలశక్తిశాలికీర్తివంతులై బ్రిటిషు వారి విజయమార్గమున అగ్రేసరులగుచుండిరి. కాని యీ సమయములో అధికశ్రమవలన గాంధీజీఆరోగ్యము సరిగా లేకుండెను. ఆయన రక్తభేదులచే బాధపడుచు శయ్యాగతుడయ్యెను.

గాంధీజీ తీవ్రవ్యాధిచే బాధపడుచుండెను. ఆయన సహచరులు అనుచరులు ఆయనకు సేవాశుశ్రూషలు చేయు

చుండిరి. కాని గాంధీజీ యీవ్యాధినివారణకు ఎట్టిచికిత్సకునిగాని, చికిత్సాపద్ధతినిగాని ఆశ్రయించలేదు. ఆయన ప్రాకృతిక చికిత్సను ఆశ్రయించెను. ప్రాకృతికచికిత్సాసహాయముతో రోగమును ప్రతిఘటించుటకును, నిగ్రహించుటకును ఎంత అధికమైన అవకాశము కలుగునో ఆయన తనవ్యాధితో ప్రాకృతికచికిత్సను చేయించుకొని నిరూపించ ప్రయత్నించెను. ఈ చికిత్స ఉపకారమునుగురించి ఆయన వ్రాసిన పుస్తకమునుండి ప్రాకృతికచికిత్సలోని అభినవత్వము, నూతనత్వము విషయమై చాలాసంగతులు గ్రహింపగలము.

అనారోగ్యమునందున గాంధీజీ కార్యములనుండి శెలవు గైకొనవలసివచ్చెను. ఆశ్రమములో వసించుచుండిరి. కాని సేవవిషయమై విశ్రాంతిసమయములోకూడ ఆయనమనస్సును ఆక్రమించియే యుండెను. ఆయన రైతులజీవనయాత్రప్రణాళికను, చూచి, వారిఅభావములను దారిద్ర్యమును దర్శించి, కార్యములు లేనిసమయములలో వారిఅలసభావమును చూచి విచారించుచుండిరి. వారిదుఃఖకష్టములను తొలగించుటకు ఆలోచించుచుండిరి. వ్యవసాయపనులు వ్యవసాయదినములు గడచినపిమ్మట బహుదినములునిరర్థకముగా గడపుచుందురు. ఆ అవసరకాలములో వారు యితరకార్యములు గావించుకొనినయెడల తద్ద్వారా కొంతధన మార్జింపవచ్చును. వారి దుఃఖదారిద్ర్యములు తొలగిపోవచ్చునని గాంధీజీ ఆలోచించు

గాంధీజీ ప్రత్యేక రాజకీయ కార్యకలాపముల విషయము కొంత ఆలోచించెను.

42

# రౌలట్‌బిల్లు—స్వాతంత్ర్యాపహారులైన ఆంగ్లేయులు

ప్రథమ మహాయుద్ధము విరమింపబడినట్లు ఆరోగ్య శయ్యయందున్నప్పుడే గాంధీజీ వినెను. గాంధీజీ హృదయము ఆనందతరంగములలో అల్లాడిపోయెను. విజయము పొందిన బ్రిటిషువారు ఈనాడు భారతీయుల సహాయమును గురించి స్మరించుకొందురు. కృతజ్ఞతకు చిహ్నస్వరూపముగా భారతీయులకు స్వతంత్రశాసనాధికారమును ప్రసాదింతురు. బ్రిటిషువారి దయాపూర్వకమైన ప్రకటనకొరకు గాంధీజీ ఆతురతతో అపేక్షించియుండెను.

బ్రిటీషువారి ఘోషణ ప్రకటింపబడెను.

కాని స్వతంత్రశాసనాధికారప్రకటన కాదు—రౌలట్ విచారణకమిటీవారి విచారణఫలితమును గురించినప్రకటన, పరాధీనభారతవాసులను ఇంకను కఠినశాసనముల నాగపాశముచే బంధించమని ప్రకటన.

యుద్ధానంతరము బ్రిటీషువారు శాసనవిషయములో భారతీయుల యోగ్యతను అయోగ్యతను, నిర్ణయించుటకున్న

దానితోపాటు బ్రిటిషు శాసకులపై భారతీయులఆచరణమును గురించి అనుసంధానము చేయుటకును, రౌలట్ అను ఒక ఆంగ్లేయుని సభాపతిత్వముక్రింద ఒకవిచారణకమిటీనియేర్పా టుచేసిరి. ఈవిచారణకమిటీ రాజభక్తులను, అనుగతులను అనుకూలురైనవారినే సాక్షులుగా గ్రహించెను. సత్యసంధానము త్రోసి పుచ్చి, కేవలము హింసాకాండలు, కల్లోలములను గూర్చి భారతీయుల సంఘటనలను, కార్యములను అతిరంజితముజేసి, భారతీయులు చిరకాలము బ్రిటిషువారి ఉదారపరిపాలనపై శత్రుభావాపన్నులవిషయము నానావిధములైన ప్రమాణములతో, సాక్ష్యములతో నిరూపించెను. విచారణకమిటీ భారతీయులశత్రుత్వమును, అయోగ్యతను నిరూపించి భారతీయులను అణచియుంచుటకు అమలులో నున్ననియమములకంటె కఠినతరమైన, విశేషశక్తివంతమైన శాసనములను తయారు చేయుటకు బ్రిటిషువారికి హితోపదేశము గావించెను.

ఇంగ్లీషువారు భారతీయులపై సానుభూతిభావమును చూపి యిట్లు నుడివిరి, 'మీకు అధికారములను ఇచ్చుటకు మాకు ఇష్టముగానే యుండెను. కాని మీరు మాసహకారమును కోరుటలేదు. విచారణకమిటీవారిప్రకటనవలనమీరు మాతో కేవలము శత్రుత్వము చేయగోరుచున్నారనియు, మమ్ములను నాశనము చేయగోరుచున్నారనియు తెలియ వచ్చెను. అందువలన మీరింకను కొంతకాలము మాపరి

పాలనక్రిందనే వసింపవలయును. మిమ్ములను యోగ్యులుగాను, తగినవారినిగాను చేయుటకు రౌలట్ కమిటీవారి ఆదేశానుసారముగా మరికొన్ని నియమములను, శాసనములను ప్రవర్తింపచేయుచున్నాము.

దుర్భాగ్యులు భారతీయులు! — సేవకుబదులు ఎంత ఆశ్చర్యకరమైన ప్రతిదానము!

సహాయమునకు బదులు ఎంతమహత్తరమైనకృతజ్ఞత!

పిమ్మట కృతఘ్నులైన బ్రిటీషువారు భారతీయుల నాశముకొరకు 'రౌలట్ ఆక్టు' అనుపేరుతో నూతనశాసనమును పార్లమెంటుద్వారా ఆమోదింపచేసిరి. శాసనానుసారముగా ఏభారతీయునైనను ఇష్టానుసారముగాగాని లేకసందేహము కలిగినగాని అరెస్టు చేయుటకును, నిర్ణయములేని కాలమువరకు జైలులో నుంచుటకును, విచారణ లేకుండా శిక్షించుటకును గలఅధికారమును ప్రకటనచేసిరి!

భారతీయులు చమకితులైరి!

రాజభక్తులును, రాజుగారిపై విశ్వాసపరాయణులునైన భారతీయులుకూడ నేత్రములను విస్ఫారితము గావించుకొనిరి!

భారతదేశ మంతటను దీర్ఘవిశ్వాసముల ప్రబలతరంగములు ప్రవహించుచుండెను.

ఆశాస్వాతుస్త్రైయున్నగా ధీజ స్తబ్ధులైరి. ఆయన హృదయము వేదనాభారముచే కృంగిపోయెను. ఇదియా యుద్ధములో సహాయమునకు ఫలితము!

ఇది విశ్వాసమునకు బదులు పరమవిశ్వాసఘాతుకత అని ఆశాంతహృదయము జవాబిచ్చెను.

గాంధిజీవివేకము ఆయన కిట్లు తెలియజేసెను—

'నేను బ్రిటీషువారి విశ్వాసపాత్రమైన నాగరికునిగా వారికి హృదయపూర్వకమైన సహాయము, సేవగావించితిని. ఆపద దినముల నతిక్రమించి బ్రిటీషువారు ఇంతశీఘ్రముగా దానిని మరచిపోయినప్పుడు నేను ఇక యీసత్య ఆనుగత్య విశ్వాసమును అంటిపట్టి యుండజాలను?

బ్రిటీషువారిప్రవర్తనవలన విశ్వాసియు, ఉదారుడునైన గాంధిజీ కఠినఅనుభవములద్వారా తీవ్రరూపము దాల్చెను. నూతనభావములతో కార్యరంగమున ప్రవేశింప ప్రతిజ్ఞాబద్ధుడయ్యెను.

రౌలట్ బిల్లును విమర్శించి ఆయనవైస్రాయి చెమ్స్ ఫోర్డుకు ఉత్తరము వ్రాసెను. వార్తాపత్రికల సహాయముతో భారత దేశమంతటను ఈశాసనముయొక్క దుష్టభావములను వ్యక్తపరచుచు ప్రజలను మిథ్యా అన్యాయములకు విరుద్ధముగా జాగరూకులను గావించెను. వార్తాపత్రికలద్వారా యీశాసనమును రద్దుచేయుమని బ్రిటీషువారిని ప్రార్థించుకొనెను.

గాంధీజీ, దేశబంధు చిత్తరంజనదాస్, లోకమాన్య బాలగంగాధరతిలక్, పండిత మతిలాల్ నెహ్రూలు మొదలగు ప్రసిద్ధనాయకులు ఈదుష్టనీతి పూర్ణమైన శాసనమును రద్దు చేయమని అనేకవిధముల ప్రయత్నము చేసిరి. వైస్రాయి, శాసనపరిషత్తుసభ్యులుకూడ యీశాసనమునకు విరుద్ధముగా అభిప్రాయములను ప్రకటించిరి. వ్యవస్థాపకసభలో నున్న విశిష్టభారతీయసభ్యులుకూడ సభజరుగుచున్నసమయములో ఈశాసనమును రద్దుచేయుమని అధికారులను వేడుకొనిరి.

కాని అంతయు వ్యర్థమాయెను.

శాసనము రద్దుకాలేదు సరికదా, శాసనపాషాణభారముచే అనేకనిరపరాధులగు భారతీయులు నలిగిపోవుచుండిరి.

దేశమంతటను దాగియున్న అగ్నిప్రజ్వరిల్లుచుండెను.

దేశములోని నాయకులు ఈవిషయములో ఒకనిర్ధారణకు వచ్చుటకు జాతీయమహాసభయొక్క విశేషసమావేశమును ఆహ్వానించిరి.

---

# అహింస భారతదేశము-
# హింసాపరాయణులు బ్రిటిషువారు.

1919 వ సంవత్సరములో ... జాతీయమహాసభా సమావేశము జరిగెను. ఇంతలో దేశములోని నాయకబృందము గాంధీజని మహాసభలో సభ్యునిగా చేరమని గోరియుండిరి. తనఆదర్శములనుసార్థకపరచుకొనుటకును, మహాసభను గౌరవాన్వితము గావించుటకును, గాంధీజి కాంగ్రెసులో సభ్యుడుగా చేరెను. గాంధీజిమహాసభలోమితవాదులనాయకత్వమును దర్శించెను. మరల 1918—19 వ సంవత్సరములలో మితవాదులకు సెలవిచ్చి పంపుటవలన క్రియాశీలుర, విప్లవకారుల ఆగమనముకూడ గాంచెను. జాతీయమహాసభ ఆవేదనని వేదనములను చేయుట, కేవలము భోజనపుబల్లలపై కూర్చుని ఉపన్యాసములిచ్చు రీతిని త్యజించి, దేశముకొరకు సంగ్రామము చేయుటకును, యథార్థక్షేత్రమైన కార్యములాచరించుటకును తయారగుచున్నదని గాంధీజీ గ్రహించెను. నిష్క్రియత్వమునుండి దేశబంధు, మతిలాల్ నెహ్రూ మొదలగుక్రియాశీలుర ఉద్యమముల ప్రయత్నములపరిచయమును పొందెను.మహాసభ తనఆదర్శములకు ఆశ్రయము కాబోవుచున్నదని గ్రహించెను.మహాసభఆదర్శములుగాంధీజీ ఆదర్శములకు సన్నికటమైనవి. ఆవేదనఅనునయముల కార్యములు

సత్యద్రష్టయగు గాంధీజీ జీవనము యొక్క క్రమవికాస ధారను నదీప్రవాహముతో పోల్చి చూచిన యెడల రెంటి యందును విచిత్రసమన్వయమును చూడగలుగుదుము.

గాంధీజీ ప్రతీకారమును ఆరంభించెను. భారతదేశ వాసులు ఈ రౌలట్ బిల్లును నిర్బంధముగా ప్రతిఘటింతురు. సర్కారువారు ఈ ప్రతిఘటనను లక్ష్యపెట్టని యెడలయినా శాసనమునకు విరుద్ధముగా సత్యాగ్రహము చేయవలయును. ఆయన యిట్లు తెలియజేసెను—"శాసనములకు జవాబుగా మనము సమస్తదేశమునందు హర్తాళము జరుప సంకల్పించవలయును. సత్యాగ్రహము ఆత్మశుద్ధియుద్ధము. ఇది ధర్మయుద్ధము. ధర్మకార్యమును శుద్ధిద్వారానే ఆరంభించవలయును. ఆరోజున జనులందరు ఉపవాస ముండవలయును. తమతమ కార్యములను విరమించవలయును." ఈ ఉపవాసము 24 గంటలవరకు పాలింపవలయునని అందరికి తెలియజేయబడెను.

ప్రతివాదస్వరూపముగా 1919 ఏప్రిల్ 6 వ తేదీన సాధారణహరతాళము జరుపుటకు గాంధీజీ ప్రకటనద్వారా తెలియజేసిరి. భారతీయులందరును ఆనాడు ఉపవాసముచేసి హృదయములో దృఢమైన యిచ్ఛను, శక్తిని పొందవలెనని అందరికి ఆజ్ఞాపించబడెను.

వాసులు ఊరేగింపుగా బయలుదేరి రౌలట్ శాసనమునకు విరుద్ధముగా అసమ్మతిని తెలియజేయుచు వీధులలో ప్రచారము చేసిరి. బొంబాయి పట్టణములో గాంధీజీ, శ్రీమతి సరోజినీ నాయుడు, ఇతర [illegible] హిందూ మహమ్మదీయనాయకులు ఏకమై ఒకరిప్రక్క నొకరుండి ఊరేగింపుతో బయలుదేరిరి. ఊరేగింపు ఒక మసీదువద్దకు వచ్చినపిమ్మట, మసీదు అధిపాసుల ముసల్మాను మౌల్వీలకోరిక ప్రకారము గాంధీజీ మసీదు లోనికిపోయి అచటి హిందూ ముస్లిమ్ జనప్రవాహమునుద్దేశించియు రౌలట్ శాసనమునకు విరుద్ధముగా సంగ్రామము చేయుటకు ఐకమత్యముతో సంసిద్ధము కావలయునని ప్రబోధించెను. జనసమూహము ఆయన ఉపదేశానుసారముగా సంగ్రామ క్షేత్రములో ప్రవేశించుటకు సంసిద్ధమై యున్నామని తెలియజేసెను.

హరతాళము శాంతిపూర్వకముగా జరిగినను ఇంగ్లీషువారు అశాంతి సృష్టిచేయుటకు ప్రయత్నించిరి. కొన్నికొన్ని ప్రదేశములలో అస్త్రధారులైన పోలీసులు, సైన్యసమూహములు ఊరేగింపును ఆటంకపరచుటకు ప్రయత్నించిరి. ఊరేగింపులో పాల్గొన్నవారిని కొందరిని కొట్టిరి, అనేకమందిని కారణము లేకపోయినను అరెస్టుచేసిరి. ఆ కారణముచేత జనప్రవాహముకూడ కొంతవరకు హద్దు మీరవలసివచ్చెను. అహమదాబాదుపట్టణములో ప్రజలకు పోలీసులకు సంఘర్ష

ణము జరిగెను. ఢిల్లీ, పంజాబులోని అమృతసరపట్టణము లలో అల్లరులు చెలరేగెను. కలకత్తాలోకూడ కొన్నికొన్ని స్థానములలో పోలీసులు అశాంతిని సృష్టించిరి.

అశాంతి, హింసల విషయము అహింసాపూజారి గాంధీజీ నిని అత్యంతవిచలితుడయ్యెను. ఢిల్లీ పంజాబుల లోని సంఘటనలు విశేషఅల్లరులకు కారణము కావచ్చునని తలంచి గాంధీజీ వెంటనే ఢిల్లీ, పంజాబుప్రదేశములకు పోవుటకు సిద్ధపడెను. గాంధీజీ కొందరు సహకారులను వెంటనిడుకొని ఢిల్లీపోవురైలులో ఎక్కెను. కాని ఆయన ఢిల్లీప్రయాణము సాగలేదు. ఏప్రిల్ 8 వ తేదీన బండి మధురానగరమునకు చేరెను. ఆసమయములో పోలీసువారు వచ్చి ఆయన బండిలో ప్రవేశించి సర్కారువారిఆజ్ఞాపత్రమును ఆయనకు అందించిరి—'మీరు ఢిల్లీలోగాని, పంజాబులోగాని ప్రవేశించినచో అచ్చట అశాంతి అధికముకావచ్చును. కావున మిమ్ములను ఆసరిహద్దులకు పోనియ్యము' అని అందులో వ్రాయబడియుండెను. గాంధీజీ తనసహజధోరణిలో నవ్వుకొనెను. నవ్వులో హృదయమునందున్న దృఢత్వమును ఏకముజేసి సహజకంఠముతో నుడివినదేమనగా—'నేను అశాంతిని పెంచుటకు పోవుటలేదు. అశాంతిని తగ్గించుటకు పోవుచున్నాను. సర్కారువారి ఆజ్ఞను అంగీకరింపజాలనందుకు విచారించుచున్నాను.'

ఆజ్ఞను నిరాకరించి దృఢచిత్తముగల గాంధీజీయాత్ర నారంభించెను. పలవాలస్టేషనులో పోలీసులు ఆయనను అరెస్టుచేసిరి. అరెస్టుచేసి యెరోడాజెయిలులోనికితీసుకొనిపోయిరి.

కాని గాంధీగారిఅరెస్టువార్త సమస్తభారతదేశము నందు విద్యుద్వేగముతో వ్యాపించెను. భారతదేశవాసులు ఈవార్తవిని అత్యంతబాధపడిరి. క్రోధావేశపూరితులైరి. వివిధ ప్రదేశములలో ప్రజలకు పోలీసులకు పోరాటములుజరిగెను.

సర్కారువారు ఈపరిస్థితులనుచూచి చింతాక్రాంతులైరి. తుదకు బొంబాయివద్దఒకస్టేషనుకుతీసుకొనివచ్చి గాంధీజీని వదలివేసిరి. గాంధీజీ అచ్చటినుండి బొంబాయిపట్టణము నకు వచ్చెను. హిందుముస్లిము అనుభేదములేక పట్టణవాసు లందరును మహానందముతో ఆయనకు స్వాగతమిచ్చిరి. ఆయనతో ఒకబ్రహ్మాండమైన ఊరేగింపు బయలుదేరెను. సర్కారువారికి మిగుల దుఃఖముకలిగెను. వారుఊరేగింపును చెదరగొట్టుటకుపోలీసుసైన్యమునుపంపించిరి. పోలీసులువచ్చి ఊరేగింపును ఆటంకపరచిరి. కాని ప్రజలు పోలీసులఆజ్ఞాను సారముగా ఊరేగింపును విరమించుటకుఇష్టపడలేదు. పోలీసులకు పంతము వచ్చిపోయెను. అశ్వారోహులగు పోలీసు సైన్యము ప్రజలను కలగద్రొక్కి జనసమూహములో ప్రవే శించెను. అనేకమందిఆహుతులైరి. అనేకులుమరణావస్థలో పడిపోయిరి. హింసాసహాయముతో అత్యాచారులగు అధి కారులు అహింసశాంతరూపముగదాల్చినజనసమూహమును

దేశవాసులకు ముందు సత్యాగ్రహమును అహింసా తత్త్వమును నేర్పవలయునని గాంధీజీ వారికి తెలియజేసెను. సత్యాహింసలనివిగ్రహింపగలిగినయెడల దేశముఅహింసకు బదులు హింసనుప్రయోగింప విరమించును. హింసకుబదులు శాంతిసహనములతో అహింసావిధానమునే అవలంబించును. ఆవిధానము ధర్మయుక్తమై అపారశక్తిశాలియై వర్ధిల్లును. అప్పుడు ప్రపంచములోని ఏహింసాశక్తియు ఆశక్తిని అటంక పరుపజాలదు. అహింసఅసహాయోద్యమమువద్ద పశుశక్తు లన్నియు పరాజయమును స్వీకరించును.

గాంధీజీ వారికి తెలియజేసిన దేమనగా దేశవాసు లకు అహింసా సత్యాగ్రహములవిషయము నేర్పుటకు తగిన యేర్పాటు చేయవలయును

శాసననిరసనాందోళనము ఆరంభించుటకుముందుఆయన సత్యాగ్రహసభను స్థాపించెను. వివిధస్థానములలో దేశవాసు లను సత్యాగ్రహములో దీక్షితులను గావించుటకు సత్యా గ్రహశిబిరములను స్థాపించెను. స్థానాంతరమున ఆవిషయ ములు ఆలోచించబడును.

---

## 44

# జాలియన్ వాలాబాగ్

గాంధీజీ తన కార్యక్రమమునుగురించి సందేహించుచుండిరి.

కాని శాసనశక్తి గాంధీజీకర్తవ్యములకొరకు అపేక్షించక తమకర్తవ్యములను నెరవేర్చుకొనుచుండెను. ప్రతివిధానము నవలంబించుచున్న భారతీయులను అన్యాయమగుత్పీడనములద్వారా అణచివేయ ప్రయత్నించుచుండెను.

ఈ ప్రయత్నమునకు దృష్టాంతము జాలియన్ వాలాబాగు.

రౌలట్ శాసనమునకు విరుద్ధముగా జరిగిన హరతాళమును ఆధారముగా చేసికొని యితరప్రదేశములలోవలె పంజాబులోకూడ అందు అమృతసరములో విశేషమైన ఆందోళనము బయలుదేరెను. ఆపట్టణములోని హిందుమునల్మాన్ మొదలగు ధర్మసంబంధమైన ప్రజలును, వృద్ధులు, యువకులు నారీమణులు మొదలగు సకలమానవులును, ధనికులు దరిద్రులు అను సకలశ్రేణులవారును హరతాళమును పాలించి అసమ్మతిని తెలియజేసిరి. పంజాబు యింగ్లీషువారికి సైన్యము సమకూర్చు దేశము. పంజాబీహిందువులు, మహమ్మదీయులు, శిక్కులు, ఇంగ్లీషుసర్కారువారు సైన్యదళమును బలమైనదానినిగా చేయుచుండిరి. ప్రథమమహాయుద్ధ

ములో అనేక కష్టములను పొంది ఇంగ్లీషువారి గౌరవమును, ప్రాణములను పంజాబుసైనికులే రక్షించియుండిరి. ఆపంజాబి వారి హృదయములలోకూడ స్వతంత్రపరిపాలనేచ్ఛ జాగరితమైనది. అస్వాతంత్ర్య అభిలాష కలిగినది. సైనికసహాయమునకు బదులు ఇంగ్లీషు సర్కారువారు ప్రతిదాన మిచ్చెదరనియు, స్వదేశమును పరిపాలించుకొను అధికారమిచ్చెదరనియు వారుకూడ యితరసహాయకాలనీలవలె అనురక్త భారతవాసులవలె విశ్వసించిరి.

సర్కారువారు ఈసేవకు ప్రతిఫలముగా రౌలట్ ఆక్టును ప్రసాదించిరి!

కృతజ్ఞతకు ప్రతిఫలము — అతికరుణాపూర్ణమైన నిష్ఠురమైన ప్రతిఫలము!

ఇంగ్లీషువారి అనుగతులైన శిక్కులు, ముసల్మానులు, హిందుపంజాబీలు సర్కారువారి రౌలట్ ఆక్టుప్రకటనమును వినినప్పుడు ఆశ్చర్యపడినదానికంటె అధికముగా క్రోధోద్రిక్తులైరి. పిమ్మట వారు ఈకృతఘ్నతకు విరుద్ధముగా శిరములెత్తి హరతాళమును ఆరంభించిరి. సమరపిపాసులగు పంజాబీలు అహింసామంత్రపూజారినుండి మంత్రమును స్వీకరించిరి. సంఘబద్ధమై సమ్మిళితమైన యీశాసనమునకు విరుద్ధముగా తమచిత్తక్షోభమును తెలియజేసిరి.

కాని కొలదిదినములలో మహత్తరమైన ప్రజాసమూహములో సంపూర్ణమైన అహింస ప్రతిష్ఠితము కాజాలదు.

అందువలన అమృతసరులో అచ్చటచ్చట అల్లరులు బయలుదేరెను. అత్యాచారులగు పోలీసుల దమననీతివల్లనే యీ అల్లరులు బయలుదేరెను.

తుదకు పంజాబుప్రభుత్వమువారు అమానుషికమైన కార్యములను గావించిరి, సభలనుగాని ఊరేగింపులనుగాని జరుపకూడదని నిషేధించుచు ప్రజలకు సామరిక శాసనమును ప్రకటితము చేసిరి. కొద్దిమందిమాత్రమే యీసామరిక శాసనమునుగురించి తెలుసుకొనగలిగిరి. అధికసంఖ్యాకులకు యీవార్తయే తెలియదు.

ఏప్రిల్ 13 వ తేదీన అమృతసరులోని 'జాలియన్ వాలాభాగు' గోడలచుట్టియున్న మైదానములో రౌలట్ శాసనము, సత్యాగ్రహులపై దమననీతికి విరుద్ధముగా తమ ప్రతివాదమును తెలియజేయుటకై నాయకులు ఒకసభను ఏర్పాటు చేసిరి. ఆ తేదీన గుంపులు గుంపులుగా ప్రజలు వచ్చి ఆసభాస్థలములో సమావేశమైరి. హిందుమహమ్మదీయులను భేదములేక అందరును ఆస్థానములో సమావేశమైరి. హఠాత్తుగా అస్త్రధారులగు సైనికులు డయూర్ అనుమిలటరీఉద్యోగి నేతృత్వమున జాలియన్ వాలాభాగ్ మైదానమును నాలుగువైపుల

ఆక్రమించిరి. ఆమైదానములో ప్రవేశించుటకు ఒకటేమార్గ
ములే యుండెను. డయ్యరుఆదేశానుసారముగా సైనికులు
నిరాయుధులగు అమాయికప్రజలపై ప్రబలవేగముతో తుపా
కులు కాల్చుట కారంభించిరి. ప్రశాంతముగానున్న ప్రజలు
హఠాత్తుగా ఆక్రమింపబడిరి. ప్రజలు దిక్కులేనివారైరి. అం
దరును బయటికి వచ్చుటకును, పారిపోవుటకును, అటునిటు
నెట్టుకొనుచుండిరి. బయటికివచ్చుమార్గములో గుళ్ళవర్షము
కురియుచుండెను. వృద్ధులు, యువకులు, శిశువులురుధిరమయ
కళేబరములతో భూమిపై ఒరిగిరి. తప్పించుకునిపారిపోవుటలో
వలుపబడి త్రొక్కబడి ఎందరో దుర్బలులు, వృద్ధులు, శిశు
వులు తమఅంత్యనిశ్వాసమును విడిచిరి. ఆమైదానములో
శవములపర్వతములు తయారుచేయబడెను. దుస్సహాదుర్భర
బాధలచేతను, ఆర్తనాదములతోడను, ముమూర్షువులమూలు
గులతోను, ఆహతులవిప్పులతోనుఆకాశపాతాళములుముఖ
రితము లగుచుండెను. వేలకొలదిమానవుల రక్తస్రవంతులచే
మైదానమంతయు ఆవరించిపోయెను. కఠినమైన మృత్తిక
కోమలరూపమును దాల్చెను. సైనికులగుళ్ళు నిశ్శేషమై
పోయెను. గుళ్ళు ఆఖరైపోవుటచే పాపపుడయ్యరు చాలా
విచారగ్రస్తుడయ్యెను. భారతీయులను సంపూర్ణముగా అవ
మానపరచకపోవుటచేత నిరాశాహృదయముతో డయ్యరు
తనసహచరులు మైదానమును వదలిపోయిరి.

ఈ దుఃఖవార్త సాయంకాలమునకు పట్టణములో వ్యాపించెను. దుర్భాగ్యులగు పట్టణవాసులు ఆత్మీయస్వజనుల విషయములను తెలంచుకొని మైదానమువైపునకు పరుగిడి పోయిరి. రాత్రి ఘనాంధకారరూపమగు నల్లనివస్త్రమును పరిచి యీభీభత్సమైన హృదయవిదారకమైన దృశ్యమును దాచిపెట్టెను, కాని దుఃఖసముద్రమున మునిగిన ప్రజలు అంధకారమునకు భయపడదురా? భార్యమృతభర్తకళేబరమును వెదుకుచుండెను, కొమారుడుతల్లిదేహముకొరకు అన్వేషించుచుండెను, వృద్ధుడగుతండ్రి యువకుడగు పుత్రుని దేహము కొరకు ఇటునటు పరుగిడుచుండెను.

అశుభరాత్రి అవసానమొందెను. కాని అమృతసరములోని హిందూమహమ్మదీయులదురవస్థలు అవసానమొందలేదు, నూతనదురవస్థలు, దుఃఖములు వారిపై పర్వతములవలె పడుచుండెను. అధికారులు గృహస్థులగృహములలో ప్రవేశించి వారిపై అత్యాచారములు చేయమొదలిడిరి, వీధులలో ప్రజలు పోవుచున్నపుడు మోకాళ్ళతో దోగాడుచు నడువమని ఆదేశించిరి. యూనియన్ జాక్‌కు వందనములు చెల్లించమని బలవంతపెట్టుచుండిరి. మానవులపై పశువులవలె ప్రవర్తించుచుండిరి. పంజాబుసర్కారువారి అమానుషిక అత్యాచారములు హద్దులను అతిక్రమించిపోయెను.

ఈదురవస్థల, అత్యాచారముల వార్తలను ప్రథమమున పంజాబుసర్కారువారు దాచియుంచిరి. కాని సర్కారువారి జాగరూకతను అతిక్రమించి వార్తలన్నియు సమగ్ర భారత దేశమునందు వ్యాపించెను. ఈ విషయము విని సమస్త భారత దేశమంతయు కంపించెను. సమస్త భారత దేశము శోకానలముచే, ఆవేదనచే తల్లడిల్లిపోవుచుండెను. ఆంగ్లేయుల మనుష్యత్వమును గురించి సాధారణప్రజలకుకూడా సందేహము కలిగెను. వార్తలను విని, వార్తలభయంకరత్వమును ఆలోచించి ఆంగ్లేయులమనుష్యత్వమునందు విశ్వాసముంచిన గాంధీజీకూడా తుదకు ఆంగ్లేయులస్వభావమునుగురించు సందేహించెను. పంజాబులోని అసహాయ హతభాగ్యప్రజను చూచి యీ ఆపదసమయములో ఓదార్పును కలిగించవలెనని ఆయనహృదయము తల్లడిల్లి పోవుచుండెను.

గాంధీజీ వైస్రాయి చెమ్స్‌ఫోర్డుకు ఉత్తరమును వ్రాసిరి. ఆయన పంజాబు వెళ్ళుటకు అనుమతించమని వేడుకొనిరి. కాని గవర్నర్ జనరల్ అనుమతి నిరాకరించెను.

హృదయములో పొంగిపొరలుచున్న దుస్సహాశోకము చేత వైస్రాయి ఆదేశమును ధిక్కరించెదనని గాంధీజీ తలంచెను. కాని విశేషముగ ఆలోచించి స్థిరపరచుకొనిన దేమనగా—ఈ ఉత్తేజనాసమయములో శాసనమును ధిక్కరించినచో అత్యంతవిపరీతమైన, భయంకరమైన ఫలితము ఫలింప

వచ్చును. ఆ దేశమును ధిక్కరించినందుకు ముందే తనను అరెస్టు చేయుదురు. ఆయన అరెస్టువార్త యీశోకార్త ఉత్తప్త వాతావరణములో అగ్నిలో ఆజ్యము పోసినట్లగును. దేశవాసు లందరు కోపగింతురు. హింసాపూరితు లగుదురు. శాసనకర్తలపై తిరుగుబాటు చేయవచ్చును. దేశవాసుల యీ కార్యముల నవకాశముతీసుకొని అత్యాచారులగుసర్కారువారు యింకా అత్యాచారములు సలుపవచ్చును. దేశమంతటను దమననీతి, ధ్వంసాత్మక కార్యములను జరుపవచ్చును. దేశము మరల దుఃఖకష్టముల పంకిలములో నిమజ్జితము కావచ్చును. గాంధీజీ యీ విషయములన్నిటిని వివేచనచేసి పంజాబుప్రయాణము విరమించెను. కాని 'యంగ్ యిండియా' 'నవజీవనము' మొదలగు పత్రికలద్వారా పంజాబుసర్కారువారి యీచండనీతికి విరుద్ధముగా తీవ్రమైన, కఠోరమైన విమర్శనములను చేయించుచుండెను. ఈసమయములో ప్రసిద్ధ ఆంగ్లపత్రిక 'బాంబే క్రానికల్' కూడ యీ అమానుషిక అత్యాచారములనుగురించి విశేషముగా ప్రచారము చేయుచుండెను. ఇది సత్యమును ప్రచారము చేయుటచేత విరక్తిచెంది బొంబాయిసర్కారువారు దీనిసంపాదకుడైన హార్నిమాన్‌ను అరెస్టుచేసిరి. అప్పుడు దీనిపరిచారకులు గాంధీని ప్రార్థించుటచే దీనిభారమును ఆయనయే స్వీకరించెను. దీని సహాయముతోకూడ దేశమంతటను తీవ్రమైన ప్రచార కార్య

ము సాగించుచుండిరి. ఇదికాక ఢిల్లీ, అలహాబాదు, కలకత్తా మొదలగు నగరములలోని దేశీయమైన, జాతీయమైన పత్రికలుకూడ యీనీచకాండకు విరుద్ధముగా నిర్భయమైన, సత్యమైన విమర్శనములను వ్రాసి దేశవాసులను జాగరూకులనుగాను, ప్రబోధితులనుగాను గావించెను. భారతదేశములోని ప్రతివార్తాపత్రికయు గాంధీజీపంజాబుప్రయాణమునుగురించి గావింపబడిన నిషేధాజ్ఞను విని ఆశ్చర్యమొందెను. గాంధీజీ సత్వరమే పంజాబుపోవుటకు అనుమతినియ్యమని కోరుచు ప్రకటనములను గావించెను. పంజాబులోని ప్రజాసామాన్యముగూడ యీదురవస్థలలో ఈమహాపురుషుని స్నేహమును, సానుభూతిని పొంది ఆఘాతములబాధలను మరచిపోవుటకు ఆయనరాకకొరకు అత్యాతురతతో అపేక్షించుచుండిరి. విశిష్టపంజాబినాయకులువచ్చి బొంబాయిలో గాంధీజీనిదర్శించిరి. పంజాబురమ్మని గాంధీజీని ప్రార్థించిరి. దీనివలన గాంధీజీహృదయము మరింత వ్యాకులపడజొచ్చెను.

హింసాపూర్ణ రక్తపిపాసులగు పశుదళము...

అమాయికులు శాంతులునగు మానవశిశువులపై అత్యాచారములను చేయుచుండిరి-వారిని కరచుచుందురు. వారిదేహముల దెబ్బలు వేయుచుందురు.

రక్తాక్తశిశువులు బాధచే ఆర్తనాదములు చేయుచుందురు.

వారి ఆర్తనాదములు సుకోమలగాత్రి దేవి కర్ణేంద్రియములలో ప్రవేశించును.

స్నేహపరాయణియగు మాత్రుదేవివిలపించుచుండును.

ఆహతసంతానమువద్దకు పరుగిడిపోవుటకు వ్యాకులత పడుచుండును.

హింసాపూర్ణ శాసకదళము—

అమాయిక శాంత భారతీయులపై అత్యాచారములు గావించుచున్నారు. వారిని పీడించుచున్నారు. ఆతములు వేయుచున్నారు.

అత్యాచారితభారతవాసులు బాధలచే ఆర్తనాదములు చేయుచున్నారు.

వారి ఆర్తనాదములు సానుభూతి పరాయణుడగు గాంధీజీకర్ణేంద్రియములలో ప్రవేశించెను.

గాంధీజీ వ్యాకులపడుచుండెను. అత్యాచారిత, నిపీడిత దేశవాసులవద్దకు పరుగిడి పోవుటకు వ్యాకులపడుచుండెను.

గాంధీజీమరలగవర్నర్ జనరల్ కు ఉత్తరము వ్రాసెను. ఈసారి ఉత్తరములో వినయపూర్వకముగా దృఢత్వమును, ఏకాగ్రతయొక్క సంకల్పమును కూడ తెలియజేసెను. సత్య సంధుడగు యీమహామానవుని దృఢసంకల్పవిషయము తెలుసుకొని యీసారి వైస్రాయి తనఅభిప్రాయమును మార్చుకొనెను. గాంధీజీ పంజాబు పోవుటకు అనుమతి నొసంగెను.

పంజాబువాసులకొరకు ఐదురాత్రులనుగడపుచున్న గాంధీజీ సంతసమొందెను. సహచరులను కొందరిని వెంట నిడుకొని త్వరితగతిని పంజాబుకు పయనమైరి. అక్టోబరు నెలాఖరుకు లాహోరులో ప్రవేశించెను. అక్టోబరు 1[illegible]వ తేదీని అనుమతి పొందిరి.

దురదృష్టవంతులగుసంతానమువద్దకు స్నేహపరాయణి యగు మాతృదేవి వచ్చి నిలువబడిన ట్లాయెను.

హతభాగ్యులును, విభ్రాంతులునగు పంజాబువాసులు గాంధీజీవద్దకు గుంపులుగుంపులుగా ఏతెంచుచుండిరి. కన్నీటితో హృదయావేదనములను చరిత్రను వినుపించుచుండిరి.

గాంధీజీకూడ ప్రథమమున విభ్రాంతుడును, వేదనార్తుడును ఆయెను—

అమృతసరులో జాలియన్‌వాలాబాగ్ మృత్తికపై హిందూముస్లిముల శుష్కరక్తముచూచి గాంధీజీ స్తంభించిపోయెను! కానిఅల్పకాలములోనే ఆయన ప్రకృతమార్గమున బడిరి. ప్రశాంతమస్తిష్కముతో సంఘటనల నన్నిటిని సూక్ష్మముగా విమర్శించుకొనెను. ఈఅమానుషిక అత్యాచారముల ప్రకృతేతిహాసమును తెలుసుకొనుటకును, దీనికి ప్రతివిధానము చేయుటకును స్థిరసంకల్పుడాయెను.

అప్పుడు పంజాబులోని నాయకులనేకులు కారాగారములోనే యుండిరి. బయటనున్నవారితో సంప్రదింపులను గావించెను. ఇంకను విశేషముగా సంప్రదించుటకును, ఆలోచించుటకను భారత దేశములో వివిధప్రదేశములలో నున్న నాయకులందరికి వెంటనే పంజాబుకు రమ్మని సవినయముగా వేడుకొనెను. ఆయన కోరికపై కలకత్తానుండి చిత్తరంజన దాసు కాశీనుండి పండిత మదనమోహనమాలవ్యా, అలహాబాదునుండి పండిత మోతిలాల్ నెహ్రూ, బొంబాయినుండి అబ్బాస్ త్యాబ్జీ, జయాకరు మొదలైన అనేకమందినాయకులు వెంటనే లాహోరుకు వచ్చిరి. గాంధీజీ అందరితోను అందరు గాంధీజీతోను విశేషముగాసంప్రదించికొనిరి. ఆలోచించుకొనిరి. గాంధీజీ యీహత్యాకాండ విషయములో నిరపేక్షముగాను, సర్కారువారిసంబంధము లేకుండగను విచారణసల్పుటకు నాయకులవద్ద ప్రతిపాదనము గావించిరి. నాయకులుకూడ ఆయన ప్రతిపాదనము యుక్తియుక్తముగా నున్నదని తలంచి యీవిషయములో సాధ్యమైనంతవరకు విచారణ సల్పుటకు సర్కారుతో సంబంధములేని విచారణ సంఘమును నియమించుటకు నిర్ణయించిరి. వెంటనే సంఘము ద్వారా విచారణ ఆరంభించు నేర్పాటులు గావింపబడెను. నాయకులు తమసిద్ధాంతములను వార్తాపత్రికలద్వారా ప్రకటించిరి. అత్యాచారిత, ఉత్పీడిత దేశవాసులు స్త్రీపురుష

భేదము లేకుండ యీసంఘమువారికి యథార్థప్రసంగతులను సాక్ష్యమిచ్చుటకును, ప్రమాణముల నిచ్చుటను ఆహ్వానింపబడిరి.

విచారణసంఘసభ్యులు విచారణచేయుటకు పంజాబులో ఒక్కొక్కస్థానమునకు పోయిరి. గాంధీజీ అమృతసర ప్రాంతమందున్న గ్రామములో ప్రవేశించెను. గ్రామములలో ప్రత్యక్షదర్శులగు అధివాసులనుండి హత్యాకాండవిషయములో ప్రకృతమైన, హృదయవిదారకమైన, సాక్ష్యములను ప్రమాణములను సంపాదించెను. నయనములనుండి అశ్రువులను రాల్చుచు అత్యాచారముల అనాచారముల బీభత్సేతిహాసమును ఆకర్ణించిరి. పిమ్మట యితరసభ్యులతో నియమితదినమున మరల లాహోరులో కలుసుకొనిరి. ఈసారి విచారణకమిటీవారు తమవిచారణవివరములను, ఫలితములను పత్రికటించుభారము గాంధీజీపై నుంచిరి. గాంధిజీ అసాధారణపరిశ్రమ గావించి వివరములను తయారుచేసి సంఘమువారికి సమర్పించెను. సంఘమువారు ఆవివరణములను వార్తాపత్రికలద్వారా సమస్తభారతదేశములో ప్రచారము గావించిరి.

సంఘమువారు ప్రకటించిన ఆవివరములను చదివి సమస్తభారతదేశమేగాక సమస్తప్రపంచముకూడ స్తంభించిపోయెను. తనస్వార్థము కొంతకు, తన సామ్రాజ్యరక్షణ

కొరకు ఆంగ్లప్రభుత్వము ఎంతనీచముగా, నిష్ఠురముగా మానవులపై ప్రవర్తించెనో, దానిని సకలదేశవాసులును తెలుసుకొని విస్మయమొందిరి. లజ్జితులైరి! డయ్యరుయొక్కయు, అతనిసైనికులయొక్కయు పైశాచికకృత్యములను సకలవిశ్వవాసులును నిందించిరి. తీవ్రముగా విమర్శించిరి.

భారతదేశసర్కారువారు, బ్రిటీషుసర్కారువారు ఈ సత్యము ప్రకటింపబడుటచేత విచలితులైరి లజ్జవల్లనో. లేక ప్రపంచవాసుల అభిప్రాయములను అణచివేయుటకో అనునట్లు ఒకవిచారణసంఘమును నియమించిరి. లార్డుహంటరు అనువారిసభాపతిత్వముక్రింద హంటర్ కమిటీస్థాపింపబడెను. గాంధీజీనికూడ ఒకసభ్యునిగా ఉండమని సర్కారువారు కోరియుండిరి. కాని సత్యపూజారియగు గాంధీజీ యీ అసత్యమును మరుగుపరచుఅనుష్ఠానపధులకు స్పష్టమైన జవాబిచ్చి విసర్జించిరి. దేశవాసులద్వారా సంఘము నేర్పాటుచేసిన పిమ్మట సర్కారువారిసంఘముతో యెట్టిప్రయోజనము లేదు, అని తెలియజేసిరి. గాంధీజీ ఆదర్శానుసారముగా సమస్తదేశము యీమాయసంఘమునకు సహాయము చేయుటకు నిరాకరించెను. భారతదేశము, భారతీయులు హంటర్ సంఘమును విసర్జించిరి.

కాని సామ్రాజ్యవాదులు, కుటిలచరిత్రులు అంతటితో విరమింతురా? వారు మాయవిచారణసల్పి వారి

యిష్టానుసారముగా విచారణ ఫలితములను ప్రకటించిరి, హంటర్ కమిటీవారు డయ్యరు, అతనిసైనికులు గావించిన దురంతములు అనుచితమైనవని తలంచికూడ వారునిర్దోషు లనియు, కర్తవ్యపరాయణులనియు అభిప్రాయములను వెల్లడి చేసిరి. వారుగావించిన ఘనకార్యములకు వారికి ఉన్నతపదవు లను ఇప్పించవలసిన సిఫారసు చేసిరి. సర్కారువారు కమిటీ వారిసిద్ధాంతమును అంగీకరించిరి. అత్యాచారులగు ఉద్యో గస్థులను శిక్షింపక వారిలో కొందరికొందరికి ఉన్నతపదవుల నిచ్చి గౌరవించిరి.

దేశవాసులు గవర్నమెంటువారి స్వభావమును, స్వరూ పమును మరింత గ్రహింపగలిగిరి. ఈదురాయులకూరి, అత్యా చారులగు సర్కారువారిని ప్రతిఘటించుటకు సకలదేశ వాసులు సంసిద్ధులైరి.

ఈసమయములో మనదేశపు హిందూ మున్సల్మానుల ఉభయసంప్రదాయములలో అపూర్వమైన ఐకమత్యము, సాంఘికభావము అభివృద్ధి చెందెను. ఆంగ్లశాసనయుగ ములో భారతదేశములోని యీరెండుసాంప్రదాయములలో నిప్పుడే అధికవ్యాపకమైన, గంభీరమైన సమ్మేళనము సంభ వించెను. ఈసమ్మేళనము, సాంఘికభావము కొన్ని కారణముల చేతను దృఢబంధనముచేత బంధింపబడెను. ఆ కారణములను గురించి క్లుప్తముగా వివరింతము.

వైస్రాయ్ చెమ్స్‌ఫోర్డునుండి భారతదేశమహమ్మదీయులు ధర్మగురువగు ఖలీఫాయొక్క గౌరవరక్షణ, రాజ్యరక్షణాదివిషయములలో వాగ్దానమును పొందినపిమ్మట ప్రథమ మహాయుద్ధములో ఆంగ్లేయులకు సహాయము చేసియుండిరి. స్వాతంత్ర్యశాసనాధికారాధికారములు పొందుటఆశతో మహమ్మదీయులు భారతదేశవాసులుగా యుద్ధమున మిత్రపక్షము వారిపక్షమున చేరి యుద్ధము చేసిరి.

కాని యుద్ధాంతమున ఇంగ్లీషువారు భారతదేశములోని యితరసంఘములవారిని వంచితులుగను, హతాశులనుగాను చేసినట్టుల భారతదేశమహమ్మదీయులను కూడ వంచితులను, హతాశులనుచేసిరి. ఇంగ్లీషుసర్కారువారు యుద్ధములో జయించినపిమ్మట వారొసంగిన వాగ్దానము మాటలలో మాటయని ఎగురగొట్టిరి. సంధిననుసరించి పరాజితుడైన ఖలీఫాగౌరవప్రతిపత్తికికూడ భంగము కలుగజేసిరి. ఖలీఫారాజ్యములోని అధికభాగమును మిత్రపక్షము వారిభాగముగా గావించుకొనిరి.

వాగ్దానమును భగ్నముచేసి విశ్వాసఘాతుకతను ప్రదర్శించుటచే భారతదేశ మహమ్మదీయులుకూడ ఉద్రిక్తులైరి. విరక్తిచెందిరి. భారతీయులయెడల, మహమ్మదీయుల ఆంగ్లేయులు గావించిన ఆచరణములలోని అసంగతవ్యవహారము

లను వారు గ్రహించి ఆంగ్లేయుల పరిపాలనముపై విరుద్ధ భావాపన్నులైరి.

దానిపైన జాలియన్ వాలాబాగ్ క్షేత్రములో హిందూ శిక్కుర క్తముతో మహమ్మదీయులర క్తధారలుకూడ సమ్మిళిత మాయెను. అసంతుష్టులైన మహమ్మదీయులు కృతఘ్నులగు శాసకుల యీఅత్యాచారములవలన మనోవ్యథననుభవించిరి. హిందువులతోను ఇతరసంఘములతోను ఏకీభవించి ఆంగ్లేయుల అత్యాచారములను ప్రతిఘటింప సంకల్పించుకొనిరి.

సరిశహృదయమునకు, తీక్ష్ణబుద్ధికి అధికారియగు గాంధీజీ మహమ్మదీయులహృదయావేదనమును గ్రహింప గలిగెను. దానితోపాటు ఇతరసంఘములవారి హృదయావేదనముకూడ అనుభవింప గలిగెను. వివిధభారతీయుల వివిధఆవేదనములను, అభిలాషలను ఏకోన్ముఖమునకు త్రిప్పు భారమును ఆయన వహించెను.

ఖలిఫాపై గావించిన అన్యాయాచరణమునకు తమ అసమ్మతిసూచనగా భారతదేశమహమ్మదీయులు ఖిలాఫత్ ఆందోళనము సృష్టిచేసిరి. ఈఆందోళనముద్వారాయింగ్లీషు సర్కారువారిని విచలితులనుగా చేయసంకల్పించిరి. ఈసమయములో వారు పంజాబులో గాంధిగారినిర్భయకార్యకలాప

ములవిషయమును అవగాహనచేసికొనిరి. హిందూమహాసభీయు లనుభేదము లేక సకలసంఘములవారిపై గాంధిగారి సానుభూతి, సేవాపరాయణతను గ్రహించిరి. ఖిలాఫత్ ఆందోళనకర్తలు గాంధిగారిసహృదయతనుగ్రహించి ఆయనను వారిమధ్యకు ఆహ్వానించిరి. వారిమధ్యకువచ్చి వారి దుఃఖకష్టములను, ఫిర్యాదులను ప్రత్యక్షముగాచూచుటకును వారికి ఉపదేశముల నొసంగుటకును ఆహ్వానించిరి.

గాంధీజీ వెంటనే వారిని కలుసుకొనెను. వెంటవెంటనే రెండుసార్లు అలహాబాదులోను, ఢిల్లీలోను, కలకత్తాలోను ఖిలాఫత్ సమావేశములు జరిగెను. గాంధీజీతో సంప్రదింపులు గావించి ఖిలాఫత్ సంఘము (సౌకత్ ఆలి, మౌలానా అబ్దుల్ కాలామ్ఆజాద్, మౌలానా హాజరత్ సోహాని మొదలగువారు సభ్యులు) వారు తమఆందోళనమును భారతజాతీయ మహాసభతో సమ్మిళితము చేయకోరిరి. ఉభయసంఘముల వారు ఏకమై కార్యములను గావించి మహత్తరమైన, విపులమైన ఆందోళనమును సృష్టించుటకు అంగీకరించిరి.

ఇంతలో దేశమునందుగల విశిష్టస్త్రీపురుషులలోను పంజాబులో జరిగిన హత్యాయజ్ఞమువలన, ఆంగ్లేయులప్రతిజ్ఞా భంగమువలన ఒకవిశేషమైన ప్రతిఘటనఆరంభమాయెను. జగత్పూజ్యులు రవీంద్రకవీంద్రులు జాలియన్ వాలాబాగ్ లో ఆంగ్లేయులు గావించిన ఘోరఅత్యాచారములవలన విశేష

దుఃఖితులను, వ్యధితులనైరి. ఆంగ్లేయులమానుష్యత్వవిహీన లక్ష్యదుఃఖాక్రాంతులై హృదయవేదనము తీవ్రమొందగా ఇట్లు ఉద్ఘోషితము గావించెను. "ఏ ఆంగ్లేయులు నా దేశవాసులను పశువులవలె హత్యగావించగలరో, నా దేశమును అవమానపరచగలరో, అట్టి ఆంగ్లేయులొసంగిన గౌరవపదవులను ధరించియుండుట నా మానుష్యత్వమునకు, జాతీయాభిమానమునకు సిగ్గుకరమైనదని, కళంకపూర్ణవిషయమని నేను తలంచుచున్నాను. అందువలన యీ అత్యాచారములకు ప్రతిబాధ రూపమున నేటినుండి నాకు ఆంగ్లేయులొసగిన "నైట్" పదవిని హృదయవేదనతో ధిక్కరించుచున్నాను, విసర్జించుచున్నాను."

ఆంగ్లేయులు పాలించిన భారతదేశ అధివాసుల అసహాయత్వమును గ్రహించి, ఆంగ్లేయుల దౌర్జన్యతను, నిర్దయతను గని రవీంద్రకవీంద్రుడు తన 'నైట్' బిరుదును పరిత్యజించి అత్యాచారుల అహేతుక అత్యాచారములను తీవ్రముగా విమర్శించి తన ప్రతివాదమును తెలియజేసిరి.

రవీంద్రుడు గావించిన సాహసపూర్ణమైన ఘోషణకు గాంధీజీ సంతుష్టిజెందెను. రవీంద్రుని కంఠముతో కంఠమును కలిపి ఆయనకూడ ఉద్ఘోషితము గావించెను. గురుదేవుని కవిత్వము భారతజాతీయజాగరణకు అమూల్యసంపద, గురుదేవుని

లకు సామాన్యఅధికారములనుఇచ్చుటకును సిద్ధపడిరి. భారత స్వాతంత్ర్యవాదు 'మంటేగు చెమ్స్‌ఫోర్డుఆక్టు' విషయము భారత దేశప్రజలకును, నాయకులకును తెలియజేసిరి. మరియొక విశేషవిషయమును ఇచ్చుటఆలోచింతము. ఖిలాఫత్ కమిటీ గాంధీజీని వారిలోకి స్వీకరించిరి. గాంధీజీకూడ యీ ఖిలాఫత్ కమిటీద్వారా మహమ్మదీయసంఘమును జాతీయ మహాసభతో ఏకముచేసి కార్యము లొనర్చునట్లు ప్రబోధితముగావించెను. ఈ ఖిలాఫత్ కమిటీలోనే ఆయన ప్రథమమున ఇంగ్లీషుస్వాధువారితో సహాయనిరాకరణమును ప్రారంభించు ప్రతిపాదనమును చేసియుండిరి. ఆయన గావించిన యీ ప్రతిపాదనమును ఖిలాఫత్ కమిటీవారు అంగీకరించిరి. అమృతసరులో జరిగిన దురంతములు, ఖిలాఫత్ ఉద్దేశ్యములద్వారా గాంధిగారి సహాయ నిరాకరణనీతి జన్మించెను.

ఇంతలో అమృతసరులో కాంగ్రెసు సమావేశము జరిగెను. ఈసమావేశములో గాంధీజీసంపూర్ణముగా మహాసభ కార్యములలో ప్రవేశించెను. మహాసభనాయకులు సత్యమును సేవించుసేవకునిపొంది ధన్యులైరి గౌరవాన్వితులైరి.

## 45

# ప్రథమసహాయోద్యమము

"మాంటేగు చెమ్సుఫోర్డు" ప్రజలకు తెలియచేయబడెను. దీనిలో భారతీయులు అధికారము లభింపబడుటకు ఉపాయములు నిహితమై యున్నవని కొందరు గ్రహించిరి. శాసకుల హృదయతా లేదని మరికొందరు తలచిరి. దీనిని అంగీకరించుటయా లేక విసర్జించుటయా అనువిషయమై నాయకులలో విశేషముగా అభిప్రాయభేదములు పొడసూపెను. దేశబంధు చిత్తరంజనదాసు, పండిత మోతిలాల్ మొదలగువారు ఈశాసనసంస్కరణ విషయములో అయిష్టులై యుండిరి. కాని దీనికి విరుద్ధముగా యెట్టిభిన్నమార్గము నవలంబించుటకు ప్రథమమున అంగీకరింపలేదు. గాంధీజీ దీనిని అతిసామాన్యమైనదని, అకించిత్కరమైనదని తెలిసికొనియు శాసనమునకు ప్రాథమికఅధికారముగాఅంగీకరించవలెనని సలహా యిచ్చెను. నాయకులు, గాంధీజీమధ్య యిట్టి అభిప్రాయభేదములు చెలరేగుచుండెను.

కాని ఇంగ్లీషువారిఆచరణములు నాయకులయొక్క, గాంధీజీయొక్క అభిప్రాయభేదములను సత్వరముగా తొలగించుటకు సహాయపడెను. పంజాబులో అత్యాచారియు, హత్యాకారియు, మిలిటరీఉద్యోగియునైన డయ్యరు ఇంగ్లాండుకు తిరిగిపోయినప్పుడు ఇంగ్లీషువారు ఆయన గావించిన

పరిపాలకులతో సహకారము చేయకుండునట్టి నీతిని హృదయ పూర్వకముగా అవలంబించవలయును.

గాంధీజీ భారతదేశీయులకు వ్యాపకభావముతో, సాధారణభావముతో శాసనములు తిరస్కరించమని సలహాలను, ఉపదేశములను ఇచ్చుట యిదియే మొదటిసారి.

గాంధీజీ యిట్లుపదేశించుటకు ఒక కారణ ముండెను. ప్రతిభారతీయునకు సత్యాగ్రహమును గురించి, అహింసను గురించి బోధించి దేశమును సత్యాగ్రహమునకు అగ్రసరము కమ్మని నుడువుటకు వీలులేదని గాంధిజీ గ్రహించెను. కోట్లానుకోట్ల భారతీయులొక్కసారిగా అహింసాపరాయణులు కాజాలరు. కాని కొందరు భారతీయులు నిష్కపటముగా సత్యాగ్రహము అహింసానీతి ననుసరించి కార్యము లొనర్చిన యెడల, క్రమముగా దీనిద్వారా సకలభారతదేశవాసులు ఆదర్శములను సంపాదించగలరు. అహింసానియమముల ననుసరించి సంగ్రామము చేయుటకు ప్రబోధమును బడయగలరు. కాని ఇట్టి క్షేత్రమునందుకూడ ఆపదలున్నవి. క్రమవిహీన మగు మనోవృత్తిగల, దుష్టస్వభావముగల ప్రజలు యీ ఆందోళనమును సుయోగముగా చేసుకొని అవినయముల వల్లను, హింసాయుతకార్యములవల్లను, ఆందోళనమును ఉద్దేశభ్రష్టముగను, పదభ్రష్టముగను గావింప ప్రయత్నిం

తురు. కాని వారి అపకీర్తివిషయము గ్రహించి మ గాంధీజీ యీసారి శాసనమును అతిక్రమించుటకును, సాధారణవిషయములలోసహా ఆంగ్లేయులసంపర్కమును విసర్జించుటకును, సంకల్పించుకొనిరి.

ఈసమయములోనే గాంధీజీ ఖిలాఫత్ ఆందోళనకారుల ఆహ్వానమువలన వారితో కలిసిపోయిరి. వారిహృదయములలో సహాయనిరాకరణోద్యమబీజములను నాటి, భారతజాతీయ మహాసభ ద్వారా ఆబీజములపై జలమును పోయించి ఫలవంతమగు వృక్షములుగా పరిణమింపజేయుటకు ఉద్యుక్తులైరి.

ఇతర నాయకులు కూడ అత్యాశావిధానమునకు కొంతవిరుద్ధముగా ప్రతివిధానమును వెదకుచునపిమ్మట గాంధీజీ ఉపదేశములనాలకించిరి. వారిమార్గములను, కర్తవ్యములను నిర్ణయించుకొనుటకు 1920వ సంవత్సరం, సెప్టెంబరు నెలలో కలకత్తాలో జాతీయమహాసభయొక్క విశేషసమావేశమును జరుపుటకు ఆహ్వానములుపంపించిరి. సమావేశములో గాంధిగారి ఆదర్శములు, మార్గములనుగురించి ప్రథమమున నాయకులలో విశేషవాదానువాదములుజరిగెను. తుదకు నాయకులందరును తమ అభిప్రాయభేదములను విసర్జించి గాంధీగారి అభిప్రాయములతో యేకీభవించిరి. ఇంతకంటె సర్కారువారిని బాగసూతలనుగావించుటకు మరియొకమార్గములేదని

వారుకూడ గ్రహించిరి. అందువలన యీ అసహాయోగ, అహింసాసత్యాగ్రహ సంగ్రామమును అవలంభించుట శ్రేయమని అందరును ఏకాభిప్రాయులైరి.

గాంధీజీ యీ అసహాయోద్యమ ప్రతిపాదనమునకు ప్రథమ కారణము జాలియన్ వాలాబాగ్‌లో జరిగిన హత్యాకాండలు, భారతీయ మహమ్మదీయుల సంఘమువారి యెడల సర్కారు చూపిన విశ్వాసఘాతుకతకు విరుద్ధముగా ఆమోదింపచేయించెను. కాని తరువాత ఇతరనాయకులతో సంప్రదించియుండగా విశేషాధికారములతో దీనిని వ్యాసుచేయించెను. ఇంగ్లీషువారి పరిపాలనలోగల నిష్ఫలత్వము స్పష్టముగా ప్రమాణమైనది. ఇంగ్లీషు శాసనమువలన భారతీయులకు యెట్టిమంగళము చేకూరదని వారు స్పష్టము గ్రహించిరి. భారతీయులు గతనాలుగు సంవత్సరములనుండి బ్రిటీషువారి సాధారణప్రభుత్వములోనే యుండి ఉపనివేశస్వాతంత్ర్య శాసనమును కోరుచుండిరి. కాని ఇంగ్లీషుసర్కారువారు ఈప్రాథమిక అధికారమునకే ననుజ్ఞ యిచ్చుటకు అంగీకరించలేదు. పైపెచ్చు భారతీయులను అత్యాచారములద్వారా, శోషణనీతిద్వారా నిర్వీర్యులుగాను, దుర్బలులనుగాను గావించి వుంచగోరుచున్నారు. కావున మనము నిమ్నశను అధికారమును పొందుటకు యీ అసహాయోద్యమ ప్రతిపాదనమును అంగీకరించుచున్నాము, గాంధిగారి ప్రతిపాదనమును జాతీయమహాసభ అంగీకరించెను. ఈప్రతి

పాదనమునకు అనుకూలముగానో, ప్రతికూలముగనో, ఉండు ఇంగ్లీషువారిభాగమును పర్యాలోచించి రాజోపసాంవత్స రికమహాసభాసమావేశములో దీనినియమముల ననుసరించి కార్యరూపమున అగ్రగణ్యమగుట మార్గముల నవలంబింప వలయును. అసహాయోద్యమవిషయములో కార్యప్రణాళికను తయారుచేయు భారము మహాసభ గాంధిజీపై సమర్పించెను. సర్కారువారితో సకలసంబంధములను విసర్జించుటయే గాంధిగారి అసహాయోద్యమ మూలవిషయములు, సర్కారు వారికి ఏకార్యములోను సహాయము చేయకుండుట, సహకారమునుండి విరమించుట, అయన కార్యప్రణాళికలోనమకూర్ప బడెను, సర్కారుఉద్యోగములను విసర్జింపవలయును, గౌరవ పదవులను విసర్జింపవలయును. సర్కారువారివిద్యాలయము లను వర్జింపవలయును, ఆఫీసులు, కోర్టులు, శాసనములువర్జిం పవలయును, విదేశవస్తువులను బహిష్కరింపవలయును.

నిర్మాణకార్యక్రమ ప్రణాళికలో ఆయన చరఖా, స్వదేశపరిచారమునకు ప్రధానస్థానముల నిచ్చెను. దానితో పాటు దేశములో విద్యావ్యాప్తికి జాతీయవిద్యాలయములను ప్రతిష్ఠించువిషయము, ప్రజాసాధారణముచే నిర్మింపబడిన పంచాయితీలు, కోర్టులవిషయములనుగూర్చిసలహాలనిచ్చిరి.

ఇది అపూర్వమైన, విచిత్రమైన సంగ్రామకౌశలమని అందరికిని తోచగలదు. భారతీయులసహాయముతోనే, సహా

కారములోని ఇంగ్లీషువారు భారతదేశమును పరిపాలించు వారు. భారతీయు లెల్లరును సాధారణ అసాధారణపదవు లలో, ప్రభుత్వపు కార్యములలో నియమితులై సర్కారు వారికి పరిపాలనలో సహాయము చేయువారు. గాంధీజీ అస హాయమును, సహకారమును, ఉపసంహరించి లోపలనుండి శాసన యంత్రమును నిర్వీర్యము చేయుటను అవలంబించెను. అస్త్ర ములద్వారా సంగ్రామము చేయకుండా ఇంగ్లీషుసర్కారు వారిని నిస్సహాయులుగాను, నిస్తేజులుగాను చేయగోరెను. గాంధీజీ కనిపెట్టిన యీ సంగ్రామము జాతీయమహాసభ ఉద్దే శ్యములను కార్యములను చాలావరకు మలుపుకు నడపు టకు తోడ్పడెను. నాయకులనేకులు ఈ కార్యప్రణాళిక విషయములో సంతుష్టిచెంది దీనిని సమర్థించుటకు సిద్ధపడిరి.

తరువాత డిసెంబరు నెలలో నాగపూర్ పట్టణములో జాతీయమహాసభ యొక్క సాంవత్సరిక సమావేశము జరిగెను. ఆ సమావేశములో మహోత్సాహముతో జాతీయవాదు లు, సేవకుదళము గాంధీగారి అసహాయోద్యమ ప్రతిపాదన మును సమర్థించిరి. ఆమోదించిరి. ఈ విషయములో మొత్త వ్యవస్థనైనను చేయుటకు గాంధీజీపై భారము వేయబడెను.

అసహాయోద్యమములో సత్యాగ్రహ కార్యముకూడ నొక చేర్చబడినని ఆయన తెలియజేసెను. ఈ అసహాయోద్యమ కార్యక్రమమును సకలసమయములలో అహింసద్వారా

నడుపవలయునని, యీ కార్యములలో హింస ఉండకూడదనియు ఆయన ప్రకటించెను.

ఈ ప్రతిపాదనమునకు ప్రథమమున దేశములో నితరులనేకులు వారు కొంత అభ్యంతరము కలుగజేసిరి. పిమ్మట గాంధిగారి యీ అహింస అసహాయోద్యమము యొక్క అభినవ విప్లవ ప్రణాళికను గ్రహించి వారు ఆనందముతోను, సానుభూతితోను యీ ఆందోళనములో పాల్గొనిరి.

ఈసారి గాంధీజీ తన కార్యక్రమ ప్రణాళికను వాస్తవ క్షేత్రమున ప్రయోగించుటకు ఉద్యుక్తులైరి. సర్వవిధములైన విదేశవస్తువులను విసర్జించవలయునని దేశమంతటను ప్రచారము గావించిరి. దేశవాసులు ఉత్సాహితులైరి. కర్మప్రబోధముల చేత ఉద్దీపితులైరి. చంచలులైరి. ప్రజలు విదేశవస్త్రములను త్యజించిరి. ఆంగ్లేయులను అందరు విశ్వాసముతో అనుసరించుట వర్జించిరి. బొంబాయి, ఢిల్లీ, అహమదాబాదు, కలకత్తా మొదలగు పట్టణములలో, ఉత్సాహముతో, ఆడంబరముతో విదేశవస్త్రములను, వస్తువులను బహిరంగస్థలములలో కాల్చివేయుట కారంభించిరి. దేశములో అనేకమంది ధనికులు సహా అమూల్యములైన వస్త్రములను అగ్నిలో పడవేయుచుండిరి. విదేశవస్తువులను ధ్వంసము చేయుటకు సమస్త దేశమునందును ఆందోళనము చెలరేగెను. దేశవాసులు

బ్రిటిషుశాసనము ఇంతకుపూర్వముకంటెను భారతీ యులను అసహ్యించుకొనుచుండెను. కానిగాంధీజీవారిఅసహ్య మును ఇనుమడింపచేయుకోరలేదు. కాని ప్రజా దృష్టిని ఇంగ్లం డుదిగుమతియైన వస్తువులపై పునః ఆయన మరలింపగోరెను. భారతదేశము ఇంగ్లాండుతో సకలసంబంధములను తెగించు కొనుటకు బద్ధపరికరమాయెను. దానికినిదర్శనముగా నీయా విదేశవస్త్రములు వస్తువులు దహనము చేయబడుచున్నవి. ఈశస్త్రచికిత్సకూడ అవసరమై యుండెను. ఇంతకాలము యీ విషపూర్ణవస్తువులను బీదలకు దుఃఖార్తులకు నిచ్చుటయే అన్యాయమైనది. ఏలననగా బీదవారలకుకూడ ఆత్మగౌరవ మున్నది. కాని నిదానముగా ఆలోచించి చూచినచో యీ విదేశవస్తుదహనకార్యము తాత్కాలికముగా హింసామూలక మైనదని తోచినను, దీనిలోహింసాస్పర్శమాత్రమైనను లేదు. భారతదేశములోని ప్రతిరోధపరాయణమగు ఆత్మయొక్క ప్రతిరోధస్ప్రవాహ గలబాహ్యప్రకాశముమాత్రమేయున్నది.

గాంధిగారి వ్యాఖ్యానమువలన విశ్వవాసులు, భారత వాసులు ముగ్ధులైరి. విదేశవస్తువులబహిష్కరణకు స్పష్టమైన హేతువును అందరును వెదకికనుగొనిరి. కానికార్యసాఫల్యత కొరకు అసహాయోద్యమఆందోళనమునకు దేశమునుపరిపాలి తము చేయుటకు ముందు ఆయన తన కార్యములోని యితర

బుచ్చుటయు హిందూధర్మమునకు ప్రకృతసిద్ధము, భగ
వానునిసృష్టిని సేవించుటకు అందరును జన్మించినారు.
బ్రాహ్మణుడు తనజ్ఞానము వల్లను, క్షత్రియుడు తనరక్షణ
శక్తివల్లను, వైశ్యుడు తనవాణిజ్యనైపుణ్యము వల్లను, శూ
ద్రుడు తన దైహికపరిశ్రమ వల్లను అందరిసేవ చేయవలయు
ను. బ్రాహ్మణుడు ఎట్టిశారీరకపరిశ్రమ చేయవలదనిగాని,
ఆత్మరక్షణకై క్షత్రియపాలనము గావించవలదనిగాని, ఇతర
కార్యములేవియు చేయవలదనిగాని దీనిఅర్థము కాదు. జన్మచే
విశేషముగా బ్రాహ్మణుని జ్ఞానజీవిగా గావించును. జన్మ
హక్కు, విద్యద్వారా ఆయుపయుక్తతలకు జ్ఞానదానము చేయు
టకు యోగ్యుడు కావలయును. శూద్రుడు జ్ఞానమునకధికారి
కాగోరిన యెడల ఆయనను విరతునిగా చేయుటకు కారణ
మేమియులేదు. దేహముద్వారమునే అతడు అందరికంటె
మహత్తరమైన సేవచేయగలడు. సేవకొరకు ఉన్నశ్రేణి
వారికిగల యోగ్యతలతో నే దేని విశేషగుణమునకు అధికారి
కాగలిగిన యెడల ఆయనపై హింసచూపుట కెట్టికారణము
లేదు. కాని ఏబ్రాహ్మణుడు జ్ఞానమునకధికారియని శ్రేష్ఠ
త్వమును బడయగోరునో ఆతనికి పతనము తప్పకకలుగును.
ఆబ్రాహ్మణుడు ఎంతమాత్రమును జ్ఞానమునకధికారి
కాజాలడు' అని ఆయన వచించెను.

గాంధీజీ యీవిధముగా వర్ణాశ్రమధర్మములయొక్క
పరిష్కృతతాత్పర్యమును ప్రచారము చేయమొదలిడెను.

కార్యభేదములవలన వృత్తిభేదములు ఏర్పడెను. కాని వృత్తిభేదములవలన శ్రేణిభేదము కాని, జాతిభేదముగాని ఎన్నడును నిర్ణయింపబడలేదు. దీనిని ఆయన ప్రమాణములద్వారా ప్రదర్శించెను.

ఉన్నతశ్రేణివారి అసహ్యమును, హింసలను తొలగించుటకు ఆయన నిమ్నశ్రేణివారిపక్షము వహించెను. అస్పృశ్యులతో, అంత్యజులతో ఆయన కలిసిపోయెను. ఆయన అస్పృశ్యులగృహములలో తననివాసమును, కార్యక్షేత్రమును స్థాపించెను. ఆయన నుడివిన దేమనగా— 'మానవులకు మానవులకు యెట్టిభేదము లేదు. సకలమానవులలో భగవానుని అస్తిత్వమున్నది. కావున ఏమానవుడు శ్రేష్ఠుడని గర్వించుచు మరియొక మానవుని అసహ్యించుకొనుచు త్యజించునో, అతడు భగవానునే అసహ్యించుకొనెను' ఆయన యిట్టుల ప్రచారము గావించెను. 'నిమ్నశ్రేణివారు ఈశ్వరుని సంతానము. వారు హరియొక్క అంశము. వారు హరిజనులు. హిందూజాతివారు యీభ్రమనుగ్రహించి హరిజనసోదరులను తమగృహములలోకి ఆహ్వానించుట కర్తవ్యము. మనము జాతిభేదరహితమైన అఖండహిందూ ధర్మమును నిలువబెట్టవలయును. ఇట్టి అధఃపతనపరిస్థితులలో కూడ యింకా ఉచ్చనీచముల దంభము, అసహ్యములను అంటిపెట్టియున్న యెడల సమస్తజాతియు సంపూర్ణముగా ధ్వంసమగుట, పతనమగుట తప్పదు.'

ఆయన స్వదేశము దేశవాసులకు నవచైతన్యమును కలిగించెను. ఉన్నతశ్రేణి స్వార్థపరులగు మూఢాచారులు, దాంభికులునైన సంఘకర్తలు ఆయన ప్రచారమువలన విచలితులైరి. దేశములోని నాయకులు, జాతీయమహాసభ కర్ణధారులు సంఘమునకు అభిశాపస్వరూపముగానున్న శ్రేణీ విభాగములకు, శ్రేణీభేదములకు విరుద్ధముగా ప్రచారకార్యమును నడిపించిరి. భారతదేశములోను, ప్రపంచములోను శ్రేష్ఠకవియగు రవీంద్రుడు, గాంధీజీ ఆదర్శములకు అభినందనములు తెలియజేసి ఉన్నతశ్రేణివారిని జాగ్రత వహించమని పద్యము రచించెను—

"మరణదూతద్వారమువద్ద నిలబడియున్నటుల చూచుటలేదా?

నీజాత్యహంకారముపై అభిశాపము, అంకితముచేయబడియున్నది.

అందరిని పిలువక, ఇంకను దూరముగా తొలగి [illegible]ముంచినయెడల

నీ నలువైపుల అభిమానబంధనముతో బంధించియుంచితివేని

మరణముద్వారా చితాభస్మములో అందరితో సమానము కావలయును."

హిందూసంఘములో నాలుగువైపుల మహత్తరమైన చైతన్యము కన్పట్టుచుండెను, కాని దీనివలన కూడ మహాత్ముని

హృదయమునకు తృప్తి కలుగలేదు. ఆయన యింక సంపూర్ణ గా నా కార్యరంగమున ప్రవేశించెను. ఆయన హరిజనులతో ఏకాత్మ్యత్వము పొందెను. హరిజనులతో సహవాసము కూడ చేయుచు, కలిసిమెలసి, కార్యములొనర్చుట మొదలగు కార్యములు క్రమముగా సాగించుచుండెను. హరిజనపల్లినే తనస్థిర నివాసముగా నేర్పాటు చేసుకొనెను. ఆయన మరలభారత వాసులకు తెలియజేసినవిషయము—"నేను మరల జన్మించిన యెడల హరిజనులలోనే జన్మించెదను. దానివలన నేను కష్టసుఖములనుభవించి గ్రహింపగలను, వారిముక్తికొరకు శ్రమపడి ప్రయత్నించగలను."

ఆయనకు కలిగిన యీహరిజనప్రీతి, హరిజనసాంగత్యము ఆయన జీవితములో అంత్యదినమువరకు నిలుపుకొనగలిగెను. ఆయనను సంపూర్ణముగా హరిజనుల కొరకు సమర్పించుకొనగలిగెను. ఆయన కార్యముల సందర్భమున యెచ్చటికిపోయినను అచ్చట అస్పృశ్యుల అంత్యజుల పల్లెలకపోయి నివాసమేర్పాటు జేసికొనెను. అచ్చటి నుండికార్యక్రమమును నడుపుకొనెడి.

ఆఫ్రికాకర్మక్షేత్రములో అనగా టాల్‌స్టాయిఆశ్రమములో అస్పృశ్యతావర్జనమను యేమహత్తరబీజము జన్మించెనో, ఆబీజము భారతదేశ అసహాయోద్యమకర్మక్షేత్రమునందును ప్రవేశించి మహత్తరమైన విశాలమైన మహీరుహముగా పరిణమించినది. వివిధపతితశ్రేణులలోను ఆశాజ్యోతి ప్రజ్వరిల్లెను.

అస్పృశ్యతాదూరీకరణప్రయత్నముతోపాటు ఆయన భారతీయుల మహత్తరమైన జటిలతరమైన సమస్యలను పరిష్కరించుటకు పూనుకొనిరి. ఆయన హిందూముసల్మాన్ సోదరులు సమ్మేళనసాధనకు కూడ ఉద్యుక్తులును, యత్నశీలురునైరి.

హిందువుల వివిధశ్రేణీలలో సమ్మేళనముకలుగుట యెంతప్రయోజనమో, భారతదేశ హిందూమహమ్మదీయ సంఘములలోకూడ అట్టిసమ్మేళనము, ఐక్యత చాలాఅవుసరము. భారతదేశములోనియీరెండుసాంప్రదాయములవారు ఐక్యతాబద్ధులై, భారతదేశకల్యాణముకొరకు ఉన్నతికొరకు ఆత్మసమర్పణముగావించుకొనిన యెడల, ఆఔన్నత్యము ఎంతనిశ్చితముగా, ద్రుతముగా జరుగునో వర్ణింపజాలము. భారతీయ హిందూమహమ్మదీయులు సమ్మిళితమై, ఏకమనస్కులై స్వాతంత్రతసంపాదనకొరకు ప్రయత్నించినయెడల అత్యల్పకాలములోనే భారతీయులు స్వాతంత్ర్యమును పొందగలరు. హిందూముసల్మానులసమ్మిళిత సంఘబద్ధప్రయత్నములను అణుచుటకుగాని, హిందూమహమ్మదీయుల మిలిత శక్తిని అణచియుంచుటకుగాని ప్రపంచములో ఇంగ్లీషు సర్కారువారికిగాని, మరియేసర్కారువారికిగాని, శక్తికిగాని సాధ్యముకాదు.

ఈసమ్మేళనకార్యములో సహాయముచేయుటకే ఆయన మహమ్మదీయసంప్రదాయమువారితో సహకారనీతినిఅవలం

బించెను. ఖిలాఫత్ ఆందోళనమును జాతీయ మహాసభా కార్య
క్రమముతో సంయుక్తము చేయుటకు సంకల్పించుకొనెను.
ఈ ఉద్దేశముతోనే ఆయన ఖిలాఫత్ ప్రచారకుల హృదయ
పూర్వకమైన ఆహ్వానమునకు జవాబొసంగెను. ప్రతిఖిలాఫత్
సమావేశములోను పాల్గొనుచుండెను. ఆంగ్లేయులతో అసహ
యోద్యమనీతిని ఖిలాఫత్ ఆందోళన కార్యక్రమములో
భాగముగా గ్రహించెను.

ఇదిగాక యీరెండు మతముల ప్రజలలో సమ్మేళన,
సద్భావముల అభిలాషను కలిగించుటకు యింకను అనేక
విధములైన ప్రీతికరములైన ఉపాయములను అవలంబించెను.
ఆనాడు భారతహిందూమహమ్మదీయులకు గోహత్యను నివా
రించుటకై సలహాలనిచ్చెను గోహత్యను వారించి యిది
హిందువులను సంతోషపెట్టుటకు చేసితిమని మహమ్మదీయులు
తలంపవలదని వారికి తెలియజేసెను. భారతీయుల ఆహార
ఆరోగ్యౌన్నత్యము కొరకో, లేక ఆవుల జీవన నాశనమునుండి
విరమించుచున్నామనియో వారు తలంచవలయును. హిందువు
లకు తెలియజేసిన దేమనగా— తమకు హిందువులు గోహత్య
చేయకపోయినను, గోవులను అనాదరముతో, అవజ్ఞతో
చూచి ప్రకారాంతమున వారు కోటానుకోట్ల గోవుల ప్రాణ
నాశనము కలిగించుచున్నారు. గోవుల ఆరోగ్యమును జీవిత
మును నష్టపరచి వారు స్వదేశమును పుష్టికరమై ఆహార
మునుండియు సంపదనుండియు వంచితము చేయుచున్నారు.

దేశముయొక్క సమష్టిగతమగు క్షేమముకొరకే, దేశముయొక్క పుష్టికర ఆహారముకొరకే వారు గోవులను అనాదరముతో అవజ్ఞతతో చూచుట విరమించుచున్నపని తలంపవలయును.

అయినను యీవిధముగా మహమ్మదీయులను గోహత్య చేయవలదని నిషేధించెను. కాని దానికి బలము నెట్టిపరతును ఆరోపించలేదు. దేశముయొక్క మంగళముకొరకు మహమ్మదీయులు స్వేచ్ఛాపూర్వకముగా గోహత్య విరమించవలయును. ఈకార్యమువలన సహజముగా హిందువుల ప్రేమ విశ్వాసములను సంపాదింపవలయును. హిందువులు కూడ దేశసేవవిషయములో మహమ్మదీయుల సహృదయతయందు విశ్వాసముంచి వారి భావాభియోగములలో సానుభూతిని చూపించవలయును. వారికోరికలను, ఆందోళనమును తమ స్వకీయమైనవిగాభావించి తోడ్పడవలయును. హిందువులు మహమ్మదీయుల సకలసంగ్రామములలోను, ప్రయత్నములలోను వారితో యేకీభవింపవలయును. మహమ్మదీయులు కూడ హిందువుల సంగ్రామమును తమ జాతీయసంగ్రామముగా గ్రహింప నేర్చుకొనవలయును—ఇదియే గాంధిగారి ప్రయత్నము, సాధన.

ఈసాధనలో సాఫల్యతనుపొందుటకై దృఢసంకల్పులై వేదములు, ఉపనిషత్తులు, ఖురానులో గల ధర్మనీతిద్వారా, ఉపదేశములద్వారా ఉదారసందేశమును వివరించి సకల ధర్మములభావలు ఒకటేయనియు, ఆదర్శములు ఒకటే

యునియు హిందువులలోను మహమ్మదీయులలోను ప్రచారము చేయనారంభించిరి. హిందువులు మహమ్మదీయులు ఉభయులును ధర్మభేదములు విరుద్ధతను గురించి వివాదపడవలదని నిషేధించెను. విదేశశాసకుల దుస్సలహాలవలనతత్రపః అను భేదములను గ్రహింపక, ధర్మద్వేషములలో నిమగ్నమై దేశమును దురవస్థలపాలు చేయక వలదని పలుమార్లు వేడుకొనెను,

గాంధీగారి ఆంతరిక ఆహ్రిణప్రయత్నములను ఫలములు ఫలించనారంభించెను. శాసకుల కుట్రవలన, స్వార్థపూర్ణప్రచారమువలన రెండుసంప్రదాయములలో ఘనీభవించుచున్న అసందృశ్యములై పోవుచుండెను. ధర్మము వారివ్యక్తిగతఆదర్శమని ఉభయసాంప్రదీయములవారును గ్రహింప ప్రయత్నించిరి, వ్యక్తిగత ఆదర్శములను నిలువబెట్టుకొనియు జాతిగత ఉన్నతఆదర్శములకొరకుఉభయసాంప్రదాయములు మిళితము కావలయును. ఈబోధక్తితో తమదళముగారి స్వార్థము మర్యాదలసంకటములు పెరిగిపోవుచున్నప్పుడు ఉభయసాంప్రదాయములలో సమ్మేళనఅభిలాషకూడసహజమగుచుండెను. ధర్మగురు ఖలీఫాను ధర్మమును అవమానపరచుటచేత మహమ్మదీయులు ఆంగ్లశాసకులపై విరక్తి చెందిరి. మరియొకవైపున దేశములో శోషణము, అత్యాచారములు, స్వాతంత్ర్యసమస్యలు— వీటివలనహిందువులు

యితరసంఘములవారు ఆంగ్లేయులకు విరుద్ధముగా సంక్షోభపడుచుండిరి. సంక్షోభము ఏకదేశములో ఏకజాతివారికి విరుద్ధముగా సమ్మిళితమగు మార్గము దొరకినది. దానితో గాంధిగారి ఏకజాతీయతా ఆదర్శమును ప్రచారముకొరకు అది స్వదేశీయ, స్వజాతీయభావములతో దీక్షితము చేయబడెను. హిందూమహమ్మదీయుల సమ్మిళితసంక్షోభములు ఆంగ్లశాసకుల అచలసింహాసనమును చంచలముగావించెను. గాంధిగారిప్రయత్నములు, సాధనసాఫల్యమండితమగునని తలంపబడెను.

అస్పృశ్యతాదూరీకరణ, సాంప్రదాయకప్రీతిస్థాపన ప్రయత్నములతో స్వదేశప్రచారము, ఖాదీప్రచలన కార్యములలో ఆయన యెట్లు అగ్రసరమాయెనో దానినిగురించి యిచట గ్రహింతము.

విదేశవస్త్ర బహిష్కరణవిషయములో జాతీయమహాసభ, ఖిలాఫత్ సంఘముద్వారా దేశవాసులకు నివేదించుకొనెను. కాని విదేశవస్తువులకుబదులు స్వదేశవస్తువులనిచ్చి భారతీయుల అభావములను తొలగించుటకు తగినసామర్థ్యము అప్పుడు భారతీయవ్యాపారస్తులకు లేకుండెను. అందువలన విదేశవస్తువులకుబదులు భారతదేశములో స్వదేశవస్తువులను

తయారుచేయించుటకును, పరిపాకము చేయించుటకును ఆయన విశేషప్రయత్నములు చేయుచుండెను. ఆయన యీ విషయములో భారత దేశములో ఉత్పన్నము చేయబడిన వస్త్రముల విషయమైన ఆలోచించుచుండెను. కాని భారత దేశములో వస్త్రోత్పాదన సామర్థ్యము అప్పుడు అల్పముగాను, నిరాశాజనకముగాను ఉండెను.

కోటానుకోట్లదరిద్రభారతీయులకొరకు ముతుక అన్న వస్త్రముల యేర్పాటుగావింపగలిగినయెడల, విదేశవణిజుల అర్థలోలుపత్వమునుండి దరిద్రభారతీయులను రక్షించి సాధారణ వస్త్రములద్వారా వారిలజ్జానివారణగావించుకొనునట్లు చేయగలిగినయెడల, భారత దేశములో యథార్థమగు చైతన్యమార్గము ముక్తమగును.

భారతస్వాతంత్ర్యముకొరకు ఇంగ్లీషుసర్కారు వారితో విరోధము కలిగించుకొనుటకు ఆయన ప్రధానస్థాన మీయలేదు. స్వదేశవస్తువులస్వీకరణ, ఖాదీపరిసారమును భారత దేశముక్తికి, సమృద్ధికి ఏకమాత్రమార్గమని తలంచిరి.

కాని ఈస్వదేశశిల్పపునరుద్ధారణకార్యములో నిమగ్నమై ఆయన అనేకబాధలకు, కష్టములకు లోనయ్యెను.

అది ఆయనకు ప్రత్యక్ష అసహాయోద్యమము, సత్యాగ్రహ సంగ్రామములకంటె అత్యంతముఖ్యమైనదియు, దురతిక్రమమనియు తలంచెను. భారతీయవస్త్రములనిర్మాణకర్తలను, గౌరవనీయులునైన భారతీయచేనేతకులమువారిని ఆంగ్లవణిజులు ధ్వంసము గావించిరి. చవుకవిదేశవస్త్రములద్వారా సమస్తభారతదేశమును నింపివేసెను. భారతీయ నేతపారిశ్రామికులుఅధిక మూల్యమునకు నూలు, మగ్గములనుక్రయముజేసి అంతకంటె అధికమూల్యమునకు విక్రయించుటకు ఎట్టియేర్పాటును గావించలేకపోయిరి. చవుక, ఉత్కృష్టమైన విదేశవస్తువులు, వస్త్రములు లభించుటచే అధికమూల్యముగల భారతీయ చేనేతవస్త్రములను విసర్జించిరి. స్వల్పమూల్యమునకు ఆశపడి స్వదేశవస్త్రములను విసర్జించి విదేశవస్త్రములను స్వీకరించెను. తత్ఫలితముగా భారతీయతంతువాయులు క్రమముగా విప్తమాయెను.

గాంధీజీ స్వదేశవస్త్రోత్పత్తికొరకు భారతదేశములోని చేనేతపరిశ్రమపై తనశక్తులన్నిటిని ప్రయోగించెను. ఆయన మగ్గములను సంపాదించి తన ఆశ్రమములో స్థాపించెను. ప్రథమమున ఆయన స్వయముగాను ఆయన అనుచరణదళమువారును యీశిల్పములు పునరుద్ధరించుటలో తమను సమర్పించుకొనుటకు ఉద్యుక్తులైరి. పిమ్మట దీనిఫలాఫలము

లను చూచి దీనిని విస్తరింపజేయుటకు ప్రయత్నించెదమని సంకల్పించుకొనిరి. ఆశ్రమములో మగ్గములు ఏర్పాటు చేయబడెను. కాని నేయుటకు నూలు ఏది? అప్పుడు ఒకటి రెండుమాత్రమే భారతీయవస్త్రయంత్రములు బొంబాయి పరిసరములో స్థాపించబడెను. ఆనాడు ఆయంత్రశాలనుండి నూలు క్రయముచేసి వస్త్రములు నేయుటకు ఏర్పాటు చేసిరి. కాని ఆయన మనస్సు సంతుష్టిచెందలేదు. మిల్లునుండి సంపాదింపబడిన అధిక మూల్యముగలనూలు కంటెవస్త్రముల మూల్యముకూడ అధికమగునని గాంధీజీ గ్రహించెను. ఆయంత్రములనూలుకూడ విదేశవ్యాపారస్థులిచ్చినదే. అందువలన తద్వారా తయారుచేయబడిన వస్త్రము భారత దేశవాసుల స్వకీయవస్త్రమని చెప్పుకొనుటకు వీలులేదు. ఆయన స్వదేశవస్త్రములనుతయారుచేయబోయి ప్రథమము ననే నూలు సంకటములో పడిపోయెను.

కాని సంకటమువలన ఆయన నిరాశచెందువ్యక్తి గాదు. ఆయన దీనికి ప్రతికారమార్గమును వెదక నారంభించెను. స్వదేశనూలుసంపాదించుటకు విశేషప్రయత్నములు గావించుచుండెను. నూలు తయారుచేయుయంత్రము విషయము ఆయన జ్ఞప్తికి దెచ్చుకొనెను. మనదేశములో ప్రాచీన కాలపు మధ్యయుగమునాటి చరకావిషయము ఆయనకు

జ్ఞాపకము వచ్చెను. ఈచరకాయే నూలుతీయు సమస్యను సంపూర్ణముగా పరిష్కరింపగలదని ఆయన తలంచెను. ఈచరకాయే అల్పసమయములో స్వల్పఖర్చుతో స్వదేశ ముతకవస్త్రములకొరకు ముతకనూలును తయారుచేయ గలదు. భారత దేశములో విస్మృతమై పరిత్యజింపబడిన చరకా మరల నేడు నవరూపమును ధరించి గాంధీజీప్రయ త్నమువలన పునరుద్ధరింతబడెను. భారతజాతిజనకుని ప్రయ త్నమువలన గౌరవప్రదమైన భారతశిల్పము మరల తనఆవి ర్భావమార్గమును వెదకి కనుగొనెను. చరకా పునర్జన్మ ధరించెను.

కాని చరకావిషయము స్మరించుకొన్నను శ్రమపడక గాంధీజీ చరకాను సంపాదింపలేకపోయిరి. చరకా ఎచట లభించగలదు? ఇదియే ప్రధానసమస్య. తంతువాయులే ధ్వం సమై పోయినపుడు చరకా యెచ్చట లభించగలదు? కాని గాంధీజీ నిరుత్సాహపడలేదు. స్వయముగా తిరిగియు, ఇతరు లను పంపించి త్రిప్పియు చరకాకొరకు గ్రామగ్రామములలో వెదకుట కారంభించెను. ఆయనఆశ్రమములోని సహచరు లును, సహకారులును చరకాకొరకు నాలుగువైపుల వెదకు చుండిరి. తుదకు ఉద్యమమును, పరిశ్రమఫలించెను. గుజరాతు దేశమునందు ఒకగ్రామములో 13 చరకాలున్నటుల వార్త

తెలిసెను. ఆగ్రామములో కొందరు మహిళలు చరకాతో నూలు తయారుచేయుదురని తెలిసినది. దూదిపింజలు వారికి లభించినయెడల చరకాలద్వారా నూలు తయారుచేసియిచ్చెదరని తెలియవచ్చెను. గాంధిగారికి స్వప్నదర్శనము లభించినట్లాయెను. ఆయన మిల్లులనుండి దూదిపింజలను సంపాదించి యిచ్చెను. రమణీమణులు నూలు తయారుచేసిరి. గాంధిజీ ఆశ్రమవాసులు నూలు తీయు పద్ధతిని ఉత్సాహముతో ఆనందముతో నేర్చుకొనిరి.

సమస్తజీవితములో ఆయన చరకావ్యాప్తికై ప్రచారము గావించియుండిరి. దేశవాసులకు ఆదర్శములను, దృష్టాంతములను చూపించుటకు ప్రతిదినము సహస్రకార్యములలో తాను స్వయముగాకూడ సమయమును నియమించుకొని చరకాతో నూలును తయారుచేసియుండెను. ఆయనదృష్టాంతముద్వారా చూపించినదేమనగా— ప్రతిభారతీయుడును, అవకాశమునుబట్టి కొంతనూలు తయారుచేయగలిగిన యెడల, తనవస్త్రములకు కావలసిన నూలును తయారుచేసినను, భారతీయుల ప్రయత్నములవలన భారతదేశములోని వస్త్రాభావము తొలగిపోవుటయేగాక భారతదేశములో అన్నాభావముకూడ తొలగిపోయెడిది.

యంత్రవలన భారత దేశములో ప్రసిద్ధమైన, విస్తృతమైన శిల్పము మగ్గము, చరఖా, దూది పరిశ్రమ విధ్వస్తములయ్యెను. భారత దేశపు స్వకీయసంపద ఖాదీ జన్మించెను. భారత దేశ దారిద్ర్యమును తొలగించుకొనుటకు, స్వాతంత్ర్యమును సంపాదించుటకును ఒక అభినవ అస్త్రము ఆవిష్కరింపబడెను.

ఆశ్రమ చరకాతో తయారుచేయబడిన నూలుతో, ఆశ్రమ మగ్గముతో వస్త్రము తయారయ్యెను. ప్రథమమున వస్త్రము నికృష్టముగా నుండెను. కాని అనుభవము, సమర్థత అభివృద్ధియైనకొలది వస్త్రముల ఆకారము, స్వరూపము ఉత్కృష్టముగా నుండెను. గాంధీజీ ఆశ్రమములో తయారైన వస్త్రమును ధరించెను. ఆశ్రమ వాసులుకూడ ఖద్దరు ధరించిరి. ఖాదీలోగల కౌశలమును గ్రహించి ఆయన ఖాదీప్రచారములో నిమగ్నుడాయెను. అచ్చటచ్చట సభలలోను సమావేశములలోను ఉపన్యాసము లిచ్చి, భారత దేశములోని ప్రాచీన చరఖాను గురించియు, మగ్గమును గురించియు, శిల్పముయొక్క శ్రేష్ఠత్వమును గురించియు, గుణమును గురించియు ప్రచారము చేయ మొదలుపెట్టిరి. ఇంకా స్వదేశీయుల దుఃఖదుర్దశలను తొలగించుటకు మూలమంత్రమని ఆయన ఉద్ఘోషింప నారంభించెను. ఆయన, ఆయనసహకారులు చరఖా

గాంధీజీ చరకా సంపాదించెను. ఆ పిమ్మట ఆశ్రమములో చరకా స్థాపితమాయెను. కాని ఈసారి పరాజితీయులకు తగిన దూదిపింజలు దొరకుట దుర్లభమయ్యెను. మిల్లునుండి పింజలను క్రయము చేయవలెనని గాంధీజీ సంకల్పించుకొనెను. అవి భారతీయదూదిచేత చేయబడినను, దానిద్వారా ఆయన ఆశ్రమవాసులుగాని, దేశవాసులుగాని స్వావలంబులగుటకు విద్య నభ్యసింపజాలరు. ఆయన యింతదూరము అగ్రేసరుడయ్యె హఠాత్తుగా సంభవించిన యీచిన్న ఆటంకమువలన విచలితుడు కాలేదు. అవిచలితఉద్దేశ్యముతో, ఉత్సాహముతో దూదినుండి పింజలను తయారుచేయుటకు ప్రయత్నించెను. తుదకు పరుపులను తయారుచేయు దూదేకులవానివిషయము స్మరణకు వచ్చెను ఆయన దూదేకులవానిని సంపాదించెను. అధికమజూరియిచ్చి అతనిద్వారా దూదితో పింజలను తయారుచేయించెను. ప్రథమమున దూదేకులవారే ఆశ్రమమునకు ఆవశ్యకములగు పింజలను తయారుచేసి యిచ్చుచుండిరి. కాని స్వావలంబులగు ఆశ్రమవాసులు దీనివలన సంతుష్టి చెందలేకపోయిరి. గాంధీజీ అనుచరులు అల్పదినములలోనే ఉత్సాహముతో పింజలను తయారుచేయుట నేర్చుకొనిరి. ఆశ్రమవాసులు దూదిని ఏకుచుండిరి. ఈవిధముగా గాంధీగారి ప్రయత్నమువలన, ఉద్యమమువలన, సహృద

యంత్రవలన భారత దేశమునందు ప్రసిద్ధమైన, చిత్రవిచిత్రమైన శిల్పము మగ్గము, చరకా, దూది ప్రజావిస్మృతము లయ్యెను. భారత దేశపు స్వకీయసంపద ఖాదీ జన్మించెను. భారత దేశ దారిద్ర్యమును తొలగించుటకును, స్వాతంత్ర్యమును సంపాదించుటకును ఒక అభినవ అస్త్రము ఆవిష్కరింపబడెను.

ఆశ్రమ చరకాతో తయారు చేయబడిన నూలుతో, ఆశ్రమ మగ్గముతో వస్త్రము తయారయ్యెను. ప్రథమమున వస్త్రము నికృష్టముగా నుండెను. కాని అనుభవము, సమర్థత అభివృద్ధియైనకొలది వస్త్రముల ఆకారము, స్వరూపము ఉత్కృష్టముగా నుండెను. గాంధీజీ ఆశ్రమములో తయారైన వస్త్రమును ధరించెను. ఆశ్రమవాసులుకూడ ఖద్దరు ధరించిరి. ఖాదీలోగల కౌశలమును గ్రహించి ఆయన ఖాదీప్రచారములో నిమగ్నుడాయెను. అచ్చటచ్చట సభలలోను సమావేశములలోను ఉపన్యాసము లిచ్చి, భారత దేశములోని ప్రాచీన చరకాను గురించియు, మగ్గమును గురించియు, శిల్పములయొక్క శ్రేష్ఠత్వమును గురించియు, గుణమును గురించియు ప్రచారము చేయ మొదలుపెట్టిరి. చరకాయే దేశముయొక్క దుఃఖదుర్దశలను తొలగించుటకు మూలమంత్రమని ఆయన ఉద్ఘోషింప నారంభించెను. ఆయన, ఆయనసహకారులు చరకా

ట్రిప్పి దేశవాసులకు దృష్టాంతమునను చూపించుచుండిరి, ఆయన 'యంగ్ ఇండియా' 'నవజీవనము' మొదలగు వార్తాపత్రికద్వారా చరకాఖాదీల అతీతయితిహాసమును, వర్తమానకార్యసాఫల్యతను గురించియు అనేకవ్యాసములను వ్రాసి ప్రకటించుచుండిరి.

ఈచరకాఖాదీల ప్రచారమువలన దేశములోనినాయకులదృష్టి దీనిపై పునః ఆకర్షింపబడెను. భారతదేశములోని జాతీయమైన, అర్థనైతికమైన జీవితములోగల తాత్పర్యము గ్రహించి జ్ఞానులగు నాయకులుకూడ దీనిని ప్రచారము చేయుటకు శ్రద్ధవహించిరి. వారు ఖద్దరు ధరించిరి. ముతుకనూలు ఖద్దరు వారిహృదయ దేహముల పవిత్రతను వృద్ధిచేసెను.

సాధారణప్రజలుకూడ ఖద్దరుయొక్క ప్రయోజనమును, ఉపకారమునుగురించి అనుభవమునకు సంపాదించి విదేశమునుండివచ్చు సన్ననివస్త్రములను విసర్జించి "మాతయిచ్చిన ముతుకగుడ్డలకొరకు" ప్రతపించుచుండిరి. ప్రజలు చరకాతో నూలుదీయుటకు ఆరంభించిరి. అనేకస్థలములలో మగ్గములు స్థాపించబడెను. ప్రజలు విదేశశాసకుల అత్యాచారములవల్లను, శోషణవల్లను సంక్షోభము ననుభవించు

చుండిరి. ఈసమయములో అత్యాచారములకు ప్రతీకారముగా వారు నూతనఅస్త్రములను వెదికి కనుగొనిరి. చరకాఖాదీలప్రచారము దేశములో వివిధస్థానములలో 'సత్యాగ్రహసభ'కు చెందిన సత్యాగ్రహులు రాట్నముతో నూలు తీయు కేంద్రములను స్థాపించిరి. మన దేశములో సుమారు 20 లక్షల చరకాలు పనిచేయుచుండెను. చరకాలతో తయారు చేయబడిన నూలుతో నేయబడిన ఖాదీవస్త్రములను దేశమునందున్న సత్యాగ్రహసేవికలద్వార అచ్చటచ్చట విక్రయింపబడుచుండెను.

అసహాయోద్యమ ఆందోళనకు పునాదిగా గాంధీజీ అస్పృశ్యతావర్జన, సాంప్రదాయికసద్భావము, ఖాదీప్రచారముద్వారా దేశవాసులను అహింసాసత్యాగ్రహమునకు యోగ్యులనుగా గావింప నారంభించెను. దేశవాసులహస్తములకు అస్త్రముల నందించి ఆయన ఇంగ్లీషుసర్కారువారిని యుద్ధమున ఆహ్వానించెను. భారతీయులు అసహాయోద్యమ సంగ్రామములో నిమగ్నులైరి. విదేశవస్త్రములు వస్తువులు మహాడంబరముతో విసర్జింపబడుచుండెను. అనేకమందిభారత సర్కారువారి ఉద్యోగస్థులు సర్కారువారి ఉద్యోగములను విసర్జించిరి. విద్యార్థులువిద్యాలయములను, కాలేజీలనుబహిష్కరించిరి. అనేకస్థానములలో కార్మికులు మిల్లులలో పని చేయుట మానివైచిరి.

1921 వ సంవత్సరము నవంబరు 17 వ తేదీన ఇంగ్లాండునుండి "ప్రిన్సు ఆఫ్ వేల్సు" యువరాజు భారతదేశమున కేతెంచిరి. ఆంగ్లేయుల పరిపాలనము యెడల, ఆంగ్లరాజు యెడల భారతీయుల హృదయసంక్షోభమును వెల్లడిచేయుటకు ప్రిన్సు ఆఫ్ వేల్సుగారి ఆగమనదినమున సమస్తభారతదేశమునందును హరతాళము అవలంబింపవలయునని జాతీయ మహాసభ ప్రకటించెను. మహాసక్త దేశమును భారతీయులు అక్షరాలా పాలించిరి. నవంబరు 17 వ తేదీన భారతదేశ పట్టణములలోని ప్రతిదుకాణము, ప్రతిబజారు, ఆఫీసులు,— కర్మాగారములు, బండ్లరాకపోకలు మొదలగునవన్నియు బంధింపబడెను. సంక్షుభిత భారతీయులు హరతాళపాలనము వలన ఆంగ్లరాజరికముపై తమహృదయము పూర్ణమైన క్షోభమును, అభియోగమును, సుస్పష్టముగా తెలియజేసినట్లాయెను.

సర్కారువారు విశేషకోపావేశులైరి. విదేశవస్తు బహిష్కరణమువలన వ్యాపారస్థులగు సర్కారువారి వస్తు సామగ్రులు ధ్వంసము కాజొచ్చెను. సర్కారువారికి చెందినట్టి, చెందనట్టి కార్యములలో ప్రజలసహాకారలోపమువలన పరిపాలనములో అనేకయిబ్బందులు, అనియమములు కలుగుచుండెను. దానిపైన రాజపుత్రునకు అవమానము కలుగుటచేత సర్కారువారి గౌరవమునకు భంగము కలిగెను.

క్రోధావేశపూరితులైన సర్కారువారు విశేషముగా అరెస్టులు చేయ నారంభించిరి. పెద్దలును, గౌరవనీయులునైన నాయకులు కారాగారములలో త్రోయబడిరి. దేశబంధు చిత్తరంజన్, పండిత మోతీలాల్ నెహ్రూ, సుభాస్‌చంద్రబోసు మొదలగువారు కారాగారములో పెట్టబడిరి. నాయకులను బంధించుటయేగాక సాధారణ భారతీయప్రజలనుసహా సర్కారువారు గుంపులు గుంపులుగా పట్టుబడుచుండిరి. సర్కారువారి శూన్యకారాగారములు అసంఖ్యాకములైన సత్యాగ్రహుల ద్వారా పరిపూర్ణము లగుచుండెను.

సర్కారువారి యీదమననీతివలన విపరీతఫలితమే ఫలించుచుండెను. సర్కారువారి అత్యాచారములవలన విచలితులై చంచలులై అనేకమంది భారతీయ ఉద్యోగస్థులు శాసనవిభాగము నుండి పదవులను విసర్జించిరి. తుదకు సర్కారు వారు విరక్తులై గాంధీజీవద్దకు రాజీప్రతిపాదనమును పంపించిరి. సర్కారువారు జాతీయమహాసభతో సమ్మిళితసంప్రదింపులను చేయుటకు యేర్పాట్లు గావించెను.

సర్కారువారు నాదేశీయులను లక్షలకొలది ప్రజలను అన్యాయముగా కారాగారములలో బంధించిరని గాంధీజీ వినమ్రముగా విస్పష్టముగా తెలియజేసెను. వారిని విడుదల చేయ వరకు నాహృదయముఅన్యాయముతో రాజీసంప్రదింపు

లను జరుపజాలదు. సర్కారువారు హృదయపూర్వకముగా రాజకీయుద్యమ నుద్దేశించినచో ముందు ఖైదీల నందరిని వినాషరతుతో విడుదలచేయవలయును. తమ అన్యాయములను, పొరపాటును అంగీకరింపవలయును. పిమ్మట రాజీబేరమునకు ముందుకు రావలయును, అసత్యమును హృదయమునందిడుకొని నచో న్యాయసత్యము లెన్నటికిని ప్రతిష్ఠింపబడజాలవు.

అసహాయోద్యమఆందోళనములో దేశవాసుల ఐక్యత సమ్మిళితప్రయత్నములు పరికించి గాంధీజీ ఆశాన్వితులైరి. దేశములోని సామాన్యప్రజలు ఆందోళనముద్వారాఅహింస ప్రతిఘటనయొక్క అర్థమును, కార్యక్రమమును గ్రహింప గలిగిరని గాంధీజీ తలంచెను. హింసను త్యజించి శాంతివిగ్రహములతో ఆంగ్లపరిపాలనమును వికలపరచుటయొక్క క్రమశిక్షణమును, ప్రబోధమును పొందియుండిరి. ఈఅసహాయోద్యమమునుండియే సత్యాగ్రహమును సృష్టింపవలయునని ఆశాన్వితుడైన గాంధీజీ తలంచెను. ఈసంక్షోభముద్వారానే శాసనబహిష్కార కార్యక్రమమును సాగింప సమకట్టెను.

అందువలన గాంధీజీయిట్టులఘోషించెను. సర్కారు వారికిహృదయపరివర్తనము కలుగకున్నచో సంగ్రామమును యింకను తీవ్రతరముగావింప సంకల్పించెను.

కాని రోజులు గడచి పోవుచుండెను. సర్కారువారికి హృదయపరివర్తనము కలుగలేదు. అత్యాచారములు, దమన నీతి అధికమగుచుండెను. కొన్నికొన్ని స్థానములలో శాంతముగా జరుపుకొనుచున్న సమ్మెదారులపై తుపాకిగుళ్ళను వర్షింపజేసిరి. విద్యార్థులపై లాఠీచార్జి చేయబడెను. స్త్రీలు అవమానింపబడిరి.

గాంధీజీ నిరాశజెంది సమస్తభారత దేశమునందును ప్రచారముచేసిన దేమనగా—పత్రికలచేసిన ఏడుదినముల పిమ్మట బొంబాయిప్రదేశము లోని బార్డోలీ తాలూకాలో బార్డోలీరైతులతోను, తనసత్యాగ్రహవ్రతధారులగు సహకారులతోను అహింసాపూర్వకమైన శాసన బహిష్కారాందోళనము ఆరంభించబడును. కాని శాసనబహిష్కరణమునకు ముందు ప్రపంచములోని ప్రథముడును, శ్రేష్ఠుడును నైన సత్యాగ్రహి తనసత్యాగ్రహధర్మపాలనములో ఉద్యుక్తుడగును. భారత పరిపాలనాధికారులకు తనసంకల్పమువిషయమై విస్పష్టముగా ఉత్తరముద్వారా తెలియజేసెను. 'సర్కారువారు దుర్నీతి అన్యాయముల చేత కళంకితమైయున్నారు. వారిపై నేమాత్రమును గౌరవమునుగాని, సానుభూతినిగాని ప్రదర్శింపను, నేడు సర్కారువారుసకలభ్రమప్రమాదములను సంస్కరించుటకు సమయమేతెంచినదని యీశాసనబహిష్కారమువలన నేను సర్కారువారికి తెలియజేయతలంచుచున్నాను. సర్కా-

రవారు తామాచరించిన అన్యాయములకు ప్రతీకారముగా శాసనబహిష్కారణమును ఆరంభించుటకు నుంచే ప్రతినిధులను విడుదలగావించి, వారితో రాజీప్రయత్నములు సలిపి అన్యాయములకు నష్టపూర్తి చేయవలయును.'

వినమ్రుడగు సత్యాగ్రహి గావించిన యీస్పష్టమైన ఆవేదనమువలనకూడ భ్రాంతులగు ఆంగ్లేయసర్కారు వారిలో యెట్టిపరివర్తనము కలుగలేదు. గాంధీజీ శాసనబహిష్కారణ దినము ఆసన్నమాయెను. భారతదేశములోని యీ అపూర్వమైన, అభినవమైన సంగ్రామమును దర్శించుటకై ప్రపంచవాసులందరు ఆవేశదృష్టితో విస్మయదృష్టితో స్తబ్ధులై చూచుచుండిరి.

శాసకుల అత్యాచారములు, పీడనములకువిరుద్ధముగా గాంధీజీ తనకు ఆఫ్రికాలో కలిగిన అనుభవమువలన సత్యాగ్రహఅస్త్రములు ప్రయోగింప సంసిద్ధులైరి.

---

లోనిఅర్థమును గ్రహింపలేకపోయిరి. బ్రిటిషుసామ్రాజ్య ప్రతి హింసాత్మకమైన, నీచమైన ప్రతిహింసా కార్యమును సాగించెను.

గాంధీజీ అనుతప్తహృదయముతో, ప్రశాంతముగ స్వస్థతో ఆలోచించుచుండిరి. విశేష ఆలోచన, చింతనముల గా చింతించినపిమ్మట విశేషముహూర్తాన అంతర్యామి మంగళాదేశ మును పొందెను. ఆయన భారతీయులకు స్పష్టముగా చెప్పిన దేమనగా — శాసనఉల్లంఘనము, సత్యాగ్రహము సాగింప రాదని తాత్కాలికముగా విరమించెను. యుద్ధసేనా యకునిముఖతః ఆసమయములో యుద్ధవిరమణవార్తను విని భారతీయులందరును విస్మయమొందిరి. భారతీయులలో ఉ త్సాహము, అసంతోషము ప్రబలెను. నాయకులు, కార్య కులు ఫిర్యాదుచేయుచుండిరి. సంగ్రామమును నిలిపివేయుటచే ఆశాపూర్ణప్రజలు గాంధీజీపై దోషారోపణ చేయ మొద లిడిరి.

గాంధీజీ అందరిఫిర్యాదులకు జవాబొసంగెను. దేశ వాసు లింకను అహింసానిగ్రహములను స్వీకరింపలేకపోయిరి. నేను దేశాత్మకు అహింస, నిగ్రహము, ప్రేమనుగురించి బోధించుటకు అగ్రసరుడ నగుదును. దేశము అహింసకు యోగ్యమైనదిగా తలంచితినేని అప్పుడు మరల సత్యాగ్రహ మును ఆరంభించెదను.

ఆయనయిచ్చిన యీకైఫీయతువలనకూడ నాయకులు, ప్రజలు సంతృప్తి చెందలేదు. దేశము ఉత్సాహములో నిమ

గ్రస్తమై యున్నది. [illegible] ఉద్యమోత్సాహము అది పోయినది, కొన్ని మతముల కలహములు కక్షసాధకమైన కొనసాగెను. ఇట్టి స్థానములో జరిగిన హింసాకాండ సంఘటనల వలన [illegible] దేశమునందు ఉద్యమమును ఆపివేయుట యుక్త మని [illegible] నుండ లేదు. గాంధీజీ చలించలేదు. అనంతప్రయత్నముతో మరల యిట్లు నుడివెను— "సమరక్షేత్రములో సైనికులమనస్సులలో అహింసయే విరాజిల్లవల యును. ఒకే పూర్వప్రసంగం దుష్టహింసమైనను శాసనబహిష్కారసంగ్రామమును కలుషితముగాను, పదభ్రష్టముగా చేయగలదు. చౌరీచౌరాలో స్థానికమైన హింసకూడ నా హృదయమును అనుబిస్తముగాను, వ్యథితముగాను గావించెను. ఈ అనుతాపము నాహృదయమును భగ్నము చేయుచుండుటవల్లనే నేను ఈ సంగ్రామమును విరమించుచున్నాను. దేశవాసు లింకను పూర్ణఅహింసామార్గమున నడచుటకు అలవాటు పడలేదని నేను తలంచుచున్నాను. సర్కారువారిరక్తనేత్రములకు భయపడువాడను కాను. కాని ప్రజలలో క్రమశిక్షణ లేక పోవుటచూచి నేను బాధపడుచుందును. అసహయోద్యమసాఫల్యత పరిపూర్ణమైన నిగ్రహముపై ఆధారపడి యుండును. క్రోధమునుండి క్రమశిక్షణహీనత యేర్పడుచున్నది. సత్యాగ్రహములో హింస లవలేశమున్నను జరుగ నేరదు. అహింసాసంగ్రామములో హింస అనగా వెనుకకు నడచుట, జీవితమును నిరర్థకముగా వ్యర్థముచేసుకొనుట."

స్వభ్రాంతి అను శీర్షక క్రిందనైన 1922 వ సంవత్సరము నాటి 'యంగ్ ఇండియా' లో ఒక వ్యాసమును వ్రాసియుండిరి, ఆయన వ్రాసిన విషయములు — "భారత దేశములో ఇంకను సత్యఅహింసల వాతావరణ నిర్మాణము కాలేదు. భగవానుడు నన్ను జాగరూకునిగా చేసినాడు. సత్య అహింసలే సత్యాగ్రహమును న్యాయసంగతముగా చేయ గలవు. ఈ శాసనబహిష్కరణ శాంతరూపము, సత్యరూపము. వినమ్రము, జ్ఞానయుతమునై, స్వేచ్ఛాకృతమై, ప్రీతిపూర్ణమై తృణీకారభావశూన్యమై, నిరపరాధమై విరాజిల్లినప్పుడే Civil అని చెప్పుటకు వీలగును. ఈయుక్తి ననుసరించి, నావిచారణననుసరించి భారతీయులు గొప్పపొరపాటు గావించినారని అంగీకరించుచున్నాను. అందువలన నేను సాధారణ ప్రజల శాసనబహిష్కరణమును నిలిపివేయుటయేగాక, నేను స్వయముగా బహిష్కరించుట కూడ నిలుపుచేసితిని. భగవానుడు బొంబాయిసంఘటన ద్వారా నన్ను జాగరూకునిగా గావించినాడని నేను గ్రహింపగలుగుచున్నాను. ఆయన చౌరీ చౌరాదుర్ఘటనవలన ఆయన నాకు ప్రత్యక్షముగా చూపించి నాడు. అందువలన బార్డోలీలో జరుగవలసిన సత్యాగ్రహమును నిలుపదలచేసితిని. దేశము దీనిద్వారా లాభమునే పొందగలదు. ఈవిషయములో నా కెట్టిసందేహము లేదు. ఆందోళనము ఆపివేయుటచే భారతదేశము సత్య, అహింస

లను నిస్సత్వముగా నుండగలదు." గాంధీజీ విశేషమైన ఆలోచనలు గావించి సత్యాగ్రహమును విరమించెను.

దేశవాసులు కొందరు ఆయనను చంచలుడని నిందించిరి. కొందరు గాంధీవాదమునకు విరుద్ధవాదము నవలంబింప నారంభించిరి. సర్కారువారు ఇంతకాలము నిశ్శబ్దముగా నుండిరి. గాంధీజీకి విరుద్ధమైన ప్రతిక్రియలను చూచి, భ్రాంత భారతవాసుల అప్రయత్నములవలన గాంధీజీకిగల జనప్రియత అధికముగా తగ్గిపోవుచుండెనని గ్రహించిరి. ప్రజలలో గల యీవిరుద్ధ మనోభావమును సర్కారువారు అవకాశముగా గైకొనిరి. ఈసారి సత్యాగ్రహమునకు, అసహయోద్యమమునకు నాయకశ్రేష్ఠులైన గాంధీజీని అరెస్టుచేయుటకు సంకల్పించుకొనిరి.

గాంధీజీ చౌరీచౌరాహింసకు ప్రాయశ్చిత్తము చేసుకొన సంకల్పించుకొనెను. ఆయన మరల దేశవాసులకు తెలియజేసిన విషయము—"నేను శుద్ధిని పొందవలయును. నాసత్యములో గభీరతరమైన సత్యము, దీనత్వము ఉండుగాక. హింసాశుద్ధికై నేను నిరశనవ్రతము నవలంబించుటకంటె శ్రేష్ఠమైనదిలేదు. నావాదమును, సత్యమును, అవలంబించి, అసత్యమును, హింసను ప్రకటించినవారి అపరాధములకొఱకే నేను ఉపవాసవ్రతము నవలంబించుచున్నాను. వారిపాపములకు శిక్షను నేనే అనుభవింపనిశ్చయించుకొంటిని. భావి ఆందోళనము హింసాపూర్ణముగాను, హింసకు

అగ్రిదూతగాను కొనియాడుచున్నట్లు సర్వవిధములైన వేదనలను
ఉక్కపీడనములను, దేశమునుండి తరిమివేయుటకు నుండగాను
సహా వరించుటకు సంసిద్ధుడను" అను తప్త హృదయముతో
5 దినములు ఆహారమును గైకొనక తనకతినోపవాసవ్రతము
వలన ఉన్మత్తులగు దేశవాసులకు మార్గమును ప్రదర్శించెను.

ఈ స్వేచ్ఛాకృతోపవాసము గాంధీజీ జీవితములో ఒక
విశేషమైన వైశిష్ట్యము. ఉపవాసముద్వారా ఆత్మశుద్ధిప్రణా
ళిక సత్యసంధాతయగు మహాత్మునికి అభినవ ఆచరణము!

ఇంతలో సర్కారువారుకూడ సిద్ధపడిరి. అస్త్రధారు
లగు పోలీసులు అహంకారపూర్ణపదవిక్షేపముతో సబర్మతీ
ఆశ్రమములోని హింసాశూన్యప్రశాంతనీరవత్వమును భంగ
పరచిరి. వారు ఆశ్రయమునకువచ్చి అహింసావిగ్రహమును
అరెస్టుచేసిరి. 'యంగ్ ఇండియా' లో ఆంగ్లపరిపాలనవిషయ
ములో కొన్నినేరారోపణములను గావించి ప్రకటించిన వ్యాస
ములకు అరెస్టుచేయబడితిరని తెలియచేయబడెను.

సీరసమానవుడు హాస్యోజ్జ్వలవదనముతో పోలీసులతో
పోవుటకు సంసిద్ధుడాయెను. శలవుతీసుకొనుసమయములో
ఆశ్రమవాసు లందరును ఆయనసమక్షమున కేతెంచిరి. వారి
జయముకొరకు ప్రార్థించిరి. అప్పుడు నాజీవితాదర్శములే
నాసందేశమని ఆయన నుడివెను. నన్ను అరెస్టుచేయుటవలన
మీరు కోపగించవలదు. నాప్రియమైన దేశవాసులు కోప
గించకూడదు. మీరు పరిపూర్ణమైన నిగ్రహము నవలంబించ

దినమును, క్రోధమునకు బదులు నా అరెస్టుదినమును ఉత్సవ దినముగా చేసుకొనుడి. నేను అసహాయోద్యమమునకు మూలకారణ మన్నారు. అందువలన సర్కారువారు నన్ను ప్రజలనుండి దూరముచేసి భారతదేశవాసుల శక్తిసామర్థ్యములను గ్రహించుటకు ఉద్యుక్తులై యున్నారు. హింసాపూర్ణమైన ఈ ప్రతిద్వంద్వమును భారతీయులు అహింసద్వారా స్వీకరింపవలయును. నిశ్చలభావముతో పూర్ణశాంతిని రక్షించుడి. నా అరెస్టువలన ప్రజలు క్రోధమును ప్రకటింపక శాంతముతో, స్థైర్యముతో, నిర్మాణకార్యక్రమమును పాలింపుడి. కాని పెట్టిఅల్లరులుగాని, హరతాళములుగాని, సర్కారువారితో సహకారముగాని జరుగకుండ చూడవలయును. నేను లేకపోయినను పనులుచక్కగా నెరవేరగలవు. సంపూర్ణ శాంతితో క్రమపద్ధతితో పాలింపవలయును. ప్రజలు నావాదమును గ్రహించినయెడల జయమును పొందుదురు. లేనియెడల ఆపజల నెదుర్కొనవలసివచ్చును. పోలీసులు గాంధిజీని తోడ్కొని పోయిరి. కాని గాంధీజీసందేశము దేశమంతయు వ్యాపించెను. సర్కారువారు ప్రపంచవాసులకు చూపించుటకై మహాడంబరముతో విచారణ ప్రహసనమునకు ఏర్పాట్లు గావించిరి.

మార్చి 18 వ తేదిన విచారణ జరిగెను. సర్కారు వారిపక్షమునుండి వారిపై నేరారోపణ చేయబడెను. ఆయన 'యంగ్ ఇండియాలో' అభ్యంతరకరమైన మూడువ్యాసములను ప్రకటించిరి—దానిలో ఆంగ్లపరిపాలనము నాశనము

చేయు విషయమై ప్రజలలో ఉద్రేకము కలిగించునట్లు, వారు బడియుండెను. వారు వ్యాసములలో ఒకటి రెండు గోష్ఠి అత్యంత అపరాధజనకములని అభిప్రాయమును తెలియజేసెను. ఒక దానిలో గాంధీజి వ్రాసిన విషయములు— "సర్కారువారు హత్యలు, అగ్నికాండలు, అత్యాచారములు నివారించుటకు అధికారులు ఈ అధికారమును రుజువుచేయుటకు వారు సమగ్రదేశమును హత్యలు, అగ్నికాండలు, అత్యాచారములలో ముంచివేయ కోరుచున్నారు."

మరియొక వ్యాసములో ఆంగ్లేయ అధికారుల అహంకారపూర్ణ ఆజ్ఞలకు విరుద్ధముగా వ్రాసినది— "బ్రిటిషుసింహము మన ముఖముపై తన రక్తమయ గోళ్ళను ఆడించుచున్న యెడల దానితో మనకు రాజీ యెట్లు కుదురగలదు? బ్రిటిషుసామ్రాజ్యము శారీరక దుర్బలులను పీల్చివేయుచున్నది. పశుశక్తిని ప్రకటించి ప్రతిష్ఠితమై యున్నది. విశ్వమునకు శాసనకర్తయని న్యాయవంతుడగు విధాతయున్న యెడల అది యెన్నటికిని నిలువజాలదు. 1920 వ సంవత్సరములో ఏయుద్ధ మారంభమాయెనో, ఆయుద్ధము నెలయైనను, సంవత్సరమైనను, లేక బహుసంవత్సరములైనను, ఆఖరువరకు జరుగును. ఇప్పుడు బ్రిటిషుప్రజలు దానిని గ్రహించుసమయము మేతెంచినది. తుదివరకు అహింసతో నుండుటకు తగిన సమర్థను, శక్తిని భారతదేశమునకు ఉండుగాకయని ప్రార్థించుచున్నాను."

మరియొకస్థానములో వ్రాసిన విషయము— "మనకు స్వరాజ్యము కావలయును. సర్కారువారు ప్రజలవద్ద శిరములను నతము చేయవలయును."

గాంధీజీ రాజద్రోహ నేరమును ప్రశాంతచిత్తముతో అంగీకరించెను. ఆయన అత్యంతవివేకముతోను, సంపూర్ణ శాంతితోను సర్కారువారికి విరుద్ధముగా దేశమును అహింసాసంగ్రామములో ప్రవేశపెట్టుటకు ప్రోత్సాహపెట్టె ననియు, సర్కారువారి అత్యాచారములు, ఉత్పీడనములు అంతమొందనంతవరకు యీసంగ్రామమునకుగూడ అంత ముండదని ఆయన తెలియజేసెను. 'నేను నాకర్తవ్యమును నెరవేర్చితిని. అందువలన నేను ఎట్టిలఘుశిక్షనుగాక కఠినతమ మైన శిక్షనే స్వీకరించుటకు సంసిద్ధుడనై యున్నాను. నేను దయను కోరుటలేదు. కఠినతమశిక్షను మహదానందముతో స్వీకరించుటకు సిద్ధపడియున్నాను.''

గాంధీజీకి రాజద్రోహనేరమునకై 6 సంవత్సరముల కారాగృహవాసశిక్ష విధింపబడెను.

విచారణ అభినయము అంత మొందెను.

సత్యప్రేమాదర్శములపూజారిని ఆయనస్నేహితులు, అనుచరులు, సహచరులు, సహాకారులు, అనురక్తులు కన్నీటితో ఆయనకు వీడ్కోలు నిచ్చిరి. సత్యాగ్రహియైన మహాత్మాజీ స్నిగ్ధహాస్యోజ్జ్వలవదనముతో దేశవాసులవద్ద శెలవు గైకొనిరి. స్థిర, ధీర, పదవిక్షేపములతో కారాగార అపరాధులయానములో నెక్కి కూరుచుండిరి. కారాగారలోహ ద్వారములు హింసాగర్జనములతో బంధింపబడెను.

—:0:—

# 47

# కారాగారము - ధ్యానసిమగ్నమహాత్ముడు

గాంధీజీ ప్రథమముగా సబర్మతీజైలుకు పంపించబడిరి. ఆయన ఉండుటకు ప్రత్యేకగృహము ఒసగబడెను. ఆగృహముతో ఇతరఖైదీలకు ఎట్టిసంబంధము లేకుండెను. ఆగృహమునకు ఇతరఖైదీలు రాకపోకలు చేయుటకూడ అధికారము లేకుండెను.

గాంధీజీ దీనిని గ్రహించి తెలియజేసిన దేమనగా— మానవులనుండి వేరై నే నిచ్చట వసింపజాలనని నుడివిరి. కారాగారలోహపంజరములో బంధింపబడిన ఖైదీలవలెనే తనదికూడ ఒకేవిధమైన పరిస్థితి యైనప్పుడు తాను వేరుగా నుండవలసిన కారణ మేమునిప్రశ్నించెను ? ఆయన అందరితో పాటు సాధారణఖైదీలతో సాధారణభావముతో వసించ కోరెను.

ఆయనపట్టుదలయే ఫలించెను. ఆయన సాధారణఖైదీలలో వసించుటకు అంగీకారమును పొందెను.

భయంకరమైన బాధలతో నిండిన నరకము...నరకకష్టములవలన పాపులగు జీవగణము ఆర్తనాదములు చేయుచుండిరి.

నరకపురికి స్వేచ్ఛాపూర్వకముగా దేవర్షి నారదులు ఏతెంచిరి. పాపులవద్దకు ఏతెంచెను. వారిని ఆదరించెను. మధురవీణాస్వరములతో హరినామమధురగానములను వారి కంఠములలో ప్రవేశపెట్టెను.

పాపులు ఆయన పవిత్రస్పర్శచేత, హరినామమాహాత్మ్యముచేత పవిత్రులైరి.

వారు నరకమునందు నసించుచున్నను నరకమునుండి ఉద్ధరింపబడుటకు శక్తిని పొందిరి.

ఇంగ్లీషుప్రభుత్వమువారి బాధల కారాగారము, కారాగార లోహశృంఖలములచేత బంధింపబడిన ఖైదీలు ఆర్తనాదములు గావించుచుండిరి. కారాగారఖైదీలలో, స్వేచ్ఛాపూర్వకముగా గాంధీమహాత్ము డవతరించెను.

సాధారణఖైదీల సంస్పర్శలోనికి వచ్చిరి. వారిని ఆదరించిరి—

ప్రవర్తన, ఆచరణ, వాదములవలన వారికి నిగ్రహము, దుఃఖసహనము విషయమును గురించి అపూర్వసందేశమును ప్రసాదించిరి.

పవిత్ర ఆచరణమువలన, పవిత్ర సందేశములవలన వారు శుద్ధి చెందుచుండిరి. దుఃఖములను సహించు శక్తిమంత్రమును పొందిరి. కారాగార బాధలనుండి ఉద్ధరింపబడుశక్తిని సంపాదించుకొనిరి.

గాంధీగారి యీ ఆచరణమువలన కారాగార అధికారులు భీతిల్లిరి. ఇట్లు తలంచిరి—"ఈయన సామాన్యమానవుడు కాడే! కారాగారములోని దుష్టులను, పశుతుల్యులనగు ఖైదీలను ఇతని పవిత్రులనుగా చేయుచున్నారే!" భీతిచెంది [illegible] ఆయనను మరల వేరుచేసిరి. ఇతరసాధారణఖైదీ

లకు సహా రాజద్రోహమంత్రమును బోధించుచున్నారనియు, అందువలన వేరుగా నుంచవలయుననియు ఆయనను తెలియ జేసిరి.

గాంధీజీని హాస్యోక్తుల, రహస్యములయు, శీఘ్ర శాంత మానవుని వారు వేగిగృహమునకు పంపించియు తృప్తి పొందక పోయిరి. వారు ఆయనను మరియొక కారాగారమునకు పంపిరి.

బాహ్యమానవు లెరిగిన ఆచరణములను మారవము అజ్ఞాతిలో హాకారా రాగారాంత రాళమున భారత దేశ అహింసా మంత్రఋషి అజ్ఞాతజీవనయాత్రను గడపుచుండెను.

ఈ అజ్ఞాతవాస కాలమునందే మహాత్మాగాంధీ లేక "ఆత్మచరిత్ర"ను రచించిరి. ధ్యాననిమగ్నుడగు తాప సోత్తముడు తన జీవనసంఘటనములద్వారా సత్యముయొక్క యేపవిత్రాలోకమును దర్శించెనో, అసత్యాదర్శనేతిహాసమును తనజీవచరిత్రలో వర్ణించిరి.

కాని అత్యాచారులగు దానవులు ఎల్లప్పుడు దేవత లకు భయపడుచునే యుందురు. అందువలన దేవతలను పీడించుచుందురు. అత్యాచారులగు శాసకులు గాంధీజీకి—నిర్క్రోధుడు, శాంతుడు, సౌమ్యుడు నగు మానవునకు భయపడు చుండిరి. అందువలన ఆయనను పీడింప మొదలిడిరి. ఆయనను వారు అజ్ఞాతస్థానమునకు పంపియు నిశ్చింతగా నుండలేక పోయిరి. ఆయనను పీడించుచుండిరి. ఆయనను దస్యులకు తస్క-

కులకు యోగ్యమైనస్థానములో నుంచిరి. ఆయనను నికృష్ట మైన, అనారోగ్యకరమైన స్థానములో బలవంతముగా నుంచిరి.

గాంధీజీ యీశిక్షను ప్రశాంతమనస్సుతో స్వీకరించెను. కాని ఆయన దేహము దీని సహింపలేకపోయెను. 1917 వ సంవత్సరము విరోచనములవ్యాధి కలిగినప్పటినుండి ఆయన శరీరము దుర్బలమగుచుండెను. అనవరతపరిశ్రమవలన యీ దౌర్బల్యము తొలగిపోలేదు అదిగాక కారాగృహము లోని యీకష్టములు, అత్యాచారములు దేహమును దుర్బల పరచుచుండెను. దుర్బలశరీరమును రోగము సులభముగా ఆక్రమించెను. గాంధీజీ కష్టకరమైన, ఆపత్కరమైన 'అపెండిసైటిస్' అనుజబ్బుచే బాధపడుచుండిరి. ప్రథమమున సర్కారువారు ఎట్టిశ్రద్ధను వహించలేదు. ఆరోగము క్రమముగా వృద్ధియగు చున్నప్పుడు సర్కారువారు భీతిచెందిరి. ఈవిషయము రహస్యముగా ఉంచినను, గాంధీజీపరిస్థితులు విషమించినను ప్రజలు క్రోధావేశపరులగుదురని తలంచిరి. అందువలన భీతిచెందిన సర్కారువారు ప్రజలవిమర్శలకు భయపడి గాంధిగారివ్యాధిని గురించి ప్రకటన గావించిరి. అత్యాచారములు గావించిన పిమ్మట సంబరముతో చికిత్సకు తగిన యేర్పాటులు గావించిరి. నిష్ణులగు వైద్యులద్వారా ఆయనకు అస్త్రోపచారముగావించిరి. గాంధీజీ వ్యాధివిముక్తుడయ్యెను.

దేశవాసులు చంచలులైరి. వారు గాంధీజీని త్వరలో ఏనామరతులతో విడుదలచేయుటకు భారతదేశ ఆకాశవాతా

శమును ముఖరితము చేయుచుండిరి. భారత దేశములోని వార్తాపత్రికలన్నియు గాంధీజీ బంధింపబడినందుకు విరుద్ధముగా తీవ్రమైన ప్రజాభిప్రాయమును ప్రకటించి ప్రచారము చేయ మొదలిడినవి

సర్కారువారు ప్రజలకోరికలను అంగీకరింప బాధ్యులైరి.

గాంధీజీ 1924, ఫిబ్రవరి 5 వ తేదీన వినామరతులతో విడుదల చేయబడిరి.

గాంధీజీని కొంతకాలము విశ్రాంతితీసుకోమని నాయకులందరును వేడుకొనిరి. విశ్రాంతి తీసుకుని ఆరోగ్యమును బడయనియెడల, వృ్రుతశక్తిని పునరుద్ధరణ చేసుకొనినయెడల దేశవాసులకు ఏ విధమైన సేవను చేయజాలనని ఆయన గుర్తించెను. ఆరోగ్యము పొందునిమిత్తము బొంబాయిప్రదేశములోని 'జుహూ' అను ఆరోగ్యకరమైన స్థానమునకు గాంధీజీ బయలుదేరిపోయెను.

'జుహూ' భారత దేశములో తీర్థక్షేత్రముగా పరిణమించెను.

దేశబంధు, చిత్తరంజన్ దాసు, పండిత మోతిలాల్ నెహ్రూ, పండితమదనమోహనమాలవ్యా, అలీసోదరులుఅబ్బాస్ తాయెబ్జీ మొదలగు భారతదిక్పాలకు లందరు భావికార్యక్రమమును నిర్ణయించుటకు గాంధీగారివద్దకు రాకపోకలు చేయుచుండిరి.

గాంధీజీ లేమివలన దేశములో మరియొక ప్రతిక్రియ కూడ కార్యము లొనర్చుచుండెను. శాసనబహిష్కరణ, అసహాయోద్యమములకొరకు దేశములో నాయకుడు లేకపోవుటచేత, కొందరు సహయోగవాదులు దేశద్రోహులగు సర్కారువారితో సహకరించుటకు విశిష్టసర్కారుపదవులను స్వీకరించిరి అనేకమంది మితవాదులుకూడ సర్కారువారికార్యములలో సహాయము చేసి వారిశాసనవ్యవస్థలను దృఢతరముగాను, కఠోరముగాను గావింప ప్రయత్నించిరి. కాని గాంధీజీ నాయకులు విడుదలయైన తరువాతనుండి యీ ప్రతిక్రియాశీలుర విశ్వాసఘాతుకత సమూలముగా ధ్వంసమాయెను. ప్రజలు వీరిస్వరూపమును గ్రహించి వీరిని వర్జించిరి. గాంధీజీకూడ మహాసభ ఆదర్శనములవలన అనుప్రాణితుడై మరల నూతనకర్మమార్గములలో నిమగ్నుడయ్యెను.

గాంధీజీ ఆదర్శములకు విరుద్ధమైన మరియొక ధ్వంసాత్మకమైన ప్రతిక్రియకూడ ఆయన లేనికారణముచేత సామ్రాజ్యవాదులగు సర్కారువారు సమస్తదేశమునందును వ్యాపింపజేసిరి. హిందూమహమ్మదీయసాంప్రదాయముల సంఘర్షణమునుగురించి యిచట వివరించుచున్నాము. భారతదేశ హిందూమహమ్మదీయులు ఐక్యతాబద్ధులై కార్యక్షేత్రమున అగ్రసరులైనయెడల వారిసామ్రాజ్యమునకే ముప్పువాటిల్లునని సర్కారువారు అసహాయోద్యమ ఆందోళనమువల్ల స్పష్టముగా గ్రహింపగలిగిరి. అందువలన వారు ఇలా

పత్, జాతీయమహాసభల సమ్మేళన కార్యక్రమమునందును, మహాత్మాగాంధీగారి సమ్మేళన, ప్రేమసందేశముల ప్రచార కార్యకలాపములయందును భీతిజెందిరి భారత దేశములోని హిందూమహమ్మదీయు లనెడి రెండుగొప్పసాంప్రదాయములలో భేదములను, కలహములను సృష్టింపగలిగిన యెడల హిందూమహమ్మదీయులు పరస్పరద్వంద్వములలో, సంఘర్షణములలో మునిగిపోవుదురు. అట్లైనయెడల భారతదేశములోని విశాలజనసంఘముయొక్క ఐక్యత, సమ్మేళనముల గ్రంథులు భిన్నమై పోగలవని గ్రహించిరి. ఒక స్వాతంత్ర్యకామియగుజాతి సాంప్రదాయకద్వంద్వములలో ఉన్మత్తులైన యెడల వారు స్వాతంత్ర్యసంగ్రామమును విసర్జించి, ఆత్మఘాతుకమగు సంగ్రామములో ప్రవృత్తు లగుదురు. అటులైన యెడల ఆంగ్లశాసనము ఆపదలనుండి విముక్తమగును. భారతదేశము స్వాతంత్ర్యమును పొందుఆశకూడ సుదూరపరాహతమగును. చతురులగుసర్కారువారు నాయకుడులేనిప్రజలలో యీర్ష్యాద్వంద్వబీజములను నాటిరి. ప్రతిక్రియాశీలురును స్వార్థులును నైన సాంప్రదాయికనాయకులను, ప్రతిష్ఠానములను సృష్టిజేసిరి. హిందువులను మహమ్మదీయులకు విరుద్ధముగా ప్రేరేపించిరి. మహమ్మదీయులను హిందువులకు విరుద్ధముగా ఉద్రిక్తులను జేసిరి. మహమ్మదీయులు దేశమునకు ఎట్టిసేవ చేయరనియు, ఫలము లభించినపిమ్మట దానిని అనుభవించుటకే ఉన్నారని హిందువులకు బోధించిరి. భారతదేశము స్వాతంత్ర్యమును పొందినయెడల మీకష్టములకు,

అపదలకు మేరయుండదని మహమ్మదీయులకు ప్రబోధించిరి. అధికసంఖ్యాకులగు హిందూసంఘమువారు సకలఅధికారములను, శక్తులను ఆక్రమించుకొని మిమ్ములను గులాములనుగా చేయుదురని కూడ తెలియజేసిరి

ధనమునిచ్చి, గౌరవమునిచ్చి, విశిష్టపదవులనిచ్చి స్వార్థపరులగు సర్కారువారు సాంప్రదాయికనాయకులను తయారు చేసిరి. ఈనాయకులు తమసంఘమునకు మంగళాకాంక్షిగను, త్రాణకర్తగను పిలుచుకొనిరి. తమసంఘమును అన్యసంఘమునకు విరుద్ధముగా సందేహజనకముగాను, ఉద్రిక్తముగాను గావించిరి. ఈసమయము లో 'మాస్లిమ్‌లీగ్' అను మహమ్మదీయ సాంప్రదాయికప్రతిష్ఠానము జాతీయమహాసభసంబంధమును తెగద్రెంపులుచేసుకొనెను. తమది ప్రత్యేకప్రతిష్ఠానమని ప్రచారము గావించెను. తమసంఘక్షేమముకొరకుమాత్రమే ప్రత్యేకముగా కార్యములొనర్చుచుండిరి. దేశస్వాతంత్ర్యము కొరకు 1917–1918 సంవత్సరములలో హిందూమహమ్మదీయులు ఏకమై సర్కారువారి తుపాకిగుళ్ళవర్షమువలన జాలియన్‌వాలాబాగులో రక్తదానముచేసియుండిరి. 1921–1922 సంవత్సరములలో అసహాయోద్యమములో కూడ హిందూమహమ్మదీయులు సమ్మిళితభావములతో స్వాతంత్ర్యసంగ్రామములో దుమికిరి. 1924–1925 సంవత్సరములలో ఆహిందూమహమ్మదీయులు మరల భ్రాంతిచేత, ఈర్ష్యచేత వేరైపోయిరి. ఏకమైన, అఖండమైన జాతివారు శాసకులకుట్రలవలన

రెండుశాఖలుగా చీలి దూరమైపోయిరి. పరస్పరులలో రక్తపాతము గావించుకొనుటకు సంకల్పించుకొనిరి. ను,

నీలాకాశమున తుఫాను చెలరేగుననుసూచనలు గానవచ్చుచుండెను. నలువైపుల సాంప్రదాయికద్వంద్వములు సంఘర్షణములు, తాండవనృత్యములు చేయ మొదలిడెను. బొంబాయి, కలకత్తా, కోహాటునగరములలో హిందూ మహమ్మదీయులకు కొట్లాటలు ఆరంభమాయెను. నలువైపుల ఆత్మఘాతుకమైన పిశాచదైత్యదానవులదళము శిరము లెత్తి నిలువబడెను. నాలుగువైపుల భ్రాతృహత్యలభేరీలు మూరు మ్రోగెను. మహమ్మదీయులు హిందువులను హత్యజేసిరి. హిందువులుకూడ మహమ్మదీయులను హత్యచేసిరి. హిందువులతో వ్యాపారము చేయుచున్న మహమ్మదీయులు హత్య గావింపబడిరి. మహమ్మదీయులను ఆత్మీయులను జ్ఞానముతో వారి యెడల శ్రద్ధచూపినవారు నరుకబడిరి. దేశములోని ఆకాశపాతాళములన్నియు సాంప్రదాయికసంఘర్షణములచేత ద్వంద్వములచేత విషాక్తమై, కలుషితమైయుండెను.

కారాగారమునుండి విడుదలయై బయటికివచ్చినపిమ్మట యీరక్తపాతము గాంచి గాంధీజీ అత్యంతవిచారగ్రస్తుడయ్యెను. ఏమహమ్మదీయసాంప్రదాయ మొకప్పుడు జాతీయ మహాసభయొక్క అసహాయోద్యమవిరమణవిషయమువినియు నిరుత్సాహపడక అసహాయోద్యమ ఆందోళనమును ద్విగుణతరతీవ్రము గావించిరో, ఏహిందుసాంప్రదాయ మొకప్పుడు

'రామ్‌రహీమ్‌నాజుజాకణ' అనుసంతోషముతో దీక్షపొంది మహమ్మదీయసోదరులను పరిక్షించుకొని స్వాతంత్ర్యసంగ్రామములో అగ్రేసరులై యుండిరో, ఏహిందూ మహమ్మదీయులు ఇంతకాలము ధర్మమును మందిరములలోను, మసీదులలోను యుంచి, బాహ్యమున ఏకజాతీయతాప్రబోధము చేత దేశములోని దురవస్థలను తొలగించుటకు సమ్మిళితభావముతో అగ్రేసరులై యుండిరో, నేడు అట్టివారిలో అనైక్యమనో భావములు పెచ్చు పెరిగిపోయెను

ఈసర్వనాశంకరమైన ఆత్మకలహములనుండి హిందూ మహమ్మదీయులను నివృత్తి చేయుటకు ఎట్టిప్రణాళిక లేదా? భ్రాంతిని తొలగించి చైతన్యమును కలిగించుటకు ఎట్టిమార్గము లేదా? సాంప్రదాయికకలహములవలన తమకు అవమానము, దురవస్థలు వృద్ధిచెందునని తెలియజేయుటకు ఎట్టియుపాయములు లేవా?

మహామానవునిహృదయములో అత్యంతకరుణాపూర్ణమైనవి, చరమమైనవి ఉపాయములు గాన్పించెను. భారత దేశములో హిందూమహమ్మదీయకలహములు, ద్వంద్వములు సమసిపోనియెడల, హిందూమహమ్మదీయ సాంప్రదాయములలో సంఘర్షణములు, హత్యలు జరుగుచుండినయెడల, ప్రాయోపవేశముచేత ప్రాణమును విసర్జించుదునని ఆయన ప్రకటన గావించెను. దేశములో కలహములు, సంఘర్షణములు చూచుటకంటె ఆయన మృత్యువు అత్యంతవరణీయమైనదని

తలంచెను. హిందూమహమ్మదీయుల పాపములకొరకు ఆయన మరణహీనప్రాణమును ఎన్నియోసార్లు సమర్పించుటకొరకు సంసిద్ధుడాయెను. ఎన్నియోసార్లు సరాశావ్యథలభారముతో ఆత్మదానమును గావించుకొన ఉద్యుక్తుడయ్యెను. అంధులమైన మనము, స్వార్థపరులైన మనము ఈర్ష్యాపరాయణులమైన మనము, ఆయన పవిత్రత్యాగ మాహాత్మ్యమును గ్రహింపజాలకపోతిమి.

గాంధీజీ అవిచలసంకల్పముతో ఢిల్లీకి వచ్చిరి. ఢిల్లీలో మౌలానా మహమ్మద్ ఆలీగారిభవనములో ఆతిథ్యమును స్వీకరించిరి. తినసంకల్పములో స్థిరసంకల్పులై సెప్టెంబరు 22 వ తేదీనుండి (1924) నిరశనవ్రతమును ఆరంభించిరి.

భారతదేశపుమూలప్రాంతమునుండి నాయకుల. దగాను మహమ్మదాలీభవనమునకు పరుగిడివచ్చిరి. మహమ్మదీయులలో ఆత్మికలహముల భయంకరపరిణామమును కల్పించుకొనకవారు గాంధిజీ ప్రక్కకువచ్చి నిలువబడిరి. హిందువులలో ద్వంద్వముల ధ్వంసకరచిత్రములను ఊహించుకొనిన వారకూడ మహామానవుని సన్నిధిని సమావేశమైరి. అందరును ఉపవాసమును విరమించమనియు, ఆహారమును స్వీకరించమనియు వినయపూర్వకముగా ఆయనను వేడకొనిరి. హిందూ మహమ్మదీయులలో ద్వంద్వము లంతమొందనిది, యీవిభేదములకు ప్రతీకారము జరుగనిది యీజీవితమును ధరించియుండ నిష్టములేదని కఠోరసంకల్పమును తెలియజేసిరి.

ఈద్వంద్వములను. విభేదములను, నివారించుటకు మార్గములను మాకు చూపుడి. దీని పరిష్కారమునకుపాయములను బోధింపుడి. నే నానందచిత్తములతో, అత్యంత ధైర్యముతో సాంప్రదాయికసమ్మేళనము, సద్భావముల సంస్థాపనకొరకు సాధ్యమైన యత్నములనన్నిటిని అవలంబించెదనని నాయకులు నుడివిరి గాంధీజీ నుడివిన విషయము మీరు పూర్వమువలె హిందూమహమ్మదీయులలో సంప్రీతిని సద్భావమును కలిగించుడి. హిందూమహమ్మదీయుల మందిరముల, మసీదుల, ధర్మచర్చల సమస్యలవిషయములో పరిష్కారము చేయుడు. హిందూమహమ్మదీయులను ఏకము చేయు కార్యములో అగ్రసరులు కండు. అటులైనచో నేను బ్రతుక నిచ్ఛగింతును. ఉపవాసమువలన ప్రాణత్యాగేచ్ఛను విరమింతును.

భారతదేశములో అనేకహిందూమహమ్మదీయనాయకులు గాంధీజీఅభిప్రాయానుసారముగా మార్గము లారయుటకొరకు ఢిల్లీలో సెప్టెంబరు 26 వ తేదీవరకు ఒకవారము రోజులు హిందూమహమ్మదీయుల ఐక్యసమ్మేళనము జరుగునట్లు ఏర్పాటులుగావించి ఆహ్వానములు పంపబడెను. సమ్మేళనములో ఉభయసాంప్రదాయముల సద్బుద్ధిసంపన్ననాయకులు ధర్మద్వంద్వవిషయములో ఒకరాజీతీర్మానమును అంగీకరించిరి. మహమ్మదీయులనమాజుసమయములో హిందువులు బాజాలు మ్రోయించి మసీదుప్రక్కన పోకూడదనియు,

మహామ్మదీయులకు ధర్మవిషయములో బాధలుకలుగునట్టి కార్యములేవియు చేయకూడదని నిర్ణయింపబడెను. మహమ్మదీయులు హిందువులమందిరములు, ఇతరపవిత్రస్థానములవద్ద గోహత్యలను చేయకూడదనియు, హిందువులమనస్సులలో ధర్మవిషయమై బాధలను కలుగజేయునట్టి కార్యము లేవియు చేయకూడదనియు నిర్ణయింపబడెను. దేశమునందున్న చిన్న పెద్దనాయకులందరును, సేవకులందరును, హిందూమహమ్మదీయులలో సమ్మేళనముకొరకు సాధ్యానుసారముగా ప్రయత్నములు చేయవలయునని నిర్ణయింపబడెను. దేశములో పర్యటన గావించి సర్వత్రసభాసమితుల నేర్పాటుచేసి రెండు సాంప్రదాయములలోసమ్మేళన, ఐక్యతాసందేశమును ప్రచారము చేయవలయును. ప్రీతిబంధనముతో బంధించుటకు పూర్ణశక్తితో ప్రయత్నించవలయును.

ఐక్యతాసమ్మేళనము ఏర్పాటుచేయుచున్నవారు తమ సంకల్పములను, ప్రయత్నములనుగురించి మహాత్మున కెరుక పరిచిరి. మహాత్ముడు అంధకారములో జ్యోతిని దర్శింపగలిగెను. ఆశాన్వితహృదయముతో ఉపవాసమును విరమించెను.

కొన్నినెలలలో మరల దేశములో శాంతిభావము స్థాపిత మయ్యెను, హిందూమహమ్మదీయులలో కలహములు యీర్ష్యభావములు తగ్గిపోయెను. గాంధీజీ జీవనసమర్పణ సంకల్పమువలన అప్పటికి సాంప్రదాయిక కలహములు నివారణమాయెను.

# 48
# చరకా—హరిజనులు—హిందూమహమ్మదీయుల ఐక్యత

1924 డిశెంబరు నెలలో బెల్గాంలో కాంగ్రెసుసమావేశము జరిగెను. ఈసమావేశమునకు భారతజాతీయమహాసభవారందరును ఏకగ్రీవముగా గాంధీజీని అధ్యక్షునిగా ఎన్నుకొనిరి. దేశవాసులు ఆయన ఆదర్శములను స్వీకరించుటకు సంసిద్ధులై యున్నారని తెలిసికొనియు, అందరును అసహాయోద్యమ ఆందోళనములో సహకారము చేయుటకు ఉద్యుక్తులై యున్నారనియు గ్రహించి, దేశనాయకులకు ఆయన హృదయపూర్వకమైన ప్రీతిని తెలియజేసెను. స్వరాజ్యవాదులను అసహాయోద్యమములోనికి ఆకర్షించుకొనిరి. ఆయన వచించిన విషయము—'నేడు ప్రత్యక్షకార్యముల బాధ్యతను అహింసాసంగ్రామమును నడుపుభారమును మీరు గైకొనుడు. రాజనైతిక కార్యములనుండి కొంతకాలమువరకు నాకు విశ్రాంతి నొసంగుడు. క్రియాపూర్వకమైన ఆందోళనములకంటె దేశములోని సాంప్రదాయిక, సామాజిక, ఆర్థిక దురవస్థలు నాహృదయమును, వివేకమును అధికముగా ఆకర్షించుచున్నవి. ఈశ్వరుడు నన్నిటుల జాగరూకునిగా గావించుచున్నాడు—సోదరులు సోదరులు కలహించుకొనుటచేత దేశము దుర్బలమైనయెడల, దేశీయులు దుఃఖదారిద్ర్యములలోను, ఆర్థికదురవస్థలలోను పడిపోయి దీనహీనజీవితములను గడుపుచుండిన యెడల, సంఘములో అడుగడుగునకు శ్రేణీద్వేష

మిగా, అస్పృశ్యతావిద్వేషములు సంఘమును విభక్తము గావించి, కొంచెపరచిన యెడల దేశవాసులు స్వదేశవస్తువుల విడిచి విదేశవస్తువులను, వస్త్రములను వాడుకొనుచున్న యెడల, నీవు కేవలము రాజనీతి, అహింసా ఆందోళనములు, గావించుటచేత కోటానుకోట్ల ప్రజలసేవ గావించుట యెట్లు కుదురు? అసంఖ్యాకదరిద్రపీడిత ఆర్తమానవులకు మంగళము చేకూర్చుట యెట్లగును?

నేను ఈశ్వరుని యీజాగ్రత్వాణిని స్వీకరించుటను సంకల్పించుకొంటిని. నేను ప్రత్యక్షరాజనీతిక్షేత్రమును విసర్జించి దేశముయొక్క ఆంతరిక సేవలో అగ్రసరుడ నగుటకు సంకల్పించుకొంటిని.

హృదయములో యీజాగ్రత్వాణిని విని అనుతాపము కలుగుచున్నది–నిజమే, దేశమునకు ప్రకృతకల్యాణమును చేకూర్చగలిగితినా? నా దేశములోని సాధారణప్రజలే భ్రాంతిచే, దారిద్ర్యముచే, అవిద్యచే, మూఢాచారములచే ఆచ్ఛన్నులై యుండిన యెడల స్వాతంత్ర్యమును బడసి యేమిచేయుదురు? నా దేశవాసులు ఐక్యతాబద్ధులును, ఉదారమనోవృత్తిసంపన్నులును నైనయెడల దేశమున కలిగిన యీపూర్వ పరివర్తనమును నేను స్వాతంత్ర్యమునకంటెను అధిక కామ్యమైనదిగా, అధిక శ్రేయస్కరమైనదిగా తలచుచున్నాను. నేను శాశ్వతసత్యాగ్రహిని. సత్యమును స్వీకరించుటకు, అనుసరించుటకు దేశకల్యాణముకొరకు ఈశ్వరుడు చూపిన సత్యమార్గమును అవలంబించెదను.

మహాసభ నాయకులు, ప్రతినిధులు యీ ఆకస్మిక సంకల్పమును విని ఆశ్చర్యాన్వితులైరి. కాని తుదకు గాంధీజీకి ప్రత్యక్ష రాజనైతిక కార్యముల నుండియు, కర్తవ్యములనుండియు తాత్కాలికముగా శలవు ఇయ్యవలసివచ్చెను. దేశములో యీ ఆంతరిక దురవస్థల సమయములో దరిద్రులు, విద్యావిహీనులు, అసహాయులునైన దేశవాసులకు గాంధీగారి మహాప్రాణసంబంధమే అత్యావశ్యకమని అందరును ఏకహృదయముతో గ్రహించిరి. లక్షాదిలక్షల ధ్వంసోన్ముఖ గ్రామములలో గాంధీగారి సందేశముల ఆదర్శముల ప్రచారము అత్యంతఅవసరము. నాయకులు మహత్తరనాయకునకు, మహాసేనాపతికి మహావ్రతపాలనార్థమై దుఃఖముతో శలవొసంగిరి. మీ స్నేహమును నేను మరచిపోనని శలవుగైకొనుచున్నపుడు గాంధీజీ నుడివెను. మీ సహృదయత, సేవలను మరచిపోజాలను. నేను రాజనైతిక విషయములలో పాల్గొనుట ఎప్పుడు అవసరమని మీరు తలంచెదరో అప్పుడు నాకు ఆదేశమును పంపుడి. నా అవసరమున్నదని నేను గ్రహించిన తక్షణమే మీ ఆదేశానుసారముగా మరల మీతో కలియుదును. మరల మీ ప్రక్కన నిలువబడి అహింసలకొరకు ప్రాణమును సమర్పించెదను. మరల సంగ్రామమునుగావించి సర్కారువారొసగు శిక్షనైనను వరింతును.

గాంధీజీ తాత్కాలికముగా రాజనైతిక క్షేత్రమును పరిత్యజించెను. దేశము యొక్క, సంఘము యొక్క సేవా క్షేత్రమున నిలువబడెను.

దేశము లోని దుఃఖదురవస్థలను, దారిద్ర్యమును ప్రత్యక్షముగా చూచి సాధ్యానుసారము తన్నివారణార్థై భారత దేశమంతటను పర్యటన గావించెదనని సంకల్పించుకొనెను. దీనదరిద్రులు, దుఃఖార్తులు, పతితులునగు దేశవాసుల సాంగత్యమును పొంది, వారిహృదయములను గ్రహించి, వారి పక్షాన హృదయమును స్పష్టముగా తెరచివేయ సంకల్పించుకొనెను. వారిసుఖములలో సుఖమనుభవించుచును, వారిదుఃఖములలో దుఃఖము ననుభవించుచును. సంకల్పము గావించుకొని ఆయన పర్యటనకు బయలుదేరెను.

భక్తుడు తీర్థయాత్రికుడు—తీర్థయాత్రకు బయలుదేరెను.

మందిరములలో, పుణ్యక్షేత్రములలో దైవదర్శనము గావించుకొని, దేవునిసేవ చేసి, ధన్యులగుటకు అచంచలదృఢ పదవిక్షేపములచే యాత్ర సాగించెను—

భక్తుడు గాంధీజీ—తీర్థయాత్రకు బయలుదేరినారు.

గ్రామములలో, వీధులలో నరరూపము దాల్చిన దైవదర్శనము పొంది, మానవసేవద్వారా మానవహృదయాంతరాళమందున్న భగవానుని సేవ చేయుటకు బంధుర మార్గములలో అచంచలదృఢతర పాదవిక్షేపములతో ప్రయాణము సాగించెను.

గాంధీజీ 1925 వ సంవత్సరారంభమునుండియు ఒక ప్రదేశమునుండి మరియొక ప్రదేశమునకును ఒక గ్రామము నుండి మరియొక గ్రామమునకును తిరుగ నారంభించిరి.

ఆయన ఎచ్చటికి పోయినను ప్రధానమైన అచ్చటి అస్పృశ్యులపల్లెలో నివసించుచుండును. అస్పృశ్యహరిజను లలో తన ఆశ్రమమును స్థాపించుచుండును. వారితో కలిసి పోవుచుండును. వారిపై స్నేహ ప్రేమలను ప్రకటించుచుం డును. వారిసేవ చేయుచుండును వారితో ఏకమై పల్లీసేవలో పాల్గొనుచుండును. వారిదీన భావములను, అజ్ఞానమును తొల గించుటకు ఉపదేశములను, సలహాలను ఇచ్చుచుండును. అస్పృశ్యులు, అంత్యజులు, ఆయన సాంగత్యమును పొంది హిందూసంఘముయొక్క ప్రకృతి ఆదర్శము లెట్టివో, ప్రకృతి వర్ణాశ్రమధర్మమన నెట్టిదో గ్రహింపగలిగిరి. తమదీనస్వభా వమును పరిత్యజించి వారు మరల మానవులవలె శిరము లెత్తి ఆదర్శములను ప్రబోధమును పొందిరి. ఆయన సాధ్యానుసార ముగా గ్రామములలో వారివిద్యకొరకు విద్యాలయములను స్థాపించుటకు యేర్పాట్లు గావించిరి. వారిశ్రమకు గౌరవము ఒసంగబడెను. కార్యములు లేనపుడు అలసభావముతో కాల హరణము చేయుట మహాపాపమని రైతులు గ్రహించిరి. పరి శ్రమ లేనిసమయములో కష్టార్జితధనమును వ్యసనముల, విలా సములకు వ్యయము చేయుట మహాఅన్యాయమని కార్మికులు అందరును అవకాశసమయములో పాటుపడి ధనసంపాదనకును, జీవితార్జనకొరకును ప్రయత్నించ నారంభించిరి.

సంఘములో పెద్దమనుష్యులలోను, ఉన్నతశ్రేణివారి లోను దీనిద్వారా సర్వత్ర ప్రతిక్రియ జరుగుచుండెను.

విద్యాసంస్థలను తిరుగుచు సర్వత్ర గాంధీజీతో కలియుచుండిరి. హరిజనులుకూడ ఆయనతో కలిసిపోవుచుండిరి. తమ సహృదయత, సేవ, ఆచరణములద్వారా జాతిభేదముల మాంద్యమును తగ్గించుచుండిరి. సత్యాగ్రహస్థలమునున్న మహాతీవ్రమైన సంఘముయొక్క ప్రతినిధులుగాను నూతనచైతన్యము చేకూర్చెను. గాంధిగారి అస్పృశ్యతానివారణ ప్రయత్నమే నేడు హిందూసంఘమును ధ్వంసమునుండి ఉద్ధరించినది.

ఆయన ఆనాడు గావించిన ప్రయత్నముల ఫలితము వల్లనే నేడు భారతసంఘము చైతన్యమును బడసినది.

గ్రామములో ఈకార్యములతోపాటు గాంధీజీ స్వదేశప్రచారము, ఖాదీప్రచారకార్యములుకూడ గావించుచుండెను. ఆయన ప్రతిపూటికి పోయినను అచ్చటనే దేశవాసులకు చరకాలవలన కలుగు ఉపకారమునుగురించి తెలియజేయుటకును, బోధించుటకును ఆరంభించిరి. ఆయన స్వయముగా రాట్నమునందు దారము తీసి గ్రామవాసులందరిలో చైతన్యమును కలిగించెను. ఆయనసహకారులు ఇంటికిపోయి చరకాపై నూలుతీయుమని సలహాల నిచ్చిరి.

చరకాలమధురస్వరములతో గ్రామములు ముఖరితములయ్యెను. రైతులు అవకాశసమయములో చరకాలను త్రిప్పుచుండిరి. గృహస్థులు అవకాశసమయములో నూలు తీయుచుండిరి. నేతగాడు ఆనందముతో బట్టలు నేయుచుండెను. స్వదేశచరకాలతో తయారుచేయబడిన నూలుతో నేయబడిన

వస్త్రములను ధరించి దరిద్ర గ్రామవాసులు లజ్జానివారణ చేసుకొనుచుండిరి.

గాంధీజీ ఉత్సాహితుడాయెను. సమగ్రభారతదేశములో స్వదేశప్రచారవ్రతములో దీక్షపొందిన సహకారులను, సేవకుల సహకారముతో ఒక సమావేశమును ఆహ్వానించెను. సమావేశసహకారులతో సంప్రదించి చరకాఖాదీల ప్రచారము కొరకు 'అఖిలభారతచరకాసంఘమును' పేరుతో ఒక ప్రతిష్ఠానమును స్థాపించెను. చరకాసంఘసేవకులు భారతదేశగ్రామములలో చరకాసంఘములను స్థాపించుటకును, సేవకదళము గ్రామములలో చరకా ఆదర్శములను, ఖాదీ ఆవశ్యకత విషయములోను ప్రచారము గావించుటకును, దానితో పాటు తాముకూడ చరకాత్రిప్పి గ్రామవాసులకు నూలు వడుకుట కును ఖాదీని వినియోగించుటకును ప్రోత్సాహమును కలిగించుట కును నిర్ణయింపబడెను.

నిఖిలభారత చరకాసంఘసేవకదళమువారు సకలగ్రామములలో వ్యాపించిరి. వారిప్రయత్నములవలన, వారిశ్రమ వలన ఇంటింటిలో చరకాలు తిరుగుచుండెను. ఇంటింటిలో ఖాదీ వినియోగించు సంకల్పములను స్వీకరించిరి.

వంగదేశములోని సాధారణప్రజలు ప్రథమ అసహాయోద్యమమునుండియు ఖాదీయంత్రముచేత దీక్షితులైరి. ఇప్పుడు వారు ఇంకను అధిక ఉత్సాహముతో చరకాఖాదీల కార్యములను నడపుచుండిరి. జాతీయులను స్వదేశయంత్రము

తో ఉత్సాహితులనుగా చేయుటకు గానములను పాడుచు ప్రచారము గావించిరి.

చరఖాప్రచారము గుజరాతు, పంజాబు, వంగ దేశములలో వ్యాపించెను. అందరును తమపాదములపై నిలువబడ నేర్చుకొనిరి. స్వదేశవస్తువులపై ఆధారపడ నలవరచుకొనిరి.

దేశములో నూతనప్రాణస్పందన కలిగెను. గాంధీజీ హృదయము శాంతి, స్వస్తిజ్యోతిచే మహోజ్వల రూపమును దాల్చెను.

ఖాదీ, స్వదేశవస్తువులప్రచారముతో బాటు యంత్రశిల్పములపై గాంధీజీకిగల వీతరాగమును భారత దేశ ప్రజా బాహుళ్యమునకు ప్రచారము చేయ మొదలుపెట్టిరి. యంత్రశిల్పములను విసర్జించి కుటీరశిల్పములను భారత దేశములోని ఆర్థిక, సామాజిక, నైతిక జీవితములకు అత్యంతావశ్యకమైన భాగముగా స్వీకరించుమని ఆయన ఉపదేశించిరి. యంత్రముల మహాత్తరమైన, విశేషనష్టదాయకమైన ప్రభావ మేవిధముగా భారత దేశమునకు సర్వనాశనము కలుగజేయుచున్నదో విశేషముగా వస్తువులను ఉత్పత్తిచేసి, దేశములో నిరుద్యోగసమస్య నెట్లు వృద్ధిచేయుచున్నదో, యంత్రదానవప్రభావము చేత మానవుని ఆత్మకూడ ఎట్లు దానవునిగా, పిశాచిగా పరిణమించుచున్నదో ఆయనవద్దనుండి విశేషముగా తెలుసుకొన గలిగితిమి. ఆయన అభిప్రాయానుసారముగా ఆధునిక నాగరికతయొక్క ఆత్మయే యంత్రము. యంత్రదానవునిహస్తము

నుండి భారత దేశమును రక్షింపవలయును. దేశవాసులకు యంత్రములదాసత్వమును పరిత్యజించుమని బోధించెను. భారత దేశములో స్వదేశవస్తువులను పొందుటకు మిల్లుల నసంఖ్యాకము చేయుటకంటె మాంచెస్టరుకు డబ్బుపంపుటయే మంగళదాయకమని ఆయన నుడివెను. ఒక భారతీయ మిల్లు యజమాని శోషణనీతిలో అమెరికా మిల్లుయజమానికంటె ఏవిధముగాకూడ ఉత్తముడు కాడు. యంత్రము మానవులను దానవులనుగా తయారు చేయును.

యంత్రములద్వారమున నే దరిద్రులను శోషించు ధనతంత్రము శిరము నెత్తి నిలువబడును. యంత్రములవల్ల నే మానవుని దైహికశక్తి లోపించుచున్నది. యంత్రముక్రింద నలుగుటచేత నే మనుజుడు క్రమముగా దరిద్రుడగుచున్నాడు. స్వభావభ్రష్టు డగుచున్నాడు. ఇప్పటినుండి యంత్రములకు ఫలమును ప్రమాణముచేయుట ప్రచారముచేయుటయే గాంధీజీకి విశేషకార్యక్రమ మయ్యెను. అందువలన ఆయన భారత వాసులను పలుమార్లు హెచ్చరించి నుడివినవిషయము—'ఎన్నియో సామ్రాజ్యములు పుట్టినవి, గిట్టినవి, కాని భారత దేశము ఏకాకిగా దానిలోనే వేలాదిసంవత్సరములనుండి అవిచలభావముతో నిలువబడియున్నది. అన్నియు గతించిపోయినవి. భారత దేశము ఆత్మగౌరవ అధికారమును బడయ గలిగెను. ఇది యంత్రములను కోరలేదు. ప్రాచీనచరకా, దేశీయకుటీర శిల్పమే దీనిని నిస్సందేహముగా జ్ఞానమునకు శుభములకు అధి

కాటిగా గావించినది. అందువలన భారతదేశసమృద్ధిని యినుమ
డింపజేయుటకు మరల ప్రాచీనకాలపరిస్థితులకు పోవలయును.
ఈవిధముగా యంత్రశిల్పముల ధ్వంసకరవిషయములను ప్రక
టించి భారతీయులను కుటీరశిల్పములపై అనురాగులగుటకు
సలహాల నిచ్చెను. యంత్రము సంఘశోషణకారులగు ధనతంత్ర
వాదులకు మూలకారణ మనువిషయము ఆయన విశ్వవాసు
లకు తెలియపరచెను.

ఈవిధముగా యంత్రశిల్పములకు విరుద్ధముగా ప్రచార
కార్యము చేయుచు ధనతంత్రవాదులకు విరుద్ధముగాకూడ
ప్రచారము చేయసాగించెను. ధనసంచయములోగల నిషాదే
దరిద్రభారతీయుల దుఃఖకష్టములకు కారణమని ఆయన విస్ప
ష్టముగా ప్రకటించెను. ఈధనతంత్రవాదప్రతీకారమునకు అభి
నవమార్గములనవలంబించుటకు ఆయన హేతువులను చూపిం
చెను. ధనికులు దరిద్రదేశవాసులధనమునకు రక్షకులుమాత్ర
మేనని వారు జ్ఞాపక ముంచుకొనవలయునని ఆయననుడివెను.
వారు ధనముద్వారా తమభోగవిలాసములను సార్థకపరచు
కొనక దేశములో కృషివాణిజ్యములవ్యాప్తికొరకు, దరిద్రుల
అన్నవస్త్రములసహాయముకొరకు నవనవవస్తుసామగ్రులవృద్ధి
కొరకు, సంఘములో సర్వాంగికకల్యాణముకొరకు ధనమును
వ్యయముచేయు కోరికతో నుండవలయును. మిల్లుయజమా
నులు కార్మికులవలె అనాడంబరజీవితమును గడుపవలయును.
జమీందారుల సాధారణప్రజలవలె నుండవలయును. మిల్లు

యజమానులు కార్మికులను, జమీందారులు ప్రజలను తమ సహకారులని తలంపవలయును మిల్లుయజమానులవలె జమీందారులుకూడ ప్రజలరక్షకజమీందారులుగా నుండవలయును. కేవలము తమప్రియకొంపు మూలధనము వినియోగించినం మకు పరిమితముగు కమిషనుమాత్రమే గైకొనవలయును. అట్లైన యెడలసంఘములో కార్మికులకు, యజమానులకు, జమీందారులకు, ప్రజలకు వివాదము లుండవు. ధనతంత్రములలో శోషణనీతి యుండదు. కూడబెట్టిన ధనము దేశములో దరిద్రులమంగళముకొరకు వినియోగింపవలయును.

## 49

## వైకమ్‌విషయము-దేశబంధుస్మృతి.

స్వదేశప్రచారము ద్వారముననే యంత్రశిల్పములకు విరుద్ధముగా గాంధీజీ ప్రచారకార్యమును నడపుచుండిరి. దానితోపాటు ధనతంత్రవాదమునందు గలహానికరవిషయములను ప్రకటించి సంఘములోని దరిద్రులకల్యాణముకొరకు ఆర్థికసామ్యఆదర్శములను ప్రచారము చేయుచుండిరి.

హరిజనబాంధవుడును, దరిద్రబాంధవుడు నైనమహాత్ముడు సేవాదర్శములను అంగీకరించి గ్రామగ్రామమునకు పర్యటన చేయుచుండిరి. మానవులలో సంఘవిభేదముల ప్రాచీరములను దుమ్ములో గలిపివేయుటకు యావచ్ఛక్తితో ప్రయత్నించుచుండిరి. గ్రంథవాదములవిషవృక్షమునుసమూలముగా

నాశనము చేయుచుండెను. కుటీరశిల్పములజాగరణ. దరిద్రులపై సానుభూతి భారతదేశపర్యటనమునకు, శక్తికి మూలప్రవాహము బహువిషయము ఆయన తెలియజేసెను.

పర్యటనావిధమున ఆయన దక్షిణభారతదేశములో తిరువాన్కూరురాజ్యములోని వైకంఅనుగ్రామమునకువచ్చిరి. కాని ఈగ్రామములో అతినీచమైన సామాజికాచారము ఆయనసత్యప్రియహృదయమును అధికచంచలముగాను, సంక్షుభితముగాను గావించెను. ఈగ్రామములో ఉన్నతశ్రేణిసంఘకర్తలు జాత్యభిమానముచే మత్తులై హరిజనులను పశువులనుగా చూచువారు. పశువులకంటెకూడ హీనులని వారిని చూచుచుండిరి. హరిజనులుఉన్నతశ్రేణివారివల్లెలనుండిదూరముగా మూలలో అణగిమణగి నివసించుచుండిరి. ఉన్నతవర్ణములు పోవుమార్గములలో కూడ నడుచుటకు వారికధికారము లేదు. వారు ఉన్నతశ్రేణివారికి పసికిరానియొక మార్గమున అపరాధులవలె రాకపోకలు చేయుచుండిరి.

గాంధీజీ యీదృశ్యమును అత్యంతఆవేదనముతో సహించెను. ఆఫ్రికాదేశములో గర్వాంధులగు శ్వేతజాతివారి ప్రవర్తనవిషయము ఆయనస్మరణకు వచ్చెను. ఆయన వేదనార్తుడయ్యెను. ఈఅనాచారము, మిథ్యాచారములకు ప్రతీకారము చేయ దృఢసంకల్పము గావించుకొనెను. మట్టితో చేయబడిన మార్గములు ఈశ్వరుడు సృష్టించిన ప్రపంచములోనివంటివేయని ఆయనతనసహచరులకు తెలియజేసెను.

ఆమార్గములో నడచుఅధికారము కేవలము హిందువులకే గాక, హరిజనులకు చిన్నపెద్దలకు అందరికిని వున్నది. ఈమార్గములో సకలమానవులు జాతిధర్మభేదములను పాటింపక నడచుటకు ఉపాయములను, వ్యవస్థలను అవలంబించవలయునని నిర్ణయించిరి.

సత్యాగ్రహులగు సేవకదళము సత్యస్థాపనాదర్శములతో ఉత్సాహితులైరి. వారు ఉన్నతశ్రేణివారి ద్వారములవద్దకుపోయి చేతులు జోడించుకొని వినయపూర్వకముగా ప్రార్థించుకొనిన దేమనగా—హరిజనసోదరులను ఈనిషిద్ధమార్గములలో నడువనీయుడు, మానవులపై మానవులాచరించు అత్యాచారములను తొలగింపుడు. ఈమహాధ, మూఢమాన పతితమానవులను మీవైపునకు ఆకర్షించుకొనుడు.

కాని వారిప్రార్థనలవలన విపరీతఫలములు ఫలించెను. ఉన్నతశ్రేణివారు హక్కులు పోవునను భయముతో జ్ఞానశూన్యులైరి. కోపావేశులై సత్యాగ్రహులను, హరిజనులను నిషిద్ధమార్గములలో నడచుటకు నిషేధించిరి. తిరువాన్కూరు ప్రతిక్రియాశీలసర్కారువారివద్ద శాసనములపేరుతో ఫిర్యాదు చేసిరి. స్వేచ్ఛాచారులగు దేశీయసర్కారువారు సామాజిక భేదాభేదముల వ్యామోహములతో అంధులై యుండిరి. వారు శాసనబహిష్కారము జరుగకుండుటకు సత్యాగ్రహులకు, హరిజనులకు రక్తచక్షువులను ప్రదర్శించి భయపెట్టిరి. హరిజనులు సర్కారువారిఆదేశములను తిరస్కరించి నిషిద్ధమార్గములలో నడచిన

యొసెల సర్కారువారు బలప్రయోగమువలన ఆటంకము కలుగ చేయవలసియుండును. హరిజనులకు తగిన శిక్ష యొసంగబడును. అని వారు ప్రకటన చేసిరి.

కాని సత్యాగ్రహుల హింసాశూన్యమైన నిర్భయప్రవర్తనములు దేశీయసర్కారువారిరక్తచక్షువులను గాంచి భీతి చెందలేదు. సత్యప్రతిజ్ఞకు ఆటంకము లున్నవని గ్రహించి యింకా ఉత్సాహితులైరి. వారిసంకల్పములు యింకాకఠోర రూపము దాల్చెను.

గాంధీజీ సత్యాగ్రహసేవకులను, సంఘపరిత్యక్తహరిజనులను వెంటనిడుకొని నిషిద్ధమార్గములలో ముందుకు సాగిపోవుచుండిరి. సర్కారువారిరక్తచక్షువులు, ఉన్నతశ్రేణిసంఘకర్తల ప్రతిహింసానేత్రములు వారిపై అగ్నివర్షమును కురిపించుచుండెను. పోలీసువారు హరిజనులను, సత్యాగ్రహులను పశువులవలె బాదుచుండిరి. నిర్దయతో పీడించుచుండిరి. సత్యాగ్రహిదళమువారు ప్రశాంతమనస్సుతో ఆఅత్యాచారములను సహించిరి. హరిజనులపై వేయబడిన లాఠీదెబ్బలకు సమశిరములనొగ్గి స్వీకరించిరి. అయినను వారు సంకల్పమునుండి విచ్యుతులు కాలేదు. గాంధిగారి యీసత్యసేవ, ఆదర్శకష్టలవిషయమై సమస్తభారతదేశమునందును వ్యాపించెను. సత్యాగ్రహులదుఃఖస్వీకారచరిత్రను విని భారతీయులందరును చంచలులైరి, ఉత్తేజితులైరి. భారతదేశ మంతటను ట్రావన్కూరుసర్కారువారిస్వేచ్ఛాచారములకువిరుద్ధముగా

ప్రబలమైన ఆందోళనము చెలరేగెను. తిరువాంకూరులో సంఘహితైషులగు ప్రజలు కూడ మిథ్యాచారములకు, అన్యాయ అత్యాచారములకు ప్రతివిధానము గావింప గాంధీజీ సమక్షమున నిలువబడిరి.

స్వేచ్ఛాచారులగు సర్కారువారు దీనిని చూచి భీతిజెందిరి. పరిణామమును గురించి ఆలోచించి జాగ్రత్త వహించిరి. వారున్నత శ్రేణివారి పక్షము త్యజించి నిమ్న దేశమును రద్దు జేసిరి. సకల మార్గములలో రాకపోకలు చేయుటకు అందరికిని సమానాధికారమున్నదని అంగీకరించిరి. ఆటంకములు తొలగిపోవుటచే మిథ్యాచారములను చూర్ణము జేసి గాంధీజీ హరిజనులను వెంటనిడుకొని, నిషిద్ధమార్గములలో రాకపోకలు జరిపిరి. విభేదముల ఆటంకములు తొలగిపోయెను.

గాంధిగారి కార్యకలాపములవలన అనేక దేశముల పరివర్తనములు సంఘటిల్లెను. నానా దేశములలో హరిజనులపై ఆదేశింపబడిన నిషిద్ధ ఆచారముల అవరోధనియమములు రద్దు చేయబడెను. భారత దేశములో నవజాగ్రత తరుణవర్గము వారు గాంధీజీ ఆదర్శనములవలన హరిజనసోదరులను తమతమ ఆసనములలో ప్రతిష్ఠితము గావించుటకు గ్రామములలో నగరములలో ప్రచారము చేయుటకు ఆరంభించిరి.

దక్షిణ దేశములో పర్యటన పూర్తిచేసి గాంధీజీ వంగదేశమునకు వచ్చెను. వంగ దేశ గ్రామములలో నగరములలో పర్యటనచేసి ఆయన వంగ దేశసంఘములో పరిచితులగుల

మండిరి. ఈసమయములో ఆయన మరల శాంతినికేతనమునకు పోయిరి. కవీంద్రరవీంద్ర ఆశ్రమములో నివసించి ఆయన భారత దేశముయొక్క శాశ్వత పవిత్ర శాంతిని ఆస్వాదించిరి. కవీంద్రరవీంద్రనిమానవప్రేమ, ఈశ్వరోపలబ్ధి చూచి శ్రద్ధాసహిత చిత్తముతో కవివరునకు నమస్కృతులను తెలియజేసిరి. గాంధీజీ, రవీంద్రులమధ్య ప్రేమసంబంధము స్థాపితమయ్యెను.

ఈసమయములో శోకాంధకారము సమస్త భారత దేశమును, దానితోపాటు గాంధీజీహృదయమును ఆవరించెను. భరత దేశనాయకులలో ఒకరగు దేశబంధు చిత్తరంజన్‌దాసు అత్యంతరోగగ్రస్తులై యుండిరి. ఆయన విపులైశ్వర్యమునకు అధికారియైనను, దేశసేవకొరకు, దేశములోని దరిద్రులకు, దుఃఖార్తులకు, తనసమస్తఐశ్వర్యమును సంపూర్ణముగా దానము చేసెను. దేశవాసులు దేశబంధుగారి అనారోగ్యము వలన అత్యంతవిషాదగ్రస్తులైరి. అశేష దేశమువాసుల వినయపూర్వక ప్రార్థనవలన ఆరోగ్యముకొరకు సర్వత్యాగియగు చిత్తరంజనుడు డార్జిలింగునకు బయలుదేరిపోయెను. కాని మృత్యువు ఆయనను దేశీయులనుండి నిర్దయతో విచ్ఛిన్నముగావించెను. దేశమును శోకసాగరములో నిమగ్నము చేసి 1925 జూన్ నెలలో దేశబంధుఇహలోకమును త్యజించి మహాప్రయాణము గావించెను.

సమస్తభారత దేశముశోకసాగరమున మునిగిపోయెను. ఈదుఃఖవార్తను గాంధీజీవినెను. గాంధీజీహృదయము వ్యా

కులతతో నిండిపోయెను. అసహాయోద్యమ ఆందోళనమునకు
సర్వశ్రేష్ఠసహకారిని స్మరించుకొని ఆయన నశ్వర దేహమును
దర్శించుటకు గాంధీజీ కలకత్తాకు పరుగిడిపోయిరి. దేశవాసుల
వ్యాకులప్రార్థనల ననుసరించి దేశబంధుగారి మృతకళేబరమును
డార్జిలింగునుండి కలకత్తాకు తీసుకొనివచ్చిరి. మహత్తరమైన,
అపూర్వమైన ఊరేగింపుతో ఆయన నశ్వరదేహము కేవ
రాతలాశ్మశానఘట్టమునకు కొనిరాబడెను. దేశబంధు చితా
గ్నిచే అదృశ్యమైపోయినటుల గాంధీజీ దర్శించెను. గాంధీజీ
ఇట్లు తనహృదయమును ప్రశ్నించుకొనిరి దేశబంధుని ఏదిస్వ
స్మృతియు దేశవాసులకు ఆయన అపారసేవ, సద్గుణగణము
లనుగురించి స్మరింపచేయునట్టిది యుండదా? దేశబంధుని పుణ్య
పవిత్రస్మృతి దేశవాసులు ధూపమువలె మధురసౌరభమును
భవానిపూర్‌లో గలభవనమునుసహా దేశవాసులమంగళము
కొరకు దేశవాసులపేరట చనిపోవుటకుముందు దానము
చేసినటుల తెలిసికొని గాంధీజీ తనహృదయములోని ప్రశ్నకు
జవాబు వెదకి కనుగొనెను. ఆయన నాయకులతో సంప్రదించి
నిర్ణయించిన విషయము—భవానీపూర్ భవనములో దేశ
ములో దరిద్రులు, అనాథలు అగునారీమణులకు శిశువులకు
చికిత్ససేవ జరుగు వైద్యాలయమును ప్రతిష్ఠించెదరు. కాని ఈ
సేవాకార్యమునకు విశేషధనము కావలసియున్నది. నాయ
కులు చికిత్సాలయముయొక్క విశేషగురుభారమును గ్రహించి
నిరుత్సాహితులైరి. గాంధీజీ యీసమస్యనుకూడ పరిష్కరిం

షరి. 'దేశబంధువు దేశమునకు బంధువు' ఆయనస్మృతిని రక్షించుటకు కావలసినధనము దేశవాసులు దానము చేయవలయును. దేశవాసులనుండి ధనమును భిక్ష మెత్తి సర్వస్వత్యాగియు, భిఖారియునైన శివునిమహిమను ప్రతిష్ఠింపవలయును. నేను స్వయముగా ఈధనమును భిక్ష మెత్తి సంపాదించెదను. దేశములో ఇంటింటివద్ద భిక్షాపాత్రను పట్టి పూర్ణము చేయుదును! అని నుడివెను.

కఠోరసంకల్పములను గావించుకొను గాంధీజీ తనసంకల్పములనుండి ఎన్నడును విరమించడు. ఆయన మూడు నెలలు చేయిచాచి యింటింటివద్ద భిక్షమెత్తెను. ఒకమహాత్మునిస్మృతి రక్షణార్థమై ధనికులు, దరిద్రులు నగుభారతీయులందరును మరియొక మహాత్మునిహస్తములో 10 లక్షలరూపాయలసహాయమును దానముగా సమర్పించుకొనిరి. గాంధీజీ సంపాదించిన ధనమును నాయకులహస్తములలో సమర్పించుకొనెను. ఆధనముద్వారా 'చిత్తరంజనసేవాసదనము' స్థాపింపబడెను. చిత్తరంజనుని అమరస్మృతి సేవాసదనసేనద్వారా అమరత్వమును పొందెను.

—:0:—

# 50

# సైమన్ కమీషను-నెహ్రూ రిపోర్టు

గాంధీజీ సేవాసదనమును ప్రతిష్ఠింపజేసి మరల చరఖా సంఘకార్యక్రమ కార్యములలో నిమగ్నులయ్యెను. మరల వివిధజిల్లాలలో సంచారము చేసి ఖాదీప్రచారము గావించుచుండిరి.

ఈసమయములో దక్షిణాఫ్రికాభారతీయుల సమస్యావిషయములో దక్షిణాఫ్రికాయూనియన్ సర్కారువారికి భారతదేశసర్కారువారికిమధ్య దీర్ఘాలోచనములు జరిగెను. ఆలోచనములఫలితముల (1926-27 వ సంవత్సరము) ఉభయసర్కారులవారు ఈసమస్యను పరిష్కరించుటకు ఒక రాజీమార్గమునకు వచ్చిరి. వారు మీమాంసషరతులు గాంధీజీకి తెలియజేసిరి.

నిర్ణయింపబడిన షరతులు :

(1) జీవనయాత్రలో పాశ్చాత్యులగౌరవమును అంగీకరించినయెడల ప్రవాసులగు భారతీయులు దక్షిణాఫ్రికాయూనియన్‌లో స్థిరనివాసులుగా వసింపవచ్చును. (2) ఈయేర్పాటుకు అంగీకరింపనివారిని యూనియన్‌సర్కారువారు తమ ఖర్చులతో భారతదేశమునకు పంపివేయుదురు. (3) యూనియన్‌లో క్రమముగా 3 సంవత్సరములు హాజరు కానియెడల అచ్చట వసించు అధికారము లోపించిపోవును. (4) ప్రతిస్థిరనివాసియు 1918 వ సంవత్సరముయొక్క సామ్రాజ్యసమ్మేళన నిర్ణయమును శిరసావహింపవలయును. (5) భారతీయులు ఏక

పత్నీవ్రతమునకు అంగీకరింపవలయును. ప్రథమభార్యసంతానము శాసనసమ్మతమైన వారసులుగా పరిగణింపబడుదురు.

గాంధీజీ షరతులను విశేషముగా పర్యాలోచించెను. ప్రవాసభారతీయుల చెడుగులో మంచిగా భావించి గత్యంతరము లేక దీనిని అభయమార్గముగా నిర్ణయించిరి. ఆఫ్రికాభారతీయుల స్వార్థరక్షణకు విశేషమైన శక్తిసామర్థ్యములు గల ఉద్యోగస్థుని నియమింపవలయునని ఆయన భారతసర్కారువారికి తెలియజేసెను. గాంధీజీసలహాను భారతసర్కారువారు అంగీకరించిరి. శ్రీయుత శ్రీనివాసశాస్త్రిగారిని ఆఫ్రికాలోని భారతీయులకు ప్రత్యేకోద్యోగస్థునిగా (ఏజంటు జనరల్) పంపించిరి. ఈవిధముగా గాంధీజీ ఆఫ్రికా సమస్యను పరిష్కారము గావించిరి.

అనంతరము గాంధీజీ స్వదేశీప్రచారమును, సంఘసేవా కార్యమును పూర్ణోత్సాహముతో నడపుచుండిరి. కాని ఆయన కార్యములను నిలిపివేయవలసివచ్చెను. దేశములోని రాజనైతిక పరిస్థితుల గురుతరపరిణామమువలన దేశములోని నాయకులు, దేశవాసులు మరల ఆస్వాతంత్ర్యసంగ్రామమును నడుపుటకు గాంధీగారిని విశేషముగా కోరియుండిరి. మరల రాజనైతికవిషయములలో పాల్గొను అవకాశము కలిగినదని గాంధీజీ గ్రహించెను. స్వదేశప్రచారము, సంఘసేవాకార్యము, చరకాసంఘము మొదలగుకార్యములను ఆయనవద్ద మంత్రదీక్షితసత్యాగ్రహులకు అప్పగించి రాజనైతిక క్షేత్రమునకు మరల తిరిగి వచ్చిరి.

ఈసమయములో భారతరాజకీయక్షేత్రమున సైమన్ కమిషన్ బహిష్కారము భారతదేశప్రజలను ఉద్రేకులనుగా గావించెను. సైమన్ కమిషన్ విషయములో యించుక ఆలోచించి మనము మూలవిషయమునకు తిరిగి వచ్చెదము.

భారతీయుల సహాయనిరాకరణాందోళనములో ఇంగ్లీషువ్యాపారివారు కలవరపడినట్టుల ఆంగ్లవణిజులుకూడ విశేష నష్టములపాలైరి.

ఇంగ్లీషువారి వస్త్రశిల్పములకు మూలకేంద్రమైన మాంచెస్టరుయంత్రశాలలన్నియు కార్యాభావముచేత మూసివేయబడసాగెను; శ్రమికులు నిరుద్యోగులైరి; భారతదేశములో ఇతరవిదేశవస్తువుల సరఫరాకూడా మందగించెను. ఇంగ్లండులోని సాధారణఆంగ్లేయులు నష్టపడినవారై ప్రతీకారమునకు ఉపాయస్వరూపముగా భారతీయులను సంతుష్టి పరచుటకు బ్రిటిషుపార్లమెంటువారిని బలవంతపెట్టుచుండిరి. పార్లమెంటు, మంత్రిసభవారు గత్యంతరములేక భారతీయ పరిపాలనావిషయములో కొంతపరివర్తనము కలుగజేయ సంకల్పించుకొనిరి. పార్లమెంటువారి ఆదేశానుసారముగా ఆనాటిభారతదేశ వైస్‌రాయ్ లార్డుఇర్విన్ 1927, ఫిబ్రవరి 8 వ తేదీన భారతీయుల నుద్దేశించి ఒకప్రకటనమును గావించెను; ఈ ప్రకటనలోని విషయము—సర్ జాన్ సైమన్ అను ఒకవిశిష్టరాజనైతికనాయకుని నేతృత్వమున ఒకవిచారణసంఘము నిర్మింపబడును. ఈసంఘమువారు భారతదేశ

మంతటను పర్యటించి శాసన విషయములో వారి భావప్రకటనలను, అభియోగములను విందురు; విచారణద్వారా భారతీయులు శాసనాధికారమునకు ఎంతవరకు యోగ్యులో ఆవిషయముకూడ గ్రహింతురు. తుదకు వీరిఅనుభవపూర్వకమైన అభిప్రాయములు, విచారణఫలాఫలములు పార్లమెంటువారికి దాఖలు చేయుదురు. పార్లమెంటువారు కమిషన్ వారిఅభిప్రాయములను, సిద్ధాంతములను స్వీకరించి భారతీయులకు శాసననిర్మాణములో నెట్టి అధికారము నిచ్చుటకు ఆలోచించెదరు. ఈకమిషనులో సర్కారుకు చెందిన, చెందని ఏభారతీయసభ్యునికూడ స్వీకరింపబడదనియు, కేవలముఆంగ్ల రాజనీతినిపుణులద్వారా యీకమిషను నిర్మింపబడునని ఆప్రకటనద్వారానే భారతీయులకు తెలియజేయబడెను.

ఈప్రకటనవలన భారతీయులు సంతుష్టి చెందకపోగా, అసంతుష్టినే చెందిరి. ఏకమిషనులో ఒక్కభారతీయుడైనను ఉండరో, ఆకమిషను భారతీయుల దుఃఖదారిద్ర్యములను. ప్రజాఆకాంక్షలను ఎట్లు గ్రహింపగలరు? కమిషనులోని ఆంగ్లసభ్యులు భారతదేశరాజనైతిక ఆర్థికఅభావములు, అభియోగముల విషయము ప్రత్యక్షానుభవము లేకపోవుటవలన ఏ అభిప్రాయములను వెలిబుచ్చగలరు? ఇంగ్లీషుసభ్యులు ప్రాల్ సముద్రముల ఆనదీతీరమునందుండి కేవలము కితాబువిద్యద్వారాను, ఆంగ్లఉద్యోగస్థులద్వారా

ఇచ్చుట నిరసన ప్రదర్శించు ప్రజలపై లాఠీలు, గ్యాసు, తుపాకీగుళ్ళు ప్రయోగింపఁజొచ్చిరి. గొప్పగొప్పనాయకులుకూడ దెబ్బలకు గురియైరి. పంజాబులో ప్రసిద్ధనాయకులు లాలా లజపత్ రాయి లాఠీదెబ్బలవలన తీవ్రముగా ఆహతులైరి. కొలది దినములు పీడాగ్రస్తులై దేహలీలలను చాలించిరి. ప్రజల ధైర్యము లోపించెను. అయినను వారు అహింసాత్ములై కమిషన్ వారిని విసర్జించుచుండిరి. కార్యములను పూర్తిచేసి కమిషన్ వారు ఇంగ్లాండుకు పోయిరి.

జాతీయమహాసభానాయకులు కమిషన్ వారిని బాయ్కట్ చేయుమని సలహాలను ఇచ్చుటతో విరమించియుండలేదు. వారు భారతీయుల అభావఅభియోగములనుగురించియు, అధికారఅనధికారములనుగురించియు విచారణ సల్పి, భారతీయుల శాసనవిషయములో యోగ్యతసామర్థ్యమునుగురించి నిర్దిష్ట అభిప్రాయములనుసమకూరుటకు స్వదేశకమిషన్ వారిని నియమింప సంకల్పించుకొనిరి. వారు పండిత మోతీలాల్ నెహ్రూగారిని యీ కమిషన్ వారికి అధ్యక్షునిగా ఎన్నుకొనిరి. పండితుని నేతృత్వమున యితర భారతీయసదస్యులు విశేషముగా విచారణములను, ఆలోచనములను గావించి ఒక అభిమతమును **(Report)** తయారు చేసిరి. ఈఅభిమతానుసారముగా భారతీయులకు స్వాయత్త శాసనాధికారమును సత్వరమే ఒసంగుట యుచితమని తెలియచేయబడెను. బ్రిటిషువారి అధీనములో నుండగానే భారతదేశము ఆత్మశాసనాధికారము ననుభవించు

నాయకులు తమ సంకల్పమునుగురించి గాంధీజీకి సంపూర్ణముగా వివరించిరి. గాంధీజీ వారిసంకల్పమును సమర్థించి తెలియజేసిన దేమనగా- ఏ కార్యములో భారతీయుల ఆత్మలపై శ్రద్ధ లేదో, భారతీయులకు కూడ అకార్యము లేక ప్రణాళికను సత్యరక్షణకొరకు వర్జించుట అత్యావసరమైనది. కమిషన్ వారిని అహింసాభావముతో వర్జించి, 'మీతో మాకు పరిచయము లేదనియు, మీతో మా కెట్టిఅవసరము లేదనియు, వారికి తెలియచేయవలయును.

1928 వ సంవత్సరము, ఫిబ్రవరి 3వ తేదీన సర్. జాన్ సైమన్ గారి నేతృత్వమున సైమన్ కమిషన్ బొంబాయి రేవులో అవతరించిరి. బొంబాయిలో సర్వత్ర హరతాళము పాలింపబడెను. స్వేచ్ఛాసేవకులు రేవువద్దకుపోయి అయిష్టతను ప్రదర్శించి కేకలు వేయుచు 'సైమన్ తిరిగి పొమ్ము' అని నుడివిరి.

కేవలము బొంబాయిలోనే కాదు, కమిషన్ వారు ఎచ్చటికి పోయినను వారు తీవ్రతరఅయిష్టతను ఎదుర్కొనవలసివచ్చెను. వారికి విరుద్ధముగా సంపూర్ణహరతాళము పాలింపబడెను.

కమిషన్ వారివిచారణకార్యమునకు విశేషవిఘ్నములు సంభవించెను. సర్కారువారుకూడ యీవిషయమున క్రోధావేశులైరి. ప్రతిహింసాపరాయణులై తీవ్రమైన అమానుషికమైనదమనకార్యములను గావించుచుండిరి. అచ్చ

ఇచ్చుట నిరసన ప్రదర్శించు ప్రజలపై లాఠీలు, గ్యాసు, తుపాకీగుళ్ళు ప్రయోగింపఁజొచ్చిరి. గొప్పగొప్పనాయకులుకూడ దెబ్బలకుగురియైరి. పంజాబులో ప్రసిద్ధనాయకులు లాలా లజపత్ రాయి లాఠీదెబ్బలవలన తీవ్రముగా ఆహతులైరి. కొలఁది దినములు పీడాగ్రస్తులై దేహలీలలను చాలించిరి. ప్రజల ధైర్యము లోపించెను. అయినను వారు అహింసాత్ములై కమిషన్ వారిని విసర్జించుచుండిరి. కార్యములను పూర్తిచేసి కమిషన్ వారు ఇంగ్లాండుకు పోయిరి.

జాతీయమహాసభానాయకులు కమిషన్ వారిని బాయ్ కట్ చేయుమని సలహాలను ఇచ్చుటతో విరమించియుండలేదు. వారు భారతీయుల అభావఅభియోగములనుగురించియు, అధికారఅనధికారములనుగురించియు విచారణ సల్పి, భారతీయుల శాసనవిషయములో యోగ్యతసామర్థ్యమునుగురించి నిర్దిష్ట అభిప్రాయములనుసమకూరుటకు స్వదేశకమిషన్ వారిని నియమింప సంకల్పించుకొనిరి. వారు పండిత మోతిలాల్ నెహ్రూగారిని యీకమిషన్ వారికి అధ్యక్షునిగా ఎన్నుకొనిరి. పండితుని నేతృత్వమున యితరభారతీయసదస్యులువిశేషముగా విచారణములను, ఆలోచనములను గావించి ఒకఅభిమతమును **(Report)** తయారు చేసిరి. ఈఅభిమతానుసారముగా భారతీయులకు స్వాయత్తశాసనాధికారమును సత్వరమే ఒసంగుట యుచితమని తెలియచేయబడెను. బ్రిటిషువారి అధీనములో నుండగానే భారతదేశము ఆత్మశాసనాధికారము ననుభవించు

టకు సంపూర్ణముగా అధికారులను విషయము స్పష్టముగా ప్రకటింపబడెను.

1928వ సంవత్సరములో జరిగిన మహాసభ సాధారణ సమావేశములో అనేక అధికవోటులతో నెహ్రూకమిషన్ రిపోర్టు 'నెహ్రూరిపోర్టు' అని అంగీకరింపబడెను. పండితజవహర్‌లాల్' సుభాష్‌చంద్రబోసు మొదలగువారు పంథీయనాయకులు స్వాయత్త శాసనతీర్మానమునకు విరుద్ధముగా నిలువబడిరి బ్రిటిషుక ర్తృత్వములేని పూర్ణస్వాతంత్ర్యప్రతిపాదనమును అంగీకరించమని ప్రార్థించుకొనిరి. సర్కారువారిపై విశ్వాసము పోయినను బ్రిటిషుజాతివారిపై విశ్వాసము పోలేదని గాంధీజీ వారికి తెలియజేసెను. మనము స్వాయత్త శాసనాధికారము ద్వారానే బ్రిటిషువారినుండి పూర్ణస్వాతంత్ర్యమును పొందగలము. తుదకు గాంధిగారిఅభిప్రాయమునే మహాసభసదస్యులలో అనేకులు అంగీకరించిరి.

గాంధీజీ మరల రాజకీయ తికవిషయములలో ప్రవేశించినను దేశములోనిదరిద్రులగు కృషికుల కూలీలవిషయము మరువలేదు. సహస్రకార్యములలో నిమగ్నుడై యున్నను ఆయనహృదయము సర్వదా రైతుల కూలీల దురవస్థలను తొలగించుటకే ఉన్ముఖమై యుండెను.

ఈసమయములో నాయకులలో ఒకరగు సర్దార్ వల్లభాయిపటేల్ గాంధిగారి గ్రామసేవా ఆదర్శముల ననుసరించి గుజరాతుగ్రామములో సేవాకార్యములలో నియుక్తులైరి

గాంధీజీ వర్తమానుద్వారా ప్రజలవిషాదగాధలను విని అత్యంత హృదయవేదనము ననుభవించిరి. గుజరాతుప్రదేశములో ఒకశాసనము ఉండెను. పంటలు పండని సంవత్సరము సర్కారు వారు ప్రజలనుండి పన్ను వసూలుచేయరు. పన్ను వృద్ధి చేయరు. ఆసంవత్సరము గుజరాతుదేశములో అనేక గ్రామములలో పంటలు పండ లేదనియే నుడువ వచ్చెను. కాని పీడించు సర్కారువారు తమభాండాగారమును పూర్ణము చేయు అభిలాషతో శాసనమును లక్ష్యపెట్టలేదు. దుర్భిక్షపీడితకృషి కుల, గ్రామవాసుల విచారపూర్వకమైన ప్రార్థనలనైనను ఆకర్ణించలేదు. భయపెట్టి బలవంతముగా పన్నువసూలు చేయుటకు ఉద్యుక్తులైరి. గుజరాతులోని బార్డోలిగ్రామము నుండి సర్దార్ పటేల్, ఇతరసంఘసేవకులు ఈవిషయమును గాంధీజీకి తెలియజేసి యీఆపదలో సంతోషజనకమైన ప్రతీకారముకొరకు ప్రార్థించిరి.

విచారగ్రస్తులైన గాంధీజీ తెలియజేసిన విషయము— 'అసత్యము అన్యాయమని తోచినవిషయములను ఎంతమాత్రము అంగీకరించవలదు. ఆ అసత్యమునకు విరుద్ధముగా సత్యమును ప్రతిష్ఠించుటకు నిర్భయముగా శిరము నెత్తి నిలువబడ వలయును. ఆ అసత్యముతో సంపూర్ణముగా సహాయనిరాకరణము గావింపవలయును. ఆ అసత్యమును, అహింసద్వారా విగ్రహముద్వారా, నిరుపద్రవముద్వారా ప్రతిఘటింపవలయును. సర్కారువారు పన్ను వసూలుచేయుట అసత్యము,

అన్యాయము అని తోచినయెడల, గ్రామవాసులు సర్కారు వారికిట్లు తెలియచేయవచ్చును. ఈఅన్యాయమైన పన్నును వారు స్వేచ్ఛాపూర్వకముగా చెల్లింపరు. ఈపీడనము నివారింపజేయుటకును, సత్యము ప్రతిష్ఠింపజేయుటకును, వారు సత్యాగ్రహము చేయుదురు.

గాంధిగారి ప్రోత్సాహమువల్లను, ఉపదేశమువల్లను సర్దార్ జీ, లక్షలకొలది గ్రామవాసులును ఉత్సాహితులైరి. సర్దార్ జీ గ్రామవాసులను సమకూర్చి సర్కారువారిపన్ను వసూలుకు విరుద్ధముగా వ్యాపకమైన మహత్తరమైన సత్యాగ్రహము ఆరంభించిరి.

సర్కారువారుకూడ సర్వశక్తులను ప్రయోగించి సత్యాగ్రహులను అణచివేయుటకు ఉద్యుక్తులైరి. సర్కారు ఉద్యోగస్థులు లక్షలకొలది కృషీవలులను కొట్టుట కారంభించిరి. రైతులయిండ్లలోని వస్తువులనన్నిటిని బయటికి లాగి వేసిరి. బహిరంగవేలములో వాటిని విక్రయించుటకు మొదలిడిరి. కాని రైతులు అచలముగ స్థిరముగ నుండిరి. ఒకవైపున అహింసాత్మతో, దృఢసంకల్పముతో, ప్రశాంత క్రోధవిహీనహృదయముతో అత్యాచారములను పీడనములను సహించుచుండిరి. మరియొకవైపున హింసాయుతదురాత్మలదళము పీడనముల, శాసనముల దాంభీకత్వముతో మదోన్మత్తులైరి.

బార్డోలిలో జరుగుచున్న కరుణపూర్ణ, వీరత్వపూర్ణమైన గాథలు సమస్తభారతదేశమును అల్లకల్లోలపరచెను.

భారతదేశకోటానుకోట్లప్రజలు పీడితసోదర సోదరీమణుల గాంచి విషాదగ్రస్తులైరి. తుదకు అహింసానిగ్రహముల అస్త్రముచేత సర్కారువారి ఆగ్నేయాస్త్రము పరాజిత మయ్యెను. రైతుసోదరుల మరణవ్రత సంకల్పమునకు సర్కారువారు లొంగిపోవలసివచ్చి విసుగుజెంది పన్నుభారమును రద్దుచేసిరి. గాంధీగారి అహింసాశక్తి పీడనకారులగు సర్కారువారిశక్తికంటె శక్తివంతమైనవిషయము రుజువయ్యెను. విషాదగ్రస్తుడగు గాంధీజీ రైతులదుఃఖము కొంతవరకు తొలగిపోయినటుల గాంచి సంతుష్టిజెందెను.

ఉక్తప్రస్థానిక విషయములలో రాజీకుదిరినను సర్కారువారు భారతదేశములోని మూలమైన మహత్తరమైనవిషయములలో ఎట్టిప్రతీకారమును చేయలేదు. ఎట్టిసదిచ్ఛను ప్రకటింపలేదు. సైమన్‌కమిషన్ రిపోర్టు ననుసరించి పార్లమెంటువారు ఏశాసనసంస్కరణములను ప్రకటింతురో, భారతీయులు వాటినే అంగీకరింపవలయునని సర్కారువారు గర్వముతో ప్రకటించిరి. వారు ఇంతకంటె అధికముగా ఏమియు చేయజాలరు.

కాని సర్కారువారు ఏమియు చేయజాలకపోయినను భారతదేశ ఆశాఆకాంక్షలకుమూర్తప్రతీకారమైయున్న భారత జాతీయమహాసభ ఏదియో యొకనిర్ణయము చేయుటకు సంసిద్ధమాయెను. సర్కారువారిసిద్ధాంతమును తెలుసుకొని మహాసభ 1928 వ సంవత్సరములో కలకత్తాలో ఒకప్రత్యేకసమా

దేశమునకు ప్రకటించెను అదమూ వేశములో నెహ్రూరిపోర్టే భారతీయుల యొక్క వాంఛయని మరల ప్రతిపాదనము అంగీకరింపబడెను. 'నెహ్రూ రిపోర్టు' ననుసరించు భారతీయులకు బ్రిటిషువారు స్వాయత్త శాసనము నిచ్చుటకు ఇంగ్లీషు సర్కారువారికి తెలియ చేయబడెను.

కలకత్తాలో గావింపబడిన ప్రతిపాదనమునందు సర్కారువారికి తెలియజేసిన విషయము—"రాష్ట్రీయపరిస్థితుల గురుత్వముపై లక్ష్యముంచు బ్రిటిషుపార్లమెంటువారు, 1929 డిశంబరు 31 న తేదీవాటికి ఈ నిర్మాణతంత్రమునకు (నెహ్రూ రిపోర్టు) సంపూర్ణాంగీకారమును తెలియజేయకున్న యెడల, కాంగ్రెసు దీనిని అంగీకారయోగ్యమని తలంచును. కాని ఈతారీఖునగాని, ఇంతకుపూర్వముగాని యీనిర్మాణతంత్రమును అంగీకరింపనియెడల కాంగ్రెసువారు అహింసాఅసహాయోద్యమ ఆందోళనమును ఆరంభించి పన్నునిచ్చుట ఆపివేసి, ఇతరోపాయముల నవలంభించుటకు దేశవాసులకు ఆదేశింతురు."

కాని ఈసమయములో దీనితోపాటు జాతీయమహాసభ మరికొన్ని ఉపాయముల నవలంబించెను. దానివలన యీసారి వామపంథీదళమువారు విశేషముగా ప్రతిబంధకమును సృష్టింపలేదు. వారుకూడ యీసారి మహాసభప్రతిపాదనమును సమర్థించిరి. మహాసభ వామపంథీదళమువారి సంపూర్ణస్వాతంత్ర్యాదర్శనములను అంగీకరించెను. నెహ్రూరిపోర్టుతో సామంజస్యము కలిగియుండి ప్రయోజనానుసారముగా సంపూర్ణ

స్వాతంత్ర్యప్రచార కార్యములకు ఏ ఆటంకము కలుగచేయ వలదని నిశ్చయించుకొనెను.

స్వాతంత్ర్యసంకల్పముగాక మహాసభ యింకా కొన్ని ప్రతిపాదనములను అంగీకరించెను. ప్రతిపాదనములో మహా సభ దేశవాసులను మాదకద్రవ్యములను విసర్జించమని కోరి యుండెను. విదేశవస్తువులను త్యజించుటకును, ఖద్దరుప్రచా రము గావించుటకును స్వదేశవస్తువులను స్వీకరించుటకును, అస్పృశ్యతను వర్జించుటకును ప్రజలను వేడుకొనిరి. దేశ ములో జరుగుచున్న సేవాకార్యములకొరకు కాంగ్రెసుసేవకు లకు ధనసహాయము చేయుమని వారు నివేదించుకొనిరి.

ఈవిధముగా వివిధమతావలంబులగు రాజనైతికదళము వారు తుదకు గాంధీజీ ఆదర్శములద్వారానే ప్రబోధితులైరి. వివిధదళములతో నిర్మింపబడిన జాతీయమహాసభ సంపూర్ణ ముగా గాంధిగారి కార్యక్రమమును అంగీకరించెను. ఇంగ్లీషు వారికి ఆఖరుఉత్తరము వ్రాయబడెను. కాని దానిఫలితము కొరకు గాంధీజీ, నాయకులు వేచియుండి కాలహరణము చేయు నిష్టపడలేదు. వారు ముందుగానే దేశమును సంగ్రామము కొరకు సంసిద్ధము చేయుచుండిరి. విదేశవస్తువుల బహిష్క రణమువలన, స్వదేశవస్తువులు, ఖాదీప్రచారమువలనను, భారతీయులమనస్సులు భావిసంగ్రామముకొరకు తయారగు చుండిరి.

సర్కారువారు భారతజాతీయమహాసభ ప్రతిపాదనము నకు ఎట్టిప్రత్యుత్తరము నొసగలేదు. శాసనములపీడనముల

పద్ధతులను ఇంకావృద్ధిచేసిరి. రాజుగారికి ప్రతికూలముగా విప్లవము, కుట్రలు చేయు నేరములనుసృష్టించి అనేకమందిగౌరవనీయులగు నాయకులగృహములను పరీక్షించుచుండిరి. నాయకులనేకులను కారాగారములో పెట్టిరి. సర్కారువారు కుట్రకేసులు అనేకములను సృష్టించిరి. దేశసేవకులగు యువకులనేకమందిపై హత్యానేరములు మోపి, కుటిలనేరములకు నేరస్థులనుగా గావించి వారికి మరణదండన విధించిరి.

లాహోరులో భగవత్ సింగు మొదలగువారు మరణదండన ననుభవించిరి. భారత దేశయువకులు చంచలులైరి. ఈ యువకులను క్షమించమని గాంధీజీ వినయపూర్వకముగా వేడుకొనుచు వైసురాయికి ఉత్తరమును వ్రాసిరి. కాని వైస్రాయి యీ ప్రార్థనమును తిరస్కరించెను. భగవత్ సింగ్ మొదలగువారు ఉరితీయబడిరి.

సర్కారువారి యీకఠిన ప్రవర్తనమువలన గాంధీజీకి సర్కారువారిమెడల గలఅంత్యవిశ్వాసముకూడ పోగా అత్యంతఆవేదనతో, స్థిరసంకల్పములతో తనసత్యమార్గమున నడచుటకు సంకల్పించుకొనెను.

ఈసమయములో మరియొకసంఘటనము జరిగెను. తత్ఫలితముగా గాంధీగారికిని, భారతీయప్రజలకును ఇంగ్లీషు వారిపైగల క్షీణతవిశ్వాసరశ్మికూడ విలుప్తమాయెను,

1929 సంవత్సర మధ్యభాగములో భారతీయులను శాంతింపజేయుటకు, భారతీయుల ఆశాఆకాంక్షలను తృప్తిపర

చుటకు సత్వరమే బ్రిటిషుపార్లమెంటువారు స్వాయత్తశాసన మూలకమైన శాసనతంత్రమును నిర్మాణముచేయుటకు సంకల్పించుకొనిరని వైస్రాయ్ ఇర్విన్ ప్రకటనము గావించిరి. కాని బ్రిటిషుపార్లమెంటువారు వైస్రాయ్ ప్రకటనను నిరాకరించుచు భారతీయులకొరకు త్వరితముగా యెట్టిశాసన తంత్రమును యేర్పాటుగావించు అభిప్రాయము తమకు లేదని తెలియజేసిరి.

ఆంగ్లేయుల మోసమునకు భారతాత్మ తలక్రిందు లయ్యెను. భారత దేశకోర్కెస్వరూపము 1929 డిశంబరు నెలలో లాహోరులో జరిగిన జాతీయమహాసభలో స్పష్టముగా ప్రకటితమయ్యెను. ఆజాతీయమహాసభ యీసమావేశములో స్వాయత్తశాసనవిషయములో రాజీవిషయకమైన ప్రతిపాదనమును పరిత్యజించి పూర్ణస్వాతంత్ర్యప్రతిపాదనమును అంగీకరించెను. భారత దేశము అహింసయెడల అనుగత్యమును, విశ్వాసమును ఉంచి పూర్ణస్వాతంత్ర్యమును సంపాదించుటకు కోరుచున్నదని లాహోరుసమావేశమునకు సభాపతియైన తరుణనాయకుడు పండిత జవహర్‌లాల్ నెహ్రూ స్పష్టముగా తెలియజేసిరి. ఈకోరిక నెరవేరనియెడల జాతీయమహాసభచే 1928 వ సంవత్సరపు కలకత్తాసమావేశములో గావింపబడిన తీర్మానము ననుసరించి త్వరితముగా మహత్తరమైన, వ్యాపకమైన, చరమమైన అహింసాసంగ్రామములో ప్రవేశించవడ మగును.

ఈశాసన బహిష్కరణసంగ్రామ కార్యక్రమమును ఏర్పాటుచేయు భారమంతయు, బాధ్యతయంతయు గాంధీజీపై సమర్పింపబడెననియు, యీశాసనబహిష్కరణ పంపాలనా శక్తియు, అధికారమును గాంధీజీకే అర్పింపబడెననియు జాతీయమహాసభవారు ప్రకటించిరి. దేశవాసులు ఆయన సత్యఅహింసలను అనుసరించుటకు అభిలషించుచున్నారని గ్రహించి గాంధీజీ జాతీయమహాసభవారు ప్రసాదించిన యీ బాధ్యతను ప్రశాంతమనస్సుతో స్వీకరించెను. ఆయన శాసనబహిష్కారము ఇంకను గంభీరముగా ఆలోచించి ఉపాయములను నిర్ణయించుటకు 1930 వ సంవత్సరము డిశంబరు 14, 15, 16 తేదీలలో అహమదాబాదు సబర్మతీ ఆశ్రమములో జాతీయమహాసభకార్యపరిచారకసమితివారు ఒక సమావేశము జరుపుటకు ఆహ్వానములు పంపిరి.

ఇంతలో జాతీయమహాసభ ఆజ్ఞానుసారముగ జనవరి 26 వ తేదీన భారతదేశమునందంతటను మహావైభవముతో ప్రథమస్వాతంత్ర్యదినము పాలింపబడెను. స్వాతంత్ర్యకామియగు ప్రతిభారతీయుడును గాంధీజీ, నాయకులు రచించిన స్వాతంత్ర్యసంకల్పవాక్యమును పఠించి హృదయమును, వివేకమును సత్యఅధికారములకొరకు జాగరూకముగాను, సంసిద్ధముగాను చేసిరి.

మహాసభకార్యకారసమితిసభ్యులు గాంధీగారి వినయాహ్వానము నంగీకరించి అహమదాబాదు సబర్మతీ ఆశ్రమము

లోపమిశ్రితమైన. గాంధీజీ తన ఆశ్రమవాసులగు సత్యాగ్రహులను వెంటనిడుకొని ప్రథమమున శాసనబహిష్కరణము గావించుటకు విశేషఆలోచనలు గావించినపిమ్మట నిర్ణయింపబడెను. తరువాత అవసరమునుబట్టి సమస్తదేశవాసులు కు శాసనబహిష్కరణములో పాల్గొందురు. గాంధీజీ, కార్య శాఖలసమితివారు తమసిద్ధాంతములను మహాసభవారికి తెలియజేసిరి. ప్రజలు పరిపూర్ణముగా యీ శాసనబహిష్కరణాందోళనములో పాల్గొనవలయుననికూడ తెలియజేసిరి. భారతీయులు కేంద్రీయమైన, ప్రాదేశికమైన వ్యవస్థాపకసభల నుండి పదవులను విసర్జించిరి. సర్కారువారి ఉద్యోగములను, పదవులను పరిత్యజించిరి.

భారతమహాసభవారందరును కార్యక్రమమును ఏకగ్రీవముగా ఆమోదించిరి. మరల విశేషప్రతిపాదనముద్వారా శాసనబహిష్కరణప్రతిపాదనమును పరిపాలనము చేయు అధికారము గాంధీజీకి సమర్పించబడెను.

## 51

# 1931 వ సంవత్సరములో శాసనబహిష్కరణ సంగ్రామము

సత్యాగ్రహి మహామానవుడు శత్రువునకు, ప్రతిద్వంద్వికి నిష్కపటముగా హృదయములోని సత్యమును, సంకల్పమును తెలియజేయుటకు సంసిద్ధుడాయెను. 1930 మార్చి

2 వ తేదీన గాంధీజీ వైస్రాయ్ ఇర్విన్‌కు ఉత్తరముద్వారా తెలియజేసిన విషయము—"ఆంగ్లసర్కారువారిపీడనములు, ప్రపంచనముల సకలభారతివాసులహృదయములను నిరాశ చేసింపివేసినవి. భారతీయులు తమదేశమును పరిపాలించుకొను యోగ్యతను సంపాదించుకొనినారు. ఆయోగ్యతాబలము చేతనే వారు విదేశసర్కారువారిని దేశము వదలిపొమ్మని వేడుకొనుచున్నారు. ఆత్మశాసనాధికారమును పొందుటకు వారు సకలదుఃఖకష్టములను బాధలను ఆనందవదనముతో సహించుటకు సంసిద్ధులైయున్నారు. నిగ్రహయాతనలు వారిని అధికముగా పీడింపగలవా? దైనిక శాసనముల అత్యాచారములు అనాచారములుద్వారా వారు అనుభవించుచున్న యాతనలకంటె జైలుశిక్షఅకించిత్కరమని తలంచుచున్నారు. దేశమంతయు ఒకజైలు అని వారు నేడు గ్రహించినారు. శాసనబలముచేత యీదేశములో బ్రిటిషుశాసకుల యిచ్ఛ తప్ప మరేమియు జరుగనేరదు.

"ఆకారణముచేత భారతీయులు ఆత్మశాసనాధికారమును పొందుటకు ఇంగ్లీషువారు విధించిన శాంతిక్రమమును భంగపరచుట, శాసనబహిష్కరణచేయుట నైతికమైన పవిత్రమైన కార్యమని తలంచుచున్నారు. భారతవాసుల తరపున నేను ఈకర్తవ్యమును మీకు తెలియజేసితిని."

ఏవిషయముతో శాసనబహిష్కారము ఆరంభించవల

ము నో గాంధీజీయే నిర్ణయించెను. ఆయన ప్రిధమమున ఉప్పు సత్యాగ్రహమును నెరవేర్చుటకు సంకల్పించుకొనిరి.

ఇంగ్లీషువారు విధించిన యిన్ని శాసనములలో వారు ఉప్పువిషయములో సత్యాగ్రహము చేయుటకు ఏల ఉద్యుక్తులాయెనని మనలో ప్రశ్న యుదయింపవచ్చును. ఈప్రశ్నకు జవాబుకొరకు వెదకుటకుముందు లవణశాసనములోని యితిహాససంఘటనమున ప్రిధమమున తెలుసుకొందము.

ఇంగ్లీషుశాసనముల ప్రిధమయుగములో ఆంగ్లేయవణిజులు భారతదేశవస్తువులను, ఇంగ్లాండులోను, ప్రిపంచములో యితరస్థలములలోను విక్రియించుటకు ఓడలలో తీసుకొని పోవుచుండిరి. కాని సరకు దింపివేసి ఓడ మరల తిరిగి వచ్చునప్పుడు ఖాళీఓడయే వచ్చుచుండెడిది. ఖాళీఓడ రావడము వలన అధికనష్టము కలుగుచుండె. అందువలన వణిజులు తిరిగి వచ్చుసమయములో ఓడను మట్టితో నింపి తెచ్చెడివారు. ఆ మట్టిద్వారా కలకత్తాలో నొక కాలువను నింపుచుండిరి. ఆకాలువను పూడ్చి ఒకరాస్తాగా తయారుచేసిరి. ఆరాస్తా రెడ్ రోడ్డు అనిపిలువబడెను. కాని ఆమట్టి తెచ్చుటవలన వాణిజ్యమునకుగాని, ఓడకుగాని యెట్టిలాభకరమైనది కాదని వణిజులు గ్రిహించిరి. అప్పుడు వ్యాపారస్థులందరును ఒకయుక్తిని పన్నిరి. భారతదేశములో విక్రియించుటకును, తద్వారా లాభమును పొందుటకును అనుకూలమైన వస్తువులను ఓడలో తేవలయునని అందరును నిర్ణయించుకొనిరి. ఓడలో విదేశలవ

ణామును భర్తీచేసి, దానిని భారతదేశమునకు తెచ్చి చవుకగా విక్రయింపవలయునని సంకల్పించుకొనిరి.

వాణిజ్యనౌకలలో లవణమును తెచ్చి భారతదేశబజారులలో చవుకగా విక్రయించుచుండిరి. భారతీయులచే విదేశలవణమును కొనిపించునను ద్వేషముతో భారతీయలవణముపై పన్ను విధించిరి. తత్ఫలితముగా స్వదేశలవణము ఖరీదు విదేశలవణముకంటె అధికమాయెను. దరిద్రభారతదేశవాసులు బాధ్యులై విదేశలవణమును కొనుచుండిరి.

గాంధీజీ లవణశాసనమును నిరసించుటకు కారణము ఆ లవణశాసనోల్లంఘనముద్వారా తెలుసుకొనగలుగుచున్నాము. ఈవిషయములో గాంధీజీనుడివిన దేమన-అన్నము, వస్త్రము, జలమునవలె లవణముకూడ మానవుడు నిత్యము ఉపయోగించుకొను వస్తువులలోనొకటి. ఇది మానవునకు ప్రతిదినము అవసరమైనదే, కాని యీదరిద్రదేశపు దరిద్రమానవులకు ప్రతిదినము ఆవశ్యకమగు ద్రవ్యములపై పన్ను విధించుట అమానుషిక ఆచరణము. కావున నేను ఈదరిద్రభారతీయులకు ప్రతినిధిగా యీ అసత్యఅన్యాయపీడాకర శాసనమును ముందు బహిష్కరించెదను. ఈశాసననిరసనకార్యమును దారిద్ర్యవిమోచనకు మరియొకమార్గముగా తలంచుచున్నాను అని గాంధీజీ సంసిద్ధుడాయెను. గాంధీజీ ఆదర్శములననుసరించుటకు భారతదేశప్రజలుకూడ సంసిద్ధులైరి. గాంధీజీ సహకారులతో సంప్రదించి దాండీసముద్రతీరమునకుపోయి సముద్రజలమును

శిక్షించి లవణమును తయారుచేయుచుండెను. ప్రజలపైన రాజ్యాంగము విధించిన నిషేధాజ్ఞను తిరస్కరించుటకును నిర్ణయించిరి.

సబర్మతినుండి దండిసముద్రతీరము దాదాపుగా 200 మైళ్ళదూరము గాంధీజీ యీసుహత్తరమార్గము నతిక్రమించుటకు ఒకనూతనాదర్శము నవలంభించుటకు సంకల్పించుకొనిరి. ఆయనసహకారులగు సత్యాగ్రహులతో కాలినడక చేపోవుటకు సంకల్పించుకొనిరి. దీర్ఘమార్గము నతిక్రమించు సమయములో మార్గమధ్యమందున్న గ్రామములలో విశ్రమింతురు. గ్రామములలోని దరిద్రులు, శాంతస్వభావులునైన గ్రామవాసులకు అహింస, ప్రేమ, చరకాసందేశములను ప్రచారము చేయుదురు. సత్యాగ్రహాదర్శములను బోధింతురు. గ్రామముల సంఘముల నిర్మాణమునుగురించి సలహాల నొసంగెదరు. ఈశుభయాత్రకు దినము నిర్ణయింపబడెను.

మార్చి 12 వ తేదీ ప్రాతఃకాలము. సూర్యుడు తన సువర్ణకిరణజాలములను ఆశ్రమము నలువైపుల ఆవరింపజేసెను. ఆశ్రమములో మంగళశంఖము మ్రోయించబడెను. శుభ్రఖద్దరుతో భూషితులై ముండితమస్తకధారి, అహింసాపూజారి, ముక్తిసంగ్రామసేనాపతి, మందగమనముతో ఆశ్రమమునుండి బయలుదేరిరి. మృదుమందహాసవదనముతో నిగ్రహజ్యోతితో బయటికి వచ్చిరి.

ఆయన వెనుక 79 మంది ఆశ్రమవాసులగు సత్యాగ్రహులు నేత్రములలో ఆనందజ్యోతిని, హృదయములలో మార్జయసంకల్పములను నిడికొని బయలు దేరిరి. వీరితో గాంధీజీ సుదూరదాండీసముద్రతీరమునకు బయలుదేరిరి.

సత్యాగ్రహుల దళమువారు అగ్రేసరులగుచుండిరి. మార్గమునం దెన్నియో గ్రామములుండెను. ప్రతిగ్రామము నందున్న ప్రజలు గుంపులుగుంపులుగా మార్గమున కిరుప్రక్కల మూగి అహింసాసందేశమును విని, సత్యమంత్రమును ఆకర్ణించి, సత్యాగ్రహసంగ్రామకౌశలమును తెలుసుకొనగోరిరి.

మందహాసవదనముతో గాంధీజీ నుడివిన విషయము- 'ఇంగ్లీషువారు నిర్మించిన శాసనములను అంగీకరింపవలదు. కాని ఆంగ్లేయులను ప్రేమింపుడి. అధికారుల నిషేధాజ్ఞలను పాటింపవలదు. కాని అధికారులను శ్రద్ధతో చూడండి ఏ శాసనము మనలను పీడించిపిప్పిచేయుచున్నదో ఆశాసనములను నాశనము చేయుటకు ప్రతిజ్ఞను బూనుడు. అహింసాపూర్వక నిరోధమువలన, అహింసాపూర్వకనిరసనవలన, యీ శాసనములను ధ్వంసము చేయుదమని ప్రతినబూనుడు, సంగ్రామము చేయుటకు సత్యమను అస్త్రమును ధరింపుడు. సత్యన్యాయ ధర్మములే తుదకు అసత్యఅన్యాయఅధర్మములను జయింపగలవని జ్ఞాపక ముంచుకొనుడు. శాసన, శోషణములకు విరుద్ధముగా సంగ్రామక్షేత్రమునం దవతరించి యాతనలను, దుఃఖ

ములను, కష్టములను మించు పరిపుడు, యాతనలను సహించి యాతనలను అనుభవించుటకు సంసిద్ధులు కండు. విశుద్ధమైన నిష్కపటమైన, హృదయములో నిజాయితీత్యములలో, కార్యములలో దృఢముగను, అచంచలముగను నుండవలయును. అప్పుడే ప్రపంచములోని పాశవికశక్తి తనుఆత్మవద్ద పరాజిత మగును. ఆత్మసమర్పణము చేయ సంసిద్ధము గును."

అపూర్వమైన ఈయుపదేశము, మధురమైన దీసందేశము రాజనీతితో ధర్మసమ్మేళనము గాంధీవాదమును ప్రపంచదృష్టిలో మహత్తరముగాను అభినవముగాను గావించెను. గాంధీజీశ్రేష్ఠత్వ మిచ్చటనే యున్నది. రాజనీతితో ధర్మము యొక్క అపూర్వమైన సహజమైన సమ్మేళనము గావించుటలోనే యున్నది.

భారతదేశము హింసాయుత అస్త్రముతో విదేశశాసన విముక్తమగుటకు తయారగుచుండ ఆయంధకారముహూర్తములో భారతదేశగర్భమున యీమహాపురుషుడు ఆవిర్భవించెను. హింసద్వారా శాసకులను విదూరముచేయుటకు ప్రయత్నించినయెడల శాసకులుకూడ హింసాత్మకఅస్త్రమును విసరి ప్రతిక్రియ గావింతురని ఆయన భారతీయులకు బోధించెను. కాని అహింసాశక్తిద్వారా, సత్యధర్మములద్వారా శాసకుల నాఘాతపరచినయెడల శాసకులహస్తములందున్న మహాస్త్రములు, ఆగ్నేయాస్త్రములు, హింసాత్మకఅస్త్రములు తమంతటతామే జారి పడిపోవును. శాసకులు అస్త్రాఘాతములు

వేయుచు అవసన్ను లగుదురు. క్లాంతి జెందుదురు. భారతీయులను కష్టపెట్టుటచే వారిమనస్సులలో దుఃఖముకలుగును. అప్పుడు శాసకులు పరాజయమును వరించి భారతదేశమును త్యజించి పోవుదురు. ఆయనసాధనలలో, ఆయనఆదర్శములలో నెట్టి అపూర్వమైన భవిష్యద్వాణి నిహితమై యున్నదో భారతీయులు నేడు గ్రహింపగలిగినారు.

రాజనీతిలో యీధర్మభావమును సంచరింపచేయుట చేతనే అసంఖ్యాకులగు ఆంగ్లేయులు ఆయనపై శ్రద్ధాగౌరవములను ప్రదర్శించిరి. ఒకవైపున ఇంగ్లీషుసర్కారువారు ఆయనను అణిచివేయుటకు ప్రయత్నించుచుండిరి. మరల ఆ సమయములోనే సర్కారుసంబంధములేని ఆంగ్లవిద్వజ్జనులు, పండితవరేణ్యులు ఆయనదర్శనలాభముకొరకు, ఆయనసందేశమును ఆకర్ణించుటకొరకు భారతదేశమునకు పరుగిడి వచ్చుచుండిరి. స్వదేశమునకు తిరిగిపోయినపిమ్మట సర్కారువారి దమననీతిని ఖండించుచుండిరి. గాంధీగారి రాజనీతితో ధర్మనీతి సన్నివేశితమై యుండెను; అందువలన ఆయనరాజనీతి విశ్వవాసుల విస్మయమును, శ్రద్ధను ఆకర్షించెను. ఆయన యొక్క యీరాజనీతిని వ్యాఖ్యానము చేయుచు పండితవరేణ్యుడు రోమెన్‌రోలండు వ్రాసినవిషయము- 'ఆయన రాజనైతిక పగుట గత్యంతరము లేక.'

మహాత్ముడు తనరాజనీతిని ధర్మబలముచే బలవత్తరముగావించి ప్రతిగ్రామవాసిని, ప్రతిభారతీయుని సంసిద్ధమగు

ంకు ఆహ్వానించెను. గ్రామప్రజలు తమధార్మిక సేనాపతిని వరించుటకు, అభినందనములు తెలియజేయుటకు శంఖములను మ్రోయించిరి. పుష్పమాలలను సమర్పించుకొనిరి. 'గాంధీజీకి జయ్' అని సమస్వరములతో ప్రతిధ్వనింపజేసిరి.

మందహాసవదనముతో గాంధీజీశిరమును వంచుకొనిరి. అభినందనములకు జవాబిట్లొసంగిరి– 'భారతవర్షమునకుజయ్' అని కేవలము ఈజయధ్వనులను సమవేతకంఠముతో ఘోషించినంతమాత్రమున స్వాతంత్ర్యమును పొందజాలము. ఈ స్వాతంత్ర్యముకొరకు మనము సవవేతభావముతో పరిశ్రమయు, ప్రయత్నములను గావింపవలయును. మనగ్రామ పునర్నిర్మాణమునకు అగ్రేసరులము కావలయును. సంఘములో నున్న నీచమగు అస్పృశ్యతయను పాపమును తొలగింపవలయును. గృహములలో చరకాఖాదీలను ప్రతిష్ఠితము చేయవలయును. భారతదేశములో ఉత్పన్నమైన ద్రవ్యములతోనే మనజీవనయాత్రను నిర్వహించుకొనవలయును. మనసనాతన ధర్మమును మరల గౌరవాసనమున స్థాపింపవలయును.”

భారతవాసులు పవిత్రులైరి. మార్గములనుకనుగొనిరి. శక్తిని సంపాదించుకొనిరి. సేనాపతి ఆదేశపాలనముకొరకు నలువైపుల ప్రజలు సంసిద్ధులగుచుండిరి.

ధర్మముతో పాశవికశక్తికి ప్రతిద్వంద్వ మారంభమయ్యెను. ఈసంఘర్షణలో ధర్మము మరింత ఉజ్జ్వలముగాను

శక్తివంతముగాను కాజొచ్చెను గాంధిగారి సందేశమువలన ప్రజలలో ఆత్మవిశ్వాసము స్వప్రబోధము జాగరిత మయ్యెను.

సత్యాగ్రహపరివ్రాజకుడు గ్రామములపై గ్రామముల నతిక్రమించి అగ్రేసరు డగుచుండెను. 25 దినములు నడచిన పిమ్మట ఏప్రిల్ 5 వ తేదీనాటికి డాండిసాగరతీరమునకు వచ్చెను.

గాంధీజీ నుడివిన విషయము – "బ్రిటిషు శాసనములు సర్వవిధముల భారతభూమికి సర్వనాశనము సమకూర్చినవి. మననీతి, మనవిద్య, మనజాతీయత, మనధర్మనీతి, సమస్తమును ధ్వంసము గావించెను. నేను ఈశాసనములను అభిశాపములని నుడువుచున్నాను. అందువలన భారతజాతీయతకు హానికరమైన యీ అభిశాపములను భారతక్షేత్రమునుండి తుడిచివేయుటకు యాత్ర ఆరంభించితిని. ఈసత్యాగ్రహజీవితమును ధరించితిని. ఈశాసననిరసనసంగ్రామము అభిశాప విమోచనసంగ్రామము."

గాంధీజీ ప్రథమమున సాగరములోదిగెను. పాత్రతో జలము నింపుకొని బయటికి వచ్చిరి. అగ్ని వెలిగించి ఉప్పు తయారుచేసిరి. 79 సత్యాగ్రహులుకూడ లవణము తయారు చేసిరి.

స్వాతంత్ర్యయుద్ధసేనాపతి ప్రథమమున శాసనబహిష్కరణ సంగ్రామము నారంభించెను.

ఈసారి సేనాపతిఆదర్శములతో భారతదేశములో సర్వత్ర శాసనబహిష్కరణసంగ్రామము ఆరంభమాయెను. భారతదేశములో ప్రతిస్థానమునందును కోటానుకోట్లప్రజలు నలువైపుల లవణశాసనమును తిరస్కరించుట కారంభించిరి. సర్వత్ర ఉత్సాహము, ధైర్యము. తీక్షణపరీక్షలు ఆరంభమాయెను. వంగదేశమునందును ఉత్సాహము ఉద్యమములు చెలరేగెను. దేశములోని నారీమణులుకూడ సంగ్రామములో ప్రవేశించిరి. లవణము తయారుచేసి యింటింటికి పంచిపెట్టు చుండిరి. విక్రయించుచుండిరి. నాయకులు ఒకరితరువాత ఒకరు అరెస్టుచేయబడిరి. పండితమోతీలాలు, పండిత జవహర్‌లాలు, పండిత మాలవ్యా, సర్దార్ వల్లభాయ్, శ్రీరాజేంద్ర ప్రసాద్, శ్రీరాజగోపాలాచారి, శ్రీయతీంద్రమోహనగుప్త మొదలగువారు శాసకుల లోహకారాగారాంతరాళమునకు పంపబడిరి. సాధారణప్రజలపై అత్యాచారములు జరుగుచుండెను. సత్యాగ్రహులు కొట్టబడిరి. బెయ్‌నెట్‌లపోటులకు గురియైరి. పదాఘాతములను వరించిరి. స్త్రీలు అవమానింపబడిరి. కొట్టబడిరి. కాని భారతదేశము అహింసాఆదర్శములలో దృఢముగను స్థిరముగను ఉండెను. భారతదేశ మింకను దృఢసంకల్పముతో లవణశాసనమును తిరస్కరించుచుండెను. లవణశాసనము బహిష్కరింపబడెను.

ఈసారి గాంధీజీ యింకను వ్యాపకసంగ్రామమునకు మార్గములు కనిపెట్టెను. ఆయన సర్కారువారిలవణరాసులను

ఆక్రమింప సంకల్పించుకొనెను. ప్రజలకు నిత్యము ఆవశ్యకమైన సామగ్రిని ఆక్రమించుకుని ప్రజలను శోషింపచేయు నైతికాధికారము సర్కారువారికి లేదు.

నియమితదినమున గాంధీజీ గుజరాతులోని ధరసనా చరస్దా అను రెండుగ్రామములలో సర్కారువారి లవణాగారములను ఆక్రమించుటకు సంకల్పించిరి. కాని ఆక్రమించుటకు ముందు మరల ఆయన అహింసాసత్యాగ్రహి ధర్మమును పాలించుచుండిరి. ఆయన ఆక్రమణోద్దేశ్యము, సమయము పత్రముద్వారా స్పష్టముగా వైస్రాయ్‌కి తెలియజేసిరి.

గాంధీజీ సంసిద్ధులై సర్కారువారు అరెస్టు చేసినను సత్యాగ్రహకార్యము నిలిచిపోకుండునట్లు తగినయేర్పాట్లు గావించెను. నూతననాయకుడు వచ్చి సంగ్రామపరిచాలనా భారమును వహించును.

సర్కారువారుకూడ యీసారి స్థిరసంకల్పులైరి. లవణాగారములను ఆక్రమించుటకుముందే మే 5 వ తేదీన భారతసత్యాగ్రహసంగ్రామసర్వాధినాయకుడు అరెస్టుచేయబడిరి. కాని సత్యాగ్రహముఆగిపోలేదు. నాయకులు అబ్బాస్ తాయెబ్జీ గాంధీజీస్థానమును ఆక్రమించుకొనిరి. సత్యాగ్రహులను లవణాగారములను ఆక్రమించమని ఆదేశించిరి వారు ముక్తిగానము చేయుచు నగ్రసరులైరి. తాయెబ్జీ కూడా అరెస్టయినను యాత్ర ఆగిపోలేదు. శ్రీమతి సరోజినీ నాయుడుగారువచ్చి యాత్రను సాగించుచుండిరి.

ఆమెకూడ అరెస్టు చేయబడెను. కాని సత్యయాత్ర అహింసాయాత్ర పూర్ణవేగముతో సాగిపోవుచుండెను. సత్యాగ్రహదళమువారు నూతననాయకులను ఎన్నుకొనుచుండిరి. నవీనోత్సాహముతో అత్యంతవేగముతో యాత్ర సాగిపోవుచుండెను. పోలీసులు కోపగించిరి. చరమమార్గము నవలంబించ తలంచిరి. సత్యాగ్రహులను అరెస్టుచేసిరి. జ్ఞానశూన్యులై లాఠీచార్జి చేయుచుండిరి. బెయనెట్‌ద్వారా ఆఘాతములు వేయుచుండిరి, సత్యసేవకులు కొట్టబడిరి, ఆహుతులైరి. కాని తాము ఆఘాతములను వేయలేదు. మందహాసముతో నిర్వికారముగా నిర్భయహృదయముతో 'వందేమాతరం' గానమును పాడుచు లవణాగారములవైపునకు నడచుచుండిరి. అహింసాసత్యముల యీ అపూర్వసంగ్రామచరిత్రను విని సమగ్రప్రపంచము స్తంభితమయ్యెను, విస్మితమయ్యెను.

ప్రపంచములోగల వివిధస్థానములవారు ఈసంగ్రామమును చూచుటకు ధరసనకు పరుగిడివచ్చిరి. విదేశవార్తాపత్రికల రిపోర్టరులు ఈదృశ్యమును గాంచి అభిభూతులైరి. వారి రిపోర్టులను సత్యాగ్రహకార్యములను, మహాత్మ్యమును ప్రపంచవాసులందరును అత్యుత్సాహముతో చదువ నారంభించిరి. ఇంగ్లీషురిపోర్టరు వెబ్‌మిల్లర్ యీదృశ్యమును చూచి వ్రాసినవిషయ మిది–"ధరసనాసమక్షమున నిలువబడి ఆలవణాగారముల ఆక్రమణదృశ్యమును చూచుచుంటిని. అప్పుడప్పు డది అత్యంత వేదనాదాయకముగా నుండుటచే దానిని

మేదినీపూర్. ఇతర అనేకస్థలములలో లవణము తయారగుచుండెను. కేవలము లవణశాసనమేగాక, ఈసారి జాతీయ మహాసభ ప్రార్వాదేశానుసారముగా భారతీయు లితరశాసనములను, ఆ దేశములను బహిష్కరించు కార్యములలోకూడ ప్రవృత్తులైరి. స్వేచ్ఛాసేవకులు సర్వత్రి గుంపులు గుంపులుగా విదేశవస్త్రముల దుకాణములలోను, విదేశసారాయి షాపులలోను 'పికెటింగు'చేయ మొదలిడిరి. గ్రామవాసులు పన్నులను చెల్లించుట మానివైచిరి. బొంబాయి, బెంగాలు, బీహారు, ఒరిస్సా దేశవాసులు ఒక్కదమ్మిడీపన్నుకూడా చెల్లించమని ప్రతిజ్ఞ గావించుకొనిరి. గుజరాట్, మహారాష్ట్రము, కర్ణాటకము, ఆంధ్ర, పంజాబు దేశవాసులు అత్యాచారులగు సర్కారువారికి పన్ను చెల్లించుటకు నిరాకరించిరి. బేరారు, అస్సాంగ్రామవాసులు మనశాసనమును తిరస్కరించి సర్కారువారిచే సంరక్షింపబడిన అరణ్యములనుండి చెట్లను నరకి తెచ్చుకొనుచుండిరి. శాసనబహిష్కారతరంగములు భారతదేశమునం దంతటను విపులముగా వ్యాపించెను. కారాగారములన్నియు సత్యాగ్రహులతో నిండిపోయెను. ప్రజలు ధనమును పోగొట్టుకొనిరి. ప్రాణములను పోగొట్టుకొనిరి. అత్యాచారములచే పీడింపబడిరి. అవమానింపబడిరి. కాని స్వాతంత్ర్య సంగ్రామముయొక్క పజ్యోతిని గాంధీజీ భారతీయులలో వెలిగించెనో యది శతసహస్రావమానములు అత్యాచారములవలనకూడ ఆర్పబడలేదు.

చూడలేకున్నాను. ముఖమును మరియొకవైపునకు త్రిప్పుచున్నాను. స్వచ్ఛాసేవకులు పోలీసులచేతులలో దెబ్బలు తినుచున్నారు. కాని వారు దానికి లవలేశక్రోధముగాని, హింసనుగాని ప్రకటించుటలేదు. గాంధీజీఅహింసానీతిలో వీరికిగల విశ్వాసమును చూచి ఆశ్చర్యాన్వితుడ నగుచున్నాను.''

జార్జిశ్లోకొంబ అను మరియొక రిపోర్టరు వ్రాసిన విషయము—"వాదలాకు నలువైపుల చుట్టబడియున్న పర్వతపంక్తులలో నొకదానిపై నేను నిలువబడి చూచుచుంటిని. నానలువైపుల యింకను అనేకమంది భారతీయులు నిలువబడియుండిరి. కాని వారిముఖములవైపునకు చూచుటకే నేను సిగ్గుపడుచుంటిని.

నా దేశవాసులు శాసనముల పేరుతో జరుపుచున్న వ్యవహారములను గాంచి నేను ఇంగ్లీషువాడనని తలంచుకొనుటచే సిగ్గుచే నాశిరము వంగిపోవుచున్నది. ఇంగ్లీషుసర్కారువారు అత్యాచారములనుగావించుచున్నారు. కాని సాధారణ యింగ్లీషువారి శిరములు సిగ్గుచే వంగిపోవుచున్నవి. అహింసనప్రభావమును మానవులహృదయములలో విస్తరింపచేయుచున్నది. ధరాసనాలోనిశక్తి సమస్తభారత దేశమును శక్తివంతముగా గావించెను. అత్యాచారములనువరించి కార్యములో నచ్చునాశన జయప్రద మయ్యెను. అహింసామార్గములవలన శాసనము బహిష్కరించు ప్రబలవాంఛ సమస్తభారత దేశమలో వ్యాపించెను. వంగ దేశమునందున మహిషబాథాక

మేదినీపూర్. ఇతర అనేకస్థలములలో లవణము తయారగుచుండెను. కేవలము లవణశాసనమేగాక, ఈసారి జాతీయ మహాసభ ప్రార్యాదేశానుసారముగా భారతీయు లితరశాసనములను, ఆ దేశములను బహిష్కరించు కార్యములలోకూడ ప్రవృత్తులైరి. స్వచ్ఛాసేవకులు సర్వత్ర గుంపులు గుంపులుగా విదేశవస్త్రముల దుకాణములలోను, విదేశసారాయి షాపులలోను 'పికెటింగు' చేయ మొదలిడిరి. గ్రామవాసులు పన్నులను చెల్లించుట మానివైచిరి. బొంబాయి, బెంగాలు, బీహారు, ఒరిస్సా దేశవాసులు ఒక్కదమ్మిడీపన్నుకూడా చెల్లించమని ప్రతిజ్ఞ గావించుకొనిరి. గుజరాట్, మహారాష్ట్రము, కర్ణాటకము, ఆంధ్ర, పంజాబు దేశవాసులు అత్యాచారులగు సర్కారువారికి పన్ను చెల్లించుటకు నిరాకరించిరి. బేరారు, అస్సాంగ్రామవాసులు మన శాసనమును తిరస్కరించి సర్కారువారిచే సంరక్షింపబడిన అరణ్యములనుండి చెట్లను నరకి తెచ్చుకొనుచుండిరి. శాసనబహిష్కారతరంగములు భారతదేశమునం దంతటను విపులముగా వ్యాపించెను. కారాగారములన్నియు సత్యాగ్రహులతో నిండిపోయెను. ప్రజలు ధనమును పోగొట్టుకొనిరి. ప్రాణములను పోగొట్టుకొనిరి. అత్యాచారములచే పీడింపబడిరి. అవమానింపబడిరి. కాని స్వాతంత్ర్య సంగ్రామముయొక్క ఏజ్యోతిని గాంధీజీ భారతీయులలో వెలిగించెనో యది శతసహస్రావమానములు అత్యాచారములవలనకూడ ఆర్పబడలేదు.

# 52
## గాంధి - ఇర్విన్ షరతు

ఆందోళనమును అణచివేయుటకు వైస్ రాయ్ ఇర్విన్ ఒకటివెనుక ఒకటి ఆర్డినెన్సులను జారీచేయుచు మొత్తం 13 ఆర్డినెన్సులను ప్రకటించెను. భారతదేశములో సాధారణ శాసనము లోపించి ఆర్డినెన్సులు రాజత్వము చేయుచుండెను.

వైస్ రాయ్ జాతీయవాదులవార్తాపత్రికలను ప్రకటించుట రద్దుచేసెను. భారతదేశములోనున్న 131 వార్తాపత్రికలనుండి 2 లక్షల 40 వేలరూపాయలు జామీనుక్రింద వసూలు చేయబడెను. సర్కారువారు జాతీయమహాసభ తాలూకు కేంద్రీయ, ప్రాదేశికప్రతిష్ఠానములను శాసనవిరుద్ధమైనవిగా ప్రకటించిరి. జాతీయమహాసభకు చెందిన ఆఫీసుల నన్నిటిని ఆక్రమించుకొనిరి. ఆఫీసులకు తాళములు వేయబడెను. కాని అహింసాసంగ్రామములో ప్రజలు ప్రతిహతులు కాలేదు. సీమాంతప్రదేశముల పఠానులహృదయములలోకూడ యీ అహింస తనప్రభావమును విస్తృతము గావించుకొనెను. పఠానులు గాంధిగారి అహింసామంత్రములో దీక్షనుబొందిరి. గుంపులుగుంపులుగా శాసనధిక్కారసంగ్రామములో దుమికిరి. అత్యాచారులు, క్రూరులు నగుసర్కారువారి క్రోధాగ్నికి ఆత్మాహుతుల నర్పించుకొనిరి.

క్రమముగా సర్కారువారి భారతీయసైనికులుకూడ అహింసాప్రభావముచే చంచలులైరి. అధికారులు యీసారి

అస్త్రధారులను, అహింసాపరాయణులను అగుపఠానుల సభలో తుపాకులు పేల్చుమని భారతీయసైనికులకు ఆదేశముల నిచ్చిరి. కాని సైనికులు ఆదేశములను నిరాకరించిరి. అమాయికప్రజలను కాల్చజాలమని జవాబిచ్చిరి. ఈఆదేశనిరాకరిణానుబదులు సర్కారువారిచ్చు శిక్షను మేము స్వీకరింతుమని సమాధాన మిచ్చిరి.

సర్కారువారు జ్ఞానశూన్యులైరి. విభ్రాంతిజెందిరి. ఇన్ని అరెస్టులు, ఇన్ని దెబ్బలు, ఇన్ని హత్యలు-అయినను వీరు ఏశక్తివలన శక్తిశాలు రగుచున్నారు?

ఉపాయహీనులగు సర్కారువారు అలసిపోయిరి. తుదకు అస్త్రశక్తి అహింసాశక్తితో రాజీపడదల్చుకొన వాంఛించెను. పశుబలము ఆత్మబలమువద్ద పరాజయమును వరించెను. వైస్రాయి విశేషప్రతినిధులను పంపించి గాంధీజీ, ఇతరనాయకులతో రాజీవిషయములనుగురించి సమాలోచనములను జరుపుచుండిరి. కాని గాంధీజీ యితరనాయకులు చెప్పినదేమనగా, 'ఒక్కషరతుతో రాజీబేరము కుదరగలదు మా దేశశాసనశక్తి మాకే ఒసగవలయును. ఈవిషయమును అంగీకరించుటద్వారానే కార్యము లోనర్పవలయును.'

కాని సర్కారువారు శక్తిని త్యజించుటకు అంగీకరించలేదు. స్వాతంత్ర్యమనే పొగను చూపించి, సద్బుద్ధి నదిచ్చులనే నెపముతో ప్రజలనుమోసముచేయ ప్రయత్నించిరి. భారతీయులకు ఎట్టిది, ఎంతవరకు శాసనాధికారములను యివ్వవచ్చునో యనుసమస్యగురించి బహిరంగాలోచనములను

గావించుకొనుటకు సర్కారువారు భారతీయనాయకులతో ఒక 'గుండ్రబల్లసమావేశమును' (Round Table Conference) ఏర్పాటుచేసిరని వైస్రాయి ప్రకటించెను.

సమావేశమునకు ప్రతినిధులను ఎన్నుకొనుటలో సర్కారువారు సంపూర్ణస్వేచ్ఛాచారమును ప్రదర్శించిరి. జాతీయవాదులగు భారతీయులను వదలివేసియే సమావేశమును నిర్మాణమును చేసిరి. 1930 నవంబరు 12 వ తేదీన ఇంగ్లాండులో ప్రథమసమావేశము జరిగెను. 9 వారములు సమావేశములో ఆలోచనలు, సంభాషణములు జరిగెను. కాని ఎట్టి మీమాంసయు జరుగలేదు.

మీమాంస చేయువారెవరు? సర్కారువారి కనుగతులగు ప్రభావలోభులగు ప్రతినిధివర్గమువారా? భారతదేశము ఆత్మగౌరవమును, స్వాతంత్ర్యమును కోరుచున్నదని సాహసముతో ఆత్మవిశ్వాసముతో చెప్పగలిగెడివా రెవరు?

ఆలోచనములు వ్యర్థము లయ్యెను. భారతదేశములో ఆందోళనములు, సంగ్రామము తీవ్రరూపము దాల్చుచుండెను తుదకు సర్కారువారు గత్యంతరములేక కారాగారమందున్న గాంధీజీ, నాయకుల శరణుజొచ్చిరి. కారాగార ఆబద్ధవాతావరణములో రాజీఆలోచనములు చెప్పినందున గాంధీజీని బేషరతుతో విడుదలచేసిరి. గాంధీజీతోపాటు ఇతరనాయకులు కూడ ముక్తినిపొందిరి. గాంధీజీ బయటికివచ్చిరి. అహింస సత్యాగ్రహి అనుతప్తులను క్షమించుటకు సంసిద్ధుడై యున్నాడు. సర్కారువారి హృదయమెంత మార్పుజెందినదో చూచెద నని గాంధీజీ నుడివెను.

వైస్‌రాయ్ రాజీబేరములను సాగించుటకు గాంధీజీని ప్రాసాదమునకు ఆహ్వానించిరి. శాంతిదూత అశాంతి నుండి శాంతిని సంపాదించుటకు వైస్‌రాయి ఆహ్వానమును అంగీకరించెను. 1931 ఫిబ్రవరి 17 వ తేదీన గాంధీజీ వైస్‌రాయిగారి ప్రాసాదమునకు పోయిరి.

15 దినములు ఆంగ్లప్రతినిధికిని, భారత దేశప్రతినిధికిని సంప్రదింపులు జరిగెను. శాసనసమస్యలను పరిష్కరించుటకు ముందు సర్కారువారు సర్వవిధములైన దమననీతిని, దుష్ట శాసనములను విరమించుకొనవలయునని గాంధీజీ వచించెను. సర్కారువారు శబ్దసదిచ్ఛలరూపమును విడనాడి ప్రకృత సదిచ్ఛలను కార్యరూపమున పరిణమింప చేయవలయును.

వైస్‌రాయ్ గాంధీజీషరతుల ననుసరించి కార్యములు గావింప నంగీకరించెను. కాని జాతీయమహాసభ, గాంధీజీ శాసననిరసనఆందోళనమును విరమింపవలయునని సర్కారు వారి పక్షమునుండి ఆయన కోరెను.

గాంధీజీ తెలియజేసిన దేమనగా – జాతీయమహాసభ వారికి ఈవిషయములో తెలియజేయుదును. మహాసభవారు నాప్రార్థనమును అంగీకరింపవచ్చును. మహాసభవారు నాకు సర్వాధినాయకశక్తి నిచ్చిరో, ఆశక్తిబలముతోనే వైస్‌రాయిగారితో సంధిగావించుకొందును. పిమ్మట మహాసభలో అంగీకరింపబడును.

ఉభయపక్షములవారు రాజీకి అంగీకరించిరి. ఉభయుల అభిప్రాయానుసారముగా 1931 మార్చి 4 వ తేదీన సంధి షరతులు రచింపబడెను. ఆషరతుల ననుసరించి సర్కారు

వారు దమననీతిని విరమించుకొనిరి. ఆర్డినెన్సులను విరమించు కొనిరి. నాయకులను, సత్యాగ్రహులను విడుదల గావించిరి. జాతీయమహాసభకు చెందిన సకలప్రతిష్ఠానములపై గల నిషేధాజ్ఞలను రద్దుపరచిరి. భారతదేశములో శాంతివాతావరణము అలముకొనెను. సముద్రతీరవాసులు లవణమును తయారుచేసుకొనవచ్చుననియు, విక్రయించుకొనవచ్చుననియు, సాధారణభారతీయులు తమవ్యక్తిగతోపయోగములకు లవణమును తయారుచేయవచ్చుననియు సర్కారువారు షరతుల ప్రకారము తెలియజేసిరి.

ఈవిధముగా దరిద్రభారతీయులు ఉప్పు తయారుచేసుకొను కోరికను నెరవేర్చిరి. గాంధిగారి లవణసత్యాగ్రహ గౌరవము రక్షింపబడెను.

గాంధీజీ ప్రాణమంతయు దరిద్రులమీదనే యుండెను. స్వాతంత్ర్యమును పొందినపిమ్మటకూడ 1947 సంవత్సరము చివరిభాగములో దరిద్రులకు నిత్యము అవుసరమగు లవణము పైనుండి పన్నులన్నిటిని రద్దుచేయమని స్వతంత్రభారత సర్కారువారిని వేడుకొనిరి. జీవితములో అంత్యదినమువరకు దరిద్రభారతీయులకు సులభముగా అన్నము, వస్త్రము, లవణము సమకూర్చువిషయము ఆయన మరచిపోలేదు. నాయకులను విడుదలచేసి సర్కారువారు జాతీయమహాసభకు తెలియజేసిన దేమనగా — శాసనవిషయములో సిద్ధాంతములను నిర్ణయించుటకు వారు మరియొక 'రౌండుటేబిల్ కాన్ఫరెన్సు' యేర్పాటుచేయుటకు కోరుచున్నాను. దీనిలో మహాసభ వారుపంపిన ప్రతినిధులను అంగీకరించుటకు సిద్ధముగా నున్నాము.

ఇంగ్లీషువారి ప్రతిపాదనవిషయమైయేర్పాటుగావించు

టకు నియమితసమయమునకు జాతీయమహాసభ కార్యకర్తలు సమావేశమైరి. మహాసభ విశేషాలోచనములను సాగించిన పిమ్మట గాంధీగారి సంధిషరతులను అంగీకరించెను. రెండవ ప్రతినిధుల్ల సమావేశములో పాల్గొనుటనంగీకరించి సర్కారు వారిప్రతిపాదనలు ఆమోదింపబడెను. మహాసభకు మహాత్మా గాంధీజీని ఏకైకప్రతినిధిగా ఎన్నుకొనిరి. మహాసభతరఫున రౌండ్ టేబిల్ కాన్ఫరెన్సులో పాల్గొనుటకు ఆయనను వేడు కొనిరి. గాంధీజీ మహాసభప్రతినిధిగా ఇంగ్లాండు పోవుటకు సంసిద్ధులైరి.

ఇంతలో జాతీయమహాసభకు చెందిన వామపక్షదళము వారు గాంధీగారిద్వారా శాసనబహిష్కరణ ఆందోళనమును విరమించుటవలన గాంధీగారి సంధిషరతులను తీవ్రముగా విమర్శించిరి.

స్వభావసిద్ధమైన ప్రశాంతధైర్యముతో సంధికి కారణము గాంధీజీ వారికి తెలియజేసెను. దేశము దరిద్రమైనది. దాదాపు రెండువందలసంవత్సరములనుండి విదేశపరిపాలనము పీడింపబడుచున్నది. వంచింపబడుచున్నది. ప్రస్తుతసత్యాగ్రహమువలన దేశీయులు నేడు విశేషముగా పీడింపబడుచున్నారు. సంధిద్వారా, సంభాషణములద్వారా, ఆలోచనములద్వారా, దేశవాసులలో రక్తపాతము లేకుండ స్వాతంత్ర్యము సంపాదింపగలిగిన యెడల, అహింసాసేవకులు ఆమార్గమును అవలంబించుట ఉచితము. సత్యాగ్రహికి తనసత్యమే అన్నిటికంటె ప్రియమైనది. సర్కారువారు ప్రకృతశాంతిని కోరకయున్న యెడల, భారతీయులకు అధికారముల నిచ్చు

టకు ఉద్దేశించనియెడల, మరల సత్యాగ్రహము ఆరంభించు టకు ఎట్టిసందేహము లేదు.

సత్యాగ్రహిగా ఆయన యీసమయములో మరియొక మార్గము నవలంబించెదనని తెలియజేసిరి. ఆయన ఇంగ్లాండు ప్రజలకు భారతీయులసందేశములను వినుపింతురు. భారతీయుల వాంఛలను తెలియజేయుదురు. సర్కారువారి అసత్యఅన్యాయముల అత్యాచారములవిషయము ఇంగ్లాండులో ప్రచారము చేయుదును. అని ఆయన తెలిపెను. సత్యముద్వారా అచ్చటి ప్రజలకు సర్కారువారి అన్యాయ... లను గురించి తెలియజేసి ప్రతీకారమును విజ్ఞప్తి చేయుదురు.

వామపక్షమువారు నిరుత్తరులైరి. గాంధీజీ అవలంబించిన ప్రణాళికపరిణామము పరిశీలించుటకు ఆయనను విమర్శించుట విరమించిరి.

గాంధీజీ 1931 సంవత్సరము ఆగష్టునెల అంతములో బొంబాయి రేవులో స్టీమరుపై నెక్కిరి. ఇంగ్లాండుమార్గములో యాత్రి నారంభించిరి.

—:0:—

## 53

# రెండుచేతులు మోసము

విశ్వవాసులు భారతఋషీశ్వరుని అహింసాసందేశమును ఆకర్షించిరి. సత్యాగ్రహములో అపూర్వసంగ్రామవిషయము గుర్తెరింగిరి. నిష్క్రియప్రతిఘటనవిషయము గ్రహిం

చిరి. సమస్తప్రపంచములోని పీడితప్రజలు గాంధీగారి అహింసా సందేశములో ముక్తిమార్గమును కనుగొనిరి. ఆశాజ్యోతిని దర్శించిరి.

అందువలన గాంధీగారి ఓడ అచ్చటచ్చట రేవులలో నిలుపబడుచున్నప్పుడు ప్రతిదేశమునుండియు గుంపులు గుంపులుగ ప్రజ రేవుస్థానములకు పరుగిడివచ్చిరి. లక్షలాదికంఠములతో జయధ్వనిని గావించిరి. 'అసహాయోద్యమనాయకునకు జయము కలుగుగాక! గాంధీజీకి జయము కలుగుగాక!'

ప్రాచ్యదేశశాంతివిజయములకు అవతారమూర్తియైన గాంధీజీ స్నిగ్ధ వదనముతో, నతమస్తకముతో మహత్తరజన సంఘమునకు అభివాదనములు తెలియజేసిరి. ఓడ మిశరదేశమునకు చేరెను. మిశరవాసులు ఖిలాఫతుసమర్థనకారులును, సహాయకారులును అగు సాధారణప్రజలకు ప్రియనాయకునకు స్వాగత మిచ్చుటకు ఏర్పాటులు గావించిరి. మిశరదేశ గౌరవనీయనాయకుడు నాహాస్ పాషా ఓడలో ప్రవేశించి ప్రజాపక్షమున సత్యదూతకు స్వాగతమిచ్చిరి. అభినందనము వలన లజ్జచెందిన గాంధీజీ చేతులు రెండును జోడించుకుని పలుమార్లు క్షమాపణ కోరుకొనెను. 'నేను సాధారణప్రజల సేవకుడనుమాత్రమే. నేను దీనికి యోగ్యుడను కాను, అని నుడివెను.'

ఓడ మార్సెల్సు రేవులో నిలువబడెను. గాంధీజీ ఓడనుండి క్రిందికి వచ్చెను. ఫ్రాన్సుదేశనాయకులు, మహానుభావులు గాంధీజీని దర్శించుటకు పరుగిడివచ్చిరి. ఫ్రాన్సుదేశవిశిష్టుడును,

మహాజ్ఞానియు, పండితుడును, జగత్ప్రసిద్ధసాహిత్యవిశారదుడును అయిన రోమేన్ రోలెండువచ్చి శ్రద్ధావనతచిత్తముతో స్వాగతపత్రము సమర్పించెను. అందిట్లుల నుడివెను. 'నలుబది కోట్ల ప్రజలను ఆత్మపరిశోధనములచే మేల్కొల్పినవాడవు నీవు, సమస్త బ్రిటిషుసామ్రాజ్యమును, కంపింపజేసినది నీవు, మానవుని రాజనైతికవ్యాపారములలో రెండువేలసంవత్సరములలో అన్నిటికంటె శక్తివంతమైన నైతిక ఆందోళనాదర్శములను ప్రవర్తింపజేసినది నీవు, పండితవరేణ్యుడు రోమేన్ రోలెండు గాంధిగారి ఆదర్శములను, ప్రణాళికలను గాంచి విముగ్ధుడయ్యెను. గాంధీజీ ఆయనతో కొన్నిరోజులు గడపిరి. ఇద్దరుమహానుభావులు పరస్పరులను గ్రహించుటకు అవకాశము కలిగెను. గాంధీజీ ఆనందవదనముతో రోలెండును ఆలింగనము గావించుకొనెను.

స్టేషనులో దీనబంధు ఆండ్రూసు గాంధీజీకి స్వాగతమిచ్చుటకు కాచుకొనియుండిరి. ఆండ్రూసుగారు ఆఫ్రికా సంగ్రామములో గాంధీజీకి సహకారిగా నుండెను. భారతదేశములో నిర్మాణకార్యక్రమములో ఆయన గాంధీజీకి విశేష సహాయము చేసియుండిరి. మలబారు విప్లవసమయములో ఆయన గాంధీజీసలహాలు ఉపదేశముల ననుసరించి నిపీడిత హిందూ మహమ్మదీయులకు అనేకవిధముల సహాయము చేసియుండిరి. గాంధీజీని గురించి ఆండ్రూసుగారు ఒసంగిన సందేశములు భారతదేశమహామానవునియెడల సత్యమైన సన్యమైన శ్రద్ధాగౌరవములకు నిదర్శనములై యున్నవి.

ఇంకా క్రీస్తు నుడివిన విషయములు- 'నాయనో జగత్తునందు మహాత్మాగాంధీ రచించిన గ్రంథముల సమావేశము ఎల్లు సంఘ బహిష్కృతులు దరిద్రులును, అభాగ్యస్తులును, పీడితులును అయినవారియెడల, దుర్దశాగ్రస్తమానవులయెడల గంభీరమైన, హృదయపూర్వకమైన అనేకనిదర్శనములు వీరుభయులమధ్యను దర్శించితిని.

'మహాత్మాగాంధీగారి జీవితములో ప్రథమగంభీరతమ అనుభూతి దుర్దశాగ్రస్త, దరిద్రనిపీడితమానవులను కేంద్రము గా గావించుకొని వికసించినది. దక్షిణాఫ్రికాలో ఆయనతో ప్రవాసకాలమందున్నప్పుడు ఆయనయందుగల యీమహత్తర సానుభూతినిగురించి గ్రహించితిని. జాతివర్ణభేదములేక దరిద్రులపై ఆయనకారుణ్యము ప్రవాహమువలె ప్రవహించినది. అసహాయోద్యమఆందోళనసమయములో తమిళశిశువులు ఎల్లప్పుడు ఆయనచుట్టూ ఉన్నటుల అనేకసారులు గాంచితిని. కూలీలపై ఆయనకు గల ఆంతరికప్రేమ ఎంతోగభీరమైనది. ఆర్తమానవులపై ఆయనకారుణ్యము అపారమైనది. దారిద్ర్యనిపీడితులపై ఆయనకుగల ప్రేమనిష్ఠల నిదర్శనములు విస్మయకరమైనవి. భారతదేశములో ప్రవేశించినది మొదలు ఆయనయందుగల యీవిషయములు ప్రకటితమగుచుండెను. వాక్యములకంటె కార్యములద్వారముననే పీడిత, బాధిత, అసమర్థ, రుగ్ణ, అసహాయప్రజలపై ఆయన అపారకారుణ్యము అనంతముగా ప్రవహించెడిది.

"అస్పృశ్యతానివారణ ప్రథమకర్తవ్యమని ఆయన ఏల నుడివెను? మత్తుపదార్థములు, పానీయములు విసర్జించుటకు బలవంతమేల పెట్టుచున్నారు? చరకాపై నూలు వడికి వస్త్రములను నేయు నేర్పాటుచేయుట, కుటీరపరిశ్రమలను ప్రవర్తింపచేయుట ఆయనకర్మపద్ధతులలో శీర్షస్థానమేల పొందినది? దీనికొరకు ఆయన అర్థనీతిపై నేరము వేయలేదు. రాజనైతిక కారణములు కూడ ఆయనకు ప్రధానమైనవిగా నగపడలేదు. నిజముగా దీనిప్రయోజనములు సంపూర్ణముగా ఆయనకు ధర్మమూలకమైనవిగా కనుపించెను. దరిద్రితమ భారతీయగ్రామవాసులను దారిద్ర్యపాశములనుండి విముక్తి పరచుటకు ఇదియే ఉత్తమమార్గమని ఆయన గ్రహించెను. ఈమార్గమువలన వారు తమకుటుంబములకు అవుసరమైన అన్నవస్త్రములను సంపాదించుకొనగలరు. అర్థాహారముతో, నిరాహారముతో, సంపూర్ణముగా అనాహారులై యున్నవారు దుఃఖదారిద్ర్యములనుండియు ఋణభారములనుండియు ముక్తిని పొందుదురు."

"అస్పృశ్యతానివారణ ప్రాధాన్యత వహింపక జాతీయ ఆందోళనము ముఖ్యఉద్దేశ్యముగా పరిణమించుచున్నదనియు, రాజనైతిక ఉద్దేశ్యమే ప్రాధాన్యత వహించుచున్నదనియు నేను ఉత్తరము ద్వారా గాంధీజీకి తెలిపియుంటిని. ఈ ఆందోళనముతో ఆయనకు సంబంధమున్నంతవరకు ఇట్టి శంకకు ఎట్టి కారణము లేదని ఆయన ప్రత్యుత్తరము వ్రాసెను. ఆయన జీవితములో నిగూఢతమసత్తా యీ సమస్యలతో కేంద్రీ

కృతమై యున్నది. ఈవిషయములో ఆయనకు అత్యంతగభీర మైన అనుభూతి యుండుటచేతనే అంతగా వాగాడంబరము చేయుట లేదు.

"నేను వ్రాసిన ఉత్తరములో మరియొక విషయమును వ్రాసియుంటిని- మత్తుపదార్థములు, సురాపానమునుగురించి మహాత్మాగాంధి పానదోషవిసర్జనవిషయములోకూడ సమాన గురుత్వమునే ఆరోపించెను. సురా, మత్తుపదార్థములు ఉప యోగించుటవలన భారతదేశము త్వరితగతిని అధోమార్గ మున అగ్రిసర మగుచున్నది. మహాత్మాగాంధీజీ సాధ్యమై నంతవరకు ఈమురసస్థలనుండి విముక్తికొరకు ప్రియత్నించు చున్నారు. ఈపానదోషము, మత్తుపదార్థముల నిషావలన దరిద్రిలు ఏవిధముగాకూడ దుఃఖదైన్యములనుండి విముక్తిని పొందజాలరు. మహాత్మాగాంధీవంటి దరిద్రిబాంధవుడు ప్రపం చములో నేను ఎరుగున్నంతవరకు ఎచ్చటను లేడు. ఆయన వలె దరిద్రిలకొరకు జీవితకాలమంతయు వారెవరును ప్రయ త్నించలేదు."

(ఆండూ్రిగారి వ్యాసము)

ప్రిజల, మహానుభావుల శ్రిద్ధాగౌరవములను బడసి గాంధీజీ రైలుబండిలో ప్రివేశించెను. రైలు నడచుచు ఏయే స్టేషనులలో నిలువబడుచుండెనో, ఆయాస్థానములలో ప్రాంసు దేశపుప్రజలు గుంపులుగుంపులుగా సమావేశ మగుచుండిరి. గాంధీజీకి మహదానందముతో అభినందనములను తెలియజేసిరి రైలు బొలొస్టేషనుకు చేరెను. గాంధీజీ 'ఇంగ్లీషుచానల్'

డాయుటకు రైలునుండి దిగిరి. యువకులు, వృద్ధులు, శిశువులు, స్త్రీలు ఆయనచుట్టూ మూగిరి. ఆయనను హృదయపూర్వక శ్రద్ధాగౌరవమును తెలియజేసిరి.

తుదకు భారతశాంతిదూత సెప్టెంబరు 12 వ తేదీన ఆంగ్లభూమిపై అడుగు పెట్టెను.

అత్యాచారులగు శాసకదళమువారుగాక, సానుభూతి గల ఆంగ్లప్రజలు వచ్చి గాంధీజీకి నలువైపుల మూగిరి. గాంధీజీ స్నిగ్ధవదనముతో వారిపై హృదయపూర్వకప్రీతిని తెలియజేసెను.

ధనికులగు ఆంగ్లేయులు, సద్వంశజులగు ఆంగ్లేయులలో పోటీ ఆరంభమాయెను. గాంధీజీని ఎవరు తీసుకొని పోవుదురు. తమ మహోత్తరభవనములలో ఆతిథ్యము నెవరిత్తురు?

కాని అందరిని నివృత్తిచేయుటకు గాంధీజీ ఒసగిన జవాబు: 'నాభారతదేశము నేడు పీల్చబడి దారిద్ర్యదశలో నున్నది. నేను ఆదరిద్రదేశమునకు చెందిన దరిద్రభారత ప్రతినిధిని. నాదరిద్రదేశవాసుల అభావఅభియోగములను గురించి మీకు తెలియజేయుటకు వచ్చితిని. నా దేశమును మరచి మీప్రాసాదముల ఐశ్వర్యములలో నేను వసింపజాలను. నేను దరిద్ర ఆంగ్లసోదరీ సోదరులతో వసించెదను. గాంధీజీ తన సంకల్పములనుగురించి వినయపూర్వకముగా నివేదించుకొని ఇంగ్లాండులోని సాధారణప్రజల పల్లెగ్రామములో వసించుటకు పయనమైరి. 'మిస్. మురియెల్ లిస్టర్ అను ఆంగ్ల

న హేళవియొక్క 'కింగ్స్లేహాల్' అను గృహములో ఆయన తిరిగి వచ్చువరకు నివసించిరి.

గాంధీజీ స్వభావము, ఆదరణ, సంభాషణములవలన ఇంగ్లాండులోని పల్లెగ్రామములవారందరును అత్యంతానందభరితులైరి. వారు గాంధీజీని తమ ఆత్మీయునిగా భావించుచుండిరి. చిన్న చిన్న పిల్లలుకూడ ఆయనను ప్రేమించుచుండిరి. నలువైపుల నున్న పల్లెగ్రామములనుండి చిన్నచిన్నపిల్లలు వచ్చి సకలసమయములలో ఆయనవద్ద కూర్చుని కథలను వినుచుండువారు. శిశువువంటి సరళహృదయముగల గాంధీజీ శిశువులకళేముతో మనసార కలిసిపోవుచుండిరి.

'మిస్ మురియల్ లిస్టారు' యొక్క 'కింగ్స్లేహాలు'కు తల్లిదండ్రులతోపాటు కుమారులు కుమార్తెలుకూడ వచ్చుచుండువారు. వీరు గాంధీజీని ఏదృష్టితో చూచుచుండువారో తెలియజేయుటకై ఒకటి రెండు దృష్టాంతములను చూపుచున్నాను. గాంధీజీని చూచినప్పటినుండి పిల్లలమనస్సులు ఆయననుగురించిన భావములతోనే నిండియుండెను. ఒకసారి ఒకపిల్లవాడు యింటికివచ్చి తనతల్లిని యిటుల ప్రశ్నించెను.

అమ్మా, గాంధీ ఏమి తిందురు? ఆయన కాళ్ళకు చెప్పులు వేసుకొనడేమి?

గాంధి అనుమాటవిని, 'గాంధీ అని ఎప్పుడును పిలువకుము' అని తల్లి నుడివెను. గాంధీ చాలామంచివారు అని చెప్పెను.

'సరే నమ్మా, ఈసారినుండి ఆయనను 'గాంధిబాబయ్యా' అని పిలిచెదను' అని చెప్పెను.

ఈవిధముగా గాంధీజి ఇంగ్లీషుపిల్లలలో 'గాంధీబాబయ్యా' యని పరిచితులైరి.

గాంధీజీజన్మదినమున ఆయనకు ఆంగ్లపిల్లలు అనేక బహుమానములను పంపియుండిరి. కొందరు పరమాన్నమును కొందరు ఆటవస్తువులను సమర్పించుకొనిరి. గాంధీబాబయ్యా నీజన్మదినమున పాటలుపాడి వినిపించెదమని కొందరునుడివిరి. మైనపువత్తులను వెలిగించి ఉత్సవము చేసుకొందుము అని వారికొందరు వచించిరి. అందరికంటె ఒకబాలుడు తమాషా చేసియుండెను. అతడు ఒకరోజున తనతల్లిపై దెబ్బలు వేయుచుండెను. తల్లి నివారింప ప్రయత్నింపగా అతడు చెప్పిన విషయము-అమ్మా, తిరిగి నన్ను కొట్టకుము, ఎందుకనగా దెబ్బలుతిని తిరిగి కొట్టవద్దని గాంధీజి చెప్పియున్నాడుకదా.

ఆయనజన్మదినమున ఒకబాలుడు ఒకవ్యాసమును వ్రాసెను. దానిలో రచించిన విషయము- 'మిస్టర్ గాంధీ భారతదేశస్థుడు, రౌండుటేబిల్ కాన్ఫరెన్సులో పాల్గొనుటకు ఆయన ఇంగ్లాండుకు వచ్చియున్నారు. భారతదేశస్వాతంత్ర్యమును సంపాదించుటకు ఆయన వచ్చియున్నారు. తనసర్వస్వమును త్యాగము చేసియున్నారు. దరిద్రతమభారతీయులలో ఒకరుగా ఉండుటకు ప్రయత్నించుచున్నారు. ఆయనఆహారము మేకపాలు, ఫలములు. గాంధీజీ చేపలు మాంసము భుజించరు.

జీవహింసలో ఆయనకు నమ్మకము లేదు. గాంధీజీ ఉత్తములైన సత్పురుషుని తోచుచున్నది. గాంధీజీ భారతీయులకొరకు సుఖస్వచ్ఛందముల జీవితమును త్యజించినారు.

ఈవిధముగా మహాత్మాజీ ఐంద్రజాలికదండస్పర్శ చేత ఇంగ్లాండులోని శిశువుల మనస్సులలోకూడ ప్రేమమంత్రమును ప్రయోగించెను.

గాంధీజీ ఆవాసగృహము ఇంగ్లాండు ప్రజలకు తీర్థస్థానమువలె నుండెను. గాంధీజీదర్శనమువలన ఆంగ్లదేశసాధారణ ప్రజలు తన్మయులైపోయిరి. ఈనిత్యప్రశాంత మధురభాషియగు మనుజుడు భారతవర్షమునుండి ఆంగ్లశాసనమును కూకటివేళ్ళతో సహా పెకలించుటకు తహతహలాడుచున్నాడనియు, ఈశీర్ణదేహ అర్ధనగ్నసాధారణమనుజుడే అసాధారణకార్యక్రమముతో ఆంగ్లేయులను భారతదేశమునుండి తరిమివేయుటకు ప్రతిజ్ఞాబద్ధుడైనాడనియు వారు గ్రహించిరి. వారు గాంధీజీవద్దకు వచ్చిరి. గాంధీగారిముఖతః భారతదేశ దుఃఖదారిద్ర్యములవిషయము ఆకర్ణించిరి. భారతదేశమహత్త్వము, శ్రేష్ఠత్వమునుగురించి సవిస్తరముగా గ్రహించిరి. వారు భారతీయుల సుఖదుఃఖములను గురించి వినుటకు శ్రోతలైరి. దుఃఖార్తుల, నిపీడితుల భారతీయుల క్షేమమునే కోరిరి.

మహామానవుని మాహాత్మ్యమువిషయము బకింగ్ హామ్ ప్రాసాదములోని తోరణముల నతిక్రమించి బ్రిటిషుసమ్రాట్టు కర్ణగోచరము అయ్యెను.

సమ్రాటు విస్మయ మొందెను. ఆశ్చర్యాన్వితు డాయెను. ఆయన కోటానుకోట్ల భారతీయులను ప్రపంచవ్యాప్తముగ బ్రిటిషుశాసనయులకు ప్రతికూలముగా విప్లవము సృష్టింపగలశక్తి ఆమానవునిలో నిహితమై యున్నది. అదెంతటి మహత్తరమైనదో గదా! అహింసా అసహాయోద్యమ మంత్రములో ఎంతమహత్తరమైన శక్తి యున్నదోగదా! దాని ఇంద్రజాలమువల్లనే ఆంగ్లేయుల తుపాకులు, ఫిరంగులు నిశ్శబ్దమైపోయినవి. ఆ ఆడంబరశూన్యమగు క్షుద్రమానవునిలో ఎంతఐశ్వర్య మున్నదోగదా? తత్ఫలితముగానే ఆంగ్లేయ ప్రజలు ఆయనగుణగణములను గాంచి విముగ్ధులైరి. పంచమ జార్జి తనవిస్మయనివారణకు భారతదేశ అర్ధనగ్నఫకీరుని తన రాజప్రాసాదమునకు ఆహ్వానించెను.

గాంధీజీ సమ్రాటుని ఆహ్వానము సంగీకరించెను. రాజప్రాసాదమునకు పోయిరి.

భారతదేశదరిద్రుల అవతారమూర్తి సమ్రాటుని ద్వారమువద్దకు హాజరయ్యెను. పాదములకు చెప్పులు, నడుమును లజ్జానివారణకు వస్త్రఖండమును దేహమున శుభ్ర వస్త్రము, నగ్నమస్తకముతో అచ్చటికేతెంచెను.

ఏమియులేదు, కాని సమస్తమును ఉన్నట్లేయుండెను.

శూన్యమూర్తి, అయినను రాజైశ్వర్యములో నలంకరింపబడినట్లుండెను. మృదుమందప్రశాంతహాసము, వదనమండలమున స్వర్గజ్యోతి వెలుగుచుండెను.

పంచమజార్జి, స్త్రమ్రాజ్ఞి మేరి ఆయన ప్రథమదర్శనము వల్లనే విముగ్ధులైరి. అగ్రగణ్యులై వచ్చి మహాసమానవునిహ స్తమును పట్టుకొనిరి. శ్రద్ధాపూర్వకముగా 'షేక్ హ్యాండు' ఇచ్చిరి. భారతదేశ సాత్విక ఆత్మప్రభావము బ్రిటను తామసిక, రాజసిక ఆత్మపై జయస్తంభమును స్థాపించెను. ఇంగ్లాండులో విశిష్టవ్యక్తులు అప్పుడప్పుడు గాంధిగారిని దర్శించుచుండిరి. సుప్రసిద్ధలేఖకుడును, పండితుడునైన జార్జిబర్నార్డుషా ఆయనను దర్శించిరి. మహానుభావుడగు షా గాంధీగారి మహత్తరప్రయత్నములకు హృదయపూర్వక సానుభూతిని ప్రకటించిరి. ప్రసిద్ధలేఖకుడును, కార్మికనాయకుడునైన హారోల్డులాస్కీవచ్చి భారతస్వాతంత్ర్యమునుగురించి ఆయన అనేకాలోచనలను గావించిరి. విశేషగౌరవనీయులగు అమెరికా, జర్మనీవారుకూడ వచ్చి ఆయనతో వివిధములైన ఆలోచనములను గావించి ప్రీతి చెందిరి. గాంధీజీ తనమధురమైన, నిష్కపటమైన ప్రవర్తనవలన అందరిని విమోహితులనుగా గావించెను.

కాని సాధారణ అసాధారణమైన సకలశ్రద్ధాగౌరవముల కంతరాళమున సామ్రాజ్యవాదులగు శాసకగోష్ఠివారి కుటిల, కాఠిన్య పూర్ణమైన మాయ ఆలోచనములు ఫల్గునదిగు ప్తధారలవలె ప్రవహించి పోవుచున్నది.

శాసకులు సమావేశమునకు ఏర్పాట్లు గావించిరి. సెప్టెంబరు ఆఖరున సమావేశము జరిగెను. గాంధీజీగారి బే

సర్కారు భారతీయులపక్షమున మదనమోహనమాలవ్యా, శ్రీమతి సరోజినీనాయుడు, ఈసమావేశములో పాల్గొనిరి. పండిత మదన మోహనమాలవ్యా హిందూప్రజలలో పురుషుల ప్రతినిధిగాను, సరోజినీనాయుడు స్త్రీలకు ప్రతినిధిగాను వచ్చి యుండిరి.

సమావేశములో బ్రిటిషు ప్రతినిధులు, భారత దేశ సర్కారు, దేసర్కారుడళము వారు సమావేశమైరి. 11 వారములు సంప్రదింపులు జరిగెను. గాంధీజీ ఆవేగపూర్ణభాషలో బ్రిటిషువారి శుభబుద్ధికి నచ్చునట్లు నివేదన గావించుకొనిరి. 'దాదాపు 200 సంవత్సరములు భారత దేశమును పరిపాలించి మీరు భారత దేశమునుగురించి, భారతసభ్యత, సంస్కృతీ విషయములనుగురించి విశేషముగాగ్రహించితిరి. మేముకూడ మిమ్ములనుగురించి చాలవిషయములను తెలుసుకొంటిమి. అందువలన నేడు నేను వినయపూర్వకముగా నివేదించుకొను చున్నాను. భారత దేశమంగళముకొరకు భారత దేశమునకు ముక్తినిండు. స్వతంత్ర, శక్తిశాలియగు భారత దేశము భేచ్ఛలను స్నేహమును, ప్రీతినిపొంది ఫల మనుభవించుటకు భారత దేశమును తన గౌరవస్థానమున ప్రతిష్ఠితము చేయుటకు సహాయము చేయుడు. భారత దేశము మీావిషయమును శాశ్వతముగా జ్ఞాపకముంచుకొనును. చిరకాలము మీాస్నేహమును కాంక్షించును. చిరకాలము మీాకు సహాయము చేయును. భారత దేశము యొక్క యీ బాంధవ్యమును తృణీకరింపవలదు.'

గాంధీజీ రౌండు టేబిల్ కాన్ఫరెన్సు వివిధసమావేశములలో ఉపన్యాసములను గావించిరి. వాటినుండి విశేషభాగముల నిట ఉదహరించుచున్నాను– "ప్రథమమున భారతజాతీయమహాసభా పరిస్థితులవిషయము మీకు నివేదింప అనుమతి జెందుచున్నాను. పరిష్కారసహకారభావముతో నే యీ రౌండుటేబిల్ సమావేశములో పాల్గొనుటకు లండను వచ్చితిని. పరిష్కారమార్గములను వెదకి కనుగొనుటకే సర్వవిధముల ప్రయత్నించుచుందును. ఈసమావేశములో ఎట్టిపరిస్థితులలో నైనను అధికారులకు తొందర కలిగించునట్టి అభిప్రాయము నాకు లేదని నాసహకారులుగా యిచ్చటికి వచ్చినవారికిని, సమ్రాట్టుని సర్కారువారికిని అభయదాన మొసంగుచున్నాను. మనమనస్సులలో ఎట్టిభేదాభిప్రాయము లేర్పడినను నేను వాటిని ఆటంకపరుపను. నేను ఈసమావేశకార్యములలో ఉపయోగపడుట లేదని గ్రహించినప్పుడు, యీ సమావేశమునుండి తొలగిపోవుటకు ఎంతమాత్రము సందేహింపను. అందువలన నీసమావేశపరిచాలనాభారమును వహించినవారికి నేను నివేదించుచున్న దేమనగా– అట్టిపరిస్థితులు సంభవించినప్పుడు నేను ఈసమావేశములో నుండుట అనావశ్యకమని గ్రహించునట్లు వారు చేయవలెను. నేను ఆవిషయమును గ్రహించిన ముహూర్తముననే నిస్సందేహముగా ఈసమావేశమునుండి తొలగిపోవుదును.

"నేను ఈవిషయమును నుడువుటకు కారణము— సర్కారువారు, కాంగ్రెసువారిలో మూలగత అభిప్రాయ భేదము లున్నవని గుర్తించుట నేనెరుగుదును. నాసహకారుల అభిప్రాయములకు, నాఅభిప్రాయములకు విశేషభేదము లుండ వచ్చును. అదిగాక ఇష్టానుసారముగా ప్రవర్తించుటకూడ నాకు అధికారములేదు. భారతజాతీయమహాసభకు నేను ఒక క్షుద్రప్రతినిధినిమాత్రనే. కాంగ్రెసు అనగా నేమియో, కాంగ్రెసు ఏమి చేయగోరుచున్నదో యిచ్చట తెలియజేయ గోరుచున్నాను. అట్లైనయెడల తమసానుభూతిని పొంద గలనుకూడ. నాపై మోపబడిన భారము అత్యంతగురుతర మైనది.

"కాంగ్రెసు ఏవాంఛను కోరుచున్నదో దానికి యో గ్యతనుకూడ సంపాదించినదని కాంగ్రెసునుగురించి ఉదా సీనులు కానివారు గ్రహింపగలరు. కోరికప్రకారము కార్యము లొనర్పబోయి అది పలుమార్లు వ్యర్థమాయెను. కాని కాం గ్రెసు యితిహాసమును చక్కగా పరిశీలించి చూచినయెడల దాని యితిహాసములో సాఫల్యతయే అధికమని నేను దృఢ ముగా చెప్పగలను, వ్యర్థత కాదు— క్రమముగా అది సాఫ ల్యతవైపునకే నడచుచున్నది. భారతదేశమందలి లక్షలాది గ్రామములలో వ్యాప్తమైయున్న వ్యధితులు, క్షుధార్తులు నైన లక్షలకొలది ప్రజలకు ప్రతినిధిత్వమునే కాంగ్రెసు వహిస్తున్నది.

వారు బ్రిటిషుభారతీయులాక లేక భారతీయసామంత రాజ్యప్రజలాక అనువిషయములో దానికెట్టిలక్ష్యమును లేదు. బాహ్యాకముగా స్వార్థముకందు కొన్ని ఆఘాతములు సర్వదా దృష్టిగోచరమగుచుండును. ఈ ఆఘాతములు ప్రకృతఆఘాతములు కానియెడల, కాంగ్రెసు వద్దిర, హానిప్రతుల స్వార్థ రక్షణకొరకు సమస్తస్వార్థమును విసర్జించుటకు సందేహింపదని నేను కాంగ్రెసుపక్షమున నిస్సంకోచముగా నుడువుచున్నాను. కాంగ్రెసుసందేశమును నేను మీవద్ద పఠించునప్పుడు బహుశా మీకు ఆశ్చర్యము కలుగదు. మీకట్టిక్రియములకు కఠినముగాకూడ నుండదు. కాని కాంగ్రెసు కోరుచున్న కోరికలు నిలువజాలవు అని మీరుతలంపవచ్చును. కాని నేను అత్యంతదృఢత్వముతో కాంగ్రెసుపక్షమునుండి యీకోరికలను మీవద్ద హాజరుపరుచుచున్నాను. మీరు నా అభిప్రాయములు భ్రమపూర్ణమైనవనిగాని, భారతీయమాగప్రజల స్వార్థపూర్ణమైనవనిగాని, నిర్ణయించినయెడల, నేను నాఅభిప్రాయములను మార్చుకొనుటకు సంసిద్ధుడనై యున్నాను. అటులైన ఏపరివర్తనమైనను గావించుటకు ముందు నన్ను యిచ్చటికి పంపించినవారి అనుమతిని పొందవలసియున్నది. భారతజాతీయమహాసభసమితిలో అంగీకరింపబడిన తీర్మానమును ఇచ్చట పఠించుచున్నాను— ‘‘సర్కారువారికి, కాంగ్రెసువర్కింగుకమిటీవారికిమధ్య తాత్కాలికపరిష్కారమునకు గావింపబడిన వ్యవస్థలను గురించి ఆలోచించి కాంగ్రె

సువారు స్పష్టముగ చెప్పదలచిన దేమనగా — కాంగ్రెసుయొక్క పూర్ణస్వరాజ్యఆదర్శము అవ్యాహతమై యున్నది. బ్రిటిషుగవర్నమెంటుప్రతినిధులు, కాంగ్రెసుప్రతినిధులు ఏ సమావేశములోనైన, ఎన్నడైన సమకూడినయెడల కాంగ్రెసుప్రతినిధి యీఆదర్శముల సాఫల్యతకొరకే ప్రయత్నింపవలయును. ఆయుధములవలన భారతదేశమహాసభపరాధీనము చేసియుంచుట సాధ్యమనుమాటనిజము. అనగా గ్రేట్‌బ్రిటను ఔన్నత్యమునకును, దాని ఆర్థికస్వాతంత్ర్యమునకును అత్యంతావశ్యకమైన దేది? పరాధీనమైన విద్రోహకరమైన భారతదేశమా? లేక శక్తిశాలియైన సమభాగముగల భారతదేశమా?"

సామ్రాజ్యకాంక్షచేతను, శోషణమోహముచేతను అంధులైన మదోన్మత్తులైన ఆంగ్లశాసకుల కఠోరహృదయములు శాంతికాముడగు మహాత్మునీ, మహామానవుని ప్రార్థనవలన విగళితములు కాలేదు.

రసహీనప్రస్తరస్తూపములు జలసేచనవలన సిక్తములగునా? స్వార్థపరులగు శాసకదళమువారు తమకౌశలము, కుటిలబుద్ధిద్వారా ప్రేరేపితులై తమకోరికలను మధురవాక్యములద్వారా ఆవృతముచేసి భారతీయులపై బరువుమోపకోరెను. మహామానవునిసందేశమును నిరాకరించెను. మహామానవుని నిరాకరించి భారతదేశకోటానుకోట్లప్రజల ఆశా ఆకాంక్షలను నిరాకరించిరి.

బ్రిటీషు అధికారులు భారత పరిపాలనము కొరకు సంయుక్త రాష్ట్ర నిర్మాణమును గురించి ప్రతిపాదన గావించిరి. కేంద్రీయ శాసనాధికారము-గోరుచూ సకల ప్రదేశముల స్వాయత్త శాసన నిర్మాణమును గురించి ప్రకటన చేసిరి. కాని అన్నిటికి పై అధికారము బ్రిటిషువారికే ఉండవలెనని చంద్రకాంతము గావించిరి. గవర్నరు, గవర్నరుజనరలు ఆధిపత్యమును స్థిరముగానుంచునీతిని అవలంబించిరి. ఇదిగాక హిందూమహమ్మదీయుల అధికార అనధికారముల ప్రశ్నలను లేవదీసి సాంప్రదాయిక భేదముల అగ్నిలో ఆహుతి నర్పింప సంకల్పించిరి. హిందువులలోకూడ కాల్పనిక, ఉన్నత, అనున్నత శ్రేణీభేదములను సృష్టించి అఖండహిందూసంఘములో వివాదములను, అనైక్యతను సృష్టింప ప్రయత్నించిరి.

గాంధీజీ విచలితుడయ్యెను. భారతదేశమునకు యథార్థస్వాతంత్ర్యము నొసంగుటకు ఆంగ్లేయుల కెట్టి అభిప్రాయము లేదని ఆయన గ్రహించెను. వారు గుంద్రని బల్లసమావేశమను పేరుతో ధూమమును సృష్టించి కాలమును గడుపకోరుచున్నారు. మధురవాక్యములద్వారా తమ శాసనాధికారమునే రకరకములుగామార్చి భారతీయులమెడపై మోప ప్రయత్నించుచున్నారు. బ్రిటిషువారిసదిచ్ఛలపై గాంధీగారికి అవిశ్వాసము వృద్ధిచెందెను. సత్యాగ్రహియగు మహాత్ముని సత్యదీక్ష అంతమొందెను. ఇంగ్లాండు వ్యవహారములు పరిసమాప్తిజెందెను. నేను అధిక ఆశతో వచ్చితిననియు, ఆవేదనముతో తిరిగిపోవుచున్నాననియు ఇంగ్లాండులోని ప్రజలకు తెలియ

జర చెను. అయినను నేను సత్యాగ్రహి పాలించవలసిన న్యాయసత్యధర్మములను ఆంగ్లభూమిలో పాలించితిని. మరల భారత క్షేత్రమందును వానిని పాలింపబోవుచున్నాను. గాంధీజీ దుఃఖభారాక్రాంతహృదయముతో డిశంబరు నెలలో ఇంగ్లాండునుండి భారతదేశమునకు తిరుగుముఖము పెట్టిరి.

కాని అహింసావ్రతధారియైన మహామానవుడు బ్రిటిషు పరిపాలకులపై విశ్వాసము పోగొట్టుకొన్నను, బ్రిటిషుసాధారణప్రజలపై విశ్వాసమును పోగొట్టుకొనలేదు. అందువలన ఆయన ఇంగ్లాండు వదలిపోవునప్పుడు ప్రజల నుద్దేశించి స్నేహపూర్ణ వీడ్కోలుసందేశమును తెలియజేసిరి. "మానవ స్వభావముపై నాకు అపారమైన విశ్వాసము గలదు. ఈ విశ్వాసమే ఆంగ్లప్రజలపై నున్నవిశ్వాసమును దృఢపరచెను. మీ వార్తాపత్రికలలో వార్తలు అత్యంతవికృతరూపమును ధరించుచుండును. ఆంగ్లస్త్రీ పురుషులు వాటిని చదువుచుందురు. అయినను వారు నాపైమరొకవిధముగా ప్రవర్తించలేదు. విదేశవస్త్రములను విసర్జించమని నేను భారతదేశమునకు సలహాల నిచ్చి నేను విదేశయంత్రశాలలకార్మికులను నిరుద్యోగులనుగా చేసితిని. వార్తాపత్రికలద్వారా వారిని ఉత్తేజితులనుగా చేసినను కార్మికులు నాపై కోపగించలేదు. కార్మికస్త్రీపురుషులు నన్ను ఆదరించినారు. తమ ఆత్మీయుని వలె నన్ను గౌరవించినారు. నేను ఆంగ్లదేశమును వీడిపోవునప్పుడు ఈవిషయమును ఎంతమాత్రము మరువజాలను. జాతీ

జుల పిత్రుదేశము జాతీయులకు మార్గమును చూపించుటకై మరల భారతదేశమునకు వచ్చెను.

## 54

## నిర్మాణకార్యక్రమములో నిమగ్నులగుట

ఆంగ్లేయుల కుటిలాలోచనములవలన వ్యథ్యుడై గాంధీజీ స్వదేశమునకు తిరిగి వచ్చెను. ఆంగ్లేయుల సత్యసంధత విశ్వసించి గుండ్రబల్లసమావేశములో పాల్గొనుటకు ఆయన ఇంగ్లాండు పోయెను. భారతస్వాతంత్ర్యసత్తా అంగీకరింపబడునని తలంచెను. కాని నిరాశజెంది శూన్యహస్తముతో స్వదేశమునకు మరలెను. అట్లు వచ్చి భారతసర్కారువారు విరమించిన ఆర్డినెన్సులనన్నిటిని యింతలోనే పునర్జీవింపజేసినటుల ఆయన గ్రహించెను. 1931 వ సంవత్సరములో 'గాంధి-ఇర్విన్ సంధి' ఫలితముగా విరమింపబడిన ఆర్డినెన్సుల నన్నిటిని బెంగాలు, సంయుక్తరాష్ట్రము, సీమాంతప్రదేశము మొదలగు రాష్ట్రములలో మరల జారీ చేయబడెను. దేశములో స్వేచ్ఛాచారుల శాసనము ప్రవర్తింప జేయబడెను.

భారతసర్కారువారి ఆచరణములకు గాంధీజీ విచారమనస్కుడయ్యెను. కాని ఆయన వెంటనే తనకార్యక్రమమును ఆరంభించక ఒకసారి వైస్రాయితో మాట్లాడి ఆర్డినెన్సుల పునర్జన్మకు కారణమును తెలుసుకొనగోరెను. కాని వైస్రాయి ఆయన ప్రార్థనను అంగీకరింపలేదు.

ము పిత్రము దాల్చెను. ఇంతకుపూర్వము హిందూమహాస్మ
ల భారతను నీరెండుసాంప్రదాయములవారు సామ్రాజ్యవాదుల
వలన విభక్తులై భారతజాతీయఆందోళనము దుర్బల
. ఇప్పుడు భారతదేశప్రజలనే విభక్తముచేయుటకు
నిర్మాణింబడిన పన్నాగములను చూచి గాంధీజీ దీనికి ప్రతికూల
గా ప్రబలప్రతిఘటన తెలియజేసెను. కారాగారములో
బంధింపబడి యుండియే నిరశనవ్రత మారంభించెను. "నా
దేశనిర్భాగ్యులను విభక్తముచేయు ప్రయత్నమునకు విరుద్ధ
ముగా నేను ఉపవాసవ్రతమువలన జీవితమును విసర్జింప సంక
ల్పించుకొంటిని" అని ప్రకటన గావించిరి.

గాంధీజీ గావించిన యీనిర్ణయమువలన భారతీయులకు కండ్లు తెరచినట్లాయెను. ప్రతివారును సాంప్రదాయకత్వమునకు, అనున్నతశ్రేణివారిప్రత్యేకతకు విరుద్ధముగా జాగ్రత వహించిరి. భారతదేశములోని ప్రతినగరములోను, ప్రతిపల్లెలోను నవచైతన్య ముదయించెను. ఇంతకాలము అస్పృశ్యులని ఎవరుదూరము చేయబడి తృణీకరింపబడిరో వారిని ఆదరించి సంఘములో స్థానమిచ్చుటకును, వారిని గౌరవించుటకును భారతదేశ మంతటను నవజాగరణ ముద్భవించెను. తుదకు గాంధీగారి యీఉపవాసప్రభావఫలితముగానే అనున్నతశ్రేణివారిని ప్రత్యేకించు ప్రయత్నము వ్యర్థమైపోయెను. ఆయన సెప్టెంబరు 20 వ తేదీ 12 గంటలకు ఉపవాసవ్రతమును ఆరంభించిరి. అనున్నత శ్రేణివారిని వేరుపరచిన యెడల దేశము దుర్బలమైపోవునని నాయకులందరును ఏకాభి

ప్రాయము గలవారైరి. సర్కారువారుకూడ జాతీయులను విడదీయుసీతిని తొలగించిరి. అప్పుడు దేశనాయకుల, దేశ వాసుల ప్రార్థనలవలన సత్యపూజారియగు గాంధీజీ సెప్టెంబరు 26 వ తేదీన సౌందర్యపూజారియగు రవీంద్రకవీంద్రుని సముఖమున ఉపవాసవ్రతమును విరమించెను.

గాంధీజీ ఉపవాసవ్రతమును విరమించినను, అస్పృశ్యులను ప్రత్యేకముచేయు సర్కారువారి ఆదేశము రద్దు చేయబడినను, భారతదేశమునందంతటను అస్పృశ్యులకు సంపూర్ణగౌరవమునిచ్చి హిందూసంఘములో స్వీకరించుట లేదు. దీనివలన గాంధీజీహృదయము మరల ఆవేదనాపూర్ణ మయ్యెను. ఆత్మశుద్ధికొరకును, సహకారులశుద్ధికొరకును మే 8 వ తేదీన ఉపవాస మారంభింతుననియు, ఆ ఉపవాసమును 21 దినములవరకు పాలింతుననియు సంకల్పించుకొని నటుల 1933 మే1 వ తేదీన ఆయన ఒకప్రకటనముగావించిరి

హరిజనుల ఉన్నతికొరకు ఆయన యీ ఉపవాసవ్రతమును అవలంబించ నిర్ణయించుకొనుటవలన మే 8 వ తేదీన ఆయనను విడుదలచేసిరి.

విముక్తులై మూడువారములవరకు శాసనబహిష్కార యోద్యమమును నిలుపుదల చేయుమనికోరిరి. మే 29 వ తేదీన గాంధీజీ ఉపవాసమును విరమించిరి. ఈ 21 దినములలో భారతదేశములో నలుమూలల హరిజనసేవాకార్యములుత్సాహకరముగా జరిపింపబడెను. గురువాయూమందిరము మొదలగు

ప్రసిద్ధ దేవమందిరములద్వారములు హరిజనులకొరకు తెరువబడెను. అస్పృశ్యులు హిందూసంఘములో పంక్తిభోజనము కూడ ఏర్పాటు చేయబడెను.

ఈసారి ఉపవాసప్రతిఫలముగ ఆయన శాసనబహిష్కరణాందోళనమును విరమింపచేయుటచే దేశనాయకులనేకమంది అసంతృప్తి చెందిరి. విఠల్ భాయ్ పటేల్, సుభాస్ చంద్రబోసు అనారోగ్యమువలన అప్పుడు వియెన్నానగరములో వసించుచుండిరి. వారుకూడ గాంధిగారి యీనిర్ణయమును అంగీకరింపలేదు, ఆయన కార్యప్రణాళికను తీవ్రముగానిరసించి ఒకప్రకటనము గావించిరి. కాని గాంధీ సుభాస్ చంద్రుల రాజకీయ చింతాప్రవాహములు, కర్మమార్గములు భిన్నరూపమైనను గాంధీజీయెడల సుభాస్ చంద్రునకు అపారశ్రద్ధాగౌరవములుండెను. సుభాస్ చంద్రుడు భారతదేశమునుండి విదేశములకు పోయి భారతముక్తిసాధనకొరకు ఆజాద్ హింద్ సైన్యమును నిర్మించి సింగపూర్ నుండి ఒకఉపన్యాసములో గాంధిగారియెడల ఆయన కున్న గౌరవమును విశదీకరించిరి. దానిసారాంశము— "భారతదేశస్వాతంత్ర్యముకొరకు మహాత్మాగాంధీజీ ఆరంభించిన సంగ్రామము అసాధారణమైనది, అతులనీయమైనది. మనజాతీయేతిహాసములో ఆయననామము స్వర్ణాక్షరములతో లిఖితమై యుండును.

ప్రథమ మహాసమరాంతమున భారతీయనాయకులు బ్రిటీషుసర్కారువారివద్ద వారు వాగ్దానముచేసినప్రకారము

స్వాతంత్ర్యముకొరకు వేడుకొన ప్రయత్నించగా ఆంగ్లేయులు తమయెడల విశ్వాసఘాతుకత గావించిరని నాయకులు గ్రహించిరి. వారియీ ప్రార్థనకు బాధ్యులుగా 1919 వ సంవత్సరము నాటి రౌలట్ శాసనము ఆవిర్భవించెను. ఉన్న సామాన్యమైన స్వాతంత్ర్యముకూడ యీ శాసన ఫలితముగా చేజారిపోయెను. ప్రజలు దానిని ప్రతిఘటించబోగా దానికిబదులు జాలియన్ వాలాబాగు హత్యాకాండ ఆరంభించబడెను. ప్రథమమహాసమరములో భారతీయుల అపూర్వ ఆత్మత్యాగమునకు ప్రతిఫలము రౌలట్ శాసనము, జాలియన్ వాలాబాగు హత్యాకాండ.

1919లో జరిగిన యీ ఘోరసంఘటనలతరువాత భారతీయులు కొంతకాలమువరకు విమూఢులైయుండిరి. స్వాతంత్ర్య సంపాదనకు చేయబడిన ప్రయత్నముల నన్నిటిని బ్రిటిషువారు సామరికశక్తిద్వారా అణచివైచిరి. శాసనతంత్రఆందోళనము, బ్రిటిషువస్తువిసర్జన, అస్త్రసహితవిప్లవము మొదలగునవన్నియు స్వాతంత్ర్యసంపాదనలో వ్యర్థము లయ్యెను. ఏదిక్కునకూడ ఆశాజ్యోతి కాన్పించుట లేదు భారతీయులు ఆందోళనమునకు, నూతనఅస్త్రసంపాదనకు అంధకారములో వెదకుచుండిరి ఇట్టిసంధిక్షణములో భారతరాజనైతికక్షేత్రములో మహాత్మాగాంధీఅనహాయోద్యమము, సత్యాగ్రహము, శాసనబహిష్కరణము నను నూతనఅస్త్రములతో అవతరించెను. ఈశ్వరుడు భారతీయులకు మార్గములను చూపించుటకే ఆయనను పంపియుండెనని తోచెను. చూచుచుండగల సకలదేశవాసులు

ఆయనసహకార్యకర్తలును సమావేశమైరి. భారతదేశము రక్షింపబడెను. ప్రతిభారతీయుని ముఖమండలము ఆశావిశ్వాసముల జ్యోతితో దీప్తివంత మాయెను. అంత్యవిజయమును గురించి వారు నిశ్చింతులైరి.

ఇరువదిసంవత్సరములనుండి మహాత్మాగాంధి, వారితోపాటు భారతీయులు భారతదేశ స్వాతంత్ర్యము కొరకు సంగ్రామము గావించుచుండిరి. గాంధీజీ తననూతనఅస్త్రముతో ముందుకు నడపనియెడల భారతదేశము ధూళిలోనే పడియుండెడిది. భారతస్వాతంత్ర్యసంగ్రామములో ఆయన శక్తి సంపదలు అపూర్వములైనవి. అతులనీయములైనవి. ఇట్టి పరిస్థితులలో ఏవ్యక్తియు తనజీవితకాలములో యింత సాఫల్యతను పొందియుండలేదు.

1920 వ సంవత్సరమునుండి భారతదేశస్వాతంత్ర్యము కొరకు అత్యవసరమైన రెండువిషయములు భారతదేశము గాంధీజీవద్ద జాతీయులగౌరవరక్షణకొరకును, తనపై విశ్వాసము కలిగియుండుటకొరకును నభ్యసించెను. దీనిపరిణామ ఫలితముగానే నేడు వారిహృదయములలో విప్లవాగ్ని ప్రజ్వరిల్లెను. వారు ప్రతిష్ఠించిన ప్రతిష్ఠానములద్వారా ఆయన సందేశము సుదూరప్రాంతమందున్న పల్లిగ్రామముల నిభృత ప్రదేశములకుకూడ వ్యాపించెను. మహాత్మాగాంధీజీ మనలను స్వాతంత్ర్యరాజమార్గమున నిలువబెట్టెను.

మనము మరల మనపూర్వప్రసంగమునకు తిరిగిపోవు దము. గాంధీజీ ఉపవాసవ్రతము విరమింపబడినపిమ్మట కాం గ్రెసు తాత్కాలికాధ్యక్షులైన మిస్టర్ ఆనే యింకను 6 వారములవరకు శాసనబహిష్కారణాందోళనమును నిలుపుదల చేసెను. కారాగారమునకు బయటనున్న నాయకులతో సంప్రదించి భావికార్యక్రమమును నిరూపించుటకు పూనాలో తిలకమందిరములో ఒకసమావేశమును ఏర్పాటుగావించిరి. భారతదేశములో వివిధస్థానములనుండి దేశనాయకులు వచ్చి సమ్మేళనములో పాల్గొనిరి. నాయకులు మహాత్మాగాంధీజీతో సంప్రదించి వ్యాపకభావముతో శాసనబహిష్కారణాందోళ నము ఆపివేయబడునని సమ్మేళనములో నిర్ణయింపబడెను. కాని యోగ్యులగువారు వ్యక్తిగతబాధ్యతతో వ్యక్తిగత ముగా శాసనబహిష్కారణ చేయవచ్చును. కాంగ్రెసుకార్య ములలో గోపనీయతనుకూడ విసర్జింపవలయునని యీసమ యములో ఆదేశింపబడెను.

ఈసమ్మేళనము జరిగినపిమ్మట మహాత్మాజీ వైస్ రాయితో సంభాషించుటకు అవకాశ మిప్పించమని నివేదిం చుకొనిరి. కాని శాసనబహిష్కారణఆందోళనము సంపూర్ణ ముగా విరమించకపోవుటచేత ఆయన గాంధీజీప్రార్థనను నిరాకరించెను. ఆయనకు దర్శనమీయలేదు.

పిమ్మట గాంధీజీ వ్యక్తిగతముగా శాసనబహిష్కారణ ముకొరకు సంసిద్ధు డయ్యెను. ఆయన సబర్మతీఆశ్రమమును

భగ్నపరచి, అచ్చటిగ్రంథాగారమును, వస్తుసామగ్రిని హరిజనసేవకసంఘమునకు దానము చేసెను. అహింసాయోగిపురుషుడు తన ప్రాణముకంటె ప్రియమైన ప్రతిష్ఠానమునుండి యీ విధముగా తనను సంబంధములో విచ్ఛిన్నము గావించుకొని దేశసేవకొరకు తయారయ్యెను. దేశసేవకొరకు సమస్తమును త్యజించి రిక్తహస్తుడై సన్యాసవ్రతమును స్వీకరించుటకు ఎట్టిసందేహమును వెలిబుచ్చలేదు.

గ్రామవాసులలో నిర్భయమునుగురించి ప్రచారము చేయుటకును, వారిని వ్యక్తిగతశాసనబహిష్కరణాందోళనములో ప్రబోధితులను గావించుకొనుటకును, గాంధీజీ బోర్సాదు తాలూకాకు చెందిన రాసగ్రామమువైపునకు బయలు దేరెను. శ్రీమతి కస్తూరిబాయి, ముప్పదిముగ్గురు ఆశ్రమసహకారులును ఆయనతో బయలుదేరిరి. కాని వారు పట్టుబడి ఒకసంవత్సరము కారాగారశిక్ష విధింపబడిరి. వారిదృష్టాంతము ననుసరించి దేశములో శాసనబహిష్కరణాందోళనములో అనేకమంది పాల్గొనుచుండిరి. నలువైపుల అరెస్టులుకూడ జరుగుచుండెను. శ్రీయుత రాజగోపాలాచారి, మిస్టర్ ఆనే మొదలగువారుకూడ అరెస్టుచేయబడిరి. వ్యక్తిగతశాసనబహిష్కరణాందోళనములోకూడ ఎట్టిఅనంతమైన శక్తి దాగియున్నదో దేశవాసులు దానిని అవలోకించి నూతనసంగ్రామపద్ధతులలో దీక్ష స్వీకరించిరి.

బంధితుడై గాంధీజీ హరిజనసేవ గావించుటకు అవకాశము కలిగించమని ప్రార్థించెను. ఇంతకుపూర్వమునకూడ అనేకసార్లు కారాగారమునందుండియు హరిజన ఉన్నతి కార్యములు గావించుటకు సర్కారువారు ఆయనకు అవకాశములు కలిగించిరి. కాని ఈసారి సర్కారువారు కారాగారమునందుండి హరిజనసేవ గావించుటకు అనుమతి యిచ్చినను ఆయనపై కొన్నివిధినిషేధములను ఆరోపించిరి. అందువలన ఆయన స్వతంత్రతఆత్మవిద్రోహము దాల్చెను, ఆయన దాని ప్రతీకారముకొరకు మరల నిరశనవ్రతము నారంభించెను. గత్యంతరము లేక వారు గాంధీజీని విడుదలచేసిరి.

పిమ్మట గాంధీజీ హరిజనసేవాకార్యములో ఆత్మసమర్పణ గావించుకొన సంకల్పించుకొని భారతదేశభ్రమణము చేయ నిర్ణయించుకొనిరి.

## 55

# మ హా భా ర త యు గ ము

సత్యాశ్రయుడగు యుధిష్ఠిరుడు రాజసూయయజ్ఞమును గావించుచుండెను. ఆయజ్ఞములో జాతిధర్మవిభేదములు లేక అతిథిబృందమువారి పదయుగళము ధౌతము గావించు కార్యము స్వయముగా శ్రీకృష్ణుడే స్వీకరించెను.

ఈదృష్టాంత మెంత మహత్తరమైనదో, ఆధునికయుగములో శ్రేష్ఠమానవుడు, మానవోత్తముడు అయిన ఋషీశ్వ

హని హరిజనసేవాకార్యసంకల్పస్వీకారము. నిజముగా వారి యౌన్నత్యము కొరకు గాని ప్రదానముకొరకు జీవితకాలమం తయు ప్రయత్నించుటకూడ అంత మహత్తరమైనది.

అయుగము నాటి మహామానవుల ఆదర్శములచే ప్రభావితులై యీయుగములోని మహామానవుడు సంఘములో లాంఛిత, అవమానిత, అవహేళిత, పదదళిత ప్రజలకు గౌరవము నొసంగుటకు మహావ్రతము స్వీకరించినారు.

1933 నవంబరు 7 వ తేదీన ఆయన యీయాత్ర నారంభించెను. ఆయన ఎడారులనుదాటి, గ్రామముల నతిక్రమించి, గ్రామోన్నతి, కుటీరశిల్పముల ప్రతిష్ఠ, అస్పృశ్యతా నివారణ విషయములలో ఉపదేశముల నిచ్చి తిరుగుచుండిరి. ఆయన ఉత్సాహము, ఉద్యమము, ఉత్సాహకరమగు సందేశములు భారతదేశగ్రామములలోను, వివిధప్రదేశములలోను నవచైతన్యమును సంచరింపజేసెను. స్వాతంత్ర్యము సంపాదించుటకు ముందు భారతదేశములో నిర్మాణమూలకమైన కార్యముల ఆవశ్యకత ఎంతగలదో, గాంధీజీ యాత్రవలన ఆయన సందేశములవలన స్పష్టము చేయబడినది.

రెండవసారి గుండ్రనిబల్ల సమావేశమునుండి తిరిగి వచ్చిన తరువాత శాసనబహిష్కరణాందోళనమును వ్యాపకముగా సాగించుట నిలుపుదల చేయుటకు సలహాల నిచ్చుచుండిరి. ఎట్టినియమిత అభియోగ అన్యాయముల ప్రతీకారము నిమిత్తము వ్యక్తిగతముగా శాసనబహిష్కరణ సాగించవ

వచ్చునని ఆయన అనేకవిధములుగా అనుభవించుచుండిరి. కాని స్వరాజ్యసంపాదనకు వ్యాపకభావముతో శాసనబహిష్కరణ గావింపక జాతినిర్మాణమూలకమైన కార్యక్రమమును అవలంబించిన యెడల అది భారతదేశమునకు అధికలాభప్రదమైనదిగా యుండును. ఈవిధముగా ఆయన ఆలోచించి యీసమయములో ఒకప్రకటనలో శాసనబహిష్కరణ నిలుపుదలచేయు ప్రతిపాదనమును గావించిరి. దానియందే కాంగ్రెసులోనున్న దుర్నీతిని తొలగించుటకు కొన్నిసలహాలను కూడ సూచించిరి. భారతస్వాతంత్ర్యముకొరకు నిర్మాణమూలకకార్యములగురుత్వమును గ్రహించియే భారతదేశ వివిధ ప్రదేశములలో మంత్రిపదవులను స్వీకరించి దేశశాసనవిషయములో లభించిన సామాన్యశక్తిసామర్థ్యములను సద్వినియోగము గావించుకోవలయునని కాంగ్రెనుసహకారులకు సలహాల నిచ్చియుండిరి. దేశీయులను సంఘబద్ధము గావించుటకును, నిర్మాణమూలక కార్యములలో, హరిజనుల ఉన్నతి విషయములో, హిందూమహమ్మదీయుల సమ్మేళనవిషయములో తమను సంపూర్ణముగా సమర్పించుకొనిరి.

1934 వ సంవత్సరము సెప్టెంబరు 26వ తేదీన బొంబాయిలో జరిగిన కాంగ్రెసు 48 వ సమావేశములో గాంధీజీ కాంగ్రెసునుండి విశ్రాంతి గైకొనిరి. అనంతరము ఆయన కాంగ్రెసులో 4 అణాల సదస్యుడుగాకూడ యుండలేదు. ఆయన గావించిన యీనిర్ణయమునకు సమస్తభారతదేశము

స్తంభీభూత మయ్యెను. కారణ మేమనగా, ఆయన ప్రస్తుత జాతీయమహాసభకు పర్యాప్త, పరిపాలనను, ఆయన నాయకత్వముక్రిందనే కాంగ్రెసు భారతవిమోచన సంగ్రామము న నడపనుచుండెను. అందువలన ఆయన నిర్ణయమునకు అందికను విచారగ్రస్తులై ఆనిర్ణయమును గురించి పునర్విచారణ గావించుకొనవలయునని ఆయనను వేడుకొనిరి. కాని గాంధీజీ ఆయననిర్ణయములో స్థిరసంకల్పులై యుండెను. కాంగ్రెసునకు బయట ఉన్నప్పటికిని దేశసేవ చేయుదునని ఆయన ప్రజలకు తెలియజేసెను. అందువలన ఆయననిర్ణయమువలన దేశవాసులు కలవరము చెందవలసిన పనియును లేదు.

కాంగ్రెసు సదస్యపదవిని విసర్జించినను కాంగ్రెసుతో అంతరికసంబంధము దృఢతరముగా యుండెను. అనంతరము ఆయన కాంగ్రెసుకు ప్రధానసలహాదారుగా యుండి పనిచేయు చుండిరి. ఆయనసలహాప్రకారము కాంగ్రెసుచరిత్రలో యీ సమయమునందొక విశేషపరివర్తనము సంఘటిల్లెను.

కాంగ్రెసు బహుకాలమునుండి ప్రజలకు ప్రతినిధియై యున్నమాట నిజము. కాని గ్రామవ్యవహారములలో కాంగ్రెసుకు అనుష్ఠానికసంబంధము అప్పటి కింకను కలుగలేదు. గాంధిగారి సలహా ననుసరించి గ్రామవాసులకును కాంగ్రెసుకును 1936 వ సంవత్సరములో సంఘటిల్లెను. సాధారణదేశవాసులకును, కాంగ్రెసుకును సంబంధము కలుగజేయు ఉద్దేశముతో గ్రామసీమలలో కాంగ్రెసుసమావేశమును జరుపవని

సలహా నొసగియుండిరి. 1936 డిశెంబరు 27, 28 తేదీలలో మహారాష్ట్రాంతర్గతమైన ఫైజ్‌పూర్ గ్రామములో గాంధీజీ సలహాప్రకారము కాంగ్రెసుసమావేశము జరుపబడెను. ఆ సమావేశమునకు జవహర్‌లాల్ నెహ్రూసభాధిపత్యమువహించిరి

రాజకీయకిని, దేశీయులకును, సాధారణప్రజలకును సంబంధము స్థాపింపబడుట యిదియేప్రథమము. లక్షాధిక గ్రామవాసులు నేలపై కూర్చుని నిశ్శబ్దముగా కాంగ్రెసుకార్యక్రమమును శ్రద్ధతో ఆలకించుచుండిరి. గంటలకొలది కూరుచుని నాయకుల వాదోపవాదములను, వితర్కములను, ఉపన్యాసములను శ్రద్ధతో వినుచుండిరి. ఈదృశ్యము కాంగ్రెసుచరిత్రలో నిజముగా నవీనమైనది.

గ్రామసీమలలో జరిగిన ప్రథమ కాంగ్రెసుప్రదర్శనము గాంధీజీయే ప్రారంభించెను. 'ఝూండాచకీ'లో జాతీయ పతాకమునకు ఆయన వందనసమర్పణముగావించిరి. తద్వారా సకల భారత దేశవాసులకు ఆయన ప్రణతుల నర్పించెను.

గాంధీగారి ఆదేశానుసారముగా గ్రామసీమలో ఆహ్వానింపబడిన కాంగ్రెసుసమావేశము విశేషతాత్పర్యపూర్ణమై యున్నటులతో చెను గ్రామోన్నతికార్యములకుతనజీవితమును సమర్పించుకొనియుండిరి. దానికి పోషణకర్తగా ఆయన ద్వారా యీనీతి ఆవిష్కరింపబడెను. ప్రతిసంవత్సరము ఈవిధముగా పల్లిగ్రామములలో కాంగ్రెసుసమావేశములు జరుపుచుండిన మొదల పల్లిగ్రామములలో నిభృతస్థానములలోకూడ జాతీయ

చైతన్యము కలుగునని, పల్లెగ్రామవాసులుకూడ నవజీవితమును పొంది స్వయంతృప్తులు కాగలరని ఆయన తెలిపెను. గాంధీజీలో ప్రస్తుత ఉండవలసిన దూరదృష్టి యుండుటవలననే ఆయన దేశమును పరిరక్షితము గావించుటకై ఎన్నియో అభినవ ఉపాయములను కల్పించెను.

## 53

# ఖైదీల విముక్తి-ఆందోళనము-సత్యాగ్రహ సంరక్షణము

1937 వ సంవత్సరము, ఏప్రిల్ 1 వ తేదీన నూతన శాసనతంత్రము ప్రవర్తింపబడినప్పుడు దేశములో రాజనైతిక ఖైదీల విముక్తి కొరకు ప్రచండఆందోళనము ఆరంభించబడెను. దేశమును ప్రేమించిన అపరాధమునకు అసంఖ్యాక భారతీయులు కారాగారముల లోహద్వారముల చాటున బంధింపబడియున్నారని దేశవాసులు తీవ్రమయములో విస్మయము ననుభవించుచుండిరి. రాజనైతిక ఖైదీలవిముక్తి కొరకు దేశమునందంతట ఆందోళనము ఆరంభమయ్యెను. ఈవిముక్తి ఆందోళనములో గాంధీజీ అగ్రనాయకులై యుండిరి. ఆయన బెంగాలుసర్కారువారితో రాజనైతిక ఖైదీలవిముక్తి విషయములో సంభాషణములను నడుపుచుండిరి. ఈసందర్భముగా 1937 అక్టోబరు 26 వ తేదీన కలకత్తాలో నిరసనవ్రతము నవలంబించిరి. కలకత్తాలో వసించుచున్నప్పుడు ఆయన

బెంగాలుగవర్నరు ఆండర్సన్‌తో రాజకీయఖయిదీల విడుదల విషయము సమాలోచనములను గావించిరి. ఆయన అలీపూర్ సెంట్రల్ జైలు, ప్రెసిడెన్సీజైలు, హిజ్లీ జైలునకు పోయి రాజకీయఖైదీలను సందర్శించిరి.

ఎవని ఆదర్శములవలన, ఎవనిసందేశములవలన ప్రబోధితులై ప్రజలు అసత్య, అన్యాయములతో సంగ్రామమున ప్రవృత్తులై కారాగారమును వరించియుండిరో, వారు సత్యపూజారియొక్క సాక్షాద్దర్శనము పొంది నూతనశక్తితో, కార్యప్రణాళికలతో ప్రబోధితులైరి.

ఆయన ప్రభావమువలన, ఆయన వాదోపవాదములవలన బెంగాలుసర్కారువారు 1107 గురు రాజకీయఖైదీలను విడుదలచేసిరి.

మరల రాజకీయఖైదీలవిషయములో సంభాషణములను జరుపుటకొరకు 1938 సం॥రములో గాంధీజీ మరియొకసారి కలకత్తాకు వచ్చెను. కారగారలౌహద్వారము వెనుకనుండి అమోఘఆకర్షణముచేత, ఆయనమంత్రముచేత దీక్షపొందిన సత్యాగ్రహులు ఆయనను ఆకర్షించుచుండిరి. ఆయన ఆయాహ్వానమును, ఆయాకర్షణమును ఉపేక్షింపలేకపోయిరి.

ఈసారి నెలరోజులకుపైగా కలకత్తాలో వసించి ఆయన బెంగాలుగవర్నరు బ్రెబర్నుతో ఖైదీలవిముక్తి విషయము సంప్రదింపులను గావించిరి.

ఖైదీలవిముక్తికొరకు ప్రయత్నము చేయుటతో పాటు సత్యాగౌరవమును సంరక్షించుటకుకూడ గాంధీజీ మరియొక అన

శనవ్రతమును అవలంబించిరి. రాజకోటరాజ్యశాసనసంస్కరణవిషయములో సర్దార్ పటేల్ గారితో ఠాకూరుసాహేబు ఒకసంధిని గావించుకొనిరి. కాని ఠాకూర్ సాహేబ్ ఆసంధిని పాలించకపోవుటచేత ఠాకూర్ సాహేబ్ ప్రతిజ్ఞాభంగమునకు ప్రాయశ్చిత్తరూపముగా గాంధీజీ నిరశనవ్రతమును అవలంబించిరి. రాజకోటసమస్యవిషయములో వైస్ రాయ్ వద్దనుండి వాగ్దానముపొందుటచే గాంధీజీ నిరశనవ్రతమును విరమించెను.

సత్యపూజారి సత్యమునకు అగౌరవము జరుగుచున్నటుల యెచ్చట గాంచినను అచ్చటనే ఎదురుతిరిగినారు. అనుపవిత్రహృదయములతో నిరశనవ్రతమును అవలంబించినారు. ఈ నిరశనవ్రతము అవలంబించుటచేత తనను శుద్ధిచేసుకొనుటయేగాక, విరుద్ధపక్షమువారి అజ్ఞానమును, అంధకారమును తొలగించి వారిలో జ్ఞానోదయము కలుగునట్లు గావించినారు.

## 57

# ద్వితీయ మహాయుద్ధము - కాంగ్రెసుకు గాంధీజీ నేతృత్వము

1939 వ సంవత్సరములో సమస్తయూరోపునందును ద్వితీయమహాసమరదావానలము ప్రజ్వరిల్లెను. యూరోపులోని సకలదేశములు ఒక్కొక్కటే యీయుద్ధములో ప్రత్యక్షముగానో, పరోక్షముగానో పాల్గొనుచున్నవి.

పరాధీనభారతదేశము-సామ్రాజ్యవాదులు, సామ్రాజ్యలోలుపులు, స్వార్థాన్వేషులునగు ఆంగ్లేయులకు వారి అభి

ప్రాయములతో యెట్టి అవసరము లేకుండెను. ఆ కారణము చేత మిత్రరాష్ట్రములకు భారతీయులు యుద్ధములో పాల్గొనినారని బ్రిటీషుగవర్నమెంటువారు ప్రకటన చేసిరి. యుద్ధములోనికి బలవంతముగా భారతదేశము దించబడినది. ఈవిషయములో భారతీయుల అభిప్రాయమును తెలుసుకొనలేదు.

బ్రిటిషుగవర్నమెంటువారు యుద్దములో ప్రవేశించిన 48 గంటలలోనే భారతదేశములో భారతరక్షణశాసనము ప్రవర్తితము చేయబడెను. విశేషశక్తిసామర్ధ్యములతో భారతదేశశాసనకార్యములను పరిపాలనగావించుటకు భారత సర్కారువారు సంకల్పించుకొనిరి. యుద్ధమునకు అనుకూలముగాలేని ప్రయత్నములను, ఆందోళనములను అణచివేయుటకు భారతసర్కారువారు దృఢసంకల్పులైరి. భారతసర్కారువారి యీస్వేచ్ఛాచారమునకు గాంధీజీ కలవరము చెందెను. విచారగ్రస్తుడయ్యెను. ఆయన యీసారి మరల కాంగ్రెసునేతృత్వమును స్వీకరించెను. బలవంతముగా యుద్ధభారమును భారతీయులపై పడవేయుటకు ప్రతికూలముగా గాంధీజీ ఆదేశానుసారముగా కాంగ్రెసు మంత్రిపదవులను విసర్జించెను. గాంధీజీ స్వయముగా సత్యాగ్రహము చేసి యుద్ధమునకు విరుద్ధముగా ప్రచారకార్యములు సాగించుటకు సలహాల నిచ్చిరి.

ఇట్టిపరిస్థితులలో వార్ధాలో కాంగ్రెసువర్కింగుకమిటి జరిగెను. వ్యాపకభావముతో సత్యాగ్రహఆందోళనమును చేయక యుద్ధమునకు విరుద్ధముగా దేశీయులప్రాతికూల్యమును

ప్రచారము చేయబడు సత్యాగ్రహమును ప్రవర్తింపచేయ వలయునని గాంధీజీ ఆదేశానుసారముగానే నిర్ణయింపబడెను. గాంధీజీ సత్యాగ్రహులుగా ఎన్నుకొనినవారే సత్యాగ్రహము చేయవలయునని నిర్ణయింపబడెను. శ్రీవినోబాభావేను ప్రథమ సత్యాగ్రహిగా గాంధీజీ పంపించిరి. వినోబా యుద్ధమునకు విరుద్ధముగా ఉపన్యాసములనిచ్చి సత్యాగ్రహసంగ్రామమును ఆరంభించిరి. తత్ఫలితముగా ఆయన అరెస్టు చేయబడిరి.

తరువాత రెండవ సత్యాగ్రహిగా పండిత జవహర్లాలును ఏర్పాటుచేసిరి. ఆయనకూడ అరెస్టు చేయబడిరి. మౌలానా అబుల్ కలామ్ ఆజాద్ యుద్ధమునకు ప్రతికూలముగా ఉపన్యాసములనిచ్చి ఖైదీ అయిరి.

అనంతరము ద్వితీయమహాయుద్ధములో సహాకారము చేయగూడదని నిర్ణయించుకుని పరివ్రాజకులగు సత్యాగ్రహదళమువారు దేశమంతటను వ్యాపించిరి. తత్ఫలితముగ ఒక్కొక్క రే కాంగ్రెసువర్కింగుకమిటీసదస్యులును, కాంగ్రెసు నాయకులును, కాంగ్రెసు సేవకులును కారాబద్ధము గావింపబడిరి. మహాత్మాగాంధిగారి అభిప్రాయానుసారముగా భారతీయవ్యవస్థాపరిషత్తు, రాష్ట్రీయపరిషత్తు, ప్రాదేశిక వ్యవస్థాపక సభాసదస్యులును, మంత్రులును, పార్లమెంటు కార్యదర్శులును, యుద్ధమునకు ప్రతికూలముగా అభిప్రాయములను వెల్లడిచేసి కారాగారమును వరించిరి. దీనిఫలితముగా బ్రిటిషు గవర్నమెంటువారి యుద్ధప్రయత్నములో భారత దేశప్రజలకు

యెట్టిసానుభూతి లేదని సమస్తవిశ్వవాసులకు స్పష్టముగా పరిచారము చేయబడెను.

సంఘుటనలచక్రము ఈవిధముగా తిరుగుచుండెను. ఇంతలో 1941 వ సంవత్సరము డిశంబరునెల ప్రథమభాగములో జపాను యుద్ధములో ప్రవేశించెను. దానితో యుద్ధపరిస్థితులు అత్యంతశోచనీయముగా పరిణమించెను. యూరోపులో జర్మనివారిఆక్రమణవలన బ్రిటిషువారిశక్తిసంపదలు క్షీణించిపోవుచుండెను. ప్రాచ్యదేశములో జపాను దానికి విరుద్ధముగా నిలువబడి అస్త్రములు ధరించుటచే బ్రిటిషుశక్తిసను క్షమున సంకటములు అధికమయ్యెను. తుఫానువలె, దుర్నివారవేగముతో ఇండోచైనా, మలయు, సింగపూర్ మొదలగు దేశములు జపానుద్వారా ఆక్రమింపబడెను. జపాను బర్మాను ఆక్రమించుకొని భారతదేశపూర్వసీమాంతమునకు వచ్చి కాచుకొని యుండెను.

ఈసంఘుటపరిస్థితులలో బ్రిటిషుసామ్రాజ్యవాదులును, చర్చిలువంటి అతిజాగరూకులును, రక్షణశీలురునుకూడ చంచలులైరి. ఈద్వితీయమహాయుద్ధములో భారతదేశము హృదయపూర్వకముగా బ్రిటిషువారియుద్ధోద్యమములలో సహాయము చేయుటకు తగినమార్గములను వారు కనిపెట్టుచుండిరి. భారతదేశముతో ఒకవిధమైన రాజీపడుచుకొనుటకు బ్రిటిషువారు సుముఖులైరి. వారు స్వాతంత్ర్యకాములగు భారతీయులకు

శాసనసంస్కరణవిషయములో ప్రతిపాదనము చేసి సర్ స్టాఫర్డుక్రిప్సును భారతదేశమునకు పంపియుండిరి.

ఇంగ్లండు క్రిప్సు భారతదేశమునకు వచ్చి స్వాతంత్ర్యకాముకులగు భారతీయులకు శాసనసంస్కరణవిషయములో సూచించిన ప్రతిపాదనములో స్వాతంత్ర్యమును గురించి సూచనమాత్రమైనను లేదు. భారతదేశవాసుల ఆశాతరాంకులను నెరవేర్చునట్టి సుమాంతము ఉద్దేశముకూడ అందు లేదు. భావికాలమును గురించి విశిష్టప్రకటవాక్యములుమాత్రమే యుండెను. ఈప్రతిపాదనములో దేశరక్షణ మొదలగు గురుతరవిషయము లన్నియు బ్రిటిషువారిహస్తములందే యుండునట్లు నిర్ణయింపబడెను. కాంగ్రెసువారు హిందూమహమ్మదీయుల అఖండభారతదేశమునుగురించి నుడువుచున్న విషయముకూడ ప్రతిపాదనలో సూచింపబడలేదు. అందువలన గాంధీజీ అసహ్యముచేత క్రిప్సుప్రతిపాదనమును తిరస్కరించి నుడివిన దేమనగా—ఇది దివాలా తీసిన బ్యాంకువారికి చెక్కు యిచ్చినట్లున్నది. దానినుండి ఎన్నటికిని ఏమియు లభించు ఆశమాత్రమైనను ఉండదు.

క్రిప్సుదొరగారు స్వదేశమునకు తిరిగిపోయిరి. ఆయన రాయబారము వ్యర్థమయ్యెను. ఈసారి భారతీయకాంగ్రెసు వారికిని బ్రిటిషుసర్కారువారికిని ప్రత్యక్షసంగ్రామము ఆరంభమయ్యెను.

గాంధీజీ 'హరిజన' పత్రికలో బ్రిటిషుశాసకుల నుద్దేశించి వ్రాసిన దేమనగా—ఓఆంగ్లేయులారా, మీరిక భారత

దేశమునువదలి పొండు. దీనివలన మీకు మంచి చేకూరును. భారత దేశమునకుకూడ శుభము సమకూరును.

భారత దేశములో మూలమూలల గాంధీగారి యీ స్పష్టమైన, నిర్భయమైన వాక్యము వ్యాప్తిచెందెను. సర్వత్ర ఆయనకంఠముతో కంఠముకలిపి భారత దేశమంతటను ధ్వనించుచుండెను. 'ఓ బ్రిటిషురాజా! మీరు భారత దేశమును త్యజింపుడు!'

కాంగ్రెసు నడిపిన విషయము — 'ఆంగ్లేయులు ఈ ఘోరదుర్దినములలో భారత దేశసహాయమును కోరుచున్నారు. కాని అది బానిసలసహాయము. భారత దేశము ఈబానిసత్వమును వరించి యుద్ధములో ఆంగ్లేయులకు సహాయము చేయజాలదు.

## 58

## ఆగస్టువిప్లవము - భారతదేశవిసర్జన ఆందోళనము

సామ్రాజ్యవాదులగు ఆంగ్లేయుల ఉత్పీడనములను అత్యాచారములను అవలోకించి, భారతస్వాతంత్ర్యసత్తాను నిరాకరించి, దానిపై యుద్ధభారమును పడవైచునైఖరిని గాంచి గాంధీజీ అత్యంతదృఢత్వముతో ఆంగ్లేయులను భారత దేశము వదలిపొమ్మని ఆదేశించెను. ఇట్టిఅనుభూతి భారతభూమిలో బహుకాలమునుండీ ధూమాయిత మగుచుండెను. 1938 వ

సంవత్సరములో బెంగాలు ప్రాదేశిక కాంగ్రెస్సులో నేతాజీ సుభాష్‌చంద్రుని నాయకత్వమున సామ్రాజ్యవాదులగు ఆంగ్లేయులను 6 నెలలలో భారతదేశమును త్యజించి పొమ్మని హెచ్చరిక చేయబడెను.

దీనితరువాత సంవత్సరము సుభాష్ చంద్రుడు త్రిపుర కాంగ్రెసు సభాపతిగా 'భారతదేశమును త్యజించి పొండు' అను యీప్రతిపాదనము చేసినప్పుడుకూడ గాంధీగారికిని, మరికొందరు దేశనాయకులను ఆంగ్లేయులసదిచ్ఛపై విశ్వాసముండెను. అందువలన అప్పుడు సుభాష్‌చంద్రుడు ప్రతిపాదించిన 'భారతదేశమును త్యజింపుడు' అను సూత్రమును గాంధీజీవంటి ప్రముఖనాయకులు సమర్థింపలేదు. కాని యిపుడు భారతదేశ ఆశాఆకాంక్షలను, భారతస్వాతంత్ర్యసాధనను సామ్రాజ్యవాదులగు ఆంగ్లేయులు క్రమముగా పదదళితము చేయుట గాంచి గాంధీజీ ఆంగ్లేయులపై నున్న అసామాన్య విశ్వాసమును కూడ పోగొట్టుకొనెను. భారతీయులు విశేష ధైర్యముతో, సహనశీలముతో ఆంగ్లేయుల శుభబుద్ధి, సద్బుద్ధిపై ఆశనుంచి తుదకు గత్యంతరము లేక 'భారతదేశమును త్యజింపుడు' అను నీ చరమసందేశమును ఆంగ్లేయులకు ప్రసాదించినట్లు గాంధీజీ సమస్తప్రపంచమునకు తెలియజేసెను.

1942 ఆగష్టు 8 న తేదీన కాంగ్రెసు గాంధీగారి యీ 'భారతదేశమును త్యజింపుడు' అను ప్రతిపాదనమును సమ

ర్థించి కోరిన దేమనగా-ఆంగ్లేయులు భారతీయులయొక్క ప్రపంచవాసులయొక్క మంగళముకొరకు భారత దేశస్వాతం త్ర్యయిచ్చుటను అంగీకరింపవలయును. లేనియెడల భారతదేశ ము స్వాతంత్ర్యముకొరకు వ్యాపక సంగ్రామమును ఆరంభించ వలయును. దేశనాయకులతో గాంధీజీ వివిధములైన సంప్రదింపులను గావించెను. సకలసంగ్రామములకు అధినాయకుడైన గాంధీజీనే కాంగ్రెసు సేనాపతిపదవిలో ప్రతిష్ఠితము చేసెను. అనేకదినములనుండీ ఆయన భారతీయులను స్వాతంత్ర్యసంగ్రామములో నియమితము చేయుచుండెను. వారిలో జాతీయతా ప్రబోధము కలిగించుచుండెను. స్వాతంత్ర్యముకొరకు నిర్మాణమూలకమైన కార్యముల ఆవశ్యకతనుగురించి భారతీయులకు బోధించుచుండెను. అందువలన ఈచరమముహూర్తమునందును ఆయన దేశీయుల కర్తవ్యనిరూపణము కొరకును, సంగ్రామపద్ధతిని నిర్ణయించుటకొరకును భారమును వహించిరి.

ఈసారి స్వతంత్రసంగ్రామములో కాంగ్రెసు విజయమో, వీరస్వర్గమో పొందవలయునని ఆయన దృఢముగా వచించెను. ప్రపంచములోని రక్తచక్షువులను గాంచి భారత దేశము వెనుకకు నడువదు, ముందునకే నడచిపోవును. గాంధీగారి యీప్రకటనవలన భారతీయులలో పరాధీనదాస్య విమోచనాకాంక్ష ప్రబలరూపము దాల్చెను.

భారత దేశము అహింసా అగ్నిమంత్రములో దీక్షనుపొంది సంగ్రామముకొరకు సంసిద్ధమై యుండెను. దీర్ఘకాలము దాసత్వశృంఖలములచే బంధింపబడి, నా పూజ్యపాదులగు సర్కారు వారి అత్యాచారములవలన, నిష్పేషణవలన శోషితులై దేశవాసుల దేహము గాయపడియుండెను. కాని మానసికశక్తులు అప్పటికిని దుర్జయమై, శక్తిశాలులై యుండెను. అందువలన గాంధీజీ వజ్రకంఠవినిస్సృత 'భారత దేశమును వదలుము' అను ప్రతిపాదనము భారతీయులహృదయములలో అగ్నిని రగుల్కొల్పెను. భారతీయులు అపారశక్తితో ప్రబోధితులైరి. భారతీయులలో నిద్రాశక్తిని, ఉల్లాసమును గాంధీజీ అచిర కాలములోనే గ్రహించెను.

గాంధీగారి యీనిర్ణయమువలన బ్రిటను అమెరికాలు క్రోధమును, విరక్తిని వెలిబుచ్చి కాంగ్రెసును భయపెట్టుట ప్రారంభించెను. కాంగ్రెసు యిట్టిభయములకు భయపడునది కాదని తెలియజేసెను. ఈ హిట్లరియారోగభయముగాని, కేకలుగాని భారత దేశహృదయములో స్వతంత్రతకొరకు జ్వలించిన యీజ్యోతిని ఆర్పజాలవు. విశ్వయుద్ధములో స్వతంత్రభారతము గౌరవమయభూమికనే స్వీకరించును. అని గాంధీజీ వ్యక్తపరచెను.

గాంధీజీ ఆగస్టు ప్రతిపాదనమును భారతసర్కారు వారికి తెలియబరచెను. ఆంగ్లేయులు భారత దేశమును విడిచి పోవలసినదే యని దానిలో స్పష్టముగా వర్ణించిరి. భారత

దేశమునకు పూర్ణస్వాతంత్ర్యమును ఈయవలయును. ఈ యిచ్ఛ నెరవేర్చనియెడల దేశమంతటను వ్యాపకభావముతో అహింసా ఆందోళనము ఆరంభించబడును. ఆయాందోళనము నకు నేతృత్వము నేను స్వయముగా వహింతును.

గాంధీగారి యీప్రకటనవలన సామ్రాజ్యవాదులగు ఆంగ్లేయులు విచలితులైరి. ఆగష్టు 8 వ తేదీ రాత్రి 10 గంటకు కాంగ్రెసుకమిటీసభ సమాప్తి జెందెను. కాని ఆరాత్రి తెల్లవారకముందే మహాత్మాగాంధీజీ అరెస్టు చేయబడిరి. వారితో పాటు భారతరక్షణశాసనబలముతో కాంగ్రెసు వర్కింగుకమిటీ సభ్యులందరును ఖైదీలుగా చేయబడిరి.

ఆగష్టు 9 వ తేదీ ఉదయమునుండియే సర్కారువారు చండశాసనములను ప్రయోగించుట కారంభించిరి. దేశము భారతరక్షణశాసన నాగపాశముచే బంధింపబడెను. కాంగ్రెసు నాయకుల నందరిని ఒక్కొక్కరినే అరెస్టు చేయుచుండిరి. కాంగ్రెసునాయకులను బంధించినయెడల జాగరిత భారత స్వాతంత్ర్య ఆందోళనతరంగములను నిలుపవచ్చునని వైస్‌రాయి లిన్‌లిత్‌గో తలంచెను. కాని ముక్తిపిపాసులగు భారతీయులు శాసనశక్తిగల సహస్ర అత్యాచారములవలన కూడ ఉద్యమవిరతులు కాలేదు. వారు గాంధీగారి మంత్రమును కంఠమున ధరించి 'మంత్రసాధనమో, లేక శరీరపతనమో' యని దృఢసంకల్పులై యుండిరి.

స్వాతంత్ర్య ఆకాంక్షమూలచ్ఛేదమునకే అమానుషిక అత్యాచారములు ఆరంభించబడెను. కాంగ్రెసుప్రతిష్ఠానము

బన్నియము శాసనవిరుద్ధమైనదని ప్రకటింపబడెను. వార్తాపత్రికలపై అనేకవిధములైన నిషేధములను ఆరోపించిరి. పత్రికాంచనమును తెలియజేయుచు అనేకపత్రికలు నిలిపివేయబడెను. అయినను స్వాతంత్ర్యసంపాదనకొరకు దుర్జయశక్తితో ప్రజలు ప్రబోధితులై యుండుటచే వారిలో యెట్టి లొంగుబాటుభావము కనబడలేదు. సర్కారువారిహింసలు, బంధనములు, ఎంతకఠినము లగుచుండెనో, దేశవాసుల హృదయములలో ఆ హింసలనుండి ముక్తిపొందుటకును, ఆ బంధనములను ఛిన్నము చేయుటకును కోరిక లంతప్రబలము కాజొచ్చెను.

మహాత్మాగాంధీజీ ఆదేశానుసారముగా భారతీయులు అహింసాపద్ధతిప్రకారమే 'భారతదేశమును వదలిపొమ్మ' అను ఆందోళనమును సాగించుటకు సంసిద్ధులై యుండిరి. కాని విచారణలేకుండా హఠాత్తుగా దేశనాయకులను అరెస్టు చేయుటవల్లను, అప్పటప్పట సర్కారువారి అహేతుకమైన అత్యాచారములవల్లను, భారతీయుల రోషముచేత, క్షోభముచేత, అవమానముచేత గర్జించుచుండిరి. విదేశశాసనములకు విరుద్ధముగా భారతదేశహృదయములో కలవరము చెలరేగుచుండెను. ఈసమయములో అది ఆగ్నేయగిరివలె అగ్నిని వెడలగ్రక్కుచుండెను.

భారతదేశమునుండి బ్రిటిషుశాసనమును అంత మొందించుటకు సమస్తభారతదేశములో తీవ్రమైన ఆందోళనము

ఆరంభమాయెను. భారతేతిహాసములో 1857 వ సంవత్సరములో జరిగిన సిపాయివిప్లవానంతరము దేశమంతటను వ్యాపించి యింతమహత్తరమైన ప్రజావిప్లవము యెన్నడును జరిగియుండలేదు.

అనేకస్థానములలో బ్రిటిషుశాసనము అంతమొందెను. వంగదేశములో మేదినీపురాంతర్గతమైన కొన్నిప్రదేశములలోను, యుక్తప్రదేశ బాలియాలోను, ఛత్రపతి శివాజీ లీలాభూమియైన సాతారాలోను, సామ్రాజ్యవాదులగు బ్రిటిషువారి పరిపాలనము అంతమొందెను. ఆస్థానములలో యూనియన్‌జాక్ కు బదులు భారతీయ త్రివర్ణరంజిత జాతీయపతాకము ఎగురవేయబడెను. ఆస్థానములలో రెండుసంవత్సరములవరకు జాతీయసర్కారువారు ప్రతిష్ఠితులై యుండిరి.

సర్కారువారు భారతీయులలో కలిగిన స్వాతంత్ర్య ఆకాంక్షను అణచివేయుటకు అనేకవిధముల అత్యాచారములు గావింప నారంభించిరి. లాఠీచార్జి, తుపాకులుప్రేల్చుట, ప్రజలగృహములను కాల్చివేయుట, స్త్రీలపై క్రూరహింసలు గావించుట, శిశువులను నిక్షేతుకముగా చావమోదుట మొదలగు క్రూరకృత్యములు గావించి సర్కారువారు భారతదేశములో బ్రిటిషుపరిపాలనమును గాయపరచుటకు ప్రయత్నించుచుండిరి. కొన్నికొన్నిస్థానములలో విమానములనుండి ప్రజలపై బాంబువర్షము కురిపించిరి.

కాని సర్కారువారి అత్యాచారములు పెచ్చుపెరిగి

త్రులు నియమింపబడిరి. వివిధములైన విచారణము లన్నియు జాతీయసర్కారువారే గావించుచుండిరి. జాతీయసర్కారు వారు సామరికసైన్యమునుకూడ తయారుచేసిరి.

దేశములో విప్లవాగ్నిజ్వాలలను వెలిగించి భారతీయు లు అంతటితో విరమించలేదు. విదేశశాసనవ్యవహారములను స్తంభింపజేసి వారు నిర్మాణమూలకమైన కార్యములలో నిమగ్నులైరి. శాసనము, కర్మపద్ధతి, ఆరోగ్యము, విద్య, కృషి, ప్రచారము మొదలగు సకలకార్యములయెడల వారు శ్రద్ధవహించిరి.

ఈఆందోళనమువలన గాంధీజీ భారతదేశములో కేవలము స్వాతంత్ర్యమును పొందుఉద్రేకమును కలుగజేయుట యేగాక, స్వాతంత్ర్యమును పొంది దానిని సుప్రతిష్ఠితము గావించుటకు కావలసిన చైతన్యమునుకూడ కలిగించెను.

1942 వ సంవత్సరములో ఆరంభింపబడిన ఆందోళన ము శివుడులేని యజ్ఞమువలె గాంధీవిహీన మైనది, నాయక విహీనమైనది దీనివలన అచ్చటచ్చట జరిగిన సంఘటనలకు గాంధీజీ, కాంగ్రెసువారు బాధ్యులని సర్కారు ప్రకటించిరి. అహింసా మారువేషము ధరించి యింతకాలము యీ దేశము లో విప్లవబీజములను నాటుచుండిరనియు, సర్కారువారు ప్రచారము చేసిరి.

సర్కారువారి యిట్టిఅసత్య ప్రచారమునకు గాంధీజీ కారాగారముచాటుననుండియే ఘోరతరమైన ప్రతివాదమును తెలియజేసిరి. అసత్యప్రచారమునకు విరుద్ధముగా ఆయన

సత్యాగ్రహోద్యమము విప్లవరూపము ధరించెను. ఆయన అప్పుడు అనారోగ్యముగా యుండెను. కాని ఆ అనారోగ్య అవస్థయందే ఆయన ఆగాఖాన్ ప్రాసాదములో 21 దినముల ఉపవాసవ్రతమును ఆరంభించిరి. సర్కారువారు చండశాసనమునకు విరుద్ధముగా ప్రతిఘటనము తెలియజేయుటకు నిరశనవ్రత మారంభించుటకుముందు వైస్రాయ్‌కి ఒక ఉత్తరముద్వారా తెలియజేసిన దేమనగా - 1942 లో, ప్రజలలో విప్లవజ్వాలలు కలుగుటకు స్వేచ్ఛాచారులైన బ్రిటిషు సర్కారువారే బాధ్యులు.

ఆసమయములో కొన్ని షరతులతో గాంధిగారికి ముక్తి ఇవ్వగోరెను. కాని ఆయన నిరాకరించెను.

1944 మే 6 వ తేదీన ఆయన బేషరతులతో విడుదల చేయబడిరి. కారాగారములో వసించుచున్న సమయములో ఆయన తన సతీమణి కస్తూరిబాయ్, ప్రియతమ భక్తుడు, అనుగత శిష్యుడు మహాదేవదేశాయి గార్లను కోల్పోయిరి.

గాంధిగారు విడుదలయినపిమ్మట యితర దేశనాయకులుకూడ ఒకొక్కరే విడుదల చేయబడిరి. పండిత జవహరలాల్ నెహ్రూ కారాగారమునుండి విడుదలయిన వెంటనే ఆగస్టువిప్లవవాదులకు అభినందనము తెలియజేసిరి—"1942లో జరిగిన సంఘటనలకు నేను గర్వము ననుభవించుచున్నాను. నాయకవిహీను లగుటచే సర్కారువద్ద నతిస్వీకరించిన యెడల నేను అత్యంతదుఃఖితుడ నయ్యెడివాడను. దానివలన వీరికి

తననే పరిత్యాగించెడిది. నాయకుడు లేడు, సంఘశక్తి లేదు, ఎట్టి ఉద్యమములు లేవు, ఎట్టి అస్త్రబలము లేదు, ఎట్టి సరంజామ లేదు, అయినను అసహాయ దేశీయులు అంతరిక్ష ప్రేరేపణచే కర్మశక్తిద్వారా ప్రబలపరాక్రాంత శాసనవ్యవస్థలకు విరుద్ధముగా విప్లవము నారంభించిరి. ఇది నిజముగా అత్యంత విస్మయవిషయము.''

గాంధిగారి 'భారత దేశము వదలి పొండు' అను ఆందోళనమునకు అనంతరఅధ్యాయము భారతస్వాతంత్ర్యసంగ్రామ సాఫల్యత అధ్యాయము. తత్ఫలితముగా భారత దేశములో 200 ల సంవత్సరములనుండియున్న బ్రిటిషుశాసనముల గట్టి పునాదులన్నియు శిథిలములై పోయెను. నేడు భారత దేశము పొందిన స్వాతంత్ర్యమునకు మూలమున 1942 వ సంవత్సరమునాటి 'భారత దేశమును వదలిపొండు' అను ఆందోళనము నిహితమై యున్నది.

దక్షిణాఫ్రికాలో కృష్ణకాయులగు భారతీయులపక్షమును వహించి నిష్క్రియప్రతిఘటన సంగ్రామము, అసహాయోద్యమ ఆందోళనము, శాసనబహిష్కరణ ఆందోళనము. మహత్తరమైన, వ్యాపకమైన 'భారత దేశమునువదలిపొండు' ఆందోళనము. ఇవి అన్నియు గాంధిగారి విశేషదానములు, పరాధీనజాతీయులు గౌరవమును, స్వాతంత్ర్యమును పొందుటకు గాంధీజీద్వారా ఆవిష్కరింపబడిన యీసకల ఉపాయములు విశ్వవాసుల విస్మయమును, గౌరవమును ఆకర్షించినవి. భారతీయులు తమస్వతంత్రసంగ్రామ అధినాయకుని దానములనుగురించి ఎన్నటికిని మరువజాలరు.

# 59
# ఆగష్టు ఆందోళన అనంతరము

ఆగష్టువిప్లవాగ్ని అప్పటి కింకను సంపూర్ణముగా ఆరి పోలేదు. విప్లవజ్వాలలు అచ్చటచ్చట నుండుచునే యుండెను. సర్కారు అత్యాచారముల చేతను, ఉత్పీడనముల చేతను దేశ వాసులు ఇంకను మృతావస్థయం దుండిరి. వారి దేహములు అవసన్నములైనను, మానసికశక్తులు తేజోవంతములై యుం డెను. ఆమనోబలమును నష్టముచేయుటకు సర్కారువారు అనేకవిధముల కుట్రలు పన్నుచుండిరి. జపానువారియొక్క, సుభాస్‌చంద్రుని ఆజాద్‌హింద్‌సైన్యముయొక్క భయము చేత సర్కారువారు దేశములో నున్నసైన్యముల నన్నిటిని ఎచ్చటనో దాచి యుంచిరి. దేశములో దొంగవ్యాపారము ప్రబలమయ్యెను. సర్కారువారిలో దుర్నీతివృద్ధి కాజొచ్చెను. దానితోపాటు మేదినీపురప్రాంతములలో ప్రాకృతిక దురవస్థలు సమ్మిళితములయ్యెను. తత్ఫలితముగా బెంగాలులో భయంకర దుర్భిక్షము ఆరంభమయ్యే సూచనలు కానుపించెను. సర్కారు ఈవిషయములో ముందుజాగ్రత వహించలేదు. సర్కారు వారి దుర్నీతిపరాయణత్వమువలన కాటకము ఆరంభ మా యెను. దీనివలన అన్నాహారమువలన, ఆధివ్యాధులవలన లక్షలకొలదిప్రజలు మరణించిరి. దుర్భిక్షము, వ్యాధులు, అనంతరము సాంప్రదాయికభేదములు అత్యంతభీషణాకారము దాల్చెను. దుర్భిక్షము, సాంప్రదాయికపైశాచికనృత్యముల వలన దేశము కళంకితమయ్యెను.

అప్పటి కింకను కాంగ్రెసునాయకు లందరును కారాబద్ధులై యుండిరి. వారు లేనిసమయము కనిపెట్టి ముస్లింలీగ్ ద్వారా కాంగ్రెసు హిందూప్రతిష్ఠానమనియు, హిందూరాజ్యమును స్థాపించుటయే దానియుద్దేశమనియు భారతదేశ మంతటను ప్రచారము జరుగుచుండెను. అందువలన మహమ్మదీయులకొరకు పాకిస్థానము లేక స్వతంత్రరాష్ట్రము ప్రతిష్ఠింపబడుట అవసరము. ఇంతకంటె మహమ్మదీయులరక్షణకు వేరు మార్గములేదు. బ్రిటిషుసామ్రాజ్యవాదులు భారతదేశములో తమఅధికారమును స్థిరపరచుకొరకే దేశములో యిట్టివిభేదములను అతిజాగ్రత్తతో సృష్టించిరి. ఈవిభేదములసృష్టికి ప్రోత్సాహకులు వారుండిరి.

దేశములో యిట్టిసంకటజనక పరిస్థితులు వ్యాపించి యున్నప్పుడు గాంధీజీ కారాగారమునుండి విడుదల అయిరి. రుగ్నశరీరముతో ఆయన విడుదలయై బయటికివచ్చెను. కాని విముక్తి చెందినపిమ్మట దేశముయొక్క కళంకితదృశ్యమును చూచి ఆయన ఆవేదనచెందెను. ఆగస్టువిప్లవమువలన బ్రిటిషు సర్కారువారి దానవఅత్యాచారములవలన, దుర్భిక్షమువలన అనారోగ్యములవలన భారతదేశముదుర్భరావస్థయందుండెను ఇదిగాక సాంప్రదాయకకలహములు సృష్టింపబడెను. ఆయన ఆరంభించిన కార్యములు సర్కారువారి దుర్నీతిమూలకమైన కార్యకలాపములచేత ఎంతనష్టపడెనో దానిని గాంధీజీ అవలోకించి అత్యంతవిషాదగ్రస్తుడయ్యెను. ఇతర కాంగ్రెసునాయ

కులు కారాగారములనుండి విముక్తిచెంది ఆగస్టువిప్లవము కొరకు దేశవాసులకు అభినందనములను తెలియజేసిరి. గాంధీజీ హృదయము చిరకాలమునుండి హింసాకార్యములకు ప్రతికూలమై యుండెను. అందువలన ఆయన ప్రజలహింసామూలకమైన కార్యములను సమర్థించలేదు. సత్వరముగా సాంప్రదాయక విద్వేషమును నిరోధించి దేశస్వాతంత్ర్య ఆందోళనమును మరల శక్తివంతముగా గావించుటకును, హింసామాలిన్యమును విముక్తపరచుటకును ప్రయత్నములు గావించుచుండిరి.

రుగ్ణశరీరముతోనే ఆయన కార్యములలో ప్రవేశించెను. జీవితకాలమంతయు అశ్రాంతసాధనచే స్వతంత్రభారతదేశములో ఏస్వప్నసౌధమును ఆయన నిర్మించియుండిరో యది సామ్రాజ్యవాదులు. కుటిలనైతికుల చక్రాంతమునబడి ధూళిలో కలసిపోవుటకు సిద్ధమై యుండుటచూచి ఆయన స్థిరముగా నుండలేకపోయెను.

భారతదేశమునకు ఆనాడు లార్డు వేవెల్ వైస్రాయిగా నుండెను. ఆశాజ్యోతిని హృదయములో వెలిగించుకుని వేవెల్‌గారిని దర్శించి భారతసమస్యలనుగురించి ఆలోచించ కోరెను, కాని ఆయనప్రయత్నము వ్యర్థరూపము దాల్చెను. పిమ్మట సాంప్రదాయికసమస్యల సందర్భములో ఆయన జిన్నాగారిని దర్శించెను. ఆయాలోచనములుకూడ వ్యర్థములయ్యెను. జిన్నా రెండుజాతులవారినిగురించి వెలు

వరచిన నీతివిషయములో ఆయనతో ఏకీభవింపలేకపోయెను. ఏలననగా, ఆయన చిరకాలము అఖండభారతజాతిని విశ్వసించినవారు.

1945 వ సంవత్సరము మే నెలలో కాంగ్రెసు కమిటి సభ్యులు ముక్తిగాబడసిరి. ఇంతలో ద్వితీయమహాయుద్ధము అంతమొందెను. యుద్ధానంతరము భారతదేశముయొక్క సర్వాంగసుందరఔన్నత్యముకొరకు గాంధీజీ ఒకపరికల్పనను తయారుచేసెను. 'గాంధీపరికల్పన' అనుపేరుతో పరిచితమైన యీచిత్తుయొక్క ఉద్దేశమేమనగా గ్రామములను కేంద్రముగా చేసుకుని కృషి, శిల్పము, విద్య, ఆరోగ్యము మొదలగు సకలవిషయములలో ఉన్నతిని సాధించుట.

1945వ సంవత్సరములో కాంగ్రెసునాయకులు విముక్తి చెందినపిమ్మట భారతేతిహాసములో సత్వరపరివర్తనములు సంఘటిల్లెను. ఈసంవత్సరము జూన్ నెలలో లార్డు వేవెల్ భారతదేశములోని అచలపరిస్థితులను అంతమొందించుటకు సిమ్లాలో దేశనాయకుల సమావేశమును జరుప నుద్దేశించి ఆహ్వానించిరి.

బ్రిటిషు ప్రతిపాదనమును గురించి అచ్చట ఆలోచింపబడెను. కాని ప్రతిక్రియాశీలశక్తుల చక్రాంతమువలన యీఆలోచనములువ్యర్థమయ్యెను. ఆసమావేశసమయములో మహాత్మాగాంధీజీ హాజరై యుండెను. సమావేశము వ్యర్థమగుటచే సామ్రాజ్యవాదుల శోషణబారినుండి భారతదేశము విముక్తి

పొందలేదని వ్యధితుడాయెను. కాని ఆయన లక్ష్యభ్రష్టుడు కాలేదు. భారతదేశస్వాతంత్ర్యవిమోచనాకాంక్ష ఆయన హృదయమంతటను వ్యాపించియుండెను.

ఈసంవత్సరము డిసెంబరు 24 వ తేదిన మేదినీపురము పోవుచు కలకత్తాకువచ్చి మేదినీపురమునకు పోయిరి. కలకత్తాలో బెంగాలుగవర్నరు ఆర్. జి. కేసీగారిని, వైస్రాయి లార్డువేవెల్ గారిని గాంధీజీ దర్శించిరి. వీరు భారతదేశరాజకీయపరిస్థితులను గురించి సంప్రదింపులు గావించిరి.

మేదినీపురమునకు గాంధీజీపోయి ఐదుమందుకూర్చురు. తమలుకు కాంథిప్రాంతములలో దుర్భిక్షము, రోగములధ్వంసలీలలను ప్రత్యక్షముగా దర్శించిరి. అచ్చటిఆగస్టుఆందోళనమును, స్వాతంత్ర్యఆందోళనము అణచివేయుటకు సర్కారువారు గావించిన భయంకరఅత్యాచారములనుకూడ ప్రత్యక్షముగా దర్శించిరి.

గాంధీజీ యీ మేదినీపురములో నున్నసమయములోనే ప్రప్రథమమున ప్రార్థనసభలను ప్రవర్తింపజేసెను. ఆయన చిరకాలము మానవజీవితములో ప్రార్థనావశ్యకతను గ్రహించియుండిరి. ఆయన తనవ్యక్తిగతజీవితములో ప్రార్థనద్వారముననే ఈశ్వరుని సాన్నిధ్యమును అనుభవించిరి. ఆపత్కాలములో ఈశ్వరుని ఆదేశమును హృదయాంతరాళములో అనుభవించి తనకార్యక్రమమును నిరూపించుకొనువారు. ఈసమయమునుండి ప్రార్థనవలన ఆయన యేసంపదను

అధికారి కాగలిగెనో, ఆసంపదలో సాధారణప్రజలను, దేశ వాసులను సమృద్ధిశాలురను గావించుటకు వ్యాకులాత్ములైరి.

మానవజీవితములో ప్రార్థనావశ్యకతనుగురించి ఆయన నుడివిన విషయము — "ప్రార్థనద్వారా మానవుని జీవితము శాంతపడుచుండును. విశ్వబ్రహ్మాండమంతటను యేమహత్తర శక్తివ్యాప్తమై యున్నదో, మానవుడు శాంతపరిస్థితులలో నున్నపుడు ఆశక్తితో సన్నిహితత్వమును అనుభవించును."

వివిధధర్మములలో నున్న శ్రేష్ఠమైన సందేశములను ఆయన సంపాదించి ప్రార్థనసభలో పఠించుచుండిరి. సంకుచిత హృదయము, మూఢాచారములుగల వ్యక్తులు ధర్మగ్రంథ ములనుండి ఉత్తమసందేశములను పఠించుటకుకూడ అనేక సార్లు ఆటంకములను కలుగజేసియుండిరి. కాని వారుహిందూ ధర్మముయొక్క యథార్థస్వరూపమును మరచిపోయి సంకీర్ణ హృదయమును ప్రకటించిరి. హిందూధర్మములో భగవానుని విభూతి ఎచ్చటనుండి ప్రకాశించినను దానిని స్వీకరించువిధా నము గలదు. అంధత్వము, మూఢత్వము యథార్థజీవితవిష యము కాదు. ఈవిషయము సంకుచితహృదయముగల హిం దువులు గ్రహించువారు కారు. మూఢత్వములో సచలత్వము కాన్పించదు. దానిలో స్థాణుత్వము ప్రకటితమగును.

దానిలో ధ్వంసబీజములు దాగియుండును. కాని గాంధీజీలో ఎట్టిసంకుచితము ఎన్నడును ప్రకటితము కాలేదు.

ఇయన బహుకాలమునుండి హాస్యరస ప్రాకస్వాప్రాధాన్య పత్రము
ను అవలంబించువారు. వ్యాఖ్యాతలై ప్రార్థన చేయువారు. వీరి
వ్యాసాలా ఆయన కొంతజీవితసంధానమును పొందగలిగిరి. కొత్త
గా నిర్దేశింపబడిన స్థితి స్పష్టపరిస్థితికి చేరుకొనిరి. ప్రార్థనసభానం
తరము సమావేశమైన ప్రజలలో న్యాయఅన్యాయపరిశోధ
మును కలిగించుటకు, సత్యఅసత్యములపై తర్కమును ఉద్బోధి
తము గావించుటకు, రాజనైతికక్షేత్రములో ఉచితఅనుచితనీ
తివిషయములో అయనఅమూల్యమైన సందేశములను ప్రచా
రము చేయువారు. ఇవి అన్నియు మేదినీపురములో వసించున
సమయమునుండియే ఆరంభింపబడెను.

మేదినీపురమునుండి కలకత్తాకుపోయి అచ్చటినుండి
గాంధీజీ అస్సాముప్రదేశమునకుపోయిరి. అస్సాసునుండి మరల
కలకత్తాకువచ్చి అచ్చటినుండి మద్రాసుకు పోయిరి. అచ్చట
పారిశ్రామికులసభలో ఉపన్యసించుసమయములో కార్మికులే
కార్ఖానాలకు ప్రకృతయజమానులు అని నుడివిరి. ఈవాక్య
మును ప్రవచించి గాంధీజీ అనాదు నిపీడితమానవులతరపున
ప్రేలు నెత్తి గ్రంథవాదులను లక్షాధికారులను శాసించియుండిరి

ఇంతలో ఇంగ్లాండులో సాధారణయెన్నికలలో రక్షణ
శీలదళమువారికి పరాజయము సంభవించెను. కార్మికదళము
వారు గవర్నమెంటుపరిపాలనాభారమును వహించిరి. ఈనూ
తనగవర్నమెంటువారు కాంగ్రెసుకు విరుద్ధముగా నున్నశాసన
ముల నన్నిటిని విరమించుకొని కాంగ్రెసు న్యాయసమ్మతమైన

దని అంగీకరించిరి. వైస్‌రాయ్ లార్డు వేవెలును భారతీయ సమస్యలను పరిష్కరింపజేయుటకు సంప్రదించుటకు ఇంగ్లాండుకు ఆహ్వానించిరి. భారతదేశమందంతటను వ్యవస్థాపకసభల నూతనయెన్నికలు జరుపవలసినదని ఆదేశములు జారీ చేయబడెను.

భారతదేశములో జరిగిన యీనూతనఎన్నికల ఫలితముగా కాంగ్రెసు అనాయాసముగా యెనిమిదిప్రదేశములలో అధికసంఖ్యను సంపాదించి మంత్రిసభను నిర్మించెను.

అనంతరము 1946 వ సంవత్సరము మార్చి నెలలో ఆఖరున ఇంగ్లాండుప్రధానమంత్రి మిస్టర్ అట్లీ ప్రకటనప్రకారము మంత్రులకమిషను భారతదేశభావిశాసనతంత్రమును రచించుఉద్దేశముతో భారతదేశమునకు వచ్చిరి. ఈదళములో భారతసచివుడైన లార్డుపెథిక్ లారెన్సు, సర్ స్టాఫోర్డు క్రిప్సు, మిస్టర్ ఎ. వి. అలెగ్జాండరు ఉండిరి. ఈమంత్రులకమిషను భారతరాజకీయపరిస్థితులనుగురించి భారతీయనాయకబృందముతో సంప్రదింపులు జరుపుటకు వచ్చియుండిరి.

సిమ్లాలో 'మహాత్మాగాంధి' కాంగ్రెసునాయకబృందము, వైస్‌రాయి బ్రిటిషుమంత్రిసభాసదస్యులు కలిసి సభ జరిపిరి. మహాత్మాజీ ఆయనసహజసిద్ధమైన ఔదార్యముతో యీసారి బ్రిటిషుగవర్నమెంటువారిఔదార్యము, సదిచ్ఛను గురించి విశేషముగా ప్రశంసించిరి. మంత్రులకమిషను ప్రతిపాదనమును అంగీకరించి భారతీయులు గర్వముననుభవింపగలరని 'హరిజన' పత్రికలో ఒకవ్యాసమును వ్రాసి ప్రకటించిరి.

బహుదినములు మంత్రుల కమిషను, కాంగ్రెసు, ముస్లిమ్‌లీగ్ వారికి జరిగిన సంప్రదింపులలో ఆయన సలహాదారుగా పనిచేసెను. మంత్రులప్రస్తావనను ఆయన చాలావరకు సమర్థించెను. అయితే భారత దేశమునుండి బ్రిటిషు సైన్యమును త్వరలో తొలగించవలసి కోరుచు ఒక వ్యాసమును వ్రాసి 'హరిజన' పత్రికలో ప్రకటించిరి. దీనిద్వారా ఆయన భారతీయుల స్వపరిపాలనము నే కోరియుండిరి. మంత్రులతో గావించిన సంప్రదింపులలో భారత దేశములోని రెండు ప్రధానరాజనైతికదళములు జాతీయతావాదులగు కాంగ్రెసువారు, సాంప్రదాయికతావాదులగు లీగువారు ఏకాభిప్రాయమునకు రాలేకపోయిరి. కాంగ్రెసువారికిని, గాంధీగారికిని అఖండభారత దేశమును నిర్మించు ఆదర్శము లుండెను. భారత వర్షమును హిందు, మహమ్మదీయ, శిఖ్ఖు, పార్సి మొదలగు సకలసాంప్రదాయములకు మిలనతీర్థక్షేత్రముగా పరిణమింప చేయవలెనని గాంధీజీ, కాంగ్రెసువారు జీవితకాలమంతయు సాధన గావించియుండిరి.

మే నెలలో మంత్రులప్రతిపాదనము ప్రకటింపబడెను. దీనిలో ముస్లిమ్‌లీగువారి రెండుజాతులనీతిని ప్రత్యక్షముగా అంగీకరింపకపోయినను, పరోక్షముగా అంగీకరించుటే అయినది. ఇదిగాక భారత దేశభావిశాసనతంత్రమును రచించుటకు ప్రజాపరిషత్తును నిర్మించవలసినదిగా ప్రస్తావన చేయబడెను. నూతనశాసనతంత్రము రచింపబడునంతవరకు మధ్యకాల

ములో కాంగ్రెసువారిని, ముస్లిమ్‌లీగువారిని సమ్మిళితముగా మధ్యవర్తి సర్కారును నిర్మించుమని వేడుకొనబడెను.

గాంధీజీసలహాప్రకారము కాంగ్రెసు స్వాతంత్ర్యవిషయములో బ్రిటిషుసర్కారువారి వాగ్దానమును పురస్కరించుకని పండిత జవహర్‌లాల్ నెహ్రూ మధ్యవర్తిసర్కారును నిర్మించెను. లీగువారు ప్రథమమున మధ్యవర్తిసర్కారు వారితో కలియలేదు. కాని తుదకు వారు పాల్గొనిరి. కాని అధికారమును ఆక్రమించుకొనుటకు మనోమాలిన్యము ఆరంభమయ్యెను. ఇదియే భారతవిచ్ఛేదమునకు మార్గము సిద్ధపరచెను. కలకత్తా, నవఖాళి, బీహారు మొదలగుప్రదేశములలో సాంప్రదాయిక అల్లరులు ఆరంభమయ్యెను. ప్రపంచము హింసాపూర్ణమైయున్నదని గాంధీజీ విచారగ్రస్తుడయ్యెను.

## 60

## శాంతి యాత్ర

మహామానవమహాత్మాగాంధి ఢిల్లీలో వసించుచు స్వాతంత్ర్యద్వారమునప్రవేశించిన దేశీయులమార్గమును నిర్దేశించుచున్నప్పుడు భారత దేశసాంప్రదాయికమనోమాలిన్యము తీవ్రరూపము దాల్చెను. మహాత్మాజీ జీవితకాలమంతయు గాంచినస్వప్నము ధూళిలోకలసిపోవుటకు ఉపక్రమించునట్లుండెను. 1946ఆగస్టు 16వ తేదిన ముస్లిమ్‌లీగుద్వారా ప్రకటింపబడిన 'ప్రత్యక్షసంగ్రామ' దినమున కలకత్తానగరమధ్యమున

ఆరంభమైన నారకీయసాంప్రదాయికకల్లోలములు గాంధీజీకి ఆవేదన కలిగించెను. కాని గాంధీజీ చిరకాలము ఆశావాదియై యుండెను. అన్యాయము, అసత్యము, అశాంతి, అత్యాచారములు, అవిచారములునుండి న్యాయము, సత్యము, శాంతి, క్రమము మొదలగునవి విలసిల్లునని ఆయన విశ్వసించెను. దేశవాసులు ఆలోకరస్మిని దర్శించునప్పుడు ఆత్మఘాతుకమగు హత్యలు జరుగనేరవని ఆయన బహుదినములనుండి చెప్పుచుండిరి. స్వాతంత్ర్యభారతదేశములో సంకుచితసాంప్రదాయికతా బుద్ధినుండి ఉద్భవించిన హింసాఉన్మాదము ఉండజాలదు. అప్పుడు విరోధములన్నియు, పక్షవిభేదములైన వివాదములన్నియు విస్మరించి సమ్మేళనమహామంత్రములో దీక్షపొంది ఏకజాతీయతాజ్ఞానముచే ప్రబోధితమై అందరును మాతృభూమిసేవలోనే ఆత్మసమర్పణ గావించుకొందురు.

కాని కలకత్తాలో జరిగిన తరువాత సాంప్రదాయిక అల్లరులు నవఖాలిప్రాంతములలో ఆరంభమాయెను. కలకత్తా అల్లరులు మహానగరసీమలలోనే అబద్ధమై యుండెను. కాని నవఖాలిఅల్లరులు సమస్తజిల్లాలలో వ్యాపించెను. ఈ విశాల ప్రదేశములో అల్పసంఖ్యగల హిందూసాంప్రదాయముపై దుర్మార్గులు, హింసాపరాయణులు, ధర్మాంధులు, అమానుషిక అత్యాచారములను, ఉత్పీడనములను గావించిరి. అనేకమంది స్త్రీపురుషులును, శిశువులును హింసానలములో దగ్ధమైరి. అనేకమంది స్త్రీలు అపహరింపబడిరి. బలాత్కారముగా

భర్మాంతరము చేయించిరి. దుర్మార్గుల అత్యాచారములచేత అనేకగృహములు భస్మీపటలము లయ్యెను.

దీనివలన నాలుగువైపుల భయము, సందేహములు చెలరేగెను. విశాలమైన నవఖాళీజిల్లానుండి గుంపులుగుంపులుగా అల్పసంఖ్యగల సాంప్రదాయకులు ప్రాణవిత్తములను రక్షించుకొనుటకు వివిధస్థానములలో ఆశ్రయప్రార్థులై వచ్చుచుండిరి.

మానవునకు ప్రతికూలముగా మానవుడు గావించిన పాశవికహింసల తాండవలీలల యితిహాసమును విని, మానవత్వమునకు కలిగిన యీఅసహ్యాఅవమానమువలన గాంధీజీ అంతరాత్మ ఆక్రందనము గావించెను. అవమానితులు, లాంఛితులును అగునాకీనులాల ఆవేదనాపూర్ణ అశ్రుపూర్ణవిగ్రహములు ఆయనమానసనేత్రములలో ప్రకాశిత మగుచుండెను. వ్యథితులహృదయభేద్యమగు ఆర్తనాదములు అవ్యక్తఆకర్షణముచే ఆయనను ఆకర్షించుచున్నట్లుండెను.

ఢిల్లీలో ఒకప్రార్థనసభలోనుడివినవిషయము—'ఏదినమునుండి నేను నవఖాళివిషయము వింటినో, ఆనాటినుండియే నాకర్తవ్యమునుగురించి ఆలోచించుచుంటిని. ఈశ్వరుడు నాకు మార్గమును ప్రదర్శించునుగాక!'

ఈశ్వరునిపై చిరనిర్భరశీలుడగు యీమహామానవుడు చిలకాలము ఆయన హృదయాంతరాళములో ఈశ్వరాదేశమును అనుభవించుచుండిరి. అందువలన భారతజాతీయజీవిత

ములో సంభవించిన హిందూముస్లిం కలహములో కూడ ఆయన యాత్మ్య ప్రాధాన్యము నకొఱకు నిశ్చింతముగనుండెను.

1946 అక్టోబరు 27 వ తేదీన గాంధీజీ తన ప్రార్థనాంతర ప్రసంగములో నవఖాలీకి పోవు సంకల్పమును ప్రకటించిరి. ఆయన ఉపన్యాసములో నుడివిన విషయము- "నేను రేపు ఉదయమున కలకత్తాకు పయనము చేయుచున్నాను. అచ్చటినుండి నవఖాలీకి పోవ సంకల్పించుకొంటిని."

గాంధీజీ ఆరోగ్య మప్పుడు సరిగా లేకుండెను. ఈ మహాహానిత్రపాలనమునుండె. దీర్ఘయాత్రనుండి ఆయనను తన స్నేహితులు లోకము నివృత్తి చేయ ప్రయత్నించెను. గాంధీగారు అందునకు నుడివిన విషయము–'వంగదేశమునకు పోయి నేను ఏమి చేయగలనో యెఱుగను. నేను వంగదేశమునకు పోనియెడల నాహృదయములో నాకేమాత్రమును శాంతి యుండదని నే నెఱుగుదును.'

ప్రార్థనాంతర ప్రసంగములో వచించిన విషయము– 'నాయాత్రాపథము ఎంతమాత్రమును సహజమైనది, సుగమమైనదికాదు. నాఆరోగ్యముకూడ సరిగలేదు. కాని నాకర్తవ్యము నేను నెరవేర్పవలసినదే కదా! ఈశ్వరునియందు విశ్వసింపవలయును. ఆయనకు శరీరపరిశ్రమ గావించుశక్తి కూడ నొసంగును. ఎవరివిచారణ జరుపుటకును నేను వంగదేశమునకు పోవుటలేదు. ప్రజలసేవకునివలె నేను వంగదేశమునకు పోవుచున్నాను. అచ్చటికి వెళ్లి నేను హిందూ మహమ్మదీయ, సకలసంప్రదాయములవారిని దర్శించెదను,

జాతిధర్మభేదములు పాటింపక సకల దేశవాసులును నా ఆత్మీయులను భావమును నా 17 వ సంవత్సరమునుండియే నేను నేర్చుకొంటిని. ఈశ్వరుని సేవకులము గావలయునన్నచో ఆయన సృష్టించిన జీవుల సేవకులము కావలయును. నేను ఆ సేవకుని అధికారముతోనే వంగ దేశమునకు పోవుచున్నాను. నేను అచ్చటికి పోయి హిందూమహమ్మదీయుల సమ్మేళన విషయమే ప్రచారము చేయుదును. హిందుమహమ్మదీయులు వారిలో వారికి శత్రువులు కాకూడదు. ఏక దేశమందు ఈ రెండు సాంప్రదాయములు లాలితపాలితము లగుచున్నవి. ఏక దేశమందే వారు జీవనయాత్రను గడపుకొనుచున్నారు. ఏక దేశమునందే వారు దేహయాత్రను చాలింతురు. తూర్పు బెంగాలు స్త్రీల దురవస్థలచరిత్రను విని నాహృదయము కరగిపోయినది. నేను వారికన్నీటిని తుడిచివైచుటకు పోవుచున్నాను. వారి భగ్నహృదయములలో ఆశాసంచారము గావింప పోవుచున్నాను.”

ఇట్టి కఠోరసంకల్పము, దుర్జయఆత్మశక్తిపై ఆధారపడి మహాత్మాజీ జీవితకాలమంతయు అసత్యఅన్యాయఅధర్మములతో సంగ్రామము గావించియున్నారు. ఇట్టి స్థిరవిశ్వాసముపై నిలువబడియే ఆయన దక్షిణాఫ్రికా సత్యాగ్రహ ఆందోళనమును నడపియుండిరి. దుర్నివార వేగముతో డాండియాత్రలో అగ్రసరులైరి. చంపారణసత్యాగ్రహమును నడపినారు. ఆవిశ్వాసప్రబోధమే నవఖాళినిభృతతమ పల్లీప్రాంతములకు యాత్రను సాగింప ప్రేరణము కలిగించెను.

ఇంతకుపూర్వము దక్షిణాఫ్రికాలో అన్యాయములకెదు [illegible] ముగా అనేకసారులు సత్యాగ్రహము చేసియున్నాడు. కాని అవన్నియు [illegible] కాంగ్రెసుప్ర [illegible] గలదు. దేశవాసులయెడల సర్కారువారు గావించిన అత్యాచారములకు ప్రతీకారమునకై ఆయన పూర్వమునందనేకసారులు అహింసాశస్త్రముతో సంగ్రామక్షేత్రమున ప్రవేశించినమాట సత్యము, కాని అప్పుడు పరిస్థితుల అన్యాయరూపము ఆయనకు స్పష్టముగా కనుపించెను. ఇంతవఱకుపూర్వము దేశవాసులయెడల ఏట్టి అన్యాయముగాని అత్యాచారముగాని జరుపబడినయెడల, ఆయన ఆవిశేష అన్యాయప్రతీకారమునకు అహింసాశస్త్రముననెట్టిని ప్రయోగించి దానిని ప్రతిఘటించుటకు ప్రయత్నించుచుండిరి. కాని గాంధీజీ యీసారి ఆరంభించినయాత్ర దేశవాసులయెడల సర్కారువారు గావించిన అత్యాచారములకు ప్రతికూలము గాదు. ఈసారి ఆయన అహింసాపూర్వక అంతిమపరీక్షకు వచ్చినారు. ఈయాత్రతాత్పర్యము అనంతమైనది. ఈసారి యీయాత్రనుగురించి ఆయన నుడివిన విషయము— "ఈసారి నాపరీక్ష కఠోరమైనది, నాబాధ్యత అపారమైనది. ఇంతకు పూర్వము నేను ఎన్నిసారులు సత్యాగ్రహము చేసినను ప్రతిసారి నాసమక్షమునందొకసుస్పష్ట అన్యాయమూర్తి నిలువబడియుండెడిది. సర్కారువారికి విరుద్ధముగా నాకు ఫిర్యాదులుండెను. నేను ఆ అన్యాయమునకు ప్రతీకారముకొఱకే

అహింసాసంగ్రామమును గావించితిని. ఆసంగ్రామములో నేను పురోభాగమునకు పోయి నిలువబడియున్నను నానలు వైపుల పీడితభారతీయులువచ్చి నిలువబడిరి.

'నేను సంపూర్ణముగా భగవంతునకు ఆత్మసమర్పణము గావించుకొన్నను వీరిసందర్శనము నాకు అత్యంత శాన్త్వనమును, శక్తిని కలుగజేసెను. దాని నేడు నేనుఆరంభించిన సత్యాగ్రహముయొక్క రూపము సంపూర్ణముగా భిన్నమైనది. నేను సర్కారువారు అనుష్ఠించిన యేఅత్యాచారమునకు ప్రతీకారము చేయబోవుటలేదు. ఎవరికిని విరుద్ధముగాను ఎట్టిఅభియోగము లేదు. నేను నాజీవితకాలమంతయు యేఅహింసాసాధన గావించితినో, ఆ అహింసాద్వారా నేను మానవుని మనస్సునందున్న అమానుషికత్వమును దూరము చేయగలనో లేదో పరీక్షించిమాత్రమే చూచెదను. మానవులయందుగల క్రూరభావములు, హింసాద్వేషములు, భయవిరాగములు, మానవ మనస్సులనుండి తొలగించుటకు నాఅహింసామంత్రము ఎంతవరకు ప్రయోజనకారిగా నుండగలదో, దానినే నేను నాజీవనసాయాహ్నములో పరీక్షించ గోరుచున్నాను. ఈకార్యము అనేకులద్వారా జరుగునదికాదు. అందువలన నేను ఒక్కడనే దీనిని పరీక్షింపవలయును. నేడు నేను ఒంటరిగా బయలుదేరుచున్నాను. నేను నావ్రక్కన, నావెనుక, శతసహస్రఅనుచరుల ఆవశ్యకత లేదు. కేవలము ఈశ్వరుడు ప్రసాదించిన శక్తిమీదనే

ఆధారపడి యుండును. హింసాద్వేషరహితహృదయముతో నేను పరీక్షలలో ముందుకు నడచి పోవలసియున్నది. నాహృదయములో యెట్టి కాపట్యమున్నచో నాసాధన వ్యర్థమైపోవును. అందువలన నామనస్సునుండి సమస్త కళంకమును తొలగించి, నాకు శక్తి నిచ్చుగాకయని నేను ఈశ్వరుని ప్రార్థించుచున్నాను.

'ఇదియే నాతీర్థయాత్ర. సకలసంసారవిముక్తుడై సర్వస్వమును దానము చేయుచు, దీనభావముతో నగ్న పదములతో తీర్థస్థానములకై పునః అగ్రసరమగుటయే భారత దేశతీర్థయాత్రికుల ఆదర్శము. నాతీర్థయాత్రకు నేను నగ్న పదములతో బయలుదేరుచున్నాను.”

మానవుని న్యాయఅన్యాయముల జ్ఞానముపైన, తన ఆంతరికశక్తిపైన అవిచలితవిశ్వాసము లేకుండినయెడల మహాత్మాజీకి యీనవఖాళీయాత్ర సాధ్యమయ్యేదే కాదు. ఏమనుష్యత్వము పశుత్వముగా మారిపోయినదో దానిని మనుష్యత్వమునకు మరల మరల్చుటకు వీలగునో కాదో తెలుసుకొనుటయే మహాత్ముని నవఖాళీయాత్రలో గావించ దలచిన పరీక్ష. ఆయన యీపరీక్షకు 'హరిజన' పత్రికలో 'అహింసకు కఠోరతమఅగ్నిపరీక్ష' యని నామమిడిరి. మానవుని నీతిబోధముపై మహాత్మునకు అవిచలితశ్రద్ధ యుండెను. దానిపై ఆధారపడి ఆయన విశ్వాసము పరీక్షలను సహింపగలదో లేదో పరీక్షించు కోరికగలవారై అహింసాపూర్వకమైన,

కఠోరతరమైన అగ్నిపరీక్షలో ప్రవృత్తుడయ్యెను. నవఖాళీ పల్లి భ్రమణకాలములో యీప్రయత్నమునకు తగిన ఆపదలు కూడా ఉన్నవని ఆయనను ఒకరు జాగ్రతపరచి నుడివిన దేమనగా — 'గాంధీజీ హేతువాదముద్వారా క్రూరమానవుల హృదయాంతరాళములయందు న్యాయాన్యాయజ్ఞానమును కలిగించుటకు పోవుచున్నారు. కాని రక్తపిపాసులగు నరహంతకుల హృదయములలో హేతువాదప్రభావముచేత యెట్టిపరివర్తనమును కలిగించుట సాధ్యముకాదు. కారణమేమనగా, హేతువాదముపైపునకు వారు పోనేపోరు' భావికాలమున జరుగబోవువిషయమును అంగీకరించియే మహాత్ముడు నుడివిన దేమనగా—మానవునిలోగల అహింసాప్రవృత్తులను జయించుటకొరకే యీమాత్ర అప్రవృత్తులను అణచివేయుటకే యీసాధన. ఆయన యీసాధనను భారతస్వాతంత్ర్యముకొరకు అనుకూలమైనదనియు, పరిపూర్ణమైనదనియు తలంచిరి.

తూర్పుబెంగాలులో మతకలహములచేత ఉద్భవించిన సమస్యలు స్థానికసమస్యలని గాంధీజీ తలంచలేదు. ఆయన దీనిని అఖిలభారతసమస్యగా అంగీకరించుటచేతనే దానిని పరిష్కరించుటకు ఈవ్యాకులత్వమును అనుభవించుచుండిరి. పరిష్కారమునకు తక్షణచర్యలను గైకొనుచుండిరి. భారతదేశభవిష్యత్తునిర్మాణమునకు ముందు తూర్పుబెంగాలులో సంభవించిన మతకలహములనివారణకు ఆయన సర్వశక్తులను విని

ప్రదాయముల అనైక్యత, విద్వేషములు, హత్యలు ఫలితముగా ఉద్భవించిన విషము సమభారత దేశమును ఆచ్ఛన్నముచేయ ఉపక్రమించెను. ఆయన యీ విషయమును సంపూర్ణముగా పానముచేసి నీలకంఠుడు కావలయునని ప్రతిజ్ఞగావించుకొనెను. లేనియెడల యీ విషముచే బాధపడి మృత్యువును వరింప సంసిద్ధులై యుండిరి. భ్రాతృఘాతక యుద్ధమువలన భయంకర పరిణామమును పరిణతిని ఆయన తనమానస నేత్రముల సమక్షమున దర్శించెను. దానికి ప్రతివిధానముగా మహాత్ముడు దీనిని ఆశ్రయించుటతప్ప గత్యంతరము లేదు.

అత్యాచారిత నిపీడిత స్త్రీపురుషుల దుఃఖకష్టములను సానుభూతితో విమోచన చేయుటకును, ప్రేమచేత హింసాప్రవృత్తులను అణచివైచి, మానవునిలో గల నైతిక ప్రబోధమును మేల్కొల్పుటకును ఆయన నవఖాళీ అభిముఖముగ యాత్ర నారంభించెను. హృదయమునందు ఆశా ఆశ్వాసములను, కంఠమునందు మానవధర్మ సందేశములను ధరించెను. మార్గమందు దర్శన ప్రార్థులగు ప్రజల నుద్దేశించి నుడివిన దేమనగా-'దురవస్థలపాలై అవమానితులైనవారి అశ్రువిమోచనగావించి శాంతినొసగుటకు నేను నవఖాళీకి పోవుచున్నాను. హిందూ మహమ్మదీయులు ఏకాత్ములై నేను అచ్చట ఉండనవలసిన ప్రయోజనము లేదని చెప్పునంతవరకు అచ్చటనే యుందును' మరియొకచోట సమావేశమైన ప్రజలనుద్దేశించి నుడివినవిషయము-'నేను తొందరతొందరగా నవఖాళీలో సంచరించి తిరిగిపోవుటకు రాలేదు. నేనుమీతో కూడ వసించుటకే

వచ్చియుంటివి. అప్రయత్నమునుబట్టి నేను తప్పుటనే దేహమును త్యజించెదను.'

గాంధీజీ ఒకగ్రామమునుండి మరియొకగ్రామమునకు నడచి తిరుగుటకు సంకల్పించుకొనినారని విని నవఖాళీమహమ్మదీయులు ప్రథమమున భీతిచెందిరి. గాంధీజీ పోలీసులచే పరివేష్టితులై గ్రామములో ప్రవేశించునప్పుడు వారిని అరెస్టు చేయుటకు పోలీసుసైన్యమును తీసుకు వచ్చినారని సాధారణ పల్లీవాసులగు మహమ్మదీయులు తలంచిరి. గాంధీజీ పల్లీవాసులగు మహమ్మదీయులకు సర్వదా అభయము నిచ్చుచుండెను. వారితోసన్నిహితసంబంధము కలిగియుండుటకు ప్రయత్నించిరి. ఆత్మరక్షణకొరకు ఆయన పోలీసులను కోరి తీసుకొనరాలేదని ఆయన పలుమార్లు తెలియజేసిరి. కాని బెంగాలుసర్కారు వారు ఆయన నిరాపదకొరకు పోలీసులను ఆయనతో పంపించిరి. ఆయన సంరక్షణకొరకు పోలీసులప్రయోజనము లేదని ఆయన విశ్వాసము. మహమ్మదీయసోదరుల విశ్వాసముపై ఆధారపడియే ఆయన తననవఖాళీ యాత్ర నారంభించెను. ఎవరియెడలను సామాన్యమైన అవిశ్వాసముకూడ ఆయన హృదయములో లేదు.

ఈవిధముగా అభయ మొసంగబడినను నవఖాళీగ్రామ వాసులగు మహమ్మదీయులు ప్రథమమున గాంధీజీని తప్పించు కొనియే తిరుగుచుండిరి. కాని మహమ్మదీయులహృదయమును తెలుసుకొనుటకు ఆతురత, అపారధైర్యము ఆఖరువరకు సఫలీ

కృత మగుచునే యుండెను. అప్పుడు మహమ్మదీయులు గుంపులు గుంపులుగా ప్రార్థనసభకు హాజరగుచుండిరి, అనేక మహమ్మదీయులగృహములలో ఆయన ఆతిథ్యమును స్వీకరించిరి, అనేకమందిగృహములకు ఆయన పోయియుండుటచే తాము ధన్యులమైతిమని తలంచిరి.

గాంధీజీ ప్రార్థనసభలలో 'రామధున్' పాడుచుండెడి వారు, కొరానునుండికూడ పఠింపబడుచుండెడిది. ఆయన ప్రార్థనసభలో కొరాను చదువుటకు ఆటంకములు కూడా కొన్నిసారులు కలుగజేయబడెను. గ్రామవాసులలో నాయకులగు మహమ్మదీయులు గాంధీజీని దర్శించి ప్రార్థనసభలో ఆయన కొరాను పఠించుట మహమ్మదీయులకు అధర్మమైన నీతియని తెలియచేయ ప్రయత్నించిరి. వారి అందరియొక్క ఉద్దేశ మేమనగా-హిందువుల ప్రార్థనసభలో మహమ్మదీయులు పాల్గొనుట ముస్లిమ్‌సంస్కృతికి, ధర్మమునకు విరుద్ధమైనపని. వారు గాంధీజీని హిందువులకు అవతారమని తలంచుచుండిరి. అందునలన హిందువులైయుండి మహమ్మదీయుల ధర్మగ్రంథమగు కొరాను పఠించి మహమ్మదీయులకు వినిపించుట అనధికారచర్య యనిరి.

గాంధీజీ యీవాదముల నన్నిటిని అత్యంతసహనముతో వినిరి. ఏసంకోచము లేకుండా మహమ్మదీయులు వారి హృదయములో మూగియున్న ఫిర్యాదులనన్నిటిని ఆయనవద్ద సుస్పష్టముగా వ్యక్తము చేయుటకు మహమ్మదీయులకు అవకాశమిచ్చుచుండిరి. ఆయన మహమ్మదీయుల ఆంతరిక పరిచయ

దరిద్రులు, విద్యావిహీనులును హిందూమహమ్మదీయులు గ్రామములను వెన్నెముకవంటివారు. ఈ ఉభయనాం ప్రదాయములవారు స్నేహబంధనముచే బంధింపబడి గ్రామములలో వసించుచుండిరి. స్వార్థపరవ్యక్తుల దురాలోచనలు, దురభిప్రాయములవలన మానవుని అంతర్నిహితపశుత్వము జాగరిత మాయెను. మానవుని హృదయమునందున్న యీ పశుభావము గాంధిగారిద్వారా క్రమముగా తొలగిపోవుచుండెను. ఆయన జాతిధర్మములు పాటింపక సకలమానవులకు బాంధవుడయ్యెను. ప్రతిమానవునికి శుభాకాంక్షియయ్యెను. నవఖాళీమహమ్మదీయులు దానిని స్పష్టముగా గ్రహించిరి.

గాంధీజీ దేనగ్రామమునకు పోయినను అచ్చటివారితో చక్కేష్టగా కలిసిమెలసి యుండిరి. ఈపల్లెభ్రమణకాలమున మహమ్మదీయులగృహములలో ఆయనకు ఆహ్వానములసంఖ్య పెరిగిపోవుచుండెను. ఆయన ఎవ్వరిని యెన్నడును నిరాకరించలేదు. అత్యంతఆనందముతో వారిఆహ్వానములనుఅంగీకరించినారు. మహమ్మదీయగృహములలోనికిపోయి వారిదుఃఖకష్టముల వార్తలను తెలుసుకొనెను. పరమఆత్మీయునివలె వారితో సంభాషణలు గావించెను. గృహములోని శిశువులతోను బాలబాలికలతోను సరససల్లాపములాడి వారికి ఆనందము ప్రసాదింపగలిగెను. ఆయన కొసంగబడిన ఫలములను వారికే పంచిపెట్టి పరమానందము ననుభవించిరి.

పల్లె వాసులకు మహాత్ముడైన గాంధిగారి సానుభూతి ప్రత్యక్షమైన ప్రభావము కలిగించుటకు కొంత కాలము పట్టెను. అయిన ప్పటికిని ఈ విధముగా వారు తమకు అంతరంగికముగా సత్య మును తెలుసుకొనుచుండిరి. క్రమముగా గాంధిగారి ప్రేమ, అహింస ల మహమ్మదీయులపై ప్రభావము విస్తృతమాయెను. ప్రార్థన సభలలో మహమ్మదీయులు అధికముగా పాల్గొనుచుండిరి. ప్రార్థనసభలలో, గాంధిగారి భ్రమణమార్గములలో 'రామ్ - రహీమ్', 'కృష్ణ-కరీమ్'. 'ఈశ్వర్-అల్లా' మొదలగు నామములు ఏకముగా కీర్తించబడుచుండెడివి. ప్రథమమున మహమ్మదీయులు దీనికి అభ్యంతరము కలుగజేసిరి. క్రమముగా వారికీవిప్రతిపత్తి క్షీణించిపోయెను.

గాంధీజీ నవఖాళీయాత్ర గావించి సత్యమును ప్రతిష్ఠితము చేయుటకు ప్రయత్నించినారు. కృచ్ఛ్రసాధన గావించి సమ్మేళనాసందేశములను గ్రామగ్రామాంతరములకు ప్రచారము చేసి పోయియున్నారు. ఇట్టిదృష్టాంతములు ప్రపంచేతిహాసములో లభించుట దుర్లభము. ఆయన యీయాత్ర ప్రపంచేతిహాసములో తులనారహితమైనది. దీనిలో ఏమతమును ప్రతిష్ఠించు అభిప్రాయము లేదు. ఏధర్మప్రచారము గావించు అభిలాషయును లేదు. చిత్తాకర్షకమగు యెట్టియేర్పాటులును లేవు. సత్యమును గ్రహించుటకును, ఆచరించుటకును ఆతురతమాత్రమే యుండెను.

ఈపల్లిభ్రమణకాలమందు ఆయన హిందువులు నిర్భయులగుటకు ఉపదేశముల నిచ్చియుండిరి. పునరావాసము

కొరకు సాహసము సంపాదించుకొమని ఆదేశించెను. అక్లాంత పరిశ్రమచే పునర్వసతికి అనుకూలవాతావరణమును సృజించెను. మహమ్మదీయులలో మానసికపరివర్తనము కలుగజేసెను. హిందువులలో సాహసము, విశ్వాసము సంచరింపజేసెను.

ఈసమయములోగాంధీజీవిచిత్రములైన, వివిధములైన కర్తవ్యములను నెరవేర్పవలసివచ్చెను. ఆయన శాంతిసందేశమును ప్రచారము చేసెను. గ్రామవాసులపరిస్థితులు ఉన్నతిచెందు మార్గమును, ఉపాయమును కనిపెట్టెను. గ్రామోన్నతికొరకు అనేక సత్సలహాల నిచ్చెను. ఆయన ఆదేశానుసారముగా ఆయన అనుగతశిష్యులు గ్రామగ్రామాంతరములలో వ్యాపించి గ్రామములలోని మార్గములను, వీధులను సంస్కరించిరి. చెరువులు శుభ్రపరచిరి. అసహాయప్రజల ధాన్యముకోసి వారికి సహాయము చేసిరి. నవఖాళీజిల్లాలో త్రాగుడునీటి అభావము ఆయనకు బాధకలిగించెను. త్రాగుడునీటికి తగినయేర్పాటులు గావించుటకుకూడ సలహా లొసంగబడెను. చరకాఖాదీలప్రచారముకూడ యీసమయములోనే గావించెను. నవఖాళీభ్రమణకాలములో కేవలము సాంప్రదాయికసంప్రీతిని స్థాపించుటకొరకే మహాత్మాజీ తనశక్తులనన్నిటిని వినియోగించలేదు. పల్లిసమాజమును క్లేదవిముక్తముగాను, శుభ్రసుందరముగాను నొనర్చుటకు ఆయన సాధనలో అంశముగా గ్రహించెను.

మహాత్మాజీ తనయాత్రికాలములో హిందూసంఘము నుండి జాతిభేదను రాచారమును నిర్మూలింపచేయుటకుకూడ ఉపదేశము లొసగియుండిరి. హిందూధర్మము బ్రతికియుండ వలెనంటే యీసంఘమునుండి జాతిభేదమును విలుప్తము చేయవలయును. ఆయన తనవిషయమును ఉదహరించి చెప్పిన విషయము–'నేను హిందూసంఘములో ఏజాతికి చెందియుంటి నో ఆవిషయము బహుకాలక్రితమే మరచిపోతిని. ప్రస్తుతము నేను 'భంగీ' నని తెలియచేయుటకును, తదనుసారముగా పని చేయుటకును ఆనందించుచున్నాను. స్వతంత్రభారతములో ఇది అతీతచరిత్రగా పరిగణింపబడును. నేను యిట్టి జాతిభేద మునే ఆశించుచున్నాను.'

గాంధీగారిద్వారా మంత్రదీక్షితులైన సహకారులు కూడ ఆయన ఆదర్శములవలన అనుప్రాణితులై గ్రామవాసు లనుండి జాతిభేదమును తొలగించుటకు విశేషప్రయత్నము ములను గావించుచుండిరి. ఒకసారి సర్వజాతులవారిని కలిపి విందొకటి యేర్పాటు చేయుబడెను. ఏఉత్సవసందర్భమునను కాదు, పంక్తిభోజనోద్దేశముచేతనే, ఈభోజనములో స్త్రీ పురుషులు ఏకముగా భుజించిరి. వంటచేసినది, వడ్డించినది తోటమాలీలు. మహాత్ముడు ఈవిధముగా అస్పృశ్యతానివా రణకు దృష్టాంతములను, సలహాలను ప్రసాదించెను. జాతిభేద ముయొక్క అర్థహీనతయు, యీఆచారమువలన హిందూ సంఘమునకు కలిగిన అధఃపతనము గురించియు హిందువులలో అనేకులు గ్రహించిరి.

పల్లీభ్రమణకాలములో గాంధీగారి కార్యక్రమము—నూతన గ్రామమునకు పోయి పాదముల బురదను వేడిసీటితో కడుగుకొనువారు. కఠోరశీతకాలప్రభాతమున పాదరక్షలు లేక బంధుర పల్లి గ్రామమార్గములలో నడచుచున్న సమయములో ఆయన పాదములు చలిచేత ముడుచుకొనిపోయెను. కొంచెము సేపు వేడిసీటిలో పాదములు ఉంచువారు. ప్రతిరోజు ఈ సమయములో ఆయన బెంగాలీభాష నేర్చుకొనెడివారు. స్థానిక ప్రజలతో సంభాషించుటకును, వారిహృదయములో గల విషయములను గ్రహించుటకును యిబ్బందిగా యుండుటచే ఆయన బెంగాలీభాష నేర్చుకొనుటకు ఆరంభించెను. ప్రతిరోజు ఆయన బెంగాలీ చదువువారు, కొంత వ్రాయువారు. నేనిప్పుడు నః ఖాళీవాసిని, బెంగారీవాడిని అని ఆయన తరుచుగా నుడువుచుండువారు.

ఆయన యీవృద్ధాప్యములో సంపూర్ణముగా నూతన భాషను నేర్చుకొని గ్రామగ్రామాంతములలో భ్రమణము చేయునప్పుడు గ్రామవాసులనోటినుండి వారిమాతృభాషలో వారివిషాదగాథలు విని దీనదరిద్రులదుఃఖవిమోచనకొరకు జీవితమును సమర్పించుకొనుట గాంధీగారివంటి మహామానవునకే సాధ్యము. అల్పదినములలోనే అర్థమును గ్రహించునంతటి బెంగాలీభాష ఆయన నేర్చుకొనెను. సాధురఖలాలో స్థానిక మహమ్మదీయులు వంగభాషలో ఆయనకు అభినందనపత్రము

సమర్పించినప్పుడు గాంధిజీ యీ అభినందనపత్రములోగల ప్రతి ప్రశ్నకును సరియైన జవాబొసగియుండిరి.

ప్రతిరోజు ఆయన అరగంట సేపు బెంగాలి చదువు వారు. పిమ్మట ఆయూ గ్రామవాసులు వారికష్టసుఖములను చెప్పుకొనుటకు వచ్చినవారితో మాట్లాడుచుండువారు.

మధ్యాహ్నము 11 గంటలకు ఆయన భోజనము చేయువారు. ఒక చపాతీ, కొంచెము పాలు, కారంలేకుండా ఉడికించిన కూరలు, గ్లూకోజ్ ఆయన పుచ్చుకొనువారు. చపాతీ, కూరలు, గోధుమపిండి, లవణము, సోడాతో తయారుచేయబడెడిది.

12 గంటలకు శరీరముపై తైలమర్దన చేసుకొనువారు. ఈసమయములోకూడ చూడవచ్చినవారితో మాట్లాడు చుండువారు.

స్నానము ముగించి కొంచెము కొబ్బరికాయనీటిని త్రాగుచుండురు. 2 గంటలనుండి పరుండునంతవరకు విశేష కార్యములలో నిమగ్నులై యుండి కాలము గడుపుచుండురు. 3 గంటలసమయములో మహిళాసభలో ఉపన్యాసములిచ్చు వారు. గ్రామోన్నతి, నిర్మాణకార్యక్రమమునుగురించి గ్రామసేవకులకు, అనుచరులకు ఉపదేశముల నొసంగువారు.

4 గంటలకు ప్రార్థనసమావేశమునకు హాజరగు చుండువారు. సరిగా 5 గంటలకు ప్రార్థన ఆరంభించబడెడిది. ప్రార్థనానంతరము స్థానికప్రజలు ప్రశ్నలు వేసినయెడల

వాటికి జవాబొసంగువారు. వివిధవిషయములలో ఉపన్యాస ము లొసంగువారు. ఆయన ప్రతిదినప్రార్థనసభలలో 'నేను ఎవరిని శిక్షించుటకుగాని, కష్టపెట్టుటకుగాని రాలేదనీ'నుడువు చుండువారు. శాంతిని మైత్రిని స్థాపించుటకును, హృదయ ములలో సమ్మేళనము కలిగించుటకును వచ్చితినని నుడివెడి వారు.

సభ ముగిసినవెంటనే సభాస్థలమునుండియే సాంధ్య భ్రమణకు బయలుదేరి గ్రామములో అచ్చటచ్చట తిరిగివచ్చు వారు, సాంధ్యభ్రమణసమయములో ఆయన హిందూ, మహ మ్మదీయులగృహములకు పోవుచుండువారు.

రాత్రి 8 గంటలకు వార్తాపత్రికలు చదివి వినిపించ బడెడివి. దీనితరువాత పరుండబోవువరకు ఆయన స్థానికఅధి వాసులతో సంభాషణలు జరుపుచుండువారు. రాత్రి 9 గంట లకు శయనించువారు. సూర్యోదయమునకుపూర్వమే అతి ప్రత్యూషముననే నిద్రనుండి మేల్కొనువారు.

నవఖాళీకి వచ్చినతరువాత దాదాపుగా రెండు నెలలు గడచినవి. ఈకాలము నవఖాళీ వివిధగ్రామములలో, ఆఖరున శ్రీరామపురంగ్రామములో గడపెను. ఈశ్రీరామపురం గ్రామ ములో నున్నప్పుడే పండిత జవహరలాల్ మొదలగు కాం గ్రెసు ప్రముఖులు, నాయకులు ఆనాటి భారతదేశరాజకీయ పరిస్థితులలో కాంగ్రెసుకర్తవ్యములనుగురించి నిర్ణయించుటకు

గాంధీగారిని దర్శించిరి. ఆయన ఉపదేశములను పొంది తిరిగి వచ్చిరి.

దాదాపు రెండు నెలలనుండి మహాత్మాజీ నవఖాలీలో శాంతియాత్రను జరుపుచున్నారు. కాని ఆయనమనస్సునకు తృప్తికలుగుటలేదు. ఆయనసాధన అభీష్టసిద్ధిని బడయుటలేదు. ఈసమయములో ఆయన శాంతిమైత్రిలసందేశములను ప్రచారము చేయుచున్నారు. గ్రామోన్నతినిగురించి నూతనోత్సాహమును కలుగజేయుచున్నారు. గ్రామవాసులలో అస్పృశ్యతాకళంకము, హృదయసంకుచితత్వమును తొలగించుటకు ప్రయత్నించుచున్నారు, కాని అగాధమైన అతృప్తిని ఆయన హృదయాంతరాళములో అనుభవించుచుండెను.

ఈ రెండు నెలలలో నవఖాళీపీడనకారుల చిత్తములు ఆశానురూపముగా పరివర్తనము చెందుచున్నట్టుల లేదని గాంధీజీ గ్రహించి అత్యంతవిచారగ్రస్తుడయ్యెను. కాని ఏకాంతశ్రద్ధతో మానవుడు సత్యఅహింసలపూజారి అయినయెడల, కార్యములలో నిష్ఠనియమముల అభావము లేకున్నయెడల మానవునకు పరాజయము కలుగుట అసంభవము. అందువలన ఆయన యిటుల ప్రకటించిరి- 'సత్యఅహింసల సార్థకతనుగురించి నేను యింతకాలము చెప్పుచుంటిని, విశ్వసించుచుంటిని. కాని నేడు సమస్తమును వ్యర్థమగుచున్నటుల తోచుచున్నది. నిజముగా అది వ్యర్థమగుచున్నదా లేదా

అనువిషయము పరీక్షించుటకు నన్ను నేను పరీక్షించుకొనుటకు నేను నాసహచరులనందరిని వదలిపోవుచున్నాను.'

అంధకారములో ఆయన అంతరాత్మ కర్తవ్యముల సూచనములను పొందు ఆకాంక్షతో తహతహలాడి పోవుచుండెను. ఈసమయములో ఆయన భగవానునివద్దనుండి కర్తవ్యముల ఆదేశముకొరకు నిరీక్షించుచుండెను. గభీరఅభినివేశములో ఆయన మార్గమును వెదకుచుండెను.

తుదకు ఆయన కర్తవ్యముల ఆదేశమును పొందెను. ఆయన ఒంటరిగా గ్రామగ్రామాంతరములకు యాత్రను సాగింప సంకల్పించుకొనెను. ఆయన తనఆశ్రమసేవకులను నవఖాళీజిల్లాలో కల్లోలితప్రాంతములకు ఆత్మశక్తిని ఆధారముగా జేసికొని పంపించ నిర్భయసంకల్పమును గావించుకొనెను. తాను స్వయముగాకూడా ఆసంకల్పము నేస్వీకరించెను. ఆయన నుడివినవిషయము–'నాఆశ్రమవాసులగు స్త్రీపురుషులు ఒంటరిగా ఒక్కొక్క–కల్లోలితగ్రామములకు పోయి అచ్చటి అల్పసంఖ్యాకులగు ప్రజలప్రాణమానముల రక్షకులవలె వసింపవలయును. అవుసరమునుబట్టి తమజీవితములనుసహా సమర్పించి రక్షింపవలయును. ఈదుర్భరబాధ్యతను ఎవరేనిస్వీకరింపఅంగీకరింపకపోయినయెడల తాము స్వేచ్ఛాపూర్వకముగా నిర్మాణకార్యక్రమములోపాల్గొనవచ్చును. తనవిషయమై మహాత్మాజీ దృఢమైన నిర్భయమైన కంఠముతోనుడివెను–'నేను నా ఉద్దేశసాధనకొరకు యేకాకిగా సత్యాగ్రహమును సఫలీకృతము

గావించుటకు కృతసంకల్పుడను. నేను నాలక్ష్యమును సాధింపనైనా సాధింపవలయును. లేనియెడల యిచ్చటనే దేహత్యాగమునైనా చేయవలయును.'

ఏకాకిగా కఠినమైన పరీక్షను నెరవేర్చుకొనుసంకల్పము-ఏకాకిగా సత్యాగ్రహసంగ్రామసంకల్పము వార్తాపత్రికలలో ప్రకటింపబడినప్పుడు సమస్తదేశము విచారగ్రస్తమాయెను. ఆయన శుభాకాంక్షులగు స్నేహితులు, అనురాగముగల అనుచరులు, అంతరంగికులు యిట్టియాత్ర ఆపత్కరమైనదిగా పరిణమించవచ్చునని తెలియజేసిరి. కాని ఆయన యీసత్యాగ్రహసిద్ధాంతము అపరివర్తనీయమైనదనినుడివెను.

ఆత్మశక్తియందు సంపూర్ణవిశ్వాసముగల యీమహామానవుడు తనఆత్మశక్తిని ఆధారముగా గైకొని నిస్సందేహచిత్తముతో ఏకాకిగా యాత్రనారంభించ ఉద్యుక్తుడయ్యెను. ఇట్టి భయంకరమైన, ఆపదసంకులమైన ప్రదేశములవైపునకు ప్రయాణము సాగించ సమకట్టెను. అచ్చటి దుర్గమత్వము, భీషణత్వము గాంచి అస్త్రధారులగు సైనికులుకూడ స్తంభించిపోయిరి. ముందుకునడువ సాహసింప లేకపోయిరి.

1947 వ సంవత్సరము జనవరి 1 తేదీన మహాత్మాజీ శ్రీరామపురంలో వసించుదినయు అంతమొందెను. ఆరోజు సాయంకాలము ఆయన ప్రార్థనసభలో నుడివిన విషయము- 'ఇప్పటినుండి నేను ఏకాకిగా గ్రామగ్రామాంతరములకుపోయి యింటింటిలో ప్రజలతో సంబంధము కలుగజేసికొందును.'

ఈ ఏకాకియాత్రలో ఆయనకు సహకారులుగా నున్న వారు—ద్విభాషలు తెలిసిన అధ్యాపకుడు నిర్మలకుమార బోసు, హిందుస్థాన్ లేఖకుడు శ్రీపరశురాము, మహాత్ముని కార్య కలాపములలో సహాయము చేయుటకు శ్రీరామచంద్రన్, వ్యక్తిగతకార్యకలాపములలో సహాయము చేయుటకు కుమారి మనుగాంధీ.

ఆయనతో కూడ నవఖాళీలో యున్న యితర సేవకుల నందరిని నవఖాళీలో వివిధప్రాంతములకు ఏకాకిగా సంగ్రామ బాధ్యతను వహింపమని ఆదేశించి పంపించెను. సేవకుల కొసంగిన ఉపదేశము— మీ మనస్సులనుండి మరణభయమును తొలగింపవలయును. మీతో విరోధము పెట్టుకున్నవారి చిత్తములను జయింపవలయును. ఈ ప్రయత్నములో కొందరు ప్రాణములను కూడ పోగొట్టుకొనవలసియుండును. ప్రేమ ద్వారా శత్రువును జయింపవచ్చునని గాంధీజీకి దృఢవిశ్వాస ముండెను.

జనవరి 2 వ తేదీన గాంధీజీ యీ అపూర్వమైన సత్యాగ్రహమును ఆరంభించెను. ప్రపంచేతిహాసములో శాంతి స్థాపనకొరకు ఇట్టి అభినవకార్యక్రమము తులనారహితమైనది. పల్లెగ్రామములలో యింటింటికి తిరిగి అత్యాచారిత, లాంఛిత మానవుల గాయములకు అమృతరసమును ప్రలేపముగా పూయుటకు ఏమహానుభావుడును అగ్రసరమైనటుల మానవ చేతిహాసమునం దింతకుపూర్వ మెన్నడును గాన్పించ లేదు

గాంధీజీ కాలినడకతో పల్లెగ్రామములయాత్రకు బయలుదేరెను. ఆయన యీయాత్రను తీర్థయాత్రయని నిర్ణయించుటచేతనే ఆయన కాలినడకతో యాత్ర నారంభించినాడు. తీవ్రమైన శీతలగాలి, దుర్గమమైన పల్లెగ్రామములు, బంధురమైన గ్రామమార్గములు, అభ్యాసములేని వ్యక్తికి ఆపజ్జనకమైన వెనుకువంతెనలు గాంధిగారిసమక్షమున ప్రసారితమైయుండెను. కాని సమస్తవదనమండములో కఠోరకృచ్ఛ్రసాధనదీప్తి, హృదయములో దృఢతరమైన ప్రతిజ్ఞ—సాంప్రదాయికవిషమును నాశనమైనా చేసెదను, లేదా నవఖాలీభూమిపై ప్రాణమునైనా విసర్జించెదను— యీదుర్జయసంకల్పముతోనే ఆయన యాత్ర నారంభించెను. హిందూమహమ్మదీయులు అను నీయుభయసాంప్రదాయములలో శాంతిమైత్రీబంధనములు విచ్ఛిన్నమై దుర్లంఘ్యవ్యవధానములు సృష్టింపబడినవి. మానవునియెడల మానవునకు గలసహజసంబంధము కలుషితమైపోయినది. భారతాకాశము మసిచే మలినమైపోయినది. దానిలో స్వాభావికస్వరూపమును కలిగించుటకు గాంధీగారియాత్ర ఆరంభించబడెను.

కంఠమునందు శాంతిమైత్రీలసందేశము,హృదయమున సాఫల్యతయొక్క ఆశావిశ్వాసములు దేదీప్యమానములు, ముఖమండలమున కఠోరసంకల్పముల తేజోమయరూపము. కఠోరపరిశ్రమ గావించినను ఆయనకు అలసటలేదు. సర్వదా ఆయన ఆనందమయుడు, సదా మందహాసవదనుడు.

రాజశక్తి, దాంభికత, అన్యాయ అత్యాచార ఉత్పీడనములకు విలుప్తి కలిగించి అసహాయ భారతీయుల దురవస్థల ప్రతీకారము కొరకు ఈ క్షీణకాయుని సత్యాగ్రహయాత్రను సమస్త విశ్వవాసులు అవలోకించుచుండిరి. అప్పు డాయన ఏకాకి కాడు. ఆనాడు ఆయన వెనుక శతసహస్ర అహింసా పూర్ణ పదాతికు లుండిరి. కాని ఈసారి యీ సత్యాగ్రహములో మహాత్ముడు ఏకాకియై, నిస్సంగుడై, వాస్తవపటభూమిక పై ఆజన్మసాధనయొక్క చరమపరీక్షను చేయ యాత్ర నారంభించినారు.

పల్లెలలో యాత్ర సల్పునపుడు రవీంద్రుని "ఏక్ లా చలోరె" అనుగానము ఆయన ప్రేరణమునకు స్రోతస్విని వలె నుండెను.

రోషహీన, క్షోభహీన, భయలేశహీన, ఉదారమలస్కుడు మహాత్ముని తీర్థయాత్ర ఆరంభ మాయెను. మానవునితో మానవునకు సమ్మేళన కలుగుజేయు సాధన, మానవ హృదయములోని క్రూరప్రవృత్తులను విలుప్తము గావించు తపస్సు మహాత్ము డారంభించినాడు. తృణముకంటె నిరహంకారి, విశాలవనస్పతులవలె సహిష్ణుడు, సంకల్పములలో దృఢ చేతస్కుడు, మహామానవుని జీవితములో కఠినతమపరీక్ష ఆరంభమాయెను. ఈపరీక్షలో ఆయన జయకిరీటము ధరించును, లేదా మృత్యువును వరించును. హింసా ఉన్మత్తమైన ప్రపంచములో వసించుటకు ఆయనకు కోరిక లేదు.

శ్రీరామపురమునుండి మహాత్మాగాంధి చండీపుర గ్రామమునకై పునః యాత్రనారంభించెను. పిమ్మట 30 గ్రామములు భ్రమణము గావించి ఫిబ్రవరి 3 వ తేదీన యీతీర్థయాత్రలో ప్రథమపాదమును పూర్తిజేసెను.

ఇంతలో జనవరి 23 వ తేదీన నేతాజీ సుభాస్‌చంద్రుని జన్మదినోత్సవ సమయమున గాంధీజీ ప్రార్థనసభలో హిందూమహమ్మదీయుల సమ్మేళనవముగురించి ప్రచారము చేయబోయి బోసుగారి కీర్తివిషయము నివేదించెను. నేతాజీకి హిందూమహమ్మదీయులను భేదములేదని నుడివెను. హిందూమహమ్మదీయులు, వివిధధర్మావలంబులు భారతీయుల ఐక్యతపై పునాదిగట్టి వీరసైనికదళమును నిర్మించుసంకల్పము ఆయన కుండెను. సకలసాంప్రదాయముల ఐక్యతపై పునాదివేసి ఆయన సేవాదళమును నిర్మించుటచేత వారు శక్తిశాలురగు విరుద్ధపక్షమువారిని ఎదుర్కొనగలిగిరి.

నవఖాళీయాత్ర ముగిసినపిమ్మట ఆయన త్రిపురరాజ్యములో కల్లోలితపల్లిప్రాంతములను పర్యవేక్షించి సోద్‌పూర్ ఆశ్రమమునకు తిరిగివచ్చిరి. ఇంతలో బీహారులో కల్లోలములు చెలరేగెను. అచ్చట కల్లోలపీడితప్రజల నోదార్చి కలహాకారులలో శుభబుద్ధిని కలిగించుటకు ఆయన నవఖాళీని పరిత్యజించెను.

నవఖాళీ, త్రిపురలలోగల గ్రామములలో యాత్ర సలుపుటవలన గాంధీజీ జీవితములో అత్యుజ్వలమైన దివ్యరూపము వికసించెను. విదేశశాసనమువలన నిష్పేషితులై జాతీయులు తమఆత్మగౌరవమును, మనుష్యత్వమును విసర్జించియుండిరి. గాంధీగారి యీతీర్థయాత్రవలన దేశవాసులలో అఖిలుప్త మనుష్యత్వబోధమును జాగ్రత్తపరచు సాధనయే, అత్యాచారితులగు మానవులదుఃఖమును తనహృదయములోకి స్వీకరించు ప్రయత్నమే యీయాత్రయొక్క పరమోద్దేశము. నవఖాళీలో ఆయన ఆరంభించిన యీయేకాకిసత్యాగ్రహాఫలము అపూర్వభావముతో హిందూమహమ్మదీయ ఉభయసంప్రదాయకుల మనస్సులలో ప్రతిక్రియ గావించెను. ఏపరీక్షయందాయన వ్రతుడై యుండెనో ఆపరీక్షలో ఆశ్చర్యకరముగా కృతార్థుడై బయటికి వచ్చుటనే గాంధీజీ తృప్తిజెందెను. సత్యాగ్రహముయొక్క యీ అపూర్వమైన సాఫల్యతను గాంచి ఆయన, విశ్వవాసులు విముగ్ధులైరి.

గాంధీజీ నవఖాళీలో వసించుచున్నప్పుడు బీహారులో కూడ కల్లోలములు చెలరేగెను. పరిస్థితులను పరికించి గాంధీజీ హృదయము పరితాపానలముచే దగ్ధమై పోయెను. బీహారులో కల్లోలపీడితప్రజలకు శాంతి నొసంగవలయునని ఒకటిరెండు సారులు గాంధీజీ ఆహ్వానింపబడిరి. ప్రథమమున ఆయన ఆయాహ్వానమువలన బీహారుపైపుకు ప్రయాణముగుట కెట్టి ఆవశ్యకతను అనుభవించలేదు. కాని ఆయాహ్వానమువలన తుదకు

స్థిరముగా నుండజాలక పోయిరి. ఆయన బీహారుకు పరుగిడి పోయిరి. నవఖాళీలో అత్యాచారిత అల్పసంఖ్యాకులు ఆయ నను పొంది యెట్లు ఆశ్వాసితులయిరో, బీహారులో అల్ప సంఖ్యాకులుకూడ అటులనే ఆయనను పొంది ఆశ్వాసితులైరి.

ఇచ్చటకూడ ఆయన శాంతిమైత్రీలసందేశమునే ప్రచారము చేసిరి. నవఖాళీలో ఏకాకిగా ఏసత్యాగ్రహపరీక్ష యందాయన ప్రత్యక్షఫలమును పొందియుండిరో, ఆ ఉపా యములవల్లనే బీహారులోకూడ శాంతిప్రతిష్ఠితము గావించు టకు బీహారుప్రదేశములగ్రామములలో భ్రమణము గావిం చిరి. సీమాంతగాంధిఖాన్ అబ్దుల్ గఫర్ ఖాన్ యీ శాంతి యాత్రలో ఆయనకు సహకారిగా నుండిరి.

ఇంతలో భారతరాజకీయములలో సత్వరపరివర్తన ములు సంభవించుచుండెను. అందువలన శాంతిఅహింసల సందేశమును ప్రచారము చేయుటగాక భారతదేశరాజ నైతికజీవసంధిక్షణములో గాంధీజీ కాంగ్రెసుకు నానావిధము లైన సలహాలను యివ్వవలసివచ్చెను. రాజనైతికకార్యకలా పములలోను ఆయన విశేషముగా తత్పరుడై యుండవలసి వచ్చెను.

1947 ఫిబ్రవరి 20వ తేదీన బ్రిటిషుప్రధానమంత్రి అట్లీ, ఈసంవత్సరము జూన్ నెలలో భారతదేశమునుండి బ్రిటిషుశాసనకర్తృత్వము తొలగింపబడునని ప్రకటన గావిం చెను. భారతదేశమునకు స్వాతంత్ర్యము లభించును. ఈ ఘోషణవలన గాంధీజీ ఆరంభించిన స్వాతంత్ర్యసంగ్రామము

నకు జయమే ఘోషితమయ్యెను. ఆయన ప్రవర్తింపజేసిన 'భారతదేశమును వీడిపొమ్ము' అను మంత్రముకూడ జయింప గలిగెను. పరిస్థితులభారముచేత బ్రిటిషుశక్తి తుదకు భారత దేశమును పరిత్యజించిపోవుటకే సంకల్పించుకొనెను.

కాని గాంధీజీ యీవిజయోత్సాహములో ఆనందము ననుభవింపలేకపోయెను. ఆయన ఆదర్శములచేత ప్రబోధితమైన దేశము యేస్వాతంత్ర్యమును సంపాదించుకొనెనో దానిని సంపాదించుకొనుట కంటె దానిని సంరక్షించుకొనుటకు సంగ్రామము గావించుట అత్యంతకఠినమైన విషయముగా గాంధీజీకి తోచెను.

సాంప్రదాయిక హింసాబీజములు సామ్రాజ్యవాదులగు శాసకుల కుట్రాలోచనములవలన దేశమునం దంతటను నాటబడెను. భారతదేశమునకు స్వాతంత్ర్యము నొసగినప్రకటనలోకూడ సాంప్రదాయిక భేదనీతిని సృష్టించువిషము ప్రచ్ఛన్నమైయుండెను. దానిని గాంచి గాంధీజీ ఆనందింపలేక పోయెను.

వైస్రాయి లార్డు మౌంటుబాటెన్ బ్రిటిషుపార్లమెంటువారితో సంప్రదించి భారతదేశమును యుక్తరాష్ట్రమని, పాకీస్థానమని రెండుగా విభజింపబడునని 1947 జూన్ 3 వ తేదీన ఒకప్రకటనము గావించిరి. ఈప్రకటనలోగల భారతవిభజన నిర్ణయమునకు గాంధీజీ అంగీకరించిరేగాని, నలువైపుల ఘోరరూపముదాల్చిన మతకలహముల అశాంతి ఆయనను వ్యాకులపరచెను. దేశములో మతకలహముల

సణచి నూతనముగా లభించిన స్వాతంత్ర్యమును చిరస్థాయి యైనదిగా చేయుటకు ఆయన సంకల్పించుకొనెను. సంప్రదాయిక విషయమును తొలగించి స్వాతంత్ర్యసంరక్షణ సంగ్రామములో జాతీయజీవితములో అమృతధారలను ప్రవహింపజేయు సాధనలో గాంధీజీ తన జీవితాంతమువరకు నిమగ్నమై యుండెను. బీహారులో కల్లోలములు జరిగినపిమ్మట కలకత్తాలో ఆరంభమయ్యెను. కలకత్తాలోని కల్లోలముల విషయము తెలుసుకొని గాంధీజీ కలకత్తాకు పయనమాయెను. కలకత్తాకువచ్చి నగరములో అధికకల్లోలితప్రాంతములో వసించు సంకల్పమును ప్రకటించెను. బెలియఘాటాలో హిందు మహామ్మదీయులు నివసించుప్రాంతములో పరిత్యజింపబడిన ఒకమహామ్మదీయుని గృహములో ఆయన ఆగష్టు 8 వ తేదీన ఆశ్రయమును స్వీకరించెను. మహాత్మాజీ ఆరంభించిన యీ శాంతియాత్రలో బెంగాలు మాజీప్రధానమంత్రి సురావర్దీ కూడ పాల్గొని నగరములో శాంతిస్థాపనకొరకు ప్రయత్నించుచుండిరి.

చూచుచుండగనే భారతస్వాతంత్ర్యదినము ఆగష్టు 15 వ తేది ఏతెంచెను. ఆరోజున హిందూమహామ్మదీయుల స్వేచ్ఛాపూర్వకమైన ప్రీతిసమ్మేళనమువలన గాంధిగారి శాంతి ప్రయత్నము సఫలీకృతమైనట్లు తోచెను. మహానగరములో ఒకసంవత్సరమునుండి జ్వలించుచున్న హింసాకాండలు శాంతిదూత పాదస్పర్శవలన హింసాపూర్వకఉద్రేకము కొంతవరకు ఉపశమించెను. హిందూమహామ్మదీయులు నిస్సంకోచముగా

స్నేహభావముతో సమ్మిళితమై ఆనందదాయకమైన ఉత్సవ దినమును సార్థకపరచెను. దేశీయులు మహాత్ముని అలౌకిక శక్తి ప్రభావమువలన కలకత్తాలో వీధులలో, పల్లెగ్రామము లలో భేదవిభేదములను మరచి నగరవాసులు తమసమ్మిళితా నందాశ్రువులచేత రక్తపుతిలకమును తుడిచినైచిరి. అనుతప్త నగరవాసులు హింసాత్మకఅస్త్రశస్త్రములను గాంధిగారివద్ద సమర్పించుకొనిరి. కఠోరశాసనములను, అస్త్రశస్త్రములను ప్రయోగించి, సైనికులను నియమించుటచే ఏది సాధ్యము కాలేదో, మహాత్ముని వ్యక్తిత్వప్రభావము ముహూర్తములో దానిని సంఘటింపజేసెను. సమస్త వంగదేశమునుండి మత కలహముల లజ్జాకరమైన తీవ్రత అంధకారములో అణగి మణగి పోయెను. ఐక్యతాభానుడు అభేద్యుడై ఆవిర్భవిం చెను. భారతవాసులు ఆశాన్వితులైరి. మహాత్మునకు శిర ములువంచి నమస్కరించి వంగదేశ స్త్రీపురుషు లెల్లరును ఆశ్చర్యమ్యానసులైరి.

మహామానవుడు ఆయనసాధనఫలితమైన అపూర్వ సిద్ధినిగాంచి ఆనందపరవశులైరి. ఈప్రీతిచిరస్థాయియై యుండు గాకయని ఆశీర్వదించిరి.

కాని కొద్దిరోజులకే మరల మహానగరములో సామా న్యముగు అశాంతి చెలరేగెను. హిందూమహమ్మదీయులకు సమ్మేళనము కలిగినను విద్వేషవిష మెచ్చటనో దాగియున్న దని గాంధీజీ గ్రహించెను. దాని అంత్యబిందువుతోనహా

శోషింపజేయు సంకల్పముతో బెలియాఘాటాఆశ్రమములో 1947, సెప్టెంబరు 1 వ తేదీన నిరశనవ్రతమును ఆరంభించెను. మహానగరమంతయు ఒక్కముహూర్తములో స్తంభీభూతమై పోయెను. కలకత్తాలో శాంతి స్థాపించెదమని హిందూమహమ్మదీయులు సమ్మిళితభావముతో వాగ్దానము గావించిరి. గాంధీజీ నిరశనవ్రతము విరమించిరి.

కలకత్తాలో శాంతిస్థాపనవిషయములో వాగ్దానమును బడసి గాంధీజీ ఢిల్లీకి వచ్చుగడిపోయెను. ఇంతలో పంజాబు కాశ్మీరములలో జరిగిన మతకలహములసంఘర్షణవలన అనేక మంది నిరాశ్రయులై ఢిల్లీఆశ్రయమును పొందిరి. అచ్చట కూడ సాంప్రదాయికసంఘర్షణవలన హత్యలు జరిగెను.

గాంధీజీ మరలదృఢసంకల్పముతో అచ్చటికిపోయెను. ఈసాంప్రదాయికహింసల ఉన్మాదమును అంతమొందించవలెను. లేదా, ప్రాణమును త్యజించవలెను. అని ప్రతిజ్ఞ పూనిరి. శాశ్వతమైన అదే ప్రతిజ్ఞ— 'మంత్రసాధన, లేక శరీరత్యాగము' ప్రతిదినము ఆయన ఢిల్లీలో వివిధప్రాంతములలో సంచారము గావించెను. నిరాశ్రయులైన వేలకొలది ప్రజల శిబిరములలోకిపోయిరి. శాంతికి, శాంత్వనమునకు అవతారమైన దివ్యపురుషుని సాన్నిధ్యమునుపొంది దుఃఖార్తులు ఓదార్పును బడసిరి.

కాని రాజధానిలో అచ్చటచ్చట సాంప్రదాయిక హింసాత్మకకార్యకలాపములు సంపూర్ణముగా విరమింపబడ లేదు. సమస్త దేశవాసుల మనస్సులు సందేహవిషయము

చేతను, భాతృవిరోధముల హింసాగ్ని చేతను, నరకరూపము దాల్చినవని గ్రహించినవుడు, దేశీయులపాపమునకు ప్రాయశ్చిత్తము గావించుకొను నుద్దేశముతో 1948, జనవరి 13 వ తేదీన నిరశనవ్రతము నారంభించెను. ఆయన ఆరంభించిన యీనిరశనవ్రతముచేత సమస్త భారతదేశము నివ్వెరపడెను. భారతదేశనాయకు లందరును ఢిల్లీలోసమావేశమైరి హిందూ మహమ్మదీయులు సమ్మిళితభావముతో ఆయనకు వాగ్దానము చేసిరి. దేశీయులలో సాంప్రదాయికశుభబుద్ధిని తిరిగి కలిగించుటకు యావచ్ఛక్తిని ధారపోసెదమని ప్రతిజ్ఞ గైకొనిరి. ఈనిరశనవ్రతము 6 దినములు పాలింపబడెను. 6 దినముల పిమ్మట ఉభయసాంప్రదాయముల సమ్మిళితవాగ్దానము లభించినపిమ్మట వ్రతమును విరమించిరి.

నవఖాళీ పల్లిగ్రామములయాత్ర మొదలు జీవితములో అంత్యదినమువరకు గాంధీజీ యీవిధముగా సాంప్రదాయిక మైత్రిస్థాపనార్థమై యావచ్ఛక్తితో సాధన గావించవలసి వచ్చెను. భారతదేశములో అచ్చటచ్చట జరుగుచున్న సాంప్రదాయికహింసల ఉన్మాదమునుగాంచి ఆయన భారతదేశ భావినిగురించి ఆలోచించి విచారగ్రస్తులైరి. కాని నిరుత్సాహ మెంతమాత్రమును చెందలేదు. హిందూమహమ్మదీయులలో శుభబుద్ధిని జాగరితము గావించి ఆయన యీ సమయములో దేశములో వివిధప్రాంతములలో సంచారము గావించెను. సాంప్రదాయికశుభబుద్ధిని మేల్కొల్పుటకు ఆయనయందున్న అపారశ్రద్ధ, అనంతశక్తి, సాధనసిద్ధి

సమస్త ప్రపంచమును స్తంభింపజేసెను. విస్మయ మొందునట్లు గావించెను.

## 61

# జీవితములో అంత్యదృశ్యము

మహాత్ముని జీవననాటకములో అంత్యదృశ్య మత్యంత హృదయవిదారకమైనది.

1934 వ సంవత్సరమునాటివిషయము. అప్పుడు గాంధీజీ భారత దేశములో వివిధప్రదేశములలో హరిజనఆందోళనము, అస్పృశ్యతానివారణసందేశములనుగురించి ప్రచారము చేయుచుండిరి. అస్పృశ్యతావిషయమును సంఘదేహము నుండి తొలగించువిషయము ప్రచారము చేయుటకై జూన్ 25 వ తేదీన పూనా వెళ్లిరి. ధర్మాంధులగు కొందరు వ్యక్తులు బాంబు విసరి గాంధీగారి జీవననాశనముచేయ ప్రయత్నించిరి. 'అస్పృశ్యతానివారణకు అవసరమైనయెడల నాజీవితమునుసహా సమర్పించెద' నని హరిజనులకు నేను వాగ్దానము చేసియుంటిని. నేడు నాజీవితము నాశనమైపోయియుండిన యెడల నాశపథము సక్రమముగా పాలింపబడి యుండెడిది.

గాంధీజీ ఎప్పు డేనిర్మాణకార్యక్రమములో నిమగ్నమైయున్నను స్థూలదృష్టిసంపన్నులగు కొందరు ఆయనకార్యములకు విరుద్ధముగా ప్రచారము గావించినారు. ఇట్టిది ఆయన జీవితములో అనేకసారులు సంభవించినది. అస్పృశ్యతాపాపమును తొలగింపబోయి విరుద్ధవిమర్శనములకు సమ్ముఖీనమైనట్లు, సాంప్రదాయికసమస్యలను పరిష్కరింపబోయికూడ

ఆయన అట్లే విరుద్ధవిమర్శనములను ఎదుర్కొనవలసివచ్చెను. ఆయన యీప్రయత్నము ఆరంభించినప్పటినుండియు, ఈ ఆందోళనము మహమ్మదీయుల పక్షపాతపూర్ణమైనదనియు, మహమ్మదీయులతో రాజీ చేసుకొనువిషయమనియు అనేకులు తలంచిరి. తత్ఫలితముగా 1948 జనవరి 20 వ తేదీన ప్రార్థనసభలో ఆయన జీవననాశనోద్దేశముతో ఒక బాంబు విసరబడెను. అప్పుడు గాంధీజీ ప్రార్థనసభలో సమ్మేళనాసందేశము ప్రచారము చేయుచుండిరి. అదృష్టవశమున ఆయన కెట్టిహానియు కలుగలేదు. అవిచలితుడై యుండి ఎట్టి చాంచల్యమును ప్రదర్శింపక ప్రార్థనసభాకార్యమును ఆనాడు మామూలుగానే సమాప్తి చేసిరి. మరునాడు ప్రార్థనసభలో మహాత్ముడు ఆబాంబు విసరినవానివిషయము ఉదహరించి చెప్పిన విషయము–'ఎవరు యెట్టికార్యము గావించినను నేను అతనిక్షేమము నే కోరుచున్నాను. ఆతనికి సద్బోధలుచేసి ఆతనిని సన్మార్గమునకు దెచ్చుట ఉత్తమమైనకార్యము' ఆయన యీవాక్యముద్వారా ఎంత అవిచలితధైర్యము, అపార క్షమాగుణమును ప్రదర్శింపగలిగిరి!

తదనంతరముఆయన శాంతిస్థాపనకార్యమును,సమ్మేళన ప్రయత్నములును గావించుచుండిరి. పాకిస్థాన్ రాష్ట్రమునకు అంతర్గతమైన పంజాబుప్రాంతములకుపోయికూడ ఆయన అచ్చటి హింసాఉన్మాదములు విలుప్తము గావించు సాధనవ్రతమును స్వీకరింప కృతసంకల్పుడై పాకిస్థాన్ సర్కారువారి అనుమతి కొరకు ప్రార్థించియుండిరి. కాని ఆఅనుమతి లభించుటకుముందే

హతాత్తుగా అపరిత్యాశితముగా 1948 జనవరి 30 వ తేదీన ఆయన జీవననాటకము పరిసమాప్తి చెందెను.

జనవరి 30 వ తేది తెలవారుఝామునే నిద్రనుండి మేల్కొను అలవాటు ప్రకారము తెలవారకముందే ఆయన నిద్రనుండి మేల్కొనెను. పారిశుద్ధ్యకృత్యములు నెరవేర్చుకొని నారు. ప్రశాంతముగా ప్రార్థనగావించుకొనెను. ప్రక్కనున్న సహాకారుని పిలిచి జరూరైన ఉత్తరముల నన్నిటిని తెమ్ము, ఇవాళరోజంతా ఆపని పూర్తిచేసెదను, అని నుడివెను.

కార్యతత్పరతయందు రోజంతయు గడచిపోవు చుండెను. అమెరికాదేశ ప్రసిద్ధలేఖకుడు మార్గరెట్టు ఆయనదర్శనార్థియై వచ్చియున్నాడని ఆయనకు తెలియచేయబడెను.

మార్గరెట్టు వచ్చినారు. ఆయన భక్తితో గాంధీగారి నిటుల ప్రశ్నించెను- 'మీరు 125 సంవత్సరములు బ్రతికియుందురని మీరు అనేకసార్లు చెప్పుచుందురు. మీకు ఇట్టి ఆశ ఏల కలిగినది?'

'ఆయాశను నేను త్యజించితి' నని ఆయన విషాదవదనముతో జవాబొసంగెను.

విస్మయమొందిన మార్గరెట్టు ప్రశ్నించెను-

'ఏమి, ఎందువలన?'

గాంధీజీ జవాబొసంగెను-'సమస్తవిశ్వమునందు నేడు భయంకరపరిస్థితులు సంఘటిల్లుచున్నవి. అంధకారములో బ్రతికి యుండుటకు నాకు ఇష్టము లేదు' ఆయన కంఠములో

ఆవేదనము, వాక్యములలో అభిమానము ఆచ్ఛన్నమైయున్న
టుల తోచెను. క్షణకాలము మౌనము వహించి మరల నుడి
విరి-'నాసేవయే అవుసరమున్నయెడల నేను 125 సంవత్స
రములు బ్రతికియే యుందును.'

జాతీయజీవనసంధిక్షణములో ఆయనసేవ, ఆయనసల
హాలు, ఆదేశమును నిజముగా అత్యంతప్రయోజనములై
యున్నవి. కాని దూరదృష్టి లేని, స్థూలదృష్టిసంపన్నునకు
మహాత్మునిజీవితము భారతదేశమునకు ఎంతఆవశ్యకమై
యుండెనో తెలియలేదు. ఆదినమే (30 జనవరి 1948)
సాయంకాలము 5-30 లకు ప్రార్థనసభకు పోవుచున్నసమయ
ములో ఒకనరహంతకునిద్వారా పిస్తోలు ప్రేల్చబడి ఆమహా
త్తరపురుషుడు మహాప్రయాణము గావించెను. సమస్తప్రపం
చమునందు శోకాంధకారము వ్యాపించెను.

బుద్ధదేవుని అహింస, చైతన్యుని ప్రేమ, ఏసుక్రీస్తు
క్షమ- అన్నియు యీమహామానవునిలో రూపము ధరించి
మూర్తీభవించెను. అహింస, ప్రేమ, క్షమాగుణములకు అవ
తారమూర్తియు, సత్యాశ్రయుడునైన యీమానవదేవత
క్రూరనరహంతకుని హస్తములలో తనదేహలీలలను చాలిం
చెను. ఈవార్త సమస్తవిశ్వవాసులను శోకవిహ్వలులను
గావించుటయేగాక స్తంభీభూతులనుగాకూడ గావించెను.

సముద్రమధనమువలన ఉత్పన్నమైన విషయమును పా
నముచేసి మహాదేవుడు నీలకంఠుడై సమస్తప్రపంచమును ప్రళ

యము నుండి సంరక్షించెను. మృత్యువును వరించి మహాత్ముడు ఆమార్గము నే అనుసరించెనా ?. ఆయన హింసావిషమును పూర్తిగా స్వీకరించెనా ?

గాంధీ గారిజీవనావసానము భారత దేశవర్తమానకాలమును అతీతకాలములో ఏకసూత్రమున బంధించివైచెను. మహాభారతయుగములో ధర్మరాజ్యసంస్థాపనకొరకు ఎవరు శరీరమును ధరించి యుండిరో, ఆయన జీవనఅపరాహ్ణకాలమున స్వజనులు పరస్పరవిధ్వంసకకలహములలో మత్తులై యుండుట గాంచి మర్త్యలీలలను చాలించుకొనుటకు సంకల్పించుకొని యోగమగ్నుడయ్యెను. ఆస్థితిలో బాణవిద్ధుడై మహాప్రయాణము గావించెను. గుర్జర దేశములో ద్వాపరయుగమున సంఘటిల్లినది. యుగాంతరగుర్జర దేశయుగావతార జీవితములో అదియే మరల సంఘటిల్లెను, దాదాపు 2000 ల సంవత్సరముల క్రితము క్షమప్రేమల ఆదర్శములను ప్రచారము చేయబోయి, ప్రీతిమమతలసందేశములను బోధించబోయి, శిలువపై చిత్రవధచేసి శోచనీయమైన సంఘటన సంఘటిల్లెను. ప్రపంచేతిహాసములో మహాత్ముని జీవనావసానము వలన మరల అదియే పునరావృత్తి చేయబడినది.

1920 వ సంవత్సరమునుండి యింతవరకు భారతేతిహాసమునందు విచిత్రసంఘటనల ఘాతప్రతిఘాతములు జరిగి యుండెను. ఈ ఘాతప్రతిఘాతములలో, ఉత్థానపతనములలో, సంశయసంకటములలో భారతీయులు ఆయన ఆదేశముల

కొరకు వేచుకొనియుండిరి. దృఢవిశ్వాసముతో ఆయన వైపునకు చూచుచుండిరి. ఆయన ప్రతిసారియు సత్యఅహింసల జ్యోతిని వెలిగించి భారతీయులకు మార్గములను ప్రదర్శించెను నేడు ఆ ఒక్కవ్యక్తి లేమిచే మహత్తరమైన విపులమైన శూన్యత్వమై సృష్టింపబడినది.

కాని ఈశూన్యతవలన మనము నిరాశ చెందిన ప్రయోజనము లేదు. గాంధీజీ బోధించిన దేమి—దుఃఖ, విరోధ, విపద, విఘ్నములకు ఆత్మసమర్పణ చేయకుము. ఆఉపదేశముతో ప్రబోధితమై ఆయన ఆదర్శములతో అనుప్రాణితమై, భారతదేశము తనభావిసంశయములలో, సంకటములలో మార్గమును దర్శింపవలయును. తన ఆదర్శముల జ్యోతి అతీతకాలమున బహుసంకటసంశయములను విమోచనము గావించెను. భవిష్యత్తునందును ఆ అహింస. క్షమ, ప్రేమ, మైత్రి, సత్యనిష్ఠ మొదలగు ఆదర్శములు మనము అనుసరించినయెడల, మనము అసమాప్త కార్యములను సమాప్తముజేసి అయనయెడల యోగ్యమగు భక్తిగౌరవములను ప్రదర్శింపగలము. భారతీయనాగరికతా అమృతరూపమును వికసితముచేయగలము.

# విషయసంపుటి



స్వదేశవాసులకు

స్వతంత్రత

ఐకమత్యము

దేశసేవ – గ్రామసేవ – చరకావిషయము

జాతి – ధర్మము

అహింసాసాధనము

మృత్యువు

జీవన పంచాంగము

ఉపవాసవ్రతములపట్టిక

# మహా వాక్యములు

1 నేను నిమ్న జాతీయుడైన పాకీవాని పాదధూళిని స్వీకరించగలను. కాని సమ్రాటువద్ద శిరమును వంచి నిలువ నొల్లను.

2 హింసవలన హింస తొలగిపోదు. అహింసయే హింసను అంతమొందించగలదు.

3 ఈశ్వరునికి స్థానములేని రాజనీతిని నేను అంగీకరింపజాలను.

4 సత్యమే ధర్మము – సత్యమే ఈశ్వరుడు.

5 ఏవ్యక్తి స్వేచ్ఛాపూర్వకముగా తనదోషవిషయములను స్పష్టముగా యితరులవద్ద వ్యక్తపరచునో, మరిచేయనని ప్రతిజ్ఞచేయునో, ఆవ్యక్తి అందరికంటె పవిత్రమైన ప్రాయశ్చిత్తమును గావించుకొనును.

6 నాజీవితములో రహస్యమనునది ఏదియు లేదు. నా జీవనగ్రంథములోని ప్రతిపుటయు అందరికొరకును తెరువబడి యున్నది.

7 సత్యమార్గమున నడచుచుండుటచేత నాయందున్న భయంకర భ్రమప్రమాదములుకూడ నాకు క్షుద్రములనియే తోచును.

8 కేవలము సత్యమే యున్నది – ఇదిగాక ప్రపంచమునందు మరి ద్వితీయవస్తువు ఏదియు లేదు. ఈవిశ్వాసమే నాకు ప్రతిదినము దృఢతరమగుచున్నది.

9 'మహాత్మా' నామమును బడసి నేను ఎన్నడును అహంకారపడినట్లు తోచదు.

10 నావంటి శతసహస్రవ్యక్తులు నశించుగాక, సత్యమునకు జయము కలిగితీరును.

11 నాస్తికుడు బ్రతికిపోయినపుడు అదృష్టమువలన బ్రతికితినని నుడువును. ఆస్తికుడు ఆపరిస్థితులలో ఈశ్వరుడు రక్షించినాడని నుడువును.

12 మానసిక మాలిన్యమును తొలిగించుటకు ఉపాసనయే ఔషధము.

13 సత్యము వజ్రముకంటెకూడ కఠినమైనది. కమలమునకంటెకూడ కోమలమైనది.

14 ప్రతిపక్షులకు న్యాయము కలుగజేసిన యెడల తనకు న్యాయము సహజముగా కలుగును.

15 గురువుకొరకు వెదకుటలోనే సఫలత్వమున్నది. శిష్యుని యోగ్యత ననుసరించియే గురువు లభించుచుండును.

16 సత్యము ఒకవిశాలమైన వృక్షము, దానిసేవ చేయగలిగిన యెడల దానినుండి అనేక ఫలములు లభించును. సత్యమునకు అంతులేదు. దానిలోతునకు ప్రవేశించినకొలది దానినుండి రత్నములు లభించును. సేవచేయుక్షేత్రమింకను విశాలమగుచుండును.

17 ప్రజాసేవకులు విలువైన వస్తువును దేనిని స్వీకరించవలదు.

18 భీమా చేయుటలో కొంతవరకు పిరికితనము, ఈశ్వరునియందు అవిశ్వాసము ఉన్నవి.

19. మానవుడు, ఆతని కార్యములు రెండు భిన్నమైన వస్తువులు, మంచికార్యములపై అనురాగము, చెడుకార్యములపై విరాగము కలుగుట సహజము.

20. అహింసను ప్రయోగించనిచో సత్యము లభించదు. సత్యమును వెదకుటకు మూలము అహింసయున్నది.

21. మానవునిలో అనంతశక్తి యున్నది. మానవుని అనాదరమువలన, తిరస్కారమువలన ఆశక్తినే అగౌరవించుట యగును. దానివలన ఆతనికి హానికలిగినట్లుల సమస్త ప్రపంచమునకుకూడ హాని కలుగును.

22. నాకు ఆత్మీయులని, అనాత్మీయులని, దేశీయులని, విదేశీయులని, హిందువులని, మహమ్మదీయులని, క్రైస్తవులని, పారసీకులని, యూదులని యేవిధమైన భేదభావములేదు.

23. ఏవిషయములోనైనను సంపూర్ణవిచారణ గావింపక ఆవిషయములో యితరులకు విశ్వాసము కలిగించుట సత్యమును అవమానపరచుటయే యగుచున్నది.

24. స్వేచ్ఛాపూర్వకముగా నిగ్రహమునకు వశీభూతుడగుటయందే మానవుని మనుష్యత్వము ఇమిడియున్నది.

25. చింతనములను నిగ్రహశక్తిద్వారా బంధించు తాళముచెవి మానవునివద్దనే యున్నది. ఆతాళముచెవిని ప్రతివారును వెదకి కనుగొనవలయును.

26. మలినమనస్సు ఉపవాసములద్వారా శుద్ధికాదు. మనోమాలిన్యము విమర్శవల్లను, ఈశ్వరచింతనమువల్లను, ఈశ్వరుని ఆశీర్వాదములద్వారమునను తొలగిపోవును.

27. శరీరముతోపాటు మనస్సునకుకూడ ఉపవాసము లేనియెడల ఉపవాసమునకు ఫలితము అహంకారము.

28. సత్యమును అనుసరించు ప్రయత్నములో క్రోధము స్వార్థపరత్వము, యీర్ష్య మొదలగుదుర్గుణములు సహజముగా శమించును. అట్లు శమించనియెడల సత్యము లభించదు.

29. రాగద్వేషములుగల వ్యక్తి సరళమనస్కుడు కావచ్చును. మాటలలో సత్యపాలనము చేయవచ్చును. కాని శుద్ధసత్యమును పొందజాలడు.

30. విశుద్ధసత్యమునుగురించి జ్ఞానము వికసించినచో రాగద్వేషములనుండి విముక్తుడగును.

31. యుద్ధసైనికులు తుపాకులు పేల్చుట నేర్చుకొనినటుల, అహింసాసైనికుడు నిర్మాణకార్యక్రమము నేర్చుకొనవలయును.

32. వ్యక్తి గ్రామముకొరకు, గ్రామము జిల్లాకొరకు, జిల్లా ప్రదేశముకొరకును, ప్రదేశము దేశముకొరకు మరణించవలయును. ఇదియే దేశప్రేమయొక్కవిద్య.

## స్వదేశవాసులకు :

1. నాజీవితమే నాసందేశము.

2. నాజీవితము భ్రమప్రమాదములతో, అసంపూర్ణతతో, ఉద్యమములతో, సంగ్రామములతో సంపూర్ణమైయున్నది.

3. నేను సత్యమునువినా ఏకుటిలనీతిని ఎరుగను. అహింసా అసహాయోద్యమముతప్ప మరియే అస్త్రమును నాకు లేదు.

4. నేను కోమటినని అనేకులు నన్ను నిందింతురు. అది నాప్రతిభకు సర్టిఫికేట్టుగా భావింతును. నాకుగల అమూల్యరత్నము 'అసహాయోద్యమము' స్వాతంత్ర్యము లభించినను దీనిని త్యజింపజాలను.

5. నేను నాజీవితములోని సర్వోత్తమభాగమును ఆత్మనిర్భరశీలమునకు మార్గమును చూపించుటలోను, ఏస్థితియందైనను మనుజుడు తనను సమర్థించుకొనుటకు శక్తినార్జించుకొనువిద్యను నేర్పుటలోను వినియోగించితిని.

6. కరెంగె ఇయె మరెంగె- మంత్రమును సాధించుటలేక పడిపోవుట.

7. నేను భారతదేశములోని స్త్రీపురుషులకు ఈశ్వర నిర్ధారిత సత్పథమునుగురించి బోధించుటకే సర్వప్రయత్నములు చేసితిని.

8. నేను వచింపదలచిన విషయములను నిస్సందిగ్ధముగను, నిష్కపటముగను ప్రకటింతును. చాతుర్యమునకు నా జీవితములో స్థానములేదు.

9. ఆత్మవంచకుడగుటకంటె ప్రపంచములో హాస్యాస్పదుడగు లక్షరెట్లు మేలు.

10. నేను నాకార్యములతో అభిన్నుడను.

11. అఖండభారతదేశమే నాప్రాణరాజ్యమునందు దృఢతరవిశ్వాసవస్తువు.

12. ఏసాంప్రదాయమును నిర్మించుటకు నాకు కోరిక లేదు.

13. సహజముగా నేను దుర్బలపక్షమును సమర్థించుచుందును.

14. నేను భారతీయులకేగాక సమస్తమానవజాతికిని అధమసేవకుడను.

15. నేను ఇతరులవలెనే రక్తమాంసాదులచే నిర్మింపబడిన సాధారణమానవుడను, నాశక్తిసామర్థ్యము లన్నియు నీరవములును కర్తవ్యనిష్ఠితములును, సమర్థములును, పవిత్రవంతములు నిర్దోషములునై స్త్రీపురుషు లనుభేదము లేక సహాకర్మల అవర్ణనీయమైన శ్రమసేవలపై ఆధారపడియున్నవి. ఆవిషయము ప్రపంచములోని మానవులకు ఎక్కువగా తెలియదు.

16. సాధువేషములో నుండియు అనేకులు ఘోరరాజ నైతికులుగా యుందురు. కాని నేను రాజనైతిక వేషము ధరించినను అంతరమున ధర్మపరాయణుడను.

17. 21-1-48 తేదీన (ప్రార్థనసభలోని విషయము) బాంబు వేసిన యువకుడు సిక్కుమతస్థుడు కాడని నే నెరుగుదును. శిక్కు అయినా, ముసల్మాన్ అయినా, మరెవరయినను దానిలో నష్టమేమిటి? ఎవరు చేసినను నేను ఆతని క్షేమమునే కోరుచున్నాను. ఆయువకుని బాధించవలదని పోలీసుపై అధికారికి నేను చెప్పియుంటిని. ఆతనికి బోధించి సన్మార్గమునకు తెచ్చుటయే ఉత్తమమైన విషయము. యువకుడు, ఆతని సలహాదారులు తమ తప్పును గ్రహింపగలరు. ఏలననగా, ఈ అన్యాయము హిందూధర్మమునకు, హిందూదేశమునకు విరుద్ధముగా చేయబడినది. ఆయువకునిపై కోపము చూపుట కూడ తగనిపని. ఆతడు ఎట్టి అన్యాయము చేసెనని తలంచుటలేదు. అతడు అందరికరుణకు పాత్రుడు.

13 నా అంత్యోపవాసము వలన దేశవాసులైన తమకు ఆగ్రహము కలిగిన యెడలను, తద్వారా యథార్థ శాంతికొరకు కాక ఒక వృద్ధ దేశసేవకుని ప్రతికించుటకు మాత్రమే మీరు శాంతిపరతును అంగీకరించియున్నను, ఆ నేరము మీది గాని బాంబు విసరిన యువకునిది కాదు. నిజముగా హృదయపూర్వకముగా శాంతిపరతును అంగీకరించియుందురేని, ఆయువకుని మార్గగాములందరు తుదివరకు మీ నీతినే తప్పక అవలంబింతురు.

బాంబు విసరిన దుర్మార్గుడు విద్యాహీనురాలైన నారీమణి ద్వారా పట్టువడెనని విని సంతోషించితిని. అంతరము సబలమైయున్నను, చింతనములు విశుద్ధమై యున్నను, విద్య లేనంత మాత్రముచేత నష్టమేమియు లేదు. విద్యాగంధము లేని సోదరియొక్క సహజసత్సాహసముకొరకు ఆమెను అభినందించుచున్నాను.

# స్వతంత్రత:

1 నాకు స్వతంత్రత, మనుషత్వము అభిన్నములైనవి.

2 నేను స్వాతంత్ర్యకాముని, ఏలననగా, నేను మానవుడను, మానవ హితైషిని.

3 స్వాతంత్ర్యము అనగా మనలోనున్న హీనతములు, దరిద్రతములు నైనవారి దుర్గతిని తొలగించుటయే యని నేను గ్రహించుచున్నాను.

4 ఏది సర్వసాధారణప్రజలకు వినియోగింపబడదో అది నాకు అస్పృశ్యమైనది.

5 ఉత్తరాధికారసూత్రములో ధనధాన్యము లటు పొందు విషయములో నాకు వ్యక్తిగతముగా ఎట్టినమ్మకము లేదు. స్వోపార్జితధనమే యథార్థమైనధనము, ప్రతివ్యక్తికి తనశ్రమఫలితముగా యథోచితధనప్రాప్తికి హక్కు గలదు.

6 సామ్రాజ్యవాదుల, ధనికవాదుల దస్యువృత్తియే ఆధునికప్రపంచములో మహాపాపము, అది ప్రపంచములోని దుర్బలజాతులస్వాతంత్ర్యఅస్తిత్వమును, అభివ్యక్తిని భయావహముగా నొనర్చుచున్నది.

7 శాసకులహింసలద్వారా దాసులనుగాచేసి యుంచుటకంటె హింసలవలన భారతదేశము స్వతంత్రమైనను అదియును ఉత్తమమైనదేకాని ఇది అసాధ్యకల్పనమాత్రమే. కారణమేమనగా హింసలవలన భారతదేశము ఎప్పుడును స్వాతంత్ర్యము బడయనేరదు. కేవలము ఆత్మశక్తివల్లనే స్వరాజ్యమును పొందగలదు. ఇదియే భారత దేశమునకు ఆయుధము. ఈ ఆయుధము ప్రేమతో, శక్తితో, సత్యముతో పరిపూర్ణమైయున్నది. ఇదియే యథార్థమైన సత్యాగ్రహము.

8 నేను భావించుచున్న స్వతంత్రభారతదేశములో వివిధధర్మావలంబులైన భారతీయు లందరును యథార్థస్నేహితులవలె వసింతురని ఆశించుచున్నాను. లక్షాధికారు లెవ్వరు ఉండరు. దీనదరిద్రులుకూడ ఎవ్వరు ఉండరు. సమస్తము రాష్ట్రమున కధీనమైయుండును. రాష్ట్రమునం దందరికిని సమానమైన అధికారము లుండును. ఈ స్వప్నమును కార్యరూపమున సఫలీకృతము చేయుటకు మరణమునుసహా వరిం

చుటయే శ్రేయమని నేను భావించుచున్నాను. గృహాయుద్ధములచే శతవిధముల భిన్నమైన భారత దేశమును చూచుటకు నేను జీవించి యుండగోరను.

9 భారత దేశములోని దీనతమ వ్యక్తికూడ యీ దేశమునాది అనుకొనునట్లుగా నేను ఈభారత దేశమును తయారు చేయగోరుచున్నాను. ఈ దేశమును నిర్మించుటలో వారియభిమతములుకూడ కార్యరూపమును ధరించగలవు. ఇచ్చట ఉచ్చనీచములను శ్రేణీభేదము లుండవు. సకలసంప్రదాయములు పరస్పరమైన, దృఢమైన సంపర్కములతో మెలగుచుండవలయును. అస్పృశ్యతారూపమైన అభిశాపమునకు స్థానముగాని, ఉత్తేజకర పానీయములు, మాదకద్రవ్యసేవనములకుగాని, ఆశ్రయ ముండదు. స్త్రీలుకూడ పురుషులవలె సమానాధికారములను అనుభవింతురు. ఇదియే నేను ధ్యానించుచున్న భారత దేశము.

10 కాంగ్రెసు రాజనైతికముక్తిని సంపాదించినది. కాని యింకను అది దాని అర్థనైతికముక్తి, సాంఘికముక్తి, నైతికముక్తులను సంపాదించుటకు యుద్ధము సలుపవలసియున్నది. ఈముక్తి రాజనైతికముక్తికంటెకూడ అధికతర ఆయాససాధ్యమైనది. ఏలననగా ఇది యథార్థమైన నిర్మాణకార్యక్రమము. దీనిలో ఉద్రేకముగాని,ఆడంబరముగానిలేదు.

11 మనకు నలువైపుల విస్తరించుచున్న గూండాల రాజ్యమును అణచివేయుట ఎటులనా యనియే నామనస్సు విచారముచే భారాక్రాంతమైయున్నది. సమస్తభారత దేశ

మును గురించియే నేను ఈవిషయమును నుడువుచున్నాను. సమస్తవిశ్వమును గురించియు నిది అల్పముగనో అధికముగనో చెప్పఁదగిన సత్యము.

12 విదేశశాసనము అంతమొందించుట అనగాగుండా రాజ్యమును ప్రతిష్ఠించుటకాదు.

13 కాంగ్రెసు శక్తిసామర్థ్యములను సంపాదించుటకు ముందు దేశవాసులకు సేవ, ఆత్మత్యాగము, అనాడంబరజీవితములను గురించిన ఆదర్శములనే ప్రదర్శించినది. విదేశశాసన సమయములో ధనము వ్యయమయినట్లు ఇప్పుడు కూడా వ్యయముచేయబడునా ! మననాయకులు, రాజదూతలు స్వతంత్ర దేశములమర్యాద ననుసరించి జీవనయాత్రప్రణాళికను అవలంబించవలయుననియు, వారివలెనే ధనవ్యయము చేయవలయుననియు అనేకుల అభిప్రాయము. స్వతంత్రమైన అమెరికా, ఇంగ్లాండుపద్ధతులతో నడువవలయునని నుడువుచుందురు. ఈవిధముగా నడువకపోయినచో భారత దేశగౌరవముకూడా మ్లానమగునని తలచుచుందురు. నేనట్లు తలంచుటలేదు. స్వాతంత్ర్యమనగా వేషభాషలు, ఆడంబరము కాదు దారిద్ర్యమును దాచిపెట్టుటకు ప్రయత్నించుట ప్రశంసార్హమైన విషయముకాదు. నిష్క్రియప్రతివిధానఫలితముగా భారతదేశము సంపాదించిన నైతికసాధనమూలముననే భారతదేశము ప్రపంచముచేత గౌరవింపబడినది. ఈవిషయములో భారతదేశము అద్వితీయమైనది, కారణమేమనగా చిన్నవిగాని, పెద్దవిగాని ప్రపంచములోని జాతులన్నియుఁఅస్త్రశస్త్రములచేతను సామరికబలముచేతనుగర్వించుచున్నవి.అది

యే వారికి మూలధనము. భారత దేశమునకు నైతిక మూల ధన మే యున్నది. ఈ ధనము ఖర్చు అయినకొలది వృద్ధి యగుచుండును. కాంగ్రెసు యీ మూలధనమును పరిత్యజించినను, అధికారములు పొంది భిన్న తృక్పథములలో కార్యము లారంభించినను, విజాతీయ జీవితాదర్శములను ఆమూలాగ్రముగా పరివర్తనము చేయు సంకల్పమున అసత్యముగా నిరూపితము కాగలదు........మంత్రులు మొదలగువారు అధికారము పొందినపిమ్మట ఇదివరకు ఉన్న రాబడికంటె అధిక వేతనములను ఆశించుట కాంగ్రెసు, కాంగ్రెసేతరవ్యక్తులకు సహజమై పోయినది. రు 150 లు సరిపోవునట్టివారు 500 లు అడుగుటకుగాని, ఆశించుటకుగాని వెనుదీయుట లేదు. అధిక వేతనము లేకపోయినను, పురాతన సివిలుసర్వీసువారిపద్ధతుల ప్రకారము నడువకున్నను, వారివలె దుస్తులు ధరింపకున్నను, ప్రజలు వారిని గౌరవింపరని తలంచుచుందురు. ఇది భారత దేశములో సేవామార్గము కాదని నేను తలంచుచున్నాను. ధనార్జననుబట్టి మానవునిమూల్యము నిర్ధారితము కాదను విషయము మరచిపోగూడదు. అందరును ఆత్మశుద్ధికి ప్రయత్నించవలసిన దే. దీనికొరకు సత్యమగు మనోవృత్తులు, యథార్థమైన కర్తవ్యనిష్ఠ కావలయును.

## ఐకమత్యము:

1. ఐక్యతను పొందుటకు ప్రార్థింపనిదినము ఒక్కటియైనను నాజీవితములో గడపి యుండలేదు.

2. మనము హిందుముస్లిముల ఐక్యతను కోరుచున్నాము. అది బాహ్యకమైన ముద్రివేయబడిన ఐక్యత కాదు. ఆంతరికమైన, దృఢమైన, శాశ్వతమైన, అవిచ్ఛేద్యమైన ఐక్యత లేకపోయినచో స్వరాజ్యము లభించుట అసంభవమైన స్వప్నమువంటిది.

3. సాంప్రదాయిక ఐకమత్యముయొక్క సాధనవిషయక ఆదర్శములు నూతనమైనవి కావు. జాతీయస్వాతంత్ర్య స్తంభములుగా యీ యాదర్శములే దేశపురోభాగమున సర్వదా దేదీప్యమానములై యుండును. సాంప్రదాయిక ఐకమత్యము లేకపోయినచో స్వాతంత్ర్యము స్థిరరూపమును దాల్చి యుండనేరదు.

4. ఐకమత్యసౌధము కేవలము నిర్మాణమూలక కార్యములపై సుప్రతిష్ఠితమై యున్నదను విషయము స్మరణయందుంచుకొనుట అత్యంతావశ్యకము. ఏయుపాయముచేత దీనిని పొందనగును అనునదియే ప్రశ్న. ఐకమత్యమునందు విశ్వాసముగల ప్రతికర్మియు ఈఆదర్శమును తనజీవితములో ఒకఅంశముగా అంగీకరింపవలయును. పొరుగువారి చిత్తముల లోకూడ యీ చైతన్యమును కలిగించవలయును.

5. భయముచేతనే మనము పరస్పరుల కంఠములను నులిమివేయుచుందుము. హిందువులు తమలోనున్న పిరికితనమువల్లనే మహమ్మదీయులను నమ్మజాలరు. ముసల్మానుల అవిశ్వాసమూలమునకూడ హిందువులను గురించి సమాన

మైన పిరికితనము, కాల్పనికసందేహము లున్నవి. ఉభయుల భయములు సమానముగా అగౌరవనీయములే.

6. తనదోషములను గొప్పవిగాను, పరులదోషములను చిన్నవిగాను చూచుటయే సర్వోత్తమమైన మార్గము. ఆత్మశుద్ధికి అది ఒక్కటియే యుపాయము.

7. ప్రేమాగ్నిలో అన్నిటికంటె కఠినమైన వస్తువు కూడ కరిగిపోవును. కరుగకపోయినచో యథార్థప్రేమయొక్క శక్తివంతమైన అగ్ని సమకూర్పబడలేదని గ్రహింపవలయును.

8. హిందుముసల్మానులు పరస్పరుల ధర్మములపై సమానముగా శ్రద్ధావంతులై ఆదర్శమును స్వీకరింపకపోయినచో యథార్థమైన ఐకమత్యమును కుదురనేరదు.

9. తప్పుగా గ్రహించుటచేతనే మనలో అనేకులకు దుఃఖదుర్దశలు సంభవించినవి. వెనుకముందు లాలోచించి మాట్లాడుట ఉత్తమైన విషయము. అనవసరముగా ఒక్క మాట మాట్లాడుటయైనను తగదు. మన ఆలోచనములు యథార్థవాక్యములుగా ప్రకాశితమై కార్యరూపమున వినియోగింపవలయును.

10. సాంప్రదాయ సమూహములలో విభేదములను స్థిరముగా నుండుటకు కోరుచున్న బ్రిటిషుశక్తి మనలోనుండి తొలగిపోయినపుడే మతకలహము లన్నియు సమసిపోగలవు.

11. హిందుముసల్మానులు భ్రాతలవలె, సుహృదుల వలె వసింతురుగాక! భగవానుడు నాయీస్వప్నమును సార్థకపరచునుగాక! లేనిచో భారతదేశమునం దొకభాగమునం

దు మహమ్మదీయులును, మరియొక భాగమునందు హిందువు లును వసింతురనునట్టి భయంకరపరిస్థితులు చూచుటకు ముందుగానే నన్ను పరమేశ్వరుడు తనసద్దకు పిలుచుకొనునుగాక!

## దేశసేవ, చరకావిషయము :

1 గ్రామసేవయే యదార్థమగు దేశసేవ.

2. దీర్ఘమైన శలవుదినములలో విద్యార్థులు గ్రామములలోకి పోయి సేవాకార్యములో తమఅమూల్య అవకాశమును వినియోగించెదరుగాక, విద్యావ్యాప్తికి తాత్కాలిక విద్యాలయములు నడపించవలయును. ఆరోగ్యవిధానములను నేర్పవలయును. రోగాక్రాంత స్త్రీపురుషుల సేవ చేయవలయును.

3. విద్యార్థులు తమశరీరముల్లను వంచి శ్రమపడి గ్రామములోని అడవిప్రదేశములను, చెత్తచెదారములను శుభ్రముచేసి, కాలువలను త్రవ్వి, బావులను చెరువులను బాగుచేసి, సులభసాధ్యమైన కోనేరులను కట్టించి, వీధులను బాటలను పరిశుభ్రముచేయుచు నైతికవిషయములలోకూడ ఎక్కువశ్రద్ధ వహించవలెను. అస్పృశ్యత, బాల్యవివాహము లు, అసమానదాంపత్యసమ్మేళన, దోషణీయపానాహారము లు, స్థానికములగు బహువిధమూఢాచారములు మొదలగు వానిని క్రమముగా విసర్జించుటకు గ్రామస్థులకు ప్రబోధము గావింపవలయును.

4. అనేకవిధమ్ములైన, దారుణమైన లోటుపాటులే మన యంతరాత్మను హతమార్చుచున్నవి.

5 సాధారణప్రజలలో జాతీయకల్యాణసాధనకు ఉత్సాహము, ఉద్రేకము కలిగించి స్థిరముగా నుంచవలె నన్నచో రాట్నముపై నూలు తీయుటయే అవలంబనీయమైనది.

6 మన దేశమునుండి అనర్థకమైన భోగలాలసను తొలగించవలెనన్నను ఈరాట్నమొక్కటే అనుకూలమైన పరికరము.

7 ఉదారహృదయము, సందేహాతీతమైన పవిత్రప్రవర్తనయే యీశుభకర్మలకు ఆశ్రయము.

8 సత్యసాఫల్యము శాసనముల సూత్రజ్ఞానమువలన గాని, జమాఖర్చుల విచక్షణవలనగాని, కూటనీతివలనగాని, అనజ్ఞ అవిశ్వాసములవలనగాని లభించదు. సత్సాహసము, త్యాగము, సత్యము, ప్రీతి, విశ్వాసములద్వారా సత్యసాఫల్యత లభించును.

## జాతి - ధర్మము :

1 నేను హిందువునని గర్వింతును.

2 నేను నాసహధర్మిణిని గురించిన జ్ఞానమును ఎంత వర్ణింపగలనో అంతకంటె అధికజ్ఞానమును హిందుధర్మమును గురించి వర్ణింపజాలను. ఆమెయే ప్రపంచమునందతులనీయమైన రమణీమణివలె నన్ను నడపుచుండును.

3 ఈజీవితములో రహస్యముగా నుంచదగినది నాకేమియు లేదు.

4 ఎవనివిశ్వాసము ఎంతప్రబలముగా యుండునో, ఆతనివాదముకూడ అంతదృఢతరమై యుండును.

5 ఈశ్వరారాధనయొక్క ఆశ్రమములో యుండక పోయినచో నేను పిచ్చివాడనై పోయెడివాడను.

6 నాజీవితములోని ప్రతిస్పందనమునందును ఈశ్వరానుభూతిని అనుభవించుచుందురు.

7 దారుణసంకటసమయములలోసహా శ్రీగీతయే నా ఓదార్పుకు ఆశ్రయము.

8 ప్రీతిధర్మముయొక్క గౌరవము ఆధర్మవిశ్వాసుల ఆచరణములద్వారా ప్రకటిత మగును.

9 వివేకము లేకపోయినచో వాదోపవాదములకు స్థానము లేదు.

10 ఆంతరిక సౌహార్ద్యములేని వాగాడంబరములకంటె మౌనముతో కూడిన ఆంతరికతయే ఆరాధన క్షేత్రమునందును సకలకర్మలయందును అధికముగా ప్రయోజనమైనది.

11 భగవానుడు నిర్యాతనములచేత బాధింపబడి, హీనరూపముదాల్చిన దరిద్రనారాయణుడుగా మన సమీపమునకు వచ్చుచుండును.

12 నా ఆంతర్వాణి నేను బ్రతికియున్నదానికంటె కూడా నాకు అధికసత్యమైనది.

13 నానీతి, నావాదములు, నాఅంతరము ననుసరించి యుండును.

14 చీపురుకట్టలచేత గృహమునందున్న మలినమంతయు తొలగింపబడినట్లుల అపరాధములను అంగీకరించుటచేత మానవహృదయము నిర్మలముగాను, పవిత్రముగాను ప్రకాశించును.

15. తుపాకుల, ఫిరంగుల, గుళ్ళదెబ్బల సమక్షమునం దైనను నిర్భయముగా మనము సత్యమును చెప్పవలయును.

16. నేనుస్వయముగా నాప్రియజనులతో పాటు ధర్మమును రాజనీతి విషయములలో ప్రవేశపెట్టు పరీక్షలో నిమగ్నమైయున్నాను.

17. జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపిగరీయసీ అందుచేత దేశసేవ ధర్మము ననుసరించియే చేయవలసియుండును. ధర్మము నాకు అత్యంత ప్రియమైనది. కాని భారతదేశము క్రమముగా అధర్మమార్గమున నడచుచున్నదని నాభయము.

18. భగవానుడు పరిపాలకుడు అని దృఢవిశ్వాసమున్నచో మనభయమునకు ఎట్టికారణము ఉండదు.

19. భగవానునకు భయపడుచుండిన యెడల మానవుని భయము తనంతట తానే తొలగిపోవును.

20. ఈశ్వరానుగ్రహమే నాకు ఏకైకశక్తి. నీరవ ప్రార్థనయే నాకు సర్వప్రధానమైన రక్షాకవచము. న్యాయము యొక్క క్షీణతరమైన వెలుగుకూడా భావి కాలఆశలచేతను విశ్వాసముచేతను, ఆనందముచేతను నాహృదయమును పూర్ణము చేయును.

21. పాదిరీలగుడి నీరవగాంభీర్యమైన అత్యుత్తమ సౌందర్యముతో పరిపూర్ణమై యున్నది: మసీదు దృఢతరనిష్ఠా నియమములచే నిండియున్నది. మందిరము సర్వధర్మాధిపమైన ఆభగవానుని అపారఆనందములచేత నిత్యము దేదీప్యమానమగుచున్నది. ఆయన సర్వమునందును, సర్వము ఆయనయందును వసించుచున్నాము.

## అహింసా సాధనము:

1. భారతదేశమునందేగాక ప్రపంచమునందున్న దోషములనన్నిటిని తొలగించుటకొరకు భగవానుడే నన్ను అహింసాప్రచారమునకు యంత్రరూపముగా నియమించినాడు.

2. భారతదేశము ప్రపంచములో హాస్యాస్పద విషయముగా పరిణమించినది. నీఅహింస ఎక్కడ అని నేడు ప్రపంచవాసులు అడుగుచున్నారు. ఏఅహింసవలన నీవు స్వాతంత్ర్యమును ఆర్జించితివో అది ఏది? ఈప్రశ్నవలన సిగ్గుచేత నాతల బరిద్దలై పోవుచున్నది. స్వతంత్రభారత దేశము ప్రపంచమునకు శాంతిమంత్రమును వినిపించునా! లేక ఏ హింసాద్వేషములచేత ప్రపంచము మృతప్రాయమై యున్నదో ఆభయంకరవిషయములనే భారత దేశముకూడ ప్రపంచమునకు వినిపించునా?

3. అహింసనైనను హింసనైనను పిరికితనము లేనిదై యుండవలయును.

4. కష్టసహనములు మనుజులధర్మము, యుద్ధవిగ్రహములు పశుజాతిధర్మము.

5. స్త్రీ పురుషు లెవరైనను ఏ దుర్మార్గుని ద్వారానైనను ఆక్రమింపబడినపుడు హింసా అహింసలవిషయము ఆలోచించిక సర్వవిధముల ఆత్మసంరక్షణగా వించుకొనుటయే ప్రథమకర్తవ్యము.

6. పరాజయ మొందుటకంటె వినాశముపొందుటయే శ్రేయము.

7. నేనువృద్ధుడను, జరాగ్రస్తుడను, దంతహీనుడను, ఇట్టిపరిస్థితిలో అహింసను సమర్థించజాలోయి ఏసోదరి యెడలనైనా జరుగుచున్న పాశవిక అత్యాచారములను సహించియుండు చేని నామహాత్మగిరి తిరస్కృతమగును, అవమానిత మగును, వినష్ట మగును, ఏవిధముగానైనను అత్యాచారియొక్క కబళేమునుండి ఆసోదరినివిడిపింపవలయును. లేనియెడల జీవితఅవస్థలో యిట్టివిషయములకు సాక్షినై యుండజాలను.

8 సంపూర్ణమైన అహింస వజ్రముతో సమానమైన హృదయమునుసహా కరగించును.

9 యథార్థ అహింసగలవ్యక్తి అత్యాచారిద్వారా మరణమును చెందినను ఆతనిఅంతరమునందున్న ఆనందమును పోగొట్టుకొనజాలడు. అందుచేత ఆతనివదనమండలమున ఆనందజ్యోతి సదా ప్రకాశించుచునే యుండును.

10 నాపైనేరారోపణములు చేయుచున్నవారిపై నేను కోపపడకుందునుగాక! వారిచేతులలో నాకు మరణము సంభవించినను వారికి హాని కోరకుందునుగాక! ఈశ్వరుడు నా కట్టి మానసికశక్తిని ప్రసాదించుగాక!

11 మనుజునకు మనుజునకుమధ్య ఎన్నియో పోరాటములు, ఎన్నియోహింసాద్వేషములు, ఎన్నియోభయములు, యీవికారముల నన్నిటిని మనస్సులనుండి తొలగించుటకు అహింస యెంత సహాయకారియైనదో నాజీవనపర్యాయాహ్నమందు దానినే పరీక్షించి చూపెదను. ఈపని అనేకులు ఏకమై

చేయవలసినదికాదు. అందువలన నేను ఒక్కడనే చేయవలసియున్నది. కావున ఈనాడు నేను ఒంటరిగా హింసాద్వేషముల విముక్తాంతరముతో నడచుచున్నాను. కేవలము ఈశ్వరుడిచ్చినశక్తిమీద ఆధారపడియే నడచుచున్నాను.

12 ఏను జీవనసంగ్రామములో రతుడనైన దీనహీన ప్రాణినిమాత్రమే. చింతనములలో, కార్యములలో, వాక్యములలో సంపూర్ణనిర్దోషిని, నిష్టాపరుని, అహింసాపరుని అగుటయే నాకుగల ప్రబలమైన ఆకాంక్ష.

## మృత్యువు :

1 జన్మ, జీవితము ఆత్మయొక్క ధీరగతిశీలముగల క్రమవికాసము, మృత్యువు దానికి దుత్రమైన, పరిపూర్ణమైన విప్లవము, ఆత్మవికాసమునకు జీవితమువలెనే మృత్యువుకూడ సమానావశ్యకమైనదే.

2 విశ్వప్రకృతినియమానుసారముగా మృత్యువు ఎంత ప్రయోజనీయమైన సుందరమైన వ్యవస్థయో గ్రహింపగలిగినయెడల నది మన కెప్పుడు లభించినను యిక భయంకరమైనదిగా కనుపడదు.

3 మృత్యువు శత్రువు కాదు, యథార్థమైనమిత్రుడు. దుఃఖకష్టములనుండి యీమృత్యువే మనకు ముక్తిని ప్రసాదించును. మృతువు జీవితములోని సకలవిరుద్ధప్రయత్నములను దాటించి జ్ఞాననేత్రమును తెరచివేయును. నూతన సుయోగ

ములను దానముచేయును. నూతన ఆశలను గలిగించుచుం డును. నిద్రవలె క్లాంతిని హరింపజేసి నవసంజీవనమును ప్రసా దించును. మనఆత్మీయులమృత్యువునందు శోకమును ప్రక టింపజాలక యుండలేమనుట తథ్యము. కాని ఆత్మత్యాగు లైన వీరులవిషయములో అట్లుచేయుట అనుచితము.

4 అనివార్యమైనదానివిషయములో అధికముగా శోకిం చుట అనుచితము. సృష్టింపబడిన సకలజీవులకు మృత్యువు అత్యంతపరిణామము. మృత్యువును శోచనీయమైన దుర్ఘట నగా భావించుటయు అన్యాయము. యథార్థముగా ఆలో చించిచూచినచో మృత్యువే ముక్తి.

5 స్వర్గీయులైన ప్రియజనుల జీవితములయందు ఉత్త మములయిన విషయములను మనజీవితములయందు కార్య రూపమున స్వీకరించి భావికాలమున వారు శాంతి పొందు టకు మనము సహాయము చేయవచ్చును. ఇచ్చటివిషయం బుల నన్నిటిని వారు గ్రహింపగలిగినయెడల వారుకూడ శాంతిపొందుదురు. వారినిగురించి అమూల్యమైన స్మృతిచిహ్నా లుకూడ రక్షింపబడగలవు.

6 నేను ఆత్మయొక్క అమరత్వమునందు విశ్వాసిని, సముద్రమువిషయము ఆలోచించినపుడు అది అనేకబిందువుల జలముతో తయారుచేయబడినటుల తోచును. ప్రతిబిందువు ఒక్కొక క్షుద్రమైన సత్తారూపముదాల్చినది. మరియు సము ద్రముయొక్క మహత్తర స్వరూపమునకు అంశముకూడనై

యున్నది, ఏకమైనది. మరియు బహువు. ఈజీవన మహాసము ద్రములో ప్రతిజీవియు క్షుద్రమైన జలబిందువులు మాత్రమే, నేను విశదీకరించున దేమనగా–సమగ్రజీవితమునకు–సమ్మిళిత జీవమహాసముద్రమునకు – అపారమహిమాన్విత సార్వభౌమ ఈశ్వరశక్తి ఆస్తిత్వమునకు లయము యెప్పుడును సంభవింపదు. క్షుద్రమైన జైవసత్తాకు లయము సంభవింపవచ్చును.

7 జీవనమృత్యువులు ఒకనాణ్యముయొక్క వెనుక ముందు దృశ్యములవలె ఒక్కవస్తువుయొక్క రెండుదిక్కులై యున్నవి. సుఖభోగము, జీవనములకంటెను దుఃఖభోగము మృత్యువులనే నేను మహత్తరమైనవిగా భావించుచున్నాను. పరీక్షలు, దుఃఖకష్టములు సత్యమైనసుఖమైన జీవితముయొక్క మాధుర్యమును అనుభవింపజేయును. ఇదిలేనియెడల జీవితము లోని మూల్యమే గ్రహించుటకు వీలుండెడిదికాదు. సీతా రాములలో పరీక్షలు, దుఃఖకష్టములు, తపస్సువిషయము లేకుండినయెడల రామాయణములో దేనివిషయము వ్రాయ బడియుండెడిది? మృత్యువు, దుఃఖభోగము జీవితముకంటె అమూల్యమైనవిగా గ్రహింపవలయును. అవి మానవుని పవి త్రునిగాను, నిర్మలునిగాను గావించునని గ్రహింపవలయును.

8 మృత్యువు జీవితమునకు రూపాంతరముమాత్రమే నని చాలకాలమాలోచించినపిమ్మట గ్రహించితిని. కనుక మృత్యువు యెప్పుడు సమీపించినను దానిని కౌగలించు కొందును.

9 ఈశ్వరుడు తన నియమిత కార్యములను నెరవేర్చుటకు నాకు యీ జీవితమును దానముచేసియున్నాడు. అసమర్థులుగను అనారోగ్యముగాను జీవితమును గడపుటకంటె మృత్యువే శ్రేయము. కార్యదక్షుడనై యుండగలిగినపుడే బ్రతికియుండుటలో సార్థకత గలదు. లేనిచో ఒక్కనిమిషమైనను బ్రతికియుండు అపేక్ష లేదు.

10. ఇంతకు పూర్వముకూడ నాజీవన నాశనమునకు ప్రియత్నము చేయబడెను. కాని భగవానుడు నన్ను రక్షించెను. ఘాతకుడు తాను గావించిన పాపకర్మకు పశ్చాత్తప్తుడయ్యెను. ప్రపంచమునుండి ఒకపాపిని తొలగించుటకొరకు ఏఘాతకుడైన నాపై గుండ్లు విసరినచో ఆగుండ్లవలన అసలు గాంధి మరణించడు. ఘాతకుని నేత్రములకు ఎవరు పాపిష్టుడని తోచునో ఆగుళ్ళవలన ఆతడుమాత్రమే నిహతుడగును.

11. నేను వీరునివలె మరణింపవలెనని నా జాతకములో వ్రాయబడియున్నది. ఉరివలనగాని, గుళ్ళదెబ్బలవలనగాని నాకు మరణము సంభవించును. అట్టి మృత్యువు నిజముగా వీరునికి గౌరవప్రదమైన మృత్యువే! రోగమువలనగాని అనాహారమువలన శయ్యపై పరుండుటవలనగాని సంభవించిన మృత్యువు వీరుని మృత్యువు కాదు!

# జీవన పంచాంగము

1869 అక్టోబరు 2 వ తేదీన, పోర్ బందరులో కరంచందుని తృతీయ పుత్రుడుగా పుత్లీబా గర్భమున జన్మించెను.

1881 లో కస్తూరి బాగారితో వివాహము జరిగెను.

1884 లో పితృవియోగము కలిగెను.

1887 లో మెట్రిక్ పరీక్షలో కృతార్థు డాయెను.

1888 సెప్టెంబరు లో ఇంగ్లాండు ప్రయాణము.

1891 లో బారిష్టరు పరీక్షలో కృతార్థుడయి జూన్ నెలలో భారతదేశమునకు తిరిగి వచ్చెను. దీనికి కొద్ది రోజులకు ముందు మాతృవియోగము కలిగెను.

1893 లో ఏప్రిల్ నెల దక్షిణ ఆఫ్రికా ప్రయాణము.

1894 నెటాలులో భారతజాతీయ కాంగ్రెసు నిర్మాణము.

1899 లో బోయరు యుద్ధములో బ్రిటిషువారికి సహాయము చేయుట.

1901 లో భారతదేశమునకు తిరిగివచ్చుట, కలకత్తా కాంగ్రెసు సమావేశములో భారతీయ కాంగ్రెసులో ప్రథమమున చేరిరి.

1904 లో 'ఇండియన్ ఒపీనియన్' ప్రకటించిరి. డర్బాన్ సమీపమున ఫినిక్సు సమీపములో భూమినిక్రయము చేసి సహజ సరళ జీవనయాత్ర గడపుటకు గృహ మును నిర్మించుకొనిరి.

1906 లో నెటాలులో జులు విప్లవములో సేవాకార్యము గావించిరి. సెప్టెంబరు 11 వ తేదీన ట్రాన్స్వాలులోకి భారతీయుల ప్రవేశమును నిషేధించుచు చేయబడిన శాసనమునకు విరుద్ధముగా ప్రథమమున సత్యాగ్రహ నీతిని అవలంబించిరి. ఏషియాటిక్ ఆర్డినెన్సుప్రకారము దక్షిణ ఆఫ్రికాలో భారతీయుల అధికారమును తగ్గించుటచే 3000 భారతీయులు నేతృత్వమును స్వీకరించి సత్యాగ్రహము చేసిరి. 2000 సత్యాగ్రహులతో చెరసాలలో బంధీగాచేసిరి.

1907 జనవరి 30 వ తేదీన స్మట్సుతో చేసుకొనిన సంధిఫలితముగా అందరును విడుదలచేయబడిరి.

1908 లో సంధి లక్ష్యింపబడకపోవుటచే జోహాన్సు బర్గులో మరల సత్యాగ్రహము ఆరంభమయ్యెను. సత్యాగ్రహులకు కారావాసము, జరిమానా, గని యిలాకాలో బెత్తపుదెబ్బలు, ఘూటింగు జరుగుచుండెను.

1913 లో మనిషికి 3 పౌనులు పన్ను విధింపబడుటచే నెటాలు గనిలోని పారిశ్రామికులందరును సమ్మె చేసిరి. ఆయన సమ్మెకారులను, వారి పరిజనులను వెంటబెట్టుకొని ట్రాన్సువాలుకు ప్రయాణమై పోవుచుండగా అందరును కారాగారమున బంధింపబడిరి. స్మట్సుద్వారా అందరునువిడుదలచేయబడిరి, పన్ను రద్దుచేయబడెను.

1914 లో ట్రాన్సువాలులోకి భారతీయులం ప్రవేశమును నిషేధించుచు చేయబడిన శాసనము రద్దు చేయబడుట చే సత్యాగ్రహమునకు జయము కలిగెను.

1915 లో అహమ్మదాబాదులోని కోచరవ అను గ్రామములో ఆశ్రమము స్థాపించిరి.

1917 లో సబర్మతికి ఆశ్రమమును స్థానాంతరితము గావించిరి.

1919 లో యంగ్ ఇండియా (ఇంగ్లీషు) నవజీవన్ (హిందీ) అను పత్రికల సంపాదక భారమును వహించిరి. రౌలట్ శాసనమునకు విరుద్ధముగా సమ్మె చేయుటచే భారతదేశమునందు సర్వత్ర వ్యాపించెను. జాలియన్ వాలా బాగ్‌లో డయర్ హత్యాకాండను ఆరంభించుటచే అమృతసర్ కాంగ్రెసులో నాయకత్వమును స్వీకరించిరి.

1920 లో కలకత్తా కాంగ్రెసు సమావేశములో అసహాయోగ ఉద్యమమునుగురించి తీర్మానము పెట్టబడెను.

1921 లో అహమ్మదాబాదు కాంగ్రెసు సమావేశములో అహింసా పూర్వకముగా శాసన తిరస్కార ఆందోళనమును గురించి తీర్మానము ఆమోదింపబడెను. విదేశవస్త్ర విసర్జన అసహాయోద్యమ ఆందోళనము, వస్త్రాభావము, దారిద్ర్య విముక్తికి చరకా అమలులో పెట్టుట.

1922 లో మార్చి 10 వ తేది రాజకీయ నేరము క్రింద అరెస్టు. 6 సంవత్సరముల కారావాసశిక్ష.

1924 లో కారాగృహమునుండి విడుదల. బెల్గాం కాంగ్రెసు మహాసభకు సభాధిపతి యగుట.

1925–29 వరకు నిర్మాణ కార్యక్రమములో నిమగ్నమై యుండిరి.

1930 లో జనవరి 26 వ తేదీన స్వాతంత్ర్య దినముగా ప్రకటింపబడిన పిమ్మట మార్చి నెలలో గవర్నమెంటు అంత్యలేఖను వ్రాసి శాసన ధిక్కార ఆందోళనము ఆరంభవము చేసిరి. ఏప్రిల్ 6 వ తేదీన డాండీలో ఉప్పు సత్యాగ్రహమును ఆరంభించిరి. మే 4 వ తేదీన యరవాడ జైలులో ఖైదీగా పెట్టబడిరి.

1931 మార్చి 4 వ తేదీన లార్డు ఇర్విన్‌తో షరతు యేర్పాటు చేసుకొనిరి. మార్చి 25 వ తేదీన కారాగృహమునుండి విడుదల. మే 29 వ తేదీన 'రాజపుతానా' యను ఓడలో రౌండుటేబులు సమావేశమునకు ప్రయాణము. డిశంబరు 28 వ తేదీని 'పిపలసనా' అను ఓడలో భారతదేశమునకు తిరిగి వచ్చుట.

1932 లో మరల యరవాడ జైలులో ఖైదీగా బంధింపబడిరి. కులభేదముల సంఘముల రద్దు పూనా షరతు.

1933 ఆగష్టు 1 వ తేదీన ధర్మపత్నితో సహా సబర్మతి జైలులో ఖైదీగా నుంచబడిరి. ఆగష్టు 23 వ తేదీని విడుదల చేసిరి.

1934 లో బొంబాయి కాంగ్రెసు మహాసభలో కాంగ్రెసు సంబంధమును విసర్జించుట. జూన్ 25 వ తేదీని పూనా పట్టణములో విసరబడిన బాంబునుండి రక్షింపబడుట.

1935 మార్చి 21 వ తేదీనుండి ఏప్రిల్ 19 వ తేదీవరకు మౌనవ్రతమును అవలంబించిరి.

1936 జూలై 7 వ తేదీని మంత్రిపదవులను స్వీకరించమని కాంగ్రెసు ఆదేశించిరి. ఆసంవత్సరము గావించిన ప్రయత్నముల ఫలితముగా వేయిమందికి పైగా రాజకీయ ఖైదీలకు ముక్తి నియ్యబడెను.

1939 లో కాంగ్రెసు సభాపతి సుభాస్ చంద్రుడు కాంగ్రెసు వర్కింగు కమిటీని నిర్మించుటకు కోరిరి. కాని ఆయన తన అసమర్థతను తెలియజేయుటచే సుభాస్ బోసు సభాపతి పదవిని త్యజించిరి. కాంగ్రెసు మంత్రులను తమపదవులను త్యజించమని ఆదేశించెను. నవంబరులో జిన్నా జవహర్ లాల్ తో ఆలోచించుట.

1940 లో పూనా షరతు తిరస్కరింపబడుటచే మరల కాంగ్రెసునేతృత్వమునుఅంగీకరించుట అక్టోబరులోవ్యక్తిగత సత్యాగ్రహమును ఆరంభించమని ఆదేశించుట.

1941 డిశంబరులో ఆయన ప్రయత్న ఫలితముగా 5000 సత్యాగ్రహులుకారాగారమునుండివిముక్తినిపొందిరి.

1942 ఆగస్టు నెలలో గణ ఆందోళనము కొరకు కాంగ్రెసు కమిటి ఆయనకు సలహా నిచ్చిరి. భారత దేశమును

వదలి (Qiut India) పొమ్మని ఆంగ్లేయులకు స్పష్ట
ముగా ఆదేశించుటు. ఆగస్టు 9 వ తేదీన ఆయన
సకల సహచరులతో బొంబాయిలో అరెస్టు చేయబడిరి.
1944 లో పూనా కారాగారమునందు ఆయన ధర్మపత్ని
మహాప్రయాణము, పిమ్మట తేకుంగా మే 6 వ తేదీన
ఆయన విడుదల, హిందుముస్లిముల ఐకమత్యముకొరకు
జిన్నాగారితో వ్యర్థ ఆలోచనములు.
1945 జూన్ నెలలో సిమ్లాలో జరిగిన నాయకుల సమావే
శమునకు వేవెల్ పంపిన ఆహ్వానముపై వెళ్ళిరి. కల
కత్తాలో డిశంబరు నెలలో వైస్రాయి, వంగదేశ
గవర్నరుగారితోను దేశపరిస్థితులను గురించి ఆలోచ
నములు జరిపిరి.
1946 జనవరిలో అస్సాము, కలకత్తా చూచుకొని మద్రాసుకు
వెళ్ళిరి అచ్చట శ్రామికుల సభలో కార్మికులే కార్ఖా
నాలకు నిజమైన యజమానులని ప్రకటించి యుండిరి.
ఫిబ్రవరి 10 వ తేదీని అహమ్మదాబాదులోని నవజీవన
ప్రెస్సునుండి ప్యారీలాల్ సంపాదకత్వమున హిందీలో
హరిజనవారపత్రిక ప్రచురింపబడెను. ఫిబ్రవరి 24 వ
తేదీన కలకత్తానుండి హరిజనవారిపత్రిక ప్రకటింప
బడెను. ఏప్రిల్ నెలలో మంత్రులమిషన్ వారిలో
ఢిల్లీలో ఆలోచనములు జరిపిరి. సిమ్లా సమావేశము
నకు హాజరైరి. బ్రిటిషు సైన్యమును తొలగించు

విషయము ఆలోచించబడెను. నవఖాళీలో జరిగిన దురంతములను గురించి విని మర్మాహతులైరి. కలకత్తాకు పోయి అచ్చటినుండి యాత్ర నారంభించిరి.
1947 మార్చి నెలలో అబ్దుల్ గఫూర్ ఖాన్ గారితో కూడ బీహార్‌లో కల్లోలములచేత ధ్వంసమైన ప్రాంతములను దర్శించిరి. మౌంట్‌బాటెన్ గారి ఆహ్వానముపై ఢిల్లీకి పయనమైపోయిరి. ఆసియా మహాసమ్మేళనములో ఉపన్యాసము నిచ్చిరి. జూన్ 3 వ తేదీన బ్రిటిషు సర్కారువారు భారతదేశమును రెండుగా విభజించి ఆగస్టు తేదీనుండి హిందుస్థాన్, పాకిస్థాన్ అను నామములతో రెండు డొమినియన్లుగా నిర్మించనున్నారని విని ఏకకాలమునందు ఆనందమును, దుఃఖమును వెలిబుచ్చిరి. దేశమంతయు వ్యాపించిన మతకలహములను నివారించు నుద్దేశముతో సంకల్పము గావించుకొనిరి. స్వాతంత్ర్యము ఖండములుగా లభించినను ఇంగ్లీషు వారి కుటిల నీతివలన కలిగిన విషవాయువులు దేశమును దగ్ధము చేయుటచేత, కలకత్తాలో జరిగిన భయంకర కలహములను గురించి విని అచ్చటికి పోయిరి. స్వాతంత్ర్యము ప్రకటితమైన ఆగస్టు 15 వ తేదీకి పూర్వదినమునుండి హిందూముస్లిముల పరస్పరప్రీతి శాంతిస్థాపనలో సాఫల్యత నొందుట గాంచి ఆనందించిరి. మరల ఢిల్లీలో బిర్లాభవనమునందు

వసించుచు ఆశ్రయ ప్రార్థితుల మరల కలుపుటకును, హిందూముస్లిములలో ఏకమత్యమును స్థాపించుటకును విశ్వప్రయత్నములు చేసిరి.

1948 జనవరి 20 వ తేదీ మంగళవారమునాడు ప్రార్థనసభలో 15 గజముల దూరమున విసరబడిన బాంబునుండి జీవితము రక్షింపబడుటచే నిశ్చయముగా సభాకార్యమును నెరవేర్చుట, జనవరి 30 వ తేదీ శుక్రవారము ప్రార్థనసభా వేదికవద్దకుపోవు సమయములో 5 గం॥ల 5 నిమిషములకు నీచఘాతకుని తుపాకి దెబ్బచే హతుడై హేరామ్! హేరామ యనుచు చైతన్య హీనుడయ్యెను. 35 నిమిషములలో బిర్లాభవనమునందే మహాప్రయాణము పొందిరి.

జనవరి 31 వ తేదీ శనివారమునాడు ఢిల్లీ యమునా నదీతీర రాజఘట్టమునందు అంత్యక్రియలు జరుపబడెను. 15 మణుగుల చందన కాష్టములు, 4 మణుగుల నెయ్యి, 2 మణుగుల సుగంధద్రవ్యములు, 1 మణుగు నారికేళములు, 15 శేరుల కర్పూరములతో చితి సమర్పబడెను. తృతీయపుత్రుడు రామ్‌దాస్ గాంధి అగ్ని సంయోగము గావించెను.

ఫిబ్రవరి 12 వ తేదీ గురువారమునాడు భారత దేశమందే కాక సమస్తవిశ్వప్రపంచమునందును అంత్యశ్రాద్ధము జరుపబడెను. అస్థికల నిక్షేపముకూడ జరిగెను.

—:0:—

# ఉపవాసవ్రతముల పట్టిక

1. 1918 మార్చి నెలలో అహమ్మదాబాదులో మిల్లు యజమానుల అత్యాచారములకు విరుద్ధముగా సమ్మె జరుగుచున్న కాలములో సమ్మెకారుల తాచ్ఛల్యముచేత సమ్మె చెడిపోవునని గ్రహించి కొన్ని దినములు నిరాహారదీక్షను అవలంబించి తత్సాధనలో సాఫల్యతను పొందగలిగెను.

2. 1919 ఏప్రిల్ నెలలో నదియాద్‌లో దుర్మార్గులు కొందరు రైలులైను తీసివేయుటచే ఆపాపమునకు ప్రాయశ్చిత్తముగా కొన్నిరోజులు సబర్మతీ ఆశ్రమములో నిరాహారదీక్షను అవలంబించి యుండిరి. దుర్మార్గులచేత నేరమును ఒప్పించుటకు అందరును నిరశనవ్రతమును అవలంబించవలెనని దేశవాసులందరిని హెచ్చరించెను.

3. 1921 నవంబరు నెలలో ప్రిన్సుఆఫ్ వేల్సు భారత దేశమునకు వచ్చిన సందర్భములో బొంబాయిలో జరిగిన అల్లరులను నిరసించుచు 9 వ తేదీ నుండి 13 వ తేదీ వరకు ఉపవాసవ్రతము అవలంబించిరి.

4. 1922 ఫిబ్రవరి నెల రెండవవారములో బార్డోలీ చౌరాచౌరీలో జరిగిన దురంతముల ఫలితముగా 5 రోజులు నిరశనవ్రతధారులై యుండిరి.

5. 1924 సెప్టెంబరు నెలలో కోహాట్‌లో జరిగిన మతకలహములకొరకు పశ్చాత్తప్తులై ఢిల్లీలో 21 దినము ఉపవాస ముండిరి.

6. 1925 నవంబరు నెలలో తన శిష్యుని ప్రమాదమైన సబర్మతీ ఆశ్రమములోని శిష్యవాసుల దుర్నీతికొఱకు అను చిత్తశుద్ధికై పశ్చాత్తాపార్థమై ఒకవారము రోజులు ప్రాయోపవాస ముండిరి.

7. 1932 సెప్టెంబరులో సాంప్రదాయిక నిర్ణయములకు విరుద్ధముగా యరవాడజైలులో నున్నపుడు ఆమరణ నిరశనవ్రతమును ఆరంభించిరి. కాని సెప్టెంబరు 25 వ తేదిన సర్కారువారు స్థిరమైన వాగ్దానము నిచ్చుటచే దానిని విరమించిరి.

8. 1932 డిశంబరు నెలలో యరవాడజైలులో నున్నపుడు అప్పాసాహేబ్ పట్టువర్ధనుగారియెడల చూపించిన అగౌరవమును ప్రతిఘటించుటకు నిరశనవ్రతమును పూనిరి. రెండురోజులలోనే విరమించిరి.

9. 1933 మేనెలలో తనఆత్మశుద్ధికొరకు యరవాడజైలులో నున్నపుడు మూడువారముల నిరసన వ్రతమును అవలంబించిరి. ఆస్థితిలో జైలునుండి బయటికి వచ్చి పూనాపర్ణకుటీరములో మే 29 వ తేదిన సమాప్తిచేసిరి.

10. 1933 ఆగస్టునెలలో హరిజన ఆందోళన సందర్భమున జరిగిన అన్యాయమును ప్రతిఘటించి యరవాడ జైలులో కొన్నిరోజులు నిరశనవ్రతము అవలంబించిరి.

11. 1934 ఆగస్టు నెలలో హరిజన ఆందోళనములోని విరోధులు కొట్టుటచే ఒక వారమురోజులు ఉపవాస ముండిరి.

12. 1937 అక్టోబరుమాసమున ఖైదీల విడుదలకు కలకత్తా యందు నిరశనవ్రతదారులై యుండిరి.

13. 1939 మార్చి నెలయందు రాజకోటరాజుగారు శాసన సంస్కరణముల విషయమై చేసిన వాగ్దానమును భంగముచేయుటచే దానికి విరుద్ధముగా 5 దినములు ఉపవాసముండిరి.

14. 1943 ఫిబ్రవరి నెలలో ఆగస్టు విప్లవముయొక్క బాధ్యత నంతను భారతగవర్నమెంటు కాంగ్రెసుపై నేరముగా వేయుటచేతను, దీనిని ప్రతిఘటించు అవకాశమును మహాత్మునకు యియ్యకపోవుటచేతను ఆయన బొంబాయిలో ఆగాఖాన్ ప్రసాదములో 22 రోజులు ప్రాయోపవేశనము చేసిరి.

15. 1947 సెప్టెంబరు నెలలో కలకత్తాలో దారుణమైన భ్రాతృహత్యలనివారణకై 73 గంటల ఉపవాసముండిరి.

16. 1948 జనవరిమాసమున ఢిల్లీవంటిమహానగరమందును, అఖండభారత దేశమం దంతటను జరుగుచున్న మతకలహములు, నారీహరణములు, సర్వవిధ్వంసకారియగు హింసాకాండములను నిర్మూలించు సంకల్పముతో 123 గంటలు నిరాహారులై యుండిరి.

17. 1948 పాకిస్తాన్ గవర్నమెంటువారికి 55 కోట్లు యిచ్చువరకు నిరాహారదీక్ష నవలంబించిరి.

# మహాత్ముని మాహాత్మ్యము

[గురుదేవులు శ్రీ రవీంద్రనాథఠాకూరు]

౧

♦ అస్పృశ్యతానివారణసందర్భమున పూనాలో గాంధీజీ అవలంబించిన ఆమరణ నిరాహారదీక్షా సమయమున నొసగిన ఉపన్యాసము.

♦యుగయుగములలో దైవానుగ్రహామువలన నీప్రపంచమునకు మహాపురుషు లేతెంచుచుందురు. వారిదర్శనము తరుచుగా మనకు లభించదు. నేడు మనదుఃఖమున కంతము లేదు. ఎన్నియో ఉత్పీడనములు, ఎంతయో దైన్యము, ఎన్నియో రోగశోకతాపములను మనము నిత్యము అనుభవించుచున్నాము. దుఃఖములు పర్వతరూపము దాల్చినవి. అయినను నేడొక ఆనందము సమస్తదుఃఖములను అతిక్రమింప గలిగినది. ఏభూమిపై మనము జీవించుచున్నారమో, సంచరించుచున్నారమో, ఆభూమిపై యీభారతదేశములో అసమానప్రతిభావంతుడగు మహాపురుషుడు జన్మించినాడు.

మహాపురుషులు ఈప్రపంచమున కేతెంచినప్పుడు వారిని మనము సరిగా గ్రహింపజాలము. ఏలననగా, మన

మనస్సులు భీరువులు, అపవిత్రములు. స్వభావము శిథిలమైనది. అభ్యాసములు, దుర్బలములైనవి. మహత్తరమైన విషయములను సంపూర్ణముగా గ్రహించునట్టి, స్వీకరించినట్టి శక్తి మనస్సునకు లేదు. అందరికంటె మహానుభావులైనవారిని మనము దూరముగా త్రోసిపుచ్చితిమి.

జ్ఞానులు, గుణశీలురు, కఠోరతాపసోత్తములు, వీరిని గ్రహించుట సహజమైన విషయము కాదు. ఎందువల్లననగా మనజ్ఞానము, బుద్ధి, సంస్కారములు వారితో ఏకీభవింపజాలవు. కాని ఒక్క విషయమును గ్రహించుట అంతకఠినముగా నుండదు. అది ప్రేమ. ఏమహాపురుషుడు ప్రేమచేత తనపరిచయమును తెలియచేయునో ఆయనను మనప్రేమచేతనే ఒకవిధముగా గ్రహింపగలము. అందువలన భారతదేశములో ఒకఆశ్చర్యకరమైన సంఘటన జరిగినటులమనముయీసారి గ్రహించితిమి. ఇట్టిసంఘటన సామాన్యముగా సంఘటింపదు. మనమధ్యకు ఏతెంచినవారు మహోన్నతమైనవారు, మహత్తరమైనవారు. అయినను ఆయనను స్వీకరించితిమి. ఆయనను తెలుసుకొంటిమి. ఆయన నావాడు అని అందరును గ్రహించినారు. ఆయన ప్రేమకు ఉచ్చనీచభేదములు లేవు. మూర్ఖులు పండితులు అనుభేదము లేదు. ధనికులు దరిద్రులు అనుభేదము లేదు. ఆయనప్రేమను అందరికిని సమానముగా పంచి పెట్టి యున్నారు.

అందరికిని శుభములు కలుగుగాక ! అందరికినీ మంగళము చేకూరు గాక యని ఆయన నుడివినారు. నుడివిన విషయము వాక్యములతోగాక మహోద్వేగముతో నుడివినారు. ఎన్నియో ఉత్పీడనములను, ఎన్నియో అవమానములను ఆయన సహింపగలిగినారు. ఆయన జీవనేతిహాసము దుఃఖపూర్ణేతిహాసము. దుఃఖములు, అవమానములు కేవలము భారతదేశమునందే అనుభవించుట కాదు. దక్షిణాఫ్రికాలో ఎన్నియో దెబ్బలు ఆయనను మరణతీరమునకు చేరవేసెను. ఆయన దుఃఖము ననుభవించుట తనవిషయసుఖములకొరకు కాదు. స్వార్థముల కొరకు కాదు. ప్రజల శ్రేయస్సుకొరకు. ఎన్ని దెబ్బలు అనుభవించినను తిరిగి ఒక్కమాటయైనను అనలేదు. కోప దృష్టియైనను చూపలేదు. సకలాఘాతములను శిరసావహించి స్వీకరించెను. ఆయన ధైర్యమును, మహత్వమునుచూచి శత్రువులుసహా ఆశ్చర్యాన్వితులైరి. ఆయన సంకల్పములు సిద్ధి పొందినవి. జబరదస్తీవలన కాదు. త్యాగమువలన, దుఃఖము వలన తపస్సువలన ఆయన జయింపగలిగినారు. ఆయన నేడు భారతదేశదుఃఖభారమును తనదుఃఖముద్వారా తొలగింప ఆవిర్భవించినారు.

కొందరికి ఆయనను ప్రత్యక్షముగా దర్శించు సౌభాగ్యము లభించినది. సమస్త భారతదేశము ఆయనను తెలుసుకొనుటేగాక ఆయనయెడల అపారభక్తికి నిదర్శనముగా ఆయ

నకు మహాత్ముయని నామము నొసంగినది. భారతదేశము ఆయనను మహాత్ముడని యెట్లు గ్రహింపగలిగినదో ఆశ్చర్యకరమైన విషయము. మహాత్ముడని అనేకులను పిలుచుచుందురు, కాని దానికి అర్థము లేదు. కాని యీమహాపురుషుని మహాత్ముడనుటలో అర్థముగలదు. ఎవరిఆత్మ మహత్తరమైనదో ఆయనయే మహాత్ముడు. ఎవరిఆత్మ క్షుద్రమైనదో విషయసుఖములలో ఆబద్ధమైనదో, ధనధాన్యములలో, సాంసారికసుఖలాలసలలో నిమగ్నమైయున్నదో అట్టివారు దీనాత్ములు. అందరి సుఖదుఃఖములను తనవిగా భావించినవారే, అందరిశుభమును తనదిగా గ్రహించినవారే మహాత్ములు.

ఏలననగా అందరిహృదయములలో ఆయన వసించుచుందురు. ఆయన హృదయములో అందరును వసించుచుందురు. ఈశ్వరుని మహాత్ముడని మన శాస్త్రములలో చెప్పబడియున్నది. మర్త్యలోకములోఆదివ్యప్రేమ, ఆప్రేమైశ్వర్యము దైవానుగ్రహమువలన లభించుచుండును. ఆప్రేమ యెవరియందు ప్రకాశించినదో ఆయన హృదయపూర్వకముగా అందరిని ప్రేమించినారని మనము గ్రహింపగలిగితిమి. కాని సంపూర్ణముగా గ్రహింపలేకున్నారము. చక్కగా గ్రహించుటకు ఆటంకము ఏర్పడియున్నది. మన మనస్సు వంకరపోయి యున్నది. సత్యమును స్వీకరించుటకు మనకు భయవ్యథాసంకోచములు ఆటంకములు కలిగించుచుండును ? కష్ట

ము లేక లభించుదానిని స్వీకరింతుము. కఠినమైనదానిని ఒక ప్రక్కకు త్రోసివేయుచుందుము. ఆయనలోగల మహాత్తర సత్యమును స్వీకరింపజాలక పోయితిమి. ఇచ్చటనే ఆయనను ఆఘాతపరిచితిమి. ఆయన వచ్చినారు. తిరిగి పోయినారు, ఆయనను స్వీకరింపజాలక పోయితిమి.

ఆచారనిష్ఠులగు యూదులు ఏసుక్రీస్తును శత్రువుగా భావించి హత్యగావించినటుల క్రైస్తవశాస్త్రములలో చదివి యుంటిమి. కాని దెబ్బలు దేహమునకు చెందినవా? ఎవరు తనప్రాణమునుసహా సమర్పించి కల్యాణమార్గమును తెరుచుటకు ఏతెంచెనో ఆమార్గమును బాధాగ్రస్థము చేయుట కూడ దెబ్బవేయుట కాదా? అన్నిటికంటె గొప్పదెబ్బ అదియే. ఎంత అసహనీయ ఆవేదనముతో ఆయన నేడు మరణవ్రతమును అవలంబించినారు. ఆవ్రతమును మనము స్వీకరింపకున్నయెడల ఆయనపై మనము దెబ్బలు వేయుట కాదా? మన క్షుద్రమానసిక భయసంకోచములు సిగ్గు పడవా? ఆయన ఆవేదనమును మనము హృదయములో అనుభవింపజాలమా? ఆయన దానమును స్వీకరింపజాలమా? మన కింత సంకోచమా? ఇంత భయమా? ఆయనలో భయ కారణ మెచ్చటనులేదు. ఆయన సాహసమున కంతులేదు. మరణమునుసహా ఆయన తుచ్ఛమైనదిగా తలంచినారు. కఠిన కారాగారము, దాని సమస్తలోహశృంఖలములు ఆయన

యిచ్చుటకు ఆటంకములు కలుగజేయలేకపోయెను. అట్టిఆయన మనమధ్యకు ఏతెంచినారు. మనము భయముచే వెనుకబడిన యెడల మనము సిగ్గుచే తలదాచుకొనుటకైనను స్థానముండదు. చిన్నవారిని పెద్దవారిని అందరిని యేకము చేయుటకై ఆయన నేడు మరణవ్రతమును అవలంబించినారు. ఆయనలో గల ఆ సాహసము, ఆ శక్తి మనబుద్ధిలో, కార్యములలో ప్రవేశించునుగాక! నీవు పోవలదు. నేడు మేము నీవ్రతమును స్వీకరించితిమని యెలుగెత్తి నుడువుదుముగాక! అట్లు చేయక ఇంత మహత్తరమైన జీవితమును వ్యర్థముచేయబూనుదుమేని అంతకంటె భయంకరమైన సర్వనాశనము మరియొకటి లేదు.

విదేశీయులు మనతో శత్రుత్వము చేయుచున్నారని నుడువుచుందుము. కాని అంతకంటె మహత్తర శత్రువు మనలోపలనే ఉన్నాడు. అది మనపిరికితనము. ఆపిరికితనమును జయించుటకు విధాత మన లోకమహత్తరశక్తిని ప్రసాదించియున్నాడు. అయనజీవితముద్వారా, ఆయన అభయముద్వారా మనభయమును హరింప ఏతెంచినాడు. ఆయనను, ఆయన దానముతోసహా మనము త్రిప్పి పంపివైచెదమా? ఆకాషాయినధారి మనద్వారములపై దెబ్బలువేయుచు తిరుగుచున్నారు. మనకు ఆపద లెచ్చటెచ్చట గలవో చూపించి జాగ్రత్తపరచుచున్నారు. మానవు డెచ్చట మానవుని అవ

మానపరచునో మానవునికి భగవాను డచ్చోటనే విముఖు డగుచున్నాడు. శతసహస్రవత్సరములనుండి మానవుల యెడల అవమానవిషమును భారతదేశ రక్తనాళములలోనికి సహా మనము ప్రవేశపెట్టితిమి. హీనత్వముయొక్క అసహనీయ భారమును సతసహాస్రనీతమస్తకములపై పడవేసితిమి. దాని భారమువల్లనే నేడు దేశము క్లాంతిచే దౌర్బల్యముచే పీడిత మగుచున్నది. ఆ పాపమువలన నిలువున నిలువబడి యుండ జాలకున్నారము. మనము నడుచుమార్గములలో అడుగడుగు నకు పంకిల గుండములను తయారుచేసి యుంచితిమి. మన సౌభాగ్యమంతయు దానిఅడుగున పడిపోవుచున్నది. ఒకసోద రుడు మరియొక సోదరునినొసట స్వహస్తముతో కళంకమును లేపనము చేసియున్నాడు. మహాత్ముడు ఆపాపమును భరించ లేకపోయెను.

సమస్తహృదయము నొగ్గి ఆయనసందేశమును ఆక ర్ణింపుడి. ఆయనసంకల్పబల మెంతమహత్తరమైనదో అనుభ వింపుడి. నేడు తాపసోత్తముడు నిరాహారదీక్ష నారంభించి నాడు. ఆయన అన్నమునుముట్టరు. మీరు ఆయనకుఅన్నము పెట్టరా? ఆయన సందేశమును స్వీకరించుటయే ఆయనకు అన్నము. తద్వారా ఆయనను బ్రతికింపవలయును. అపరాధ ముల ననేకము గావించితిమి. పాపములు పుంజీభూతము లైనవి. సోదరులతో బానిసలవలె, పశువులవలె వ్యవహరించి

తిమి. ఆ యవమానమువలన మనము ప్రపంచదృష్టిలో క్షుద్రు లమైపోతిమి. వారికి తగిన గౌరవమును మన మొసగియుండిన యెడల మనకు నే డిట్టిదుర్గతి పట్టియుండెడిదికాదు. ప్రపంచ ములో యితరసంఘములవారి నందరిని ప్రజలు గౌరవింతురు. వారికి భయపడుదురు. ఏలననగా వారు పరస్పరము ఐక్యతా పత్రముచేత బంధింపబడియున్నారు. మన హిందూసంఘమును ఆఘాతపరచుటకును, అవమానపరచుటకును, ఎవరికినిభయము లేదు. ఏబలముచేత వారి కింతటి అహంకారము కలిగినదో దాని నొక్కనిమిషమైనను మరువకుందుముగాక.

ఏగౌరవమును మహాత్ముడు అందరికిని ప్రసాదింప గోరుచున్నాడో, ఆగౌరవమును మనమందరికిని ఒసగెదము. ఈయ లేనివారికి ధిక్కారము. సోదరుని సోదరునిగా స్వీకరించు టకు ఆటంకము కలుగజేయు సంఘమునకు ధిక్కారము. ఆ సంఘము జీర్ణవిశీర్ణమైనది. పతనమును గ్రహించియు స్వీక రింప జాలనప్పుడే అన్నిటికంటె మహత్తర భీరుత్వము ప్రక టిత మగును. ఆభీరుత్వమునకు క్షమాపణ లేదు.

దేశముపై అభిశాపము బహుదినములనుండియున్నది. దానికొరకు ఒక్కరు ప్రాయశ్చిత్తము చేసుకొన నమకట్టి నారు. ఆప్రాయశ్చిత్తములో మనమందరమును మిళితము కావలయును. అసమ్మేళనమునందే మన శాశ్వతసమ్మేళనము

ఆరంభమగును. ఆయన ప్రాయశ్చిత్తమును మరణపాత్రిలో నుంచి మనసమక్షమున పట్టుకొని యున్నారు. మన హస్తములకు అందించినారు. అందరును స్వీకరింపుడి. పాపనాశనము గావింపుడి, మంగళము చేకూరును. ఆయన అంత్య విషయమును మీకు తెలియజేయ వచ్చితిని. ఆయన దూరమునం దున్నారు, కాని ఆయన దూరమునందు లేరు. ఆయన మన అంతరములలోనే యున్నారు. మనకొరకు ఆయన జీవితమునే పోగొట్టుకోవలసి వచ్చినచో మన పరితాపమున కంత ముండదు.

మనతల సిగ్గుచే బ్రిద్దలై పోవును. ఆయన మనవద్ద కోరినవ్రితము దురవగాహ్యమైనది, దుస్తరమైనది. కాని అంతకంటె దుస్సాధ్యకార్యము ఆయన గావించినారు. 'అంత కంటె కఠినవ్రిత మాయనది. ఆయన ప్రిసాదించిన వ్రితమును సాహసముతో స్వీకరింతుముగాక. మనము దేనికిభయ పడుచున్నారమో అదేమియు కాదు. అది మాయ, అది మిథ్య. అది సత్యము కాదు. దానిని మనము స్వీకరింపము. ఆమిథ్యను స్వీకరింపమని అందరును ఏకకంఠముతో నుడువుడు. భయ మేల యని నుడువుడు. సకల భయములను హరించి ఆయన కూరుచుని యున్నాడు. మృత్యుభయమును జయించినారు. మనకు ఏభయము లేకుండునుగాక. లోక భయము, రాజభయము, సంఘభయము, దేనికిని మనము

వెరచియుండకుందుముగాక. ఆయన మార్గములో ఆయననే అనుసరించి నడచెదము. ఆయనకు పరాభవమును కలుగనీయము. సమస్తప్రపంచము మనవైపునకు తేరి చూచుచున్నది. మనవలన ఎట్టిఫలితము ఫలింపకుండిన యెడల యింతమహత్తరమైన విషయము హాస్యాస్పదవిషయ మగును. ఆయనశక్తియొక్క అగ్ని మన అందరి మనస్సులలో జ్వలించినయెడల, తాపసోత్తమా నీకు జయమగుగాక, నీతపస్సు సార్థక మగుగాకయని అందరమును ఏకకంఠముతో నుడువగలిగినయెడల ప్రపంచమంతయు విస్మయ మొందును. ఈ జయధ్వని సముద్రమున కివ్వలిపారమునుండి ఆవలిపారమునకు చేరినయెడల సత్యవాణి అమోఘమైనదని అందరును నుడువుదురు. భారతదేశము ధన్యమగును. నేటిదినమున యింతమహత్తరమైన సార్థకతకు ఆటంకము కలుగజేయువాడు అత్యంత హేయుమైనవాడు. దానిని మీరు భయముచే శిరసా వహింతురేని అంతకంటె హేయు లగుదురు.

ఈ ముహూర్తమున మృత్యువును సమక్షమునందిడుకొని ఆసీనుడైయున్న తాపసోత్తమునకు, భగవానుని హృదయమునం దిడుకొని, సమస్తహృదయ ప్రేమను మహోజ్వలముగా జ్వలింప జేసికొనిన ఆతపోధనునకు జయము చేకూరుగాక! మీరు ఆయనను గురించి జయజయధ్వానములు గావింపుడి, మీకంఠస్వరములు ఆయన ఆసనసన్నిధా

షమునకు చేరునుగాక, నిన్ను స్వీకరించితిమనియు, నీసత్యము స్వీకరించితిమనియు నుడువుడు.

నేను ఏమి చెప్పగలను. నాభాషకు బలమేది? ఆయన ఏభాషలో నుడివినారో అది కర్ణేంద్రియములతో వినదగినది కాదు. హృదయముతో వినదగినది. మానవుని చరమభాష మీహృదయములలో తప్పక ప్రవేశించియే యుండును.

ఇతరులు ఆత్మీయులై నప్పుడే మనకు పరమసౌభాగ్యము. ఆత్మీయులు పరులైనప్పుడే ఆపదలు సంభవించును. అపరాధములు అవసాన మొందుగాక. అమంగళము తొలగిపోవుగాక! మానవునకు గౌరవము నొసగి మనుష్యత్వగౌరవమును పొందుదురుగాక.

౨

# పూనా యాత్ర

అత్యంత విచారముతో, ఆశా హృదయముతో
పూనాకు బయలుదేరితిమి. దీర్ఘమార్గము, ముందుకుపోయిన
కొలది ఏమగునో యని మనస్సునందు ఆదుర్దా అధిక మగు
చుండెను. పెద్దస్టేషనులోకి వచ్చినవెంటనే నా సహకారులు
వార్తాపత్రికలను కొని నాకిచ్చుచుండిరి. ఆదుర్దాతో చదువు
చుంటిని. మహాత్ముని శారీరపరిస్థితులు Danger Toore కి
ఎక్కినవని డాక్టర్లు చెప్పుచుండిరి. దేహములో అధికదిన
ములు సహింపగల మేదస్సుగాని, మాంసముగాని లేదు.
మాంసపునరములుకూడా కృశించుచుండెను. Apoplexy
వలన ఏక్షణమందైనను ప్రాణహాని జరుగవచ్చును. బహు
దినములనుండి స్వపక్ష ప్రతిపక్షులతో వివిధసమస్యలను
గురించి ఆలోచనములను జరుపవలసివచ్చెను. తుదకు అను
న్నతసంఘమును హిందూసంఘమునకు అంతర్గగమైనదిగా
భావించి దానికి రాష్ట్రనైతిక విశేషాధికారము నొసంగు
విషయమై ఉభయపక్షములవారిని అంగీకరింపజేసిరి. దైహి
కబాధలను, దౌరబల్యమును జయించి ఆయన అసాధ్యసాధన
మును గావించిరి. ఈయేర్పాటును ఇంగ్లీషువారి అంగీకార
ముపై అంతయు ఆధారపడియుండును. అంగీకరింపబడకపోవు

టకు తగిన కారణ మేమియు నుండదు. ఏలననగా, అనున్నత సంఘముతో ఏకమై హిందువులు ఏవ్యవస్థలను అంగీక రింతురో వానిని ప్రధానమంత్రికూడ అంగీకరింపవలసియే యుండును.

ఆశానిరాశలతో ఆందోళితమై సెప్టెంబరు 26 వ తేదీ ఉదయమున మేము కల్యాణస్టేషనుకు చేరితిమి. అచ్చట శ్రీమతి వాసంతీదేవి, శ్రీమతి ఊర్మిళాదేవి కానుపించిరి. వారు మరియొకరైలులో కలకత్తానుండి యింతకుపూర్వమే అచ్చటికి వచ్చియుండిరి. కాలయాపన చేయక మాకు ఏర్పాటుచేయబడిన కారులో నెక్కి పూనావైపు ప్రయాణ మైతిమి.

పూనాలోని పర్వతమయమార్గ మత్యంత రమణీ యమై యుండెను. పురద్వారమునకు చేరునప్పటికి సామరిక అభ్యాసములు జరుగుచుండెను. Armoured cars machine guns అనేకములు అమర్చబడియుండెను. మార్గములో సైనికుల ప్రేల్పులు వినవచ్చుచుండెను. తుదకు విఠలభాయ్ థాకర్సేగారి ప్రాసాదమువద్ద కారు నిలువబడెను. ఆయన వితంతుభార్య మాకు ఆనందవదనముతో స్వాగతమిచ్చి తోడ్కొనిపోయిరి. సోపానముల కిరుప్రక్కల ఆమెవిద్యాల యములోని విద్యార్థినులు గానములను పాడుచు అభినందనము లను తెలియజేసిరి.

గృహములో ప్రవేశించిన వెంటనే వాతావరణమంతయు సందేహముతో భారాక్రాంతమైయున్నటుల గ్రహించితిమి. అందరివదనములలో విషాదచ్ఛాయలు అలముకొనియుండెను. మహాత్ముని శారీరక పరిస్థితులు అపత్కరముగానున్నవని గ్రహించితిని. ఇంగ్లాండునుండి అప్పటికింకను తంతి రాలేదు. ప్రధానమంత్రి పేరుతో నేనొక జరూరుతంతిని పంపియుంటిని.

పంపించవలసిన అవుసరము లేదు. ఇంగ్లాండునుండి అంగీకారము వచ్చినదని వార్తలవలన తెలియవచ్చెను. కాని వార్త సత్యమైనదో కాదో తెలియుటకు కొన్నిగంటలు పట్టెను.

నేడు మహాత్ముని మౌనావలంబనదినము. ఒంటిగంట తరువాత మాట్లాడుదురు. నేను ఆసమయములో వారివద్ద ఉండవలెనని వారికోరిక. మార్గములో పోవునప్పుడు యెరవాడ జైలుకు కొంచెము దూరములో నుండగా మాకారుకు ఆటంకము కలిగెను. ఏబండి పోనిచ్చుటకు అనుమతి లేదని ఆంగ్లసైనికుడు నుడివెను. ఈరోజున జైలులో ప్రవేశించు మార్గమునకు భారతదేశమునందే యాటంకము నుండదని తలంచితిని. కారుకు నలువైపుల మహాజనము మూగిరి.

మాలో ఒకడు జైలుఅధికారులవద్ద అనుమతికొరకు కొంచెముదూరము పోవునప్పటికే శ్రీమాన్ దేవదాస్ గాంధి

వచ్చి హాజరైరి. ఆయన చేతిలో అనుమతిపత్రి ముండెను. మహాత్మాజీ ఆయనను పంపెనని తరువాత తెలిసికొంటిమి. ఆయనకు ఏవార్త తేలియకపోయినప్పటికి మాకాపును ఎప్పటనైనా ఆపివేసి యుండవచ్చునని ఆయన ఊహించెను.

లోహద్వారములు ఒకటివెనుక ఒకటి తెరువబడెను. మరల బంధింపబడెను. సమక్షమున ఉన్నతప్రాకార అహంకారము కాన్పించుచుండెను. ఆకాశము బంధింపబడెను. ఖచ్చితముగా చెక్కబడిన మార్గమున కిరుప్రక్కల అచ్చటచ్చట వృక్షములు కాన్పించుచుండెను.

రెండువిషయములను గురించిన అనుభవము నాజీవితములో చాలాఆలస్యముగా సంఘటిల్లెను. ఇటీవల విశ్వవిద్యాలయద్వారమును దాటగలిగితిని. జైలులో ప్రవేశించుటకు ఆటంకము కలిగినను తుదకు ఎలానో వచ్చిచేరితిని.

ఉత్తరదిశలో సోపానములనెక్కి ద్వారము నతిక్రమించి ప్రాకారముచే ఆవరింపబడిన ప్రాంగణములో ప్రవేశించితిమి. దూరదూరముగా రెండుశ్రేణీల గృహములుండెను. ప్రాంగణమునందొకత్రుదప్ర ఆమ్రవృక్షచ్ఛాయక్రింద మహాత్మాజీ శయ్యాశాయియై యుండెను.

మహాత్మాజీ నన్ను రెండుచేతులతో కౌగిట చేర్చుకొని "నేడెంత ఆనందము" అని నుడివెను.

అప్పుడు మధ్యాహ్నము 1—30 లు ఇంగ్లాండు వార్త భారతదేశమంతటను వ్యాపించెను. రాజనైతికదళమువారు సిమ్లాలో కూరుచుని సమాలోచనములను సల్పుచుండిరి. వార్తాపత్రికలవారు తెలుసుకొనినారు. ఎవరిప్రాణధార ప్రతి ముహూర్తమునందును మరణసీమకు సంలగ్నమగుచుండెనో ఆయనకు ప్రాణసంకటవిమోచనకు ఆదుర్దా కానవచ్చుట లేదు. అతిదీర్ఘమగు రక్తవర్ణసూత్రముయొక్క కఠినకూరత్వమునకు విస్మయ మొందుచుంటిని. 4—15 నిమిషముల వరకు ప్రతినిమిషము ఆదుర్దా అధిక మగుచుండెను. 10 గంటలకు వార్త పూనాకు వచ్చెనని వింటిని.

నలువైపుల స్నేహితులు సమావేశమై యున్నారు. మహాదేవ్, వల్లభాయ్, రాజగోపాలాచారి, రాజేంద్రప్రసాద్, వీరిని అవలోకించితిని. శ్రీమతి కస్తూరిబాయిని, సరోజినిదేవిని చూచితిని. జవహర్‌లాల్ సతీమణి కూడ యుండెను.

మహాత్ముని శీర్ణశరీరము శీర్ణతమ మయ్యెను. కంఠస్వరము వినిపించుట లేదు. జఠరములో ఆమ్లము చేరినది. అందువలన అప్పుడప్పుడు సోడా కలిపిన నీరు త్రాగుచుండిరి. డాక్టరులబాధ్యత తీవ్రరూపమును దాల్చెను.

కాని చింతనశక్తి ఏమాత్రమును తగ్గలేదు. చింతనములధార ప్రవహించుచున్నది. చైతన్యమునకు క్లాంతిలేదు.

ప్రాయోపవేశమునకు ముందు నుండియు ఎన్నియో కఠిన ఆలోచనములలో, కఠినసమస్యలలో నిమగ్నము కావలసి వచ్చుచున్నది. సముద్రపారమునందున్న రాజనైతికులతో ఉత్తరప్రత్యుత్తరములు జరుపుటవలన మనస్సుపై కఠినమైన ఘాతప్రతిఘాతములు పడియుండెను. ఉపవాస సమయములో వివిధదళములవారి ప్రబలఅభిలాషలు ఆయన పరిస్థితులపై మమత చూపించలేదు. కాని మానసికజీర్ణత్వమునకెట్టి చిహ్నముకూడ కాన్పించుట లేదు. ఆయనచింతనముల సహజ స్వచ్ఛప్రకాశధారకు ఆటంకము కలుగలేదు. శరీరక కృచ్ఛ్రసాధనయందును ఆత్మయొక్క అపరాజిత ఉద్యమముల దివ్యవిగ్రహమును గాంచి ఆశ్చర్య మొందవలసి వచ్చెను. సమీపమునకు రాకున్న యెడల యీ క్షీణ దేహపురుషుని ప్రచండశక్తి ఎంతమహత్తరమైనదో గ్రహింపగలిగెడివాడనుకాను. మరణవేదీతలశాయియగు యీమహాప్రాణి సందేశము నేడు భారతదేశ కోటానుకోట్లప్రజల హృదయములలో ప్రవేశించినది. దూరత్వముయొక్క ఆటంకములుగాని, ఇటుకల, రాళ్ళ, కట్టెల ఆటంకములుగాని ప్రతికూల రాజకీయముల ఆటంకములుగాని ఆయనకు ఆటంకములు కలుగజేయజాలకపోయెను. బహుశతాబ్దముల జడత్వముయొక్క ఆటంకములు ఆయన సమత్వమున ధూళిసమానమయ్యెను.

నాకొరకు మహాత్ముడు ఏకాగ్రచిత్తముతో నిరీక్షించు చున్నారని మహాదేవుడు చెప్పెను. నాసామీప్యతవలన రాష్ట్రీయసమస్యల మీమాంస సాధనములో సహాయము చేయగల అనుభవము నాకు లేదు. ఆయనకు తృప్తి కలుగ జేయ గలిగితిని. ఇదియే నాఆనందము.

అందరును గుంపుగా నిలబడియున్నయెడల ఆయనకు కష్టముగా నుండునని మేము తొలగిపోయి కూరుచుంటిమి. వార్త ఎప్పుడు వచ్చునాయని చాలాసేపునుండి నిరీక్షించు చుంటిమి. అపరాహ్ణపు ఎండ గోడలపై తూలిపడిపోయినది. అచ్చటచ్చట శుభ్రఖద్దరుధారులగు స్త్రీపురుషులు ప్రశాంత ముగా నాలోచనములను గావించుచుండిరి.

చూడదగిన విషయములలో కారగారములోని యీ జనసమూహము. ఎవ్వరిప్రవర్తన యందును ప్రశ్రయజనిత మగు శైథిల్యము లేదు. చరిత్ర శక్తివిశ్వాసమును కలిగిం చును. అందువలన జైలుఅధికారులు గౌరవముతో వీరికి సంపూర్ణముగా కలిసిమెలిసి యుండు అవకాశము నొసగిరి. వీరు మహాత్ముని వాగ్దానమునకు ప్రతికూలముగా ఎట్టి అవ కాశమును స్వీకరింపలేదు. ఆత్మగౌరవదృఢత్వము, అచాం చల్యము వీరిలో ప్రత్యక్ష మగుచున్నది. చూచినవెంటనే వీరు భారతస్వరాజ్యసాధనలో యోగ్యసాధకులని తోచును.

తుదకు జైలుఅధికారులు సర్కారుముద్ర వేయబడిన కవరు చేతబట్టుకొని వచ్చిరి. ఆయన ఆనందవదనమును దర్శింపగలిగితిని. మహాత్మాజీ గంభీరముగా ప్రశాంతముగా చదువుచుండెను. ఇప్పుడు ఆయన నలువైపులనుండి అందరు తొలగిపోవుట అవసరమని సరోజినిదేవితో చెప్పితిని. మహాత్ముడు చదువుట పూర్తిచేసి అందరిని పిలిచెను. వారిని ఆలోచించి చూడమని చెప్పెను. ఆకాగితము డాక్టర్ అంబేద్కర్ గారికి చూపించు టవసరమని నుడివెను. ఆయన అంగీకారము లభించినయెడల నిశ్చింతగా నుండవచ్చు ననిరి.

స్నేహితులు ప్రక్కకు తొలగి ఉత్తరము చదివిరి. నాకుకూడా చూపించిరి. రాష్ట్రబుద్ధిచే రచింపబడినది. అతి జాగరూకతతో వ్రాయబడినది. జాగరూకతతోనే చదువవలయును. మహాత్ముని అభిప్రాయమునకు విరుద్ధముగా లేదని గ్రహించితిని. ఆఉత్తరములోని విషయములను విశదీకరించి మహాత్మునకు వినిపించుభారము పండిత హృదయనాథకుంజ్రు గారిపై వేయబడెను. ఆయన సరళవ్యాఖ్యానము వలన మహాత్ముని మనస్సులో ఎట్టిసంశయము లేకుండెను. ప్రాయోపవేశవ్రతమును ముగించిరి.

ప్రాకారమువద్ద నీడలోకి మహాత్మునిపడక జరుపబడెను. జైలుకంబళ్ళు పరచి నలువైపుల అందరును కూరుచుని యుండిరి. శ్రీమతి కమలానెహ్రూ నిమ్మరసమును

తయారుచేసెను. సర్కారువారి పత్రమును తెచ్చిన (Inspector General of Prisons) వారె శ్రీమతి కస్తూరి బాయి స్వహస్తముతో మహాత్మునకు రసమునీయవలెనని వేడుకొనిరి. "జీవితము శుష్కించిపోయినపుడు కరుణారస ధారలతో రమ్మ" అనుగానము మహాత్మునకు ప్రియమైనదని మహాదేవ్ నుడివెను. స్వరము మరచిపోయితిని. అప్పటికి ఏదోవిధముగా స్వరము తయారుచేసి పాడవలసివచ్చెను. పండిత శ్యామశాస్త్రి వేదగానము చేసిరి. పిమ్మట మహాత్మాజీ శ్రీమతి కస్తూరిబాయ్ హస్తములనుండి రసము నెమ్మదిగా త్రాగెను. తరువాత సబర్మతీఆశ్రమవాసులు, సమావేశమైనవారును "వైష్ణవజనతో" అనుగానమును పాడిరి. ఫలములు, మృష్టాన్నము పంచిపెట్టబడెను. అందరును స్వీకరించిరి.

జైలుప్రాకారములో మహోత్సవము జరిగెను. ఇట్టి విషయము మరెన్నడును జరిగియుండలేదు.

జైలులో ప్రాణసమర్పణయజ్ఞము జరిగెను. దాని సాఫల్యత యిచ్చుటనే రూపము పరిగ్రహించెను. సమ్మేళనమువలన హుతాత్ముగా ఆవిర్భవించిన అపరూపమూర్తిని యజ్ఞఫలమని నుడువవచ్చును.

రాత్రి పండిత హృదయనాథకుంజ్రు మొదలగుప్రానా ప్రముఖనాయకులు వచ్చినన్ను మహాత్మాజీ వార్షికోత్సవ సభకు అధ్యక్షులుగా నుండమని కోరిరి. బొంబాయినుండి మాలవ్యాజీకూడ వచ్చెదరని నుడివిరి. మాలవ్యాజీ సభాపతిగా యుండినయెడల నేను కొన్నివిషయములు చెప్పెదనంటిని. శారీరకదౌర్బల్యమును తృణీకరించియు శుభదినమున జరుగు యీమహత్తరసభలో పాల్గొనుటకు అంగీకరించితిని.

మధ్యాహ్నము శివాజీమందిరమను మహత్తరమైన విశాలమైన ప్రాంగణమున మహాసభ సమావేశమయ్యెను. అతికష్టముతో లోపల ప్రవేశించితిని. అభిమన్యునివలె ప్రవేశించితిని. కాని బయటికి వచ్చుటెట్లు అని తలంచితిని. మాలవ్యాజీ ప్రథమమున సుందరమైన విశుద్ధమైన హిందీ భాషలో అస్పృశ్యత హిందూశాస్త్రసమ్మతమైనది కాదని తెలియజేసిరి. అనేక సంస్కృతశ్లోకములను ఉదహరించి ఆయన వాదమును నిరూపించిరి. నాకంఠము క్షీణమైనది. ఇంతమహత్తరమైన సభలో నాఉపన్యాసమును అందరికిని వినిపించునంతటిశక్తి నాకు లేదు. నోటితో రెండుమూడు మాటలు చెప్పితిని. తరువాత నావ్యాసమును చదువుభారము పండితజీగారిపుత్రుడు గోవిందమాలవ్యా వహించెను. సాయంకాల అస్పృష్ట ఆలోకనములో యిందుకు ముందుచూడని

నా వ్యాసమును అనర్గళముగా సుస్పష్టముగా చదువుట చూచి విస్మయ మొందితిని.

సాంఘిక సామ్యవిధాన పరిరక్షణ విషయము ఏమాత్రము లోపము కలుగకుండునట్లు చూడవలెనని మణిలాల్ నెహ్రూగారి ధర్మపత్ని కొంతసేపు ముచ్చటించెను. శ్రీయుత రాజగోపాలాచారి, రాజేంద్రప్రసాద్ మొదలగు ప్రముఖులుకూడ అశుచి తొలగించమని దేశవాసులకు హృదయావేదనతో నివేదించుకొనిరి. అచ్చట సమావేశమైన మహాసభవారందరును చేతులెత్తి అస్పృశ్యతను తొలగించు ప్రతిజ్ఞను గైకొనిరి. నేటిసందేశము అందరి హృదయములలో ప్రవేశించినట్లు తోచెను.

నావంతుకర్తవ్యము పూర్తియైనది మరునాడు ఉదయమున మహాత్మునివద్ద చాలాసేపు ఉంటిని. ఆయనతోను మాలవ్యాతోను చాలాసేపు వివిధవిషయములను గురించి ఆలోచనములు జరిగెను. మహాత్మాజీ ఒక్కరోజులోనే అప్రత్యాశితబలమును పొందెను. కంఠస్వరము దృఢతరమాయెను. Blood Pressure సహజా అవస్థకు వచ్చెను. ప్రణామము లర్పించి, ఆనందమును తెలియజేయుటకై అతిథ్యభ్యాగతులు అనేకులు వచ్చుచుండిరి. అందరితోను నవ్వుచు మాట్లాడుచుండిరి. శిశువులు పుష్పగుచ్ఛముల నర్పించుచుండిరి. వారిని చూచి మహదానందము ననుభవించు

చుండిరి. స్నేహితులతో సాంఘికసామ్యవిధానములనుగురించి అనేకవిధములైన ఆలోచనములను గావించుచుండిరి. ఇప్పటి డాయన ప్రధానసమస్య హిందూమహమ్మదీయుల విరోధమును తొలగించుట.

నేడు మహాత్మునిజీవితము మహత్తరభూమికతో ఉజ్జ్వలరూపము ధరించి మనకు కాన్పించినది. దానిలో సర్వ మానవులలో మహామానవుని ప్రత్యక్షముగా దర్శించు ప్రేరణ యున్నది. ఆప్రేరణము భారతదేశములో సర్వత్ర సార్థక మగుగాక.

ముక్తిసాధనకు సత్యమార్గము మానవుని ఐక్యతా సాధనయం దిమిడి యున్నది. రాష్ట్రీయపరాధీనత మన సాంఘికసహస్రభేదవిభేదముల నవలంబించియే పుష్టివంత మగుచున్నది.

చైతన్యవిహీనమైన సకలబంధనములను భిన్నముజేసి ఉదార ఐక్యతామార్గమున మానవసభ్యత అగ్రసర మగు దినము సమాగతమైనది.

—:0:—

# పిడుగువంటివార్త

పందొమ్మిదివందల నలభైఎనిమిదవసంవత్సరము జనవరి ముప్పైయవ తేది శుక్రవారమునాడు—

స్వతంత్రభారత దేశమునకు కృష్ణపక్షమువంటి గాఢాంధకారదినము.

ఆనాడు సాయంకాలము అయిదుగంటల ముప్పదిఒక్క నిమిషమువరకు పగలంతయు హాయిగా గడచుచుండెను.

1947 వ సంవత్సరము సెప్టెంబరు నెలనుండి మహాత్మా గాంధీజీ ఢిల్లీలో బిర్లాభవనములో వసించుచుండెను. భారత దేశము సాంప్రదాయిక శాంతిని ప్రతిష్ఠించుటకును, హిందు మహమ్మదీయుల ఐకమత్యముకొరకును యావచ్ఛక్తితో ప్రయత్నములు గావించుచుండెను.

ఢిల్లీలోను, భారత దేశములోను మతకల్లోలముల అగ్నిని ఆర్పివేయుటకు కొన్నిరోజులక్రితమే నిరశనవ్రతమును అవలంబించియుండిరి. తత్ఫలితముగా ఆయన దేహామింకను దుర్బలముగా నుండెను.

తరువాత కొలదిరోజులక్రితమే జనవరి 20 వ తేదిన ప్రార్థనసభలో యుండగా ఒక దుర్మార్గుడు ఆయనపై బాం

టను విసర్జించుచుండెను. కాని దైవానుగ్రహముచే అది ఆయనకు తగలలేదు. ఆసంఘటన జరిగిన తరువాతకూడ హింసాలోలురైన పరిజనులపై ఆయనకు ప్రగాఢవిశ్వాసముండుట ఆశ్చర్యకరమైన విషయము. అయినను ఆయన నిర్భయము గానే సంచరించుచుండిరి.

గడియారములో సాయంకాలము అయిదుగంటల ముప్పదియొక్క నిమిషమైనది—

న్యూఢిల్లీ అసోసియేటెడ్ ప్రెస్‌యొక్క వార్త వార్తా యంత్రములో యిట్లు మ్రోగెను— "నేటిసాయంకాలము గాంధీమహాత్మునిపై మూడుసార్లు తుపాకిగుండ్లు పేల్చబడినవి!"

కలకత్తావార్తాపత్రికల ఆఫీసులో పనిచేయుచుంటిని. విచారకరవార్త వచ్చినప్పుడు ఆఫీసులోనే యుంటిని.

వార్తలు వచ్చుగదిలో "టెలిప్రింటర్" ఎడతెరిపి లేకుండ 'టక్ టక్' మని మ్రోగుచునే యుండెను. వార్తా పత్రికల ప్రతిఆఫీసులోను యీయంత్రము వుండును. వార్తలనుపంపు సంఘమువారు "టైపు" చేసి ఏయేవార్తలను పంపుచుందురో ఆవార్తలన్నియు ఎలక్ట్రిసిటీశక్తివలన యీ యంత్రములో ముద్రితమగుచుండును. ఆవార్తలను తర్జుమా చేసి వార్తాపత్రికలలో ముద్రించుచుందురు. అవిరామముగా టెలిప్రింటరు టైపుచేయుచున్న శబ్దము వినబడుచుండును.

హఠాత్తుగా ఆసాయంకాలము 5—31 నిమిషములకు టెలిప్రింటరులో యీవిధముగా ముద్రింపబడియుండెను.

న్యూఢిల్లీ జనవరి 30 వ తేది.

నేటిసాయంకాలము గాంధిమహాత్మునిపై మూడు సార్లు తుపాకిగుళ్ళు పేల్చబడినవి. (ఎ. పి. ఐ.) 30/1 సాయం కాలము 5—31 నిమిషములు.

గాంధీజీపై తుపాకి పేల్చినారని యంత్రమువద్ద కూరు చునివున్న సహాసంపాదకుడు పెద్దకేక వేసెను. ఆఫీసువారంద రును పనిపాటలు విరమించి, కలములు పారవేసి విచారమన స్కులై నిశ్శబ్దముగా నాలోచించుచుండిరి. మరల తుపాకితో కాల్చుటయా ? మొన్న నేగదా బాంబువిసరి హత్యచేయు టకు ప్రయత్నించినారు — మరల తుపాకి పేల్చుటయా ? భగవదనుగ్రహముచే గుళ్లు ఆయనకు తగిలియుండ వను కుంటాను.

ఒక్కనిమిషమునకే మరల ఆవార్తయే వచ్చెను—

**New Delhi JAN. 30**

**Mahatma Gandhi was shot at three times this evening (A P I) NNG/HNC 30/1 5-32 P. M.**

'ఎ. పి. ఐ.' అనగా అసోసియేటెడ్ ప్రెస్ ఆఫ్ ఇం డియా' పేరుగల వార్తాసంఘమువారు న్యూఢిల్లీనుండి వార్త

లను పంపుచుందురు – చివరి తేది, కాలము వేయుచుందురు–టెలిప్రింటర్‌లో యింగ్లీషులో ముద్రితము లగుచుండును.

మరల ఆవార్తయే ముద్రింపబడెను. ఏమురాక్షసుడో గదా మూడునాళులు తుపాకి పేల్చినాడు ! ఆమహాపురుషునికి, ఆపుణ్యపురుషునికి ఒకటైనా తగిలిన దేమోగదా ! అయ్యో ! ఆయన దేహమునకు ఒక్కటి తగిలినను బ్రతుకగలరా ?

వార్తాయంత్రములో—

"చాలా ఆపత్కరము"—5–33 నిమిషములు.

కొంపకూలినది ! అందరము పనిపాటలు పారవైచి పరుగెత్తి ఆయంత్రముచుట్టూ మూగితిమి.

మరల ఆవార్తయే వచ్చెను—

**Worst is feared (A P I) NNN/HNC 30/1 5-34 P. M.**

అందరును నిశ్వాసబద్ధులై నిశ్శబ్దముగా నిలువబడియుండిరి.

తరువాత ?

ఆపత్కరము కాదని వార్త ఏలవచ్చుటలేదు ? ఆవార్త వచ్చుటకు యింత ఆలస్యమెందుకు ?

వచ్చినవార్త—

"గాంధీమహాత్ముడు ప్రార్థనసభకు పోవుచున్నసమయములో ఆయనపై నాలుగుసారులు తుపాకిగుళ్ళు ప్రేల్చబడినవి. ఆయన ప్రమాదస్థితిలో నున్నాడు. 5—40.

మూడుసారులుకాదు — నాలుగుసారులు! అహింసామూర్తినిరస్త్రధారి రక్షకహీనుడగు వృద్ధసన్యాసి దేహముపై నాలుగుసారులు గుళ్ళు ప్రేల్చబడినవి! ఈవృద్ధుని ప్రాణనాశనమునకు పూనుకున్నవారు వీరులేనా? ఏమిలాభము సంపాదింప సమకట్టిరి?

'భగవాన్!

నేటిప్రపంచపు యీహత్యల నరకమునుండి దేవుడు పారిపోయినట్లున్నాడు — అందుకనియే యీ యుగశాంతిదూతను ఆయనవద్దకు ఆహ్వానించుకొనినాడు.

కాదు, కాదు. పొరపడుచున్నాను. ఆదుర్మార్గుని సీచాశయము వ్యర్థముకావచ్చును. ఎంత అపత్కరమైనవైనను ఆయనదెబ్బలు త్వరలో మానిపోవచ్చును. మహాత్మునిగురించి యీవిచారము వ్యర్థమైనది. మరల ఆవార్తయే వచ్చును—'

**New Delhi JAN. 30**

**Mahatma Gandhi was shot at four times while he was walking to the Prayer Ground He is seriously injured (API)**

మూడుసార్లు కాదు, నాలుగుసార్లు తుపాకీసర్లు తగిలి నవి. కాని చికిత్సకు ఏర్పాట్లు జరుగుటలేదా? ఆయన నిరాహారదీక్ష నవలంబించినపుడు డాక్టర్లు ఆయనను నాలుగు వైపులమూగియుందురే! ఆసమయములో ఒక్కడాక్టరుగారు కూడ లేరా?

నా యీమనస్సు పశ్నకు వార్తాయంత్రములో వచ్చిన జవాబు—

"డాక్టరుకొరకు కబురు పంపడమైనది...5—45"

సరే! బ్రతుకుజీవుడా అనుకొంటిమి. ఈసారివార్త క్రమముగా ఆరోగ్యము కలుగుచున్నదని యే రావచ్చునని తలంచితిమి.

మరల ఆవార్తయే వచ్చెను—

**Doctors have been summoned (API) AC/HNC 30/1 5-45 P. M.**

ఈసారి స్వస్తివార్త వచ్చుగాక, మంగళవార్త వచ్చు గాక, ఆయన కెట్టిభయము లేదనియు, ఆపద తొలగిపోయిన దనియు యిప్పుడే వార్త రావచ్చును.

టెలిప్రింటరువదలి కొంచెము ఆవలికి వెళ్ళితిమి. భయము ఏల? సందేహ మేల? ఇప్పుడే ఆశుభవార్త రా వచ్చును. కాని యింతఆలస్యమగుచున్న దేమి? డాక్టర్లు అం దరు ఏమిచేయుచున్నారు?

సెకండ్లు, నిమిషములు గడియారములో తిరిగిపోవు చున్నవి.

కాని నామానసిక పరిస్థితులనుబట్టి నిమిషములలో వైద్యము పనిజరుగదుగదా? అయ్యో! వృద్ధుని శిథిల దేహములో శస్త్రచికిత్స చేయుచున్నారేమో, మొన్ననేగదా నిరశనవ్రతము విరమించిరే — ఆయన దేహము యింకను దుర్బలముగానే యున్నదే — ఆ దేహముపైన నాలుగుసారులు గుళ్ళదెబ్బలు — మరల శస్త్రచికిత్సయా——

సెకండ్లు, నిమిషములు గతించిపోవుచున్నవి.

వార్తాయంత్రములో——

**Gandhi is dead (API) NNG/HNC 30/1 5-57 P. M.**

'డెడ్!'

చనిపోయినారా!

మా ప్రాణములు పైనపోయినవి, మా హృదయ చలనయంత్రములు ఆగిపోయినవి.

చనిపోయినారా!

ఈ పిడుగువంటి వార్త అసత్యము కాకూడదా! అసత్యమే అగుగాక — అసత్యమే యగుగాక! కాని సందేహము తొలగిపోవునట్లు మరల ఆవార్తయే వచ్చెను——

"గాంధీజీ చనిపోయినారు...5-58 సందేహముగా యున్నదా? నమ్మకము కలుగుట లేదా?

మరల ఆవార్తయే—

"గాంధీజీ చనిపోయినారు."

మూడుసారులు వచ్చినది - మరియొకసారి

**"Gandhiji is dead"**

నాలుగుసారులు. మహాత్ముని దేహములో నాలుగు సారులు గుళ్ళు తగిలినవే, అ[illegible]ఋషి రొమ్ముపై పిడుగు పడుటయా! ఆ దెబ్బలు ధరిత్రీవక్షమును బ్రద్దలుచేయలేదా!

మరల ఆవార్తయే వచ్చెను. వార్తలను పంపువారికి కూడ ఆవార్త సత్యమైనదని నమ్మజాలకున్నారు!

మరియొక వార్త—

"మహాత్మాగాంధీజీ రొమ్మునకు దెబ్బలుతగులుటచే స్పృహతప్పి పడిపోయి యున్నారు—6-15"

దాని తరువాత వార్త—

"మహాత్మాగాంధీజీ ప్రార్థనాస్థలమునకు పోవుచుండగా ఆయనపై కాల్చబడిన గుళ్ళలో ఒకటి ఆయన రొమ్ములో గ్రుచ్చుకొనెను. తత్ఫలితముగా ఆయన యీసాయంకాలము అయిదున్నరగంటల తరువాత చనిపోయినారు 6-20.

దీని తరువాత విశేషవివరములు, కాని మనస్సు వేచి యుండజాలకపోయెను. 'గాంధీజీ మరణించినారు' అను

వార్తయే హృదయమనస్సుల నావరించెను. సమస్త ప్రపంచమునందును వ్యాపించెను. ఇంకను వ్యాపించుటకు స్థానమేది?

ఒక రిపోర్టరు పిచ్చివానివలె పరుగిడివచ్చెను. ఆయన దేహమంతయు చెమటలుపట్టెను. కంపించుచుండెను. వ్యాకులహృదయముతో నిలువబడిపోయెను.

ఆయన రాజమార్గములో పోవుచుండెను. హఠాత్తుగా రేడియో సంగీత మాపివేసి "మీకు అత్యంతదుఃఖకరమగు వార్త తెలిజేయుచున్నాను. మహాత్మాగాంధీజీ మరణించినారు" అని సమస్తమానవసంఘమునకు ప్రచారముచేసెను.

పాపము, ఆ రిపోర్టరు ఆవార్తను నమ్మజాలకపోయెను. ఆకారణముచేత ఆఫీసులో టెలిప్రింటరులో ఆవార్త వచ్చినదో లేదో తెలుసుకొనుటకు పరుగిడి వచ్చెను.

వచ్చినది - సందేహమునకు ఏమాత్రము అవకాశము లేదు.

నిమిషనిమిషమునకు టెలిఫోనుగంట మ్రోగుచుండెను. ఈ కర్ణకఠోరవార్తను గురించి సత్యాసత్యములను తెలుసుకొన ప్రజలు తహతహలాడిపోవుచుండిరి. బయట ఆఫీసు సమక్షమున మహాజనము మూగియుండిరి. జనసంఖ్య క్రమముగా వృద్ధియగుచుండెను. నిజానిజములు తెలుసుకొనుటకు ఆఫీసుకు వచ్చినారు. యీసందర్భములో విశేషవిషయముల తో పత్రిక వెలువడుననివారెరుగుదురు, ఆపత్రిక తీసుకొనిపోవ

లయునని అందరును నిలుచబడియున్నారు. ఆశ్చర్యమేమనగా— ఒకరిని ఒకరు త్రోసుకొనుటలేదు. అల్లరి లేదు. దుఃఖా క్రాంతవదనములతో నిలువబడి యుండిరి.

పత్రికలు వెలువడినవెంటనే ఒకరివెనుక ఒకరువచ్చి నిశ్శబ్దముగా పత్రిక కొనుక్కొని నీరవముగా వెడలిపోయిరి.

ఈ హత్యాకారి ఎవరు? ఆతడు హిందువా? లేక, ముసలమానా? లేక శిక్కుమతస్థుడా? లేక క్రైస్తవుడా? ఎవరైననేమి ఆతడు భారతీయుడు—ఆ విషయములో సందేహమేమియు లేదు.

గతవారము బాంబు విసరి మహాత్ముని హత్య గావించ ప్రయత్నించినదియు భారతీయుడే ఆతడును. యీ హంతకుడును ఒకసంఘమునకు చెందినవారే అయియుండవచ్చును. ఆతని ప్రయత్నము విఫలమైనది. యీతని ప్రయత్నము సఫలమైనది.

భారతజాతి జనకుడు మరియొక భారతీయుని వలన హత్యగావింపబడినాడు. ఇంతకంటె లజ్జాకరమైన విషయము మరేమి గలదు?

ఏసుక్రీస్తుని హత్యగావించుటచే ఒకజాతి శాశ్వతముగా కళంకితమై యున్నది. నేడు భారతదేశము యీ మహా

పాపముచేత శాశ్వతముగా కళంకితమైపోయినది. భారత దేశ కపాళమున యీ కళంక కాలిమ శాశ్వతముగా వ్రాయబడి యుండును, సంవత్సరములుగతించును—యుగములు అతిక్రమించును— శతాబ్దములు తిరిగిపోవును — కాలక్రమమున యీ కళంకము ప్రగాఢరూపము దాల్చి మహాకాల కపాళమును కళంకితము చేయుచుండును.

ఎంతకఠినాత్ముడు ఆ హంతకుడు?

దేశవరేణ్యులు దుఃఖాక్రాంతకంఠముతో నుడివిన విషయములు—

# పండిత జవహర్ లాల్

నా స్వదేశ సోదరీ సోదరులారా! భయంకరశోకాగ్ని దేశములో నాలుగుమూలల వ్యాపించినది.

ఇట్టి పరిస్థితులలో తమకు నేను ఏమి చెప్పగలను! భారతజనకుడగు బాపూజీ యిహలోకమున లేడని నేనెట్లు తెలియజేయగలను! మనమిక యీ నేత్రములతో ఆయనను చూడజాలము. దేశములో సంభవించు దుఃఖకష్టముల సమయములలో సలహానిమిత్తము ఆయనవద్దకు పోజాలముకదా, దేశమునకు సంభవించిన యీ చరమ దౌర్భాగ్యమును గురించి నేను వూహింపనేరకున్నాను. ఆప్పటకు వీలులేని ఏదీపశిఖ చిరకాలము సమస్తప్రపంచవాసుల దృష్టిని ఆకర్షించెనో, నేడది వర్తమానకాలము నతిక్రమించి భవిష్యత్తులో వ్యాపించినది. ఆదివ్యదీపమే యీభారత దేశమును సత్యమార్గమున, స్వాతంత్ర్యమార్గమున ముందుకు నడపినది. భారత దేశమునకు సంభవించిన యీ దుర్దినములలో మహాత్ముడు బ్రతికియుండవలసిన అవుసరమెంతయొ గలదు—కాని ఆయన లేరు. ఒకపిచ్చివాడు ఆయన జీవననాశమునకు కారకుడైనాడు!

కాని మహాత్ముని నశ్వరదేహము అవసానమొందినను, ఆయన అక్షయ అమరఆత్మయొక్క దివ్యజ్యోతి వేల

కొలది సంవత్సరముల తరువాతకూడ విశ్వమానవులకు దారి చూపించును. ఆయన పవిత్రఆత్మ మనలోనే మేల్కొనియుండును. మహాత్ముని జీవనమహామంత్రమును భారతదేశములో రూపాన్వితము గావించుభారము భారతీయులదే. ఆభారమును సక్రమముగా నిర్వహించగలిగినప్పుడే ఆయన ఆత్మతృప్తి చెందును — అది మహాత్మునకి సమర్పింపగల శ్రేష్ఠమైన అర్ఘ్యము.

కావలసినది జరిగిపోయినది. కాని మహాత్ముడు ఏసందేశమును మనకు చిరకాలము వినిపించెనో దానిని సకలదేశీయుల జీవితములలో వికసింపచేసెదమను దృఢసంకల్పమును మనము సంకల్పించుకొన వలయును. ఏకాగ్రసైనికులవలె ఆయన ఆదర్శజ్యోతిని చేనిడికొని మనము ముందుకు నడువ వలయును. ఆయనఆత్మ దుఃఖించునట్టి కార్యములను మన దైనికజీవితములో ఆచరించకుందుముగాక! హింస, పిరికితనము, క్షుద్రత్వము, భేదవిభేదముల ద్వేషములు జాతీయుల జీవితములనుండి శాశ్వతముగా తొలగిపోవుగాక!

ఆయన జీవనసాధనమును స్మరించుకొందుముగాక, మననము చేసుకొందుముగాక, ఆయన ఆదర్శములను అనుసరించుదుముగాక — జయ్‌హింద్.

—:0:—

# సర్దార్ వల్లభభాయ్

నా ప్రియసోదరుడు జవహర్‌లాల్ నెహ్రూ గావించిన ఉపన్యాసము మీరు వినియున్నారు. నాహృదయము ఆవేదనతో నిండియున్నది. నేను ఏమిచెప్పుదును, ఏమి చేయుదును — నాకేమియు తోచుట లేదు, నానోట మాటవచ్చుట లేదు, భారతదేశము దుఃఖముతో, శోకముతో, లజ్జతో నిండిపోయినది.

ఈరోజున దాదాపు నాలుగుగంటలకు నేను మహాత్మునివద్దనే యుంటిని, ఆయనతో సుమారు గంటసేపు మాట్లాడియుంటిని. పిమ్మట ఆయన గడియారము బయటికి తీసి 'ఇప్పుడు ప్రార్థనకు వేళ అయినది, నన్ను పోనీయుడు' అనెను.

ఆయన బయలుదేరెను. నేను గృహమువైపునకు బయలుదేరితిని. ఇంటికి చేరకముందే ఒకసోదరుడు పరుగిడి వచ్చి యిట్లుచెప్పెను—

గాంధీజీ ప్రార్థనకు పోవునప్పుడు ఒకహిందుయువకుడు రివాల్వర్‌తో ఆయనపై మూడుసారులు కాల్చెను, ఆయన పడిపోయినారు, బిర్లాభవనమునకు తీసుకొనిపోయినారు.

తక్షణమే అచ్చటికి పోయితిని. శాంతిసౌమ్యతమా భావములతో ఆయన పరుండియున్నటుల గాంచితిని. హృదయము కరుణారసముతో పరిపూర్ణమై యున్నప్పుడు ఎట్టి రూపము ధరించునో అట్టి ప్రశాంతమూర్తిని దర్శించితిని. అచ్చట అనేకులు సమావేశమైరి.

నిరాహారదీక్షానంతరముకూడ ఆయన బ్రతికిపోయిరి, భారతదేశములో ఆయన చేయవలసిన పని పూర్తికాకపోవుటచేతనే ఆయన జీవితము అవసానమొందలేదు. కొన్ని రోజులనుండి గాంధీజీలో విషాదచిహ్నములు కానవించుచుండెను. కొలదిరోజులకితము ఒకయువకుడు ఆయనపై బాంబు విసరినప్పుడు కూడ ఆయన బ్రతికిపోయిరి. మరియొక యువకుని తుపాకిగుళ్ళ వలన ఆయన శాశ్వతముగా శలవుగైకొనినారు. ప్రపంచములో మహామానవుడు తనజీవితముద్వారా జాతీయుల పాపమునకు ప్రాయశ్చిత్తము గావించుకొనుట అత్యంత లజ్జాకరమైన విషయము.

ఇప్పుడు క్రోధోన్మత్తులమైనయెడల ప్రయోజనము లేదు. క్రోధోన్మత్తులమైతిమేని ఆయన మనకు జీవితకాలమంతయు బోధించిన దంతయు మరచిపోవుదము, ఆయన బ్రతికియుండగా మనము అనుసరింపని ఆయన ఆదేశములను యిప్పుడు తప్పక అనుసరింపవలయును. మనకు ఎంతదుఃఖమ్ము ఎంతఆవేదన, ఎంతక్రోధము కలిగినను నేడు వానిని అణచు

కొందుముగాక ! ఆయన మనకు తన సమస్తజీవితకాలములో నేర్పిన దానివిషయమై మన మిప్పుడు పరీక్షనీయవలయును.

శాంతి సద్వర్తనవిషయములతో పరస్పరుల మేకమై నేడు భూమిపై దృఢముగా నిలువవలయును. మనశిరముపై నేడు మహత్తరబాధ్యత పడియున్నది. మన నడుము విరిగి పడిపోయినది. హిందూదేశములో మహత్తరమానవుడు, మన శాశ్రియుడు నేడు గతించిపోయినాడు. కాని ఆయన గతించినను సర్వదా మనతోనే యున్నాడు. సకలసమయములలో ఆయన మనమధ్యనే యుండురు. ఆయన మనకు ప్రసాదించినది విలుప్తముగాక అమరరూపముదాల్చి యుండును. రేపు నాలుగుగంటలకు ఆయన దేహము విలీనమైపోవచ్చును.

కాని మనము ఏమిచేయుచున్నారమో చూచుటకు ఆయన ఆత్మ చిరకాలము మేలుకొనియే యుండును, ఆయన అమరుడు.

గాంధీజీ జీవితమునకు బదులుగా ఆయన సాధనను సార్థకపరచుటకు యీనాశ్వరు డిట్టిమృత్యువును సంఘటిలజేసి నాడేమో గ్రహింపజాలకున్నాము.

కాని మనపని బాకీ యున్నది. మనము వెనుకపడి యుండినచో లాభములేదు. సమ్మిళితభావముతో నిలువబడి ఆపదల నెదుర్కొనవలయును. అసంపూర్ణముగా నున్న కార్యములను సంపూర్ణము గావింపవలయును. గాంధీజీ ఆరం

భించిన సాధనను మనము సార్థకపరచునట్లు భగవానుడు ఆశీర్వదించును గాక.

ఒక శ్రేణివారు హిందువులకు ప్రత్యేకరాష్ట్రము కావలయుననియు, అచ్చట యితర సంఘములవారికి స్థానముండకూడదనియు నుడువుచున్నారు. కొందరు మహమ్మదీయులు ప్రత్యేకమహమ్మదీయ రాష్ట్రము కావలయుననియు అచ్చట యితరసంఘము వారికి స్థానముండకూడదనియు వాదించుచున్నారు. అట్లు జరుగుటకు వీలులేదని పూర్వచరిత్రలే నిరూపించినవి. ఉభయధర్మములవారు భారతదేశవాసులై యున్నపుడు భారతదేశము ఉభయుల రాష్ట్రమైయుండును. శివాజీ కేవలము హిందూరాష్ట్రమునే నిర్మింపగోరెను. కాని ఆయన వీరసాధన అంతయు వ్యర్థమైపోయెను. ఔరంగజేబు కేవలము ముస్లిమ్‌రాష్ట్రమునే నిర్మింపగోరుటచేతనే ఆయన చేతులలో మొగల్‌సామ్రాజ్యము ధ్వంసమాయెను నేడు! ముస్లిమ్‌రాష్ట్రవాదులు ముస్లిమ్‌రాష్ట్రమును నిర్మింపగలిగినారా? అది ఎన్నటికిని జరుగనేరదు. అట్లు జరుగనేరదని కాలము నిరూపించును.

అందువలన భారతస్వాతంత్ర్యఋషి సాంప్రదాయిక విభేదములను తొలగించుటకు జీవితమును బలి యిచ్చెను. అందులైనవారు దానిని సహించలేకపోయిరి.

మహాత్ముని హంతకా! నీవు ఎవరవు? హిందువేనా? యదార్థహిందువు నిన్ను అసహ్యించుకొనును. నీవెవరవు? మహమ్మదీయులకు శత్రువా? యథార్థమహమ్మదీయులు నిన్ను మహమ్మదీయులకు శత్రువని తలంచుటకు కూడ అసహ్యించుకొందురు. నీవు విప్లవవాదివా? అమెరికాలోకమందున్న విప్లవ వాదులుకూడ నీవు విప్లవవాదివి కావని తిరస్కరింతురు. యథార్థమగు విప్లవవాదికూడ నేడు నీకు విరుద్ధముగా ఖడ్గధారియై నిలువబడియున్నాడు.

మానవుడవు కానేకావు. నీవెవరవు? పిచ్చివాడవా? కావచ్చును. కాని మతవైషమ్యములు మానవుని యింతనీచునిగా, హీనునిగా చేయగలవా? కావచ్చును. ప్రపంచము దానిని ప్రత్యక్షముగా దర్శించినది. మహాత్ముని జీవనసాధన సార్థకమైనది. స్వతంత్రబుత్పాదకుడు కానిసరైన మహాత్ముని చేతులలో ప్రాణము పోగొట్టుకొనెను. సాంప్రదాయిక శాంతిదేవత విద్వేషియగు సాంప్రదాయిక నారకీయుని హస్తములో ప్రాణము బలి యిచ్చెను. అహింసాయుగదూత జీవితము హింసాగ్ని బాణములతో అంతమొందెను.

—:o:—

# నిర్మాణ కార్యసూత్రములు

(1) జాతులలో ఐకమత్యము—జాతులు అనగాహిందు, ముస్లిమ్, శిక్కు, జైన మొదలగు సాంప్రదాయములని గ్రహింపవలయును. మనస్వాతంత్ర్యముకొరకు సకలజాతుల వారును ఐకమత్యముతో కలిసిమెలిసి యుండుట అత్యంత అవుసరము. 'నాలోనే హిందువులు, ముసల్మానులు, క్రైస్తవులు, పార్శీలు అందరు ఉన్నారని' నిర్మాణకార్యములు గావించువారు తలంచవలయును. సకలధర్మములపై సమాన గౌరవమును చూపుచుండవలయును. సకలధర్మముల సార వస్తువు భగవానుని ఉపాసనయే. నిర్మాణకార్యములు గావించువారు; యితరజాతీయులతో స్నేహము కలుగజేసికొనవలయును. వారిని వేరుగా యుంచినచో యెట్టిప్రయోజనము లేదు.

(2) అస్పృశ్యతను తొలగించుట — ఎక్కువజాతి వారు తక్కువజాతివారిని ముట్టుకొనకూడదు, బ్రాహ్మణ శూద్రులచేతినీరు త్రాగకూడదు — యిట్టి నీచస్వభావమును విసర్జింపవలయును. భారతదేశములో అన్నిజాతులవారిని ముఖ్యముగా హిందూజాతివారిని ఈదోషము సర్వనాశనము నైపునకు యీడ్చుకొనిపోయినది. ప్రపంచములో సకల

జాతులవారికంటె భారత దేశము అనేకరెట్లు వెనుకబడియుం డుటకు యీదోష మొకప్రధాన కారణము.

తక్కువజాతివారితో కలిసి మెలసియుండి, వారిని ఉన్నతపరచి, వారు మనము ఏకమైపోవలయును. మన అహంకారగర్వములను విసర్జించి 'హరిజనుల'తో కలసిమెలసి పోవలయును. వారిని మనసోదరులనుగా స్వీకరింపవలయును.

(3) మద్యపానము విసర్జించుట — మన దేశము సర్వ నాశనమగుటకు మూలకారణము — కల్లు, సారాయి, నల్ల మందు, గంజాయి మొదలగు నిషావస్తువులు. వీనిని నిషేధిం చుటకు ప్రయత్నింపవలయును. ఈపనిలో స్త్రీలు, విద్యార్థులు ఎక్కువగా పాల్గొనవచ్చును. స్త్రీలు, విద్యార్థులు నిషాఖోరు లతో మధురసంభాషణములద్వారా వారి దురలవాటులను తొలగింపవలయును. నిర్మాణకార్యములు గావించువారు వీనిని నిషేధించుటకు తప్పక ప్రయత్నము చేయుదురు. అది గాక శాసనపరిషత్తులలో వుండువారుకూడ శాసనముల ద్వారా వీనిని నిషేధింపవలయును.

(4) ఖాది — ప్రజలహస్తములలో శక్తిసామర్థ్యము లను వ్యాపింపచేయుటకు ఖాది లేక ఖద్దరు ఎట్లు తోడ్పడ గలదో యింతకుముందే నుడివియుంటిని. ఖాది దానికొక నిదర్శనము 'ఖాది భారత దేశ ఐకమత్యమునకు చిహ్నమనియు

భారత దేశములోని అందరిధనముయొక్క స్వాతంత్ర్యమనియు, సమానఅధికార చిహ్నమనియు' గాంధీజీ నుడివియుండెను. 'భారతస్వాతంత్ర్యముయొక్క రాజదుస్తులని' ఖాదివస్త్రము లను గురించి పండిత నెహ్రూ నుడివియుండెను.

ప్రతిగ్రామములో ఖాది ఉత్పత్తి చేయవలయును. ఖాదీ ఉత్పత్తి అనగా — దూది పండించుట, దూది బాగు చేయుట, పుంజీలుగా చేయుట, నూలువడకుట, గంజిపెట్టుట, రంగువేయుట, బట్టలునేయుట మొదలగునవి.

(5) గ్రామములో యితరశిల్పకళలు — కార్యక్రమ మును వ్యాపింపచేయుటకు గ్రామములలో చిన్నచిన్నపను లను ఆరంభించవలయును — గోధుమపిండి విసగుట, బియ్యము దంపుట, సబ్బుతయారు చేయుట, కాగితము తయారుచేయుట, అగ్గిపెట్టెలు తయారుచేయుట, చర్మము శుభ్రము చేయుట; గానుగతో నూని తీయుట, మంచినేయి తయారుచేయుట మొదలగునవి. గ్రామములోని వారందరు యీవస్తువులనే కొనుచుండవలయును.

(6) గ్రామపారిశుద్ధ్యము — మనము నివసించుగ్రామ ములు చాలా అపరిశుభ్రముగా ఉండును. చెరువులు, నూ తులు చాలాకల్మషముగావుండును. ఇవన్ని శుభ్రము చేయుట గ్రామములో రాస్తాలుతయారు చేయుట మొదలగునవి గ్రామ

వాసులే చేయవలెను. దీనివలన గ్రామములలోకి జబ్బులు ప్రవేశింపవు. గ్రామస్థుల ఆరోగ్యము బాగుగా నుండును.

(7) విద్యాపద్ధతులు — మన దేశములో శిశువులకు చిన్నపిల్లలకు నేర్పువిద్యలో చాలాదోషము లున్నవి. విద్యా పద్ధతులు పిల్లలకు సంతోషకరమైనవికావు. పిల్లలకు ఆనంద కరమైన పద్ధలతో విద్య నేర్పవలయును. విద్య సహజముగాను, యింపుగాను వుండునట్లు చేయవలయును. దేశములోవున్న మంచివిషయములను గురించి, గొప్పవిషయములను గురించి వారికి నేర్పవలయును. దానిద్వారా వారు దేశమును ప్రేమింపగలరు.

(8) పెద్దవారివిద్య — మన దేశములో అనేకమందికి విద్యలేదు, జ్ఞానశూన్యము. నిర్మాణకార్యములు గావించు వారు పెద్దవారికి రాత్రిపాఠశాలలుద్వారా విద్య నేర్ప వలయును.

మన దేశము ఎంతమహత్తరమైనదో, ఎంతవిశాల మైనదో, ఎంత ఆదాయముగలదో వారికి నేర్పవలయును. భారతదేశము ఒకప్పుడు చాలా సుఖముగా యున్నారనియు, విదేశీయులు మనకు కష్టములు కలుగజేసినారనియు, మన ఆహారసామగ్రి కొల్లగొట్టుకపోయినారనియు, స్వాతంత్ర్యము మన చేతులలో నే యున్నదనియు, వారికి నేర్పవలయును.

(9) స్త్రీలఔన్నత్యము — మన దేశములో స్త్రీలు ప్రతివిషయములోను వెనుకబడియే యున్నారు. స్వాతంత్ర్య విషయములో అందరికిని సమానాధికారమే గలదు.

స్వాతంత్ర్యము అందరికొరకు. స్త్రీలుకూడ శ్రమపడి విద్యావంతులుకావలయును. అజ్ఞానాంధకారము తొలగిపోయి జ్ఞానముతో విరాజిల్లవలయును.

(10) వ్యక్తిగతఆరోగ్యము — ప్రతివ్యక్తియు కొన్ని ఆరోగ్యసూత్రములను అవలంబించి నడువగలిగినప్పుడు దేహారోగ్యము బాగుగా నుండును.

1. మంచి ఆలోచనములను చేయవలయును, అలసత్వమును, దుశ్చింతలను త్యజింపవలయును. 2. రాత్రింబగళ్ళు మంచిగాలిని పీల్చుచుండవలయును. చక్కగా నిలువబడి యుండవలయును, చక్కగాకూరుచుని యుండవలయును. ప్రతికార్యమునందును పరిశుభ్రతగా యుండవలయును. 3. మనము పరిశుభ్రతగా యుండవలయును. మన చుట్టునున్నవారందరును పరిశుభ్రముగా ఉండునట్లు చూడవలయును.

(11) మాతృభాష — మాతృభాష చక్కగా నేర్చుకొనవలయును. మాతృభాషతో ఇంగ్లీషు, ఉర్దూ మొదలగు మాటలను ప్రయోగించి పులగం తయారుచేయుచుందురు.

భాషామాధుర్యముగాని, భాషాఔన్నత్యముగాని, ఉత్తమ భావప్రకటనగాని, సాహిత్యఅభివృద్ధిగాని మాతృభాష ద్వారానే జరుగవలయును.

(12) రాష్ట్రభాష — భారతదేశ సకలజాతులవారు పరస్పరము మాట్లాడుకొనుటకు అందరికి అనుకూలమైన సాధారణభాష, లేక రాష్ట్రభాష అవసరము. భారతదేశములో అన్నిభాషలకంటె హిందీభాషలోనే ఎక్కువమంది మాట్లాడుచుందురు. అందువలన హిందీభాష యేరాష్ట్రభాషగా యుండవలయును. కాంగ్రెసుకూడ యీవిషయమును అంగీకరించినది. అందరును ఒకేభాష నేర్చుకొనినచో భారతదేశములో ఐకమత్యతకు ఎక్కువ అవకాశముగలదు. ప్రతివారును యీరాష్ట్రభాషను నేర్చుకొనవలయును. నిర్మాణకార్యములు గావించువారు రాష్ట్రభాష ప్రచారమునకు విశేషప్రయత్నము చేయవలయును.

(13) కిసాన్ లేక కృషీవలులు— భారతదేశములో గల నలుబదికోట్ల ప్రజలలో దాదాపు ఇరువది ముప్పదికోట్ల ప్రజలు వ్యవసాయదారులై యున్నారు. వారి చేతులలో ఎట్టి మహత్తరశక్తి గలదో వారికి తెలియదు. భారత స్వాతంత్ర్యము కొరకు వారెట్టి మహత్తరకార్యములు చేయగలరో వారెరుగరు.

కృషీవలురకు పెద్దపెద్ద విషయములను గురించిగాని అహింస, రాజనీతివిషయములుగాని ప్రథమమున బోధింప వలసిన అవుసరము లేదు. వారిద్వారా కార్యములు చేయించ వలయును. 'చంపారణ సత్యాగ్రహము' 'బార్డోలి సత్యాగ్రహము' మొదలగు పుస్తకములు చదివినప్పుడు గాంధీ మహాత్ముడు వ్యవసాయదారులలో యేవిధముగా పనిచే సినదియు బోధపడగలదు.

(14) శ్రమికులు లేక మజ్దుర్ — మన దేశము మిల్లులలో, కార్ఖానాలలో పనిచేయువారితో శ్రమికసంఘ ములను స్థాపింపవలయును. ఈ సంఘముతరఫున వారికొరకు వారిపిల్లలకొరకు పాఠశాలలను, గ్రంథాలయములను కొల్పవలయును. వారి ఆరోగ్యముకొరకు ఔషధాలయములను స్థాపించవలయును. స్వాతంత్ర్యము కొరకు వారినికూడ తయారుచేయవలయును.

(15) ఆదిమవాసులు—ఎరుకల, యానాది, కోయ లంబాడి, జాతులు ఆదిమవాసులు. భారతదేశములో దాదాపు రెండుకోట్ల జనాభా గలరు. వీరికి కూడా విద్యనేర్పి చక్కని పద్ధతులు నేర్పి ఉత్తమపౌరులనుగా తయారుచేయవలయును

(16) రోగులసేవ — ప్రతిగ్రామ, పట్టణములలో రోగులు, దుర్బలులు, వృద్ధులు, గుడ్డివారు, కుష్ఠరోగులు

అనేకమంది గలరు. వీరందరికి తగుసేవ ఉపచారములు గావింపవలయును.

(17) విద్యార్థులు—విద్యార్థులే దేశమునకు అగ్రనాయకులు. నిర్మాణకార్యములు వారిద్వారానే చక్కగా నెరవేరగలవు. వారినుండియే దేశనాయకులు బయలుదేరగలరు.

గాంధిమహాత్ముడు విద్యార్థులకు కొన్నికార్యములను నియమించినారు.

(1) విద్యార్థులు ఏపార్టీలలోను ప్రవేశించకూడదు.

(2) రాజకీయ సమ్మెలలో వారు పాల్గొనకూడదు. వారి అధికార విషయములలోను, వాంఛలవిషయములలోను అట్లు చేయవచ్చును. వారు ఐకమత్యముతో, నమ్రతతో, శాంతముగా సత్యము కొరకు సమ్మె జరిపిన యెడల జయము తప్పక చేకూరును.

(3) వారు నూలు వడకవచ్చును. నూలు వడకుటతో దేశస్వాతంత్ర్యమునకు యెట్టిసంబంధము గలదో గ్రహింపవలయును.

(4) ఖద్దరు ధరింపవలయును. కుటీరశిల్పములను ప్రోత్సాహపెట్టవలయును.

(5) జాతీయపతాకముగల బ్యాజ్‌లను ధరింపవలయును. బలవంతముగా ఎవరికి ధరింపచేయవలదు.

(6) తక్కువకులస్థులను తమసోదరులనుగా భావించి ఆదరింపవలయును. హరిజనులు, యితరమతస్థుల పిల్లలను స్నేహముతో చూడవలయును.

(7) హఠాత్తుగా ఎవరికి దెబ్బతగిలినను, ఆపద సంభవించినను ప్రాథమిక చికిత్స చేయవలయును. గ్రామములోనున్న వారందరికిని విద్యనేర్పుటకు తగు యేర్పాటులు గావింపవలయును.

(8) రాష్ట్రభాష తప్పక నేర్చుకొనవలయును.

స మా ప్తి.

మెజస్టిక్ ప్రెస్, రాజమండ్రి—1950.